# పేకమేడలు

మూలం:

టర్గినీవ్

అనువాదం:

శ్రీనివాస చక్రవర్తి

పాటలు:

కృష్ణమూర్తి



ఆదర్శ గ్రంథమండలి

విజయవాడ - 2.

# పాత్రలు

1. మేరియా డిమిత్రియెవ్నా కాలిటినా
2. మార్ఫా టిమోఫెయెవ్నా ... ఆమె మేనత్త
3. ఎలిజవెటా మైకెలెవ్నా (లీజా) } మేరి[illegible]
4. ఎలీనా మైకెలెవ్నా (లెనోచ్కా) } కూతు[illegible]
5. వ్లాడిమిర్ నికొలాయిచ్ పాన్షిన్ ... ప్రభుత్వో[illegible]
6. ఫియొడోర్ ఇవనోవిచ్ లావ్రెటస్కీ (ఫెడ[illegible] ... భూస్వామి
7. వార్వరా పావ్లోవ్నా కొరోబినా ... అతని భార్య
8. మైకెలెవిచ్ ... ఫెడ్యా మిత్రుడు, సహాధ్యాయి
9. గ్లాఫిరా ... ఫెడ్యా మిత్రుడు, సహాధ్యాయి
10. క్రిస్టాఫర్ థియోడర్ గోట్లాబ్ లెమ్ ... సంగీ[illegible] మాస్[illegible]
11. సెర్జీ పెట్రోవిచ్ జెడియొనోవస్కీ

తదితరులు

౧

వసంతకాలం. శోభాయమానంగా ఉన్న ఒకనాటి సాయంత్రం గులాబిరంగు చిరుమబ్బులు నిర్మలాకాశంలో ఎక్కడో తేలియాడుతూ నీలి అగాధంలో కరిగిపోతున్నట్లున్నాయి.

1842వ సంవత్సరం. రాష్ట్ర రాజధాని ఓ—— శివార్లలో ఒక చక్కటి భవనం. కిటికీతలుపులు తెరిచున్నాయి. ఆ కిటికీదగ్గర ఇద్దరు వనితలు కూర్చుని ఉన్నారు. ఒకామెకు సుమారు యాభై ఏళ్ళుంటాయి. రెండవ ఆమె డెబ్భైఏళ్ళ ముసలి.

మొదటిఆమె పేరు మేరియా డిమిత్రియెవ్నా కాలిటినా. ఆమెభర్త ఒకప్పుడు ప్రభుత్వ న్యాయవాదిగా పనిచేశాడు. మంచి వ్యవహర్త, పట్టుదలమనిషి, ముక్కోపి. అతను మరణించి ఇప్పటి కప్పుడే పదేళ్లయింది. బాగా చదువుకున్నవాడు. విశ్వ విద్యాలయ పరీక్షలో నెగ్గాడు. అతి సామాన్య కుటుంబంలో జన్మించడం వల్ల బతుకుతెరువు చూచుకుని జేబులు నింపుకోవాలనే విషయం త్వరలోనే గ్రహించాడు. స్ఫురద్రూపి, తెలివైన వాడు. ఇష్టమైనపుడు అతిచనువుగా మెలిగేవాడు. ఈ గుణాలన్నీచూసి మేరియా అతన్ని ప్రేమించి వివాహమాడింది. మేరియా తలిదండ్రులు చిన్న తనంలోనే చనిపోయారు. మాస్కోలోని ఒక బాలికాపాఠశాలలో కొన్ని

సంవత్సరాలపాటు చదువుకుని, చదువు పూర్తయాక ఓ—కు 50 * వెర్స్టుల దూరంలో ఉన్న పోక్రోవస్కోయె అనే గ్రామంలో తన మేనత్తతోను, అన్నతోను మేరియా నివసించసాగింది. ఈ అన్నకు పీటర్స్‌బర్గ్‌లో ప్రభుత్వోద్యోగం లభించడంవల్ల అతనితోపాటు మేరియా, వారి మేనత్తా పీటర్స్‌బర్గ్ వెళ్ళారు. అతను వీరిద్దరినీ నీచంగా చూస్తుండేవాడు. ఇంతలో అతని ఆయుర్దాయం తీరి హఠాత్తుగా అకాల మృత్యువాత బడ్డాడు.

మేరియా డిమిట్రియెవ్నాకు పోక్రోవస్కోయె జమీ సంక్రమించింది. కాని అక్కడ ఆమె అట్టేకాలం ఉండలేదు. కొద్దిరోజులలోనే ఆమె ప్రేమను చూరగొన్న కాలిటిన్‌ని వివాహమాడింది. వివాహమైన ఒక సంవత్సరం తర్వాత పోక్రోవస్కోయె జమీని మార్పిడిచేసి ఇంకా ఎక్కువ ఆదాయంవచ్చే ఇంకో జమీ తీసుకున్నారు. కాని ఆజమీ అంతగా వారికి నచ్చలేదు. అసలు ఉండడానికి అక్కడ ఇల్లంటూలేదు. అందుకని ఓ— పట్టణంలో ఒక ఇల్లుతీసుకుని అక్కడే స్థిరపడిపోయారు. ఆ ఇంటిచుట్టూ పెద్దతోట ఉంది. ఒక పక్క బ్రహ్మాండమైన బయలు. గ్రామీణ సౌకర్యాలంటే ఇచ్చగించని కాలిటిన్ "ఇక గ్రామసీమకు వెళ్ళాలసిన అగత్యంలేదు." అని నిర్ధారణచేశాడు. పోక్రోవస్కోయె అందమైన గ్రామం. మందహాసం చేస్తున్నట్టుండే పిల్లకాల్వ ఒకటి అక్కడ ప్రవహిస్తోంది. అక్కడ పెద్ద పెద్ద మైదానాలున్నాయి. పొదరిళ్ళున్నాయి. వీటన్నిటినీ విడిచిపెట్టి ఉండడం మేరియాకు కష్టంగానే ఉంది. కాని తనభర్త వ్యవహారదక్షతకు, ప్రపంచ జ్ఞానానికి చకితురాలైన ఆమె అతనిమాట కెన్నడూ ఎదురుచెప్పలేదు. ఈ విధంగా పదిహేనేళ్ళ సాంసారిక జీవితం తర్వాత కాలిటిన్ చనిపోయాడు. అతనికి ఒక కొడుకూ, ఇద్దరు కూతుళ్ళూ. ఆ ఇంటికీ, పట్టణ జీవితానికీ బాగా అలవాటుపడిపోయిన మేరియాకు ఓ—పట్టణం వదిలి వెళ్ళిపోవాలనే తలంపే కలగలేదు.

వయసులో ఉండగా మేరియా మంచి అందగత్తె అని పేరు పొందింది. యాభైయేళ్ళు వచ్చినా ఆమె ఇంకా ఆకర్షణీయంగానే ఉంది, కాకపోతే కొంచెం లావెక్కి నాజూకుతనం కోల్పోయింది. ఆమెలో దయారసంకంటె ఉద్వేగం హెచ్చు. చదువుకునే రోజుల్లో అలవడ్డ పిచ్చి

* సుమారు 35 మైళ్ళు.

అలవాట్లు వయసుమళ్ళినా మానుకోలేదు. ఆ అలవాట్లకు లోనైనందుకు తనకు తానే సముదాయించుకునేది. కోపం ముక్కుమీద ఉండేది. తన అలవాట్లకు ఏమాత్రం అభ్యంతరం కల్గినా కటకట తడిపెట్టుకునేది. కాస్త ఉబ్బేస్తే ఎంతో దయతో ఆదరించేది. ఆమెమాటకెవరూ అడ్డుచెప్పేవారు కాదు. ఆమె ఇంటికి వెళ్ళడమంటే అందరికీ ముచ్చటగా ఉండేది. ఆవిడకి మంచి ఆస్తిపాస్తులున్నాయి. తలిదండ్రులనించి ఆమెకు సంక్రమించిన ఆస్తి కంటే భర్త పొదుపుతో కూడగట్టిందే ఎక్కువ. కూతుళ్ళిద్దరూ ఆమెదగ్గిరే ఉంటున్నారు. కొడుకుమాత్రం పీటర్స్‌బర్గులోని ఉత్తమకళాశాలల్లో ఒక దాంట్లో చదువుకుంటున్నాడు.

మేరియా డిమిట్రియెవ్నాతోపాటు కిటికీదగ్గిర కూర్చున్న ముసలావిడ ఆమె మేనత్త. తండ్రి చెల్లెలు. మారుమూల, పొక్రోవస్కోయెలో మేరియా ఈవిడతో కలిసే నివసించింది. ఈమె పేరు మార్ఫా టిమోఫెయెవ్నా. వట్టి తలతిక్కమనిషి. ఎంతతోస్తే అంత. మొగంమీద నిజంచెప్పేరకం. భాగ్యవంతురాలిగా నటించడానికి ఎంత నీచానికైనా ఒడిగట్టేది. ఆమెకి కాలిటిన్ అంటే పరమాసహ్యం. మేరియా అతన్ని వివాహమాడగానే తన స్వగ్రామానికి [illegible]పోయి పదేళ్ళపాటు ఓ రైతు గుడిసెలో నివసించింది. ఈవిడంటే మేరియాకు కొంచెం భయం. సన్నని ముక్కు. వృద్ధాప్యం వచ్చినా జుట్టు నెరవలేదు. దృష్టి తగ్గలేదు. హుందాగా అడుగులు వేసుకుంటూ నడుం వంచక నిటారుగా నడిచేది. గబగబా, విస్పష్టంగా, ఖంగున మోగే గొంతుతో పెద్దగా మాటాడేది. ఎప్పుడూ తెల్లని లేసుటోపీ పెట్టుకునేది. తెల్లటి జాకెట్టు తొడుక్కునేది.

“యేవిటిసంగతి? యెందుకలా నిట్టూరుస్తావ్!” అని హఠాత్తుగా అడిగింది మార్ఫా టిమోఫెయవ్నా.

“మరేంలేదు. ఆ మబ్బులు యెంతచక్కగా ఉన్నయ్యో చూడు.”

“పాపం! అవంటే జాలేస్తోందా?”

మేరియా డిమిట్రీయెవ్నా జవాబియ్యలేదు.

“జెడియొనొవస్కీ ఇంకా రాకపోవడం ఆశ్చర్యంగానే వుంది.” అన్నది మార్ఫా అల్లికసూదులు గబగబా ఆడిస్తూ. (ఆమె పెద్ద ఉన్ని మెడపట్టీ అల్లుతోంది.)

"నిట్టూర్పుడంలో సాయపడతాడు. లేకపోతే కట్టు కథలు చెబు తాడు."

"అతనంటే యెందుకు నీకింత అక్కసు? సెర్జీ పెట్రోవిచ్ బహు యోగ్యుడు."

"బహు యోగ్యుడు!" అంది వృద్ధురాలు అసమ్మతి సూచకంగా.

"మా ఆయన అంటె అతనికెంతభక్తి విశ్వాసాలనుకున్నా. యివాళటికి కూడా ఆయన ప్రసక్తివస్తే యెంతో ఆవేశంతో మాటాడతాడు." అంది మేరియా.

"అవును. అలా మాటాడకేంజేస్తాడు. దిక్కూ మొక్కూ లేనివాణ్ణి తీసుకొచ్చి యింతవాణ్ణిచేసింది నీ మొగుడేగా" అని గొణిగింది మార్ఫా. ఆమె చేతిలోని అల్లిక సూదులు గబగబా జరిగాయి.

" తలంతా ముగ్గుబుట్టలా అయింది. చూస్తానికి మాత్రం అమాయకుడిగా కనిపిస్తాడు. కాని నోరు విప్పితే చాలు అన్నీ అబద్ధాలే. యెవరి మీదో ఒకరిమీద అభాండాలు వేస్తాడు. పైగా కౌన్సిలరు, గ్రామ పురోహితుడి కొడుకు!"

"ప్రతివాడికీ యేదో వొక కళంకం వుంటూనే వుంటుంది. పాపం! అతనికున్న కళంకం అదీ. చదువు సంధ్యలురావు, ఫ్రెంచి మాట్లాడలేడు. నిజమే. కాని, నువ్వేమన్నాఅను, అతను అందరికీ తల్లోని నాలిక"

"అవునవును. యెప్పుడూ నీచేతులు ముద్దెట్టుకుంటుంటాడు. ఫ్రెంచి మాటాడలేకపోతేనేం? ఆ విషయానికొస్తే ఆ కీసరబాసర ఫ్రెంచి నాకు మాత్రం వచ్చి చచ్చునాయేం! యేభాషలోనూ అతను మాటాడకుండా వుంటమేనయం. అప్పుడు అబద్ధాలాట్టానికి ఆస్కారముండదు. అదుగో దయ చేస్తున్నాడు. వట్టి మాటలపోగు." అన్నది మార్ఫా వీధిలోకి దృష్టి సారిస్తూ. "అదుగో! నీ-తల్లోని నాలిక! అడుగులు యెత్తెత్తి వేసుకుంటూ వస్తున్నాడు. కొంగలాగా గెడకాళ్లూ వీడూ."

మేరియా డిమిట్రియెవ్నా జుట్టు సవరించుకుంది. మార్ఫా వెక్కిరింపుగా ఆమెకేసి చూసి, "యేమిటమ్మా అది? తెల్లవెంట్రుకే! నీదాసీ దానికి వుద్వాసనచెప్పాలి. దానికి కళ్ళు కనిపించడం లేనట్టుంది."

"యెప్పుడూ నువిట్లాగే అంటూ వుంటావులే అత్తయ్యా!" అని బాధాకులిత స్వరంతో గొణుగుతూ కుర్చీ చేతిమీద వేళ్లతో వాయించ సాగింది మేరియా.

"సెర్గీపెట్రోవిచ్ జెడియొనోవస్కీ దయచేస్తున్నారు." అని మెల్లగా చెప్పాడు ద్వారంలోనుంచి తొంగిచూస్తూ గులాబీరంగు చెక్కుల నవుకరు కుర్రాడు.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

## ౨

పొడుగాటి మనిషి ఒకతను ఆగదిలో ప్రవేశించాడు. శుభ్రమైన వదులు కోటూ, పొట్టి లాగూ, బూడిదరంగు చేతితొడుగులూ, జత మెడ పట్టీలూ – పైన నల్లది, అడుగున తెల్లనిది – ధరించాడు. అందమైన ముఖం, నున్నటి కణతలదగ్గరనించీ బూట్సులదాకా అతనివైఖరిలో నమ్రతా, మర్యాద లక్షణాలు గోచరిస్తున్నాయి. మొట్టమొదటగా ఇంటి యజమానురాలికీ, ఆతరవాత మార్ఫా టిమోఫెయెవ్నాకు వంగినమస్కరించాడు. మెల్లిగా చేతితొడుగులు తీసేసి మేరియాచేతిమీదికి వంగాడు. రెండుసార్లు వినమ్రతతో ఆమెచేతిని ముద్దుకుని పడకకుర్చీలో తిష్టవేశాడు. గోళ్లు గిల్లుకుంటూ, మందహాసంచేస్తూ అన్నాడు :

"ఎలిజవేటా మైకెలోవ్నా బాగుందా ?"

"ఆ – తోటలోవుంది." అని జవాబిచ్చింది మేరియా.

"ఎలీనా మైకెలోవ్నా ?"

"ఆ–లెనోచ్కా కూడా తోటలోనే వుంది. యేమిటి విశేషాలు ?"

“ఓ-వున్నాయి! వున్నాయి!” అన్నాడు ఆ ఆగంతకుడు కళ్లు మిణకరిస్తూ, పెదిమెలు నొక్కుకుంటూ.

“విశేషం! ఆశ్చర్యం గొల్పే విశేషం! లాబ్రెటస్కీ, ఫియడోర్ ఇవనోవిచ్ యీవూళ్లో వున్నాడు.”

“ఫేడ్యా? యేవిటీ! నిజంచెప్పు. యిదంతా నీ కల్పనకాదుగదా?”

“అబ్బే! నేనేం కల్పించిచెప్పడంలా. స్వయంగా నాకళ్లతో చూచా”

“చూచానంటే యేమైంది?”

“బలే ఖుషీగావున్నాడు! వొళ్ళుచేసి నిగనిగలాడి పోతున్నాడు” అన్నాడు జెడియొనొవస్కీ, మేరియా అన్నమాటలు వినన్ట్లు నటిస్తూ.

“ఖుషీగా వున్నాడూ? యెలావుండగల్గాడు చెప్మా” అంది మేరియా.

“అవునవును. యింకోడైతే నలుగురిలో తలెత్తుకు తిరగగల్గేవాడా!”

“యేవిటీ వెధవగొడవ? వాడు యింటికి తిరిగొచ్చాడు అంతే. యింటికి రాక మరెక్కడికి వెడతాడూ? యింతకీ యిందులో అతని తప్పే ముంది చెప్పూ?” అంటూ వారి సంభాషణకు అడ్డువచ్చింది మార్ఫా.

“భార్య చెడిపోతే భర్తది తప్పు.”

“ఘోటక బ్రహ్మచారివి ఆముక్క అనక యింకేమంటావులే.”

జెడియొనొవస్కీ వస్తున్న చిరునవ్వు ఆపుకుని వినసాగాడు. కాసేపైన తర్వాత “ఆ చక్కని మెడపట్టీ యెవరికోసం అల్లుతున్నా”అని అడిగాడు.

“ప్రపంచంలో యెవడన్నా బాతాఖాని కొట్టనివాడు, దగా చెయ్యనివాడు, అబద్ధాలాడనివాడు అంటూవుంటే వాడికోసం, తెలిసిందా? ఫెడ్యానిబాగా యెరుగున్నా. వాడితప్పేమన్నా వుందంటే అది పెళ్ళాన్ని నెత్తి కెక్కించుకోవటమే అవును మరి, ప్రేమించి పెళ్ళాడాడు. యీ ప్రేమ పెళ్ళిళ్ళు చేసుకుని వొకప్పుడుమాత్రం బాగుపడి చచ్చిందెవరు” అంది మార్ఫా, మేరియాను కీగంట చూస్తూ. తరవాత లేచి “యికమీరు మీ యిష్టమొచ్చిన వాళ్ళని ఆడిపోసుకోండి. ఊ - నన్నైనా సరే. మరేంపర్వా లేదు. నేవెళ్లిపోతున్నా. మీకు అడ్డురాన్లే” అని మార్ఫా టిమోఫెయెవ్నా చక్కా పోయింది.

"యెప్పడూ యిదేవరస" అంది మేరియా, మేనత్త వెడుతున్నవైపే చూస్తూ. "యెప్పడూ యింతే."

"యేదో పెద్దతనం వచ్చేసింది. యేంజేస్తాం? దగా అంటూ మొదలెట్టింది. యీరోజుల్లో దగాకోరు కానిదెవరు చెప్పూ! మానవజీవితమే నేడిలా తయారైంది. నా స్నేహితుడొకడు, మంచి యోగ్యుడు, మంచి హోదాలోవున్నవాడు, ఒకమాటు అన్నాడుగదా 'యీరోజుల్లో కోడిపెట్ట కూడా గింజలు ఏరుకోటానికి నూటిగావెళ్లదు. దొంగదారిన వెడుతుంది.' అని. కాని నీ మొహంచూస్తే నువ్వోదేవకన్యవో అనిపిస్తుంది. యేదీ, నీ తెల్లటిచేతిని ముద్దెట్టుకోనియ్."

మేరియా మందహాసంచేసి అరచెయ్యి వంచి ముందుకుజాపింది. అతను ఆమెచేతిని గట్టిగా ముద్దుకున్నాడు. కుర్చీ అతనిదగ్గరగా లాక్కొని కొంచెం ముందుకువంగి మేరియా అడిగింది: "ఊ-అతన్ని చూచావన్నమాట! నిజంగా ఖుషీగా వున్నాడా?"

"ఓ-బలే ఖుషీగావున్నాడు." అన్నాడు జెడియొనొవస్కీ మంద స్వరంతో.

"అతనిభార్య యెక్కడుందో యేవన్నా ఆచోకీ తెలిసిందా?"

"మొన్న మొన్నటిదాకా పారిస్‌లో వుందట. ఈమధ్య ఇటలీ వెళ్ళిందంటున్నారు."

"పాపం! ఫెడ్యా పరిస్థితి మహాఘోరంగావుంది. యిదంతా యెలా భరిస్తున్నాడో? దురదృష్టపురోజులు అందరికీ యెపుడో వొకపుడు వచ్చేవే గాని యూరపు అంతా యితన్నిగురించి వొకటే చెప్పుకోవడమాయె!"

జెకియొనొవస్కీ నిట్టూర్చాడు.

"అవునవును - నిజం. ఆమె చిత్రకారులతోటీ, పియానో వాయించే వాళ్లతోటీ కలసి తిరుగుతోందట! వాళ్లంతా సంఘంలో అగ్రశ్రేష్టులట! సిగ్గూ బిడియం బొత్తిగా వదిలేసింది."

"పాపం! జాలేస్తుంది. అతనూ మాకుటుంబానికి చెందినవాడే. నాకు దూరపు దాయాది. నీకు తెలుసుగా?"

"ఆ - మీకుటుంబం సంగతి నాకు తెలియకపోవడ మేమిటి? తెలుసు."

"మమ్మల్ని చూస్తానికి యిక్కడికి వస్తాడంటూ ?"

"వస్తాడనుకుంటూ. వాళ్ల గ్రామంవెడదా మనుకుంటున్నాడనివిన్నా"

మేరియా దృష్టి పైకి సారించి

"ఆ - సెర్జీ పెట్రోవిచ్! సెర్జీ పెట్రోవిచ్! యీ గొడవంతా చూస్తే మా ఆడవాళ్ళం ఎంత వివేకంతో వ్యవహరించాలో బోధపడు తోంది."

"ఆడవాళ్ళందరూ వొకేమాదిరి అనుకున్నావా మేరియా డిమిట్రీ యెవ్నా! ఊహూఁ-దురదృష్టవశాత్తూకొంతమంది చలచిత్తపు వాళ్లుంటారు... పైగా కాలం అలాంటిది. చిన్నతనంలో సరైన పెంపకంలేక ... (సెర్జీ పెట్రోవిచ్ జేబులోంచి ఊదారంగు రుమాలు తీసి మడతలు విప్పసాగాడు) అటువంటి ఆడవాళ్ళుంటారు. వుంటూ రేమిటీ, వున్నారు. (సెర్జీపెట్రోవిచ్ జేబురుమాలు కొనతో కళ్ళు తుడుచుకుని)

"కాని మొత్తంమీద చెప్పాలంటే...అబ్బా! రోడ్లమీద దుమ్ము మహాదారుణం."

"అమ్మా!, అమ్మా!" అంటూ పదకొండేళ్ల చక్కనిచుక్క గదిలోకి ఉరుకుతూ వచ్చింది.

"వ్లాడిమిర్ నికొలాయిచ్ గుర్రంయెక్కి వస్తున్నాడు."

మేరియా డిమిట్రియెవ్నా లేచి నుంచుంది. సెర్జీ పెట్రోవిచ్ కూడా లేచి వంగి, "ఎలీనామైకెలోవ్నా! అభివందనాలు"అని మందహాసంచేసి మర్యాదకోసం ఒక మూలకివెళ్ళి ముక్కు చీదుకున్నాడు.

"బలేగుర్రం! దొడ్డిగుమ్మందగ్గర వున్నాడు. పోర్చిలోకి వస్తానని చెప్పాడు."

గుర్రపుడెక్కల చప్పిడి వినిపించింది. అందమైన గుర్రంమీద ఎక్కిన అందగాడొకడు తెరిచిఉన్న కిటికీకి సూటిగా వీధిలోకొచ్చి నిలబడ్డాడు.

# 3

గుర్రం ఎక్కి వచ్చిన ఆ రౌతు "బావున్నావా మేరియా డిమిత్రి యెవ్నా?" అని అడిగాడు. అతని కంఠస్వరం శ్రవణ సుఖంగా ఉండి ప్రతిధ్వనిస్తోంది. "కొత్తగా యీ గుర్రాన్ని కొన్నాను. బావుందా?"

మేరియా కిటికీదగ్గిరికి వెళ్ళి "బావున్నావా? వోల్డెమార్! ఓ— బలే గుర్రం! యెక్కడ కొన్నావ్?"

"మిలిటరీ కంట్రాక్టరు దగ్గర కొన్నా...డబ్బు బాగా గుంజేశాడు దొంగ వెధవ!"

"యీ గుర్రం పేరేదిటి?"

"ఆర్లాండో...పిచ్చి పేరు. యేం బావుండలా. పేరు మార్చేద్దా మనుకుంటున్నా...వట్టి మొండిజాతి".

గుర్రం కస్సుమని ఓ దూకు దూకి నురుగులు గమ్మిన మూతి అటూ ఇటూ ఆడించింది.

"లెనోచ్కా! గుర్రం మూతిమీద తట్టు. భయం లేదులే".

ఆ బాలిక కిటికీలోంచి చెయి జాపింది. కాని ఆర్లాండో హఠాత్తుగా బెదిరి ముందుకాళ్ళు పైకెత్తి గెంతింది.

ఆ రౌతు ఏమాత్రం చలించకుండా గుర్రం మెడమీద ఒక్కటి కొట్టాడు. రెండు కాళ్ళతోనూ దాన్ని తన్నిపట్టి, ఎంత మొండికేసినా లక్ష్యం చెయ్యక మళ్ళీ దాన్ని కిటికీ దగ్గిరికి తీసుకొచ్చాడు.

"జాగ్రత ! జాగ్రత !" అని పలుమారులు అంది మేరియా.

"శనోచ్కా ! యీతడవ మళ్ళీ గుర్రాన్ని తట్టు. దీని ఆటలేం యిక సాగనివ్వనులే" అన్నాడా యువకుడు.

ఆ పొగరుబోతు గుర్రం పళ్ళు కొరుకుతూంటే నాసికా పుటాలు వణుకుతున్నాయి. ఆ బాలిక మళ్ళీ చెయ్యిజాపి జంకుతూ ఆ నాసికా పుటాలమీద తట్టింది. "బలే ! బలే ! యిక దిగి లోపలికిరా" అని మేరియా ఆ యువకుణ్ణి ఆహ్వానించింది.

ఆ రౌతు నేర్పుగా గుర్రం తల తిప్పి, రికాబుతో తాకి చర్రున పరుగెత్తించుకుంటూ ఇంటి ఆవరణలోకి వచ్చి దిగాడు.

వెంటనే కొరడా ఆడించుకుంటూ హాలు గుమ్మంగుండా కచేరీ గదిలో ప్రవేశించాడు. సరిగ్గా అదే సమయానికి ఇంకో గుమ్మంలోంచి నల్లటి జుట్టు, సన్నగా పొడుగ్గాఉన్న పందొమ్మిదేండ్ల యువతి వచ్చింది. ఈమె మేరియా డిమిట్రియెవ్నా కూతురు లీజా.



పాఠకుల కిలా పరిచయమైన యువకుని పేరు వ్లాడిమిర్ నికొలాయిచ్ పాన్షిన్. ఇతను పీటర్స్బర్గ్‌లో ప్రభుత్వోద్యోగి. దేశీయ మంత్రిత్వ శాఖలో ప్రత్యేకాధికారిగా పనిచేస్తుంటాడు. తాత్కాలిక ప్రత్యేకాధికారిగా ఓ—పట్టణానికివచ్చి గవర్నరు జనరల్ జోనెన్‌బర్గ్‌కు తయినాతీగా పనిచేస్తున్నాడు. ఈ గవర్నరు ఇతనికి బంధువు కూడా.

పాన్షిన్ తండ్రి అశ్వికదళ సేనానిగా పనిచేసి పించను పుచ్చుకున్నాడు. పేరుపడ్డ జూదరి. తేనెరంగు కళ్లు. ముడతలుపడ్డ ముఖం. వణుకుడు మూతి. గొప్పగొప్ప వాళ్ళతో బుజం బుజం రాసుకుంటూ తిరగడంతో జీవితమంతా గడిపాడు. [1]రెండు రాజధానులలోని ఇంగ్లీషు క్లబ్బుల చుట్టూ తిరుగుతుండేవాడు. బాగా పరిచయస్థుడు గదా అని మాత్రా అతన్ని నమ్మడానికి వీల్లేదు. అయితేనేం, మంచి సమర్థుడనే పేరువచ్చింది. ఎంత సమర్థుడైతే మట్టుకు ఏంలాభం, ఎప్పుడూ దరిద్రమే.

అతనికి ఒక్కడే ఒక కొడుకు. చనిపోయేటప్పటికి ఉన్న ఆ కాస్త ఆస్తీ తాకట్టులో ఉంది. ఇదీ పాన్షిన్‌కి తండ్రినించి సంక్రమించిన ఆస్తి.

1 పీటర్స్‌బర్గ్, మాస్కో

కాని ఒక విధంగా కొడుకు చదువుకు సదుపాయం కల్పించాడు. వ్లాడిమిర్ నికొలాయిచ్ ఫ్రెంచి భాష చాలా బాగా మాట్లాడగలడు. ఇంగ్లీషు బాగా మాట్లాడగలడు. జర్మన్ భాష మాత్రం అధ్వాన్నంగా మాట్లాడేవాడు. ఆ రోజుల్లో ఎవరైనా అంతే. జర్మన్ భాష చక్కగా మాట్లాడడం పెద్దమనిషి తరహా కాదని ఆనాటి మర్యాదస్తులు భావించేవారు. తగు సమయంలో — హాస్యానికైతే మరీ మంచిది — జర్మన్ సమాసాలు ప్రయోగించడం సరైన పద్ధతని ఎంచేవారు.

పదిహేనేళ్ల ప్రాయానికే వ్లాడిమిర్ నికొలాయిచ్ ఏమాత్రం కళవళపాటూ లేకుండా ఎవరి కచేరీ గదిలోనైనాసరే ప్రవేశించి కాసేపు కాలం వెళ్లబుచ్చి తగుసమయంలో నిష్క్రమించడంలో ఆరితేరాడు. తండ్రి ఇతనికి చాలామంది పెద్దవాళ్ళతో పరిచయం కలిగించాడు. రెండు ఆటల మధ్య పేక కలిపేటప్పుడో గొప్ప ఆట గెలిచినప్పుడో, ఇలాంటి ఆటలలో ఆసక్తి కలిగిన ప్రముఖులకి తన 'వోలోద్యా'ని గురించి నాలుగు ముక్కలు చెప్తుండేవాడు. ఇక వ్లాడిమిర్ నికొలాయిచ్ బి. ఏ. ప్యాసయ్యాడు. విశ్వవిద్యాలయంలో చదువుకునే రోజుల్లో అనేకమంది యువక శ్రేష్ఠులతో పరిచయం కల్గించుకున్నాడు. అందమూలంగా గొప్ప గొప్ప వాళ్ళ ఇళ్ళకి వెళ్ళటానికి అవకాశం చిక్కింది. ఎక్కడికి వెడితే అక్కడ ఇతన్ని ఎంతో ఆదరించేవారు. చూడ చక్కనివాడు. చీకూ చింతా ఎరగనివాడు. సర్దా పురుషుడు. మంచి ఆరోగ్యవంతుడు. అందరితోటీ చనువుగా మెలిగేవాడు. తగ్గవలసినప్పుడు తగ్గేవాడు, ముందుకు ఉరకవలసినప్పుడు ఉరికేవాడు. శ్రేష్ఠమైన వ్యక్తి! అదృష్టదేవత చిరునవ్వు నవ్వింది. గొప్పవారల సాంఘిక రహస్యాలు గ్రహించాడు. ఆ సంఘ నియమాలను నిజంగా గౌరవించేవాడు. స్వల్పవిషయాలను అసలేమాత్రం లక్ష్యపెట్టక, గభీర విషయాలను సైతం లక్ష్యపెట్టనట్టు నటించేవాడు. బహు పసందుగా నాట్యం చేసేవాడు. ఇంగ్లీషు దుస్తులు ధరించేవాడు. కొద్ది కాలంలోనే పీటర్స్‌బర్గ్ యువకుల్లోకల్లా గుణవంతుడు, వ్యుత్పన్నుడూ అని కీర్తి సంపాదించాడు. తండ్రికంటె పావ్లిన్ ఎక్కువ సమర్థుడు. మంచి ప్రతిభావంతుడు. అనేక విషయాలలో అందెవేసిన చెయ్యి. మనోహరంగా పాడతాడు. బహు నైపుణ్యంతో చిత్రాలు గీస్తాడు.

కవిత్వమల్లుతాడు. కొద్దో గొప్పో అభినయిస్తాడు కూడా. అతనికి ఇరవై ఎనిమిదేళ్లుంటాయి. మంచి ఉద్యోగంలో ఉన్నాడు. పానిన్‌కి తనలో, తన తెలివితేటల్లో, వివేకంలో విశ్వాసం హెచ్చు. ధైర్యంగా, హుషారుగా జీవితం నిర్మించుకున్నాడు. ఇతనికి జీవితం పూల పాన్పు. వృద్ధులు, యువకులు అతన్ని సమంగా అభిమానించేవారు. అందరి సంగతీ, ముఖ్యంగా స్త్రీల సంగతి, తనకు బాగా తెలుసునని అనుకునేవాడు. స్త్రీలలో సామాన్యంగా ఉండే లోటుపాట్లు బాగా ఆకళించుకున్నాడు. లలితకళలంటే చెవికోసుకునేవాడు. తనలో పట్టుదలా, భావనాశక్తీ, తన్మయతా దాగివున్నాయనే సంజ్ఞానం ఇతనికి ఉండేది. అందుకని మామూలు నియమాలను కొంచెం సళ్ళించి అడవి ఓటుధాన్యం పండించేవాడు. ఘరానా మనుష్యులు దూరదూరంగా ఉంచే సామాన్యులతో కూడా స్నేహం కట్టేవాడు. మొత్తంమీద ఏ గొడవా పట్టించుకోకుండా స్వేచ్ఛగా జీవితం గడిపాడు. కాని అతని హృదయం పాషాణం. పట్టి జిత్తులమారి. చుట్టూ ఎంత గందరగోళం జరుగుతున్నా ఏమాత్రం ఏ పొరపాటు లేకుండా ఏం జరుగుతోందీ ఓ కంట కనిపెట్టగలడు. ధైర్యంతో స్వతంత్రంగా వ్యవహరించే ఈ యువకుడు ఎన్నడూ భావోద్వేగానికి బానిస కాలేదు. నిజం చెప్పాలంటే తన విషయాలను గురించి ఎప్పుడూ గొప్పలు చెప్పుకోలేదు. ఓ — పట్టణానికి వచ్చిరావడంతో మేరియా ఇంటికి రాకపోకలు పెట్టుకున్నాడు. త్వరలోనే ఆ ఇంటివారితో కలిసిమెలిసి పోయాడు. మేరియా డిమిట్రియెవ్నాకి ఇతనంటే పిచ్చి అభిమానం.

పానిన్ గదిలో ఉన్నవారందరికీ గౌరవపురస్సరంగా నమస్కరించి మేరియాతోనూ, ఎలిజవెటాతోనూ కరచాలనం చేశాడు. జెడియొనొవస్కీ భుజంమీద తట్టాడు. లెనోచ్కాను దగ్గరికి తీసుకుని ఆమె నుదురుమీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

"అటువంటి పొగరబోతు గుర్రంమీద యెక్కడానికి నీకు భయం లేదూ?" అని మేరియా అడిగింది.

"అది పట్టి సాధువు. నాకు నిజంగా యెవరంటే భయమో చెప్పనా? సెర్జీ పెట్రోవిచ్‌తో పేకాటంటే నాకు చెడ్డ భయం. నిన్న పేకాటలో నన్ను దోచేశాడు".

జెడియొనొవస్కీ చిరునవ్వు నవ్వుతున్నట్లు నటించాడు. గవర్నరుకి
అభిమానపాత్రుడైన ఈ పీటర్స్‌బర్గ్ ఉద్యోగి దయ సంపాదించాలని అతని
యత్నం. మేరియాతో సంభాషణలో తరచు పాన్నిన్ సాధించిన విషయాల
ప్రసక్తి తెచ్చి "అవును. అతన్ని పొగడకుండా యెవరుండగలరు!" అనే
వాడు. "యీ యువకుడు గొప్ప గొప్ప విషయాలలో విజయం సాధిస్తు
న్నాడు. ఉద్యోగుల్లో మేలుబంతి. గర్వం అంటూ లేదు."

యదార్థానికి పీటర్స్‌బర్గ్‌లో కూడా పాన్నిన్‌ని సమర్థునిగా ఎంచే
వారు. ఎంత పనైనా ఇట్టే పూర్తిచేసేవాడు. కాని కాయకష్టానికి ఎక్కువ
విలువ ఇవ్వక బతక నేర్చిన వారందరిలానే ఇతనూ తన సామర్థ్యాన్ని గురించి
చులకనగా మాట్లాడేవాడు. మంచి పరిపాలనా దక్షత గల అధికా .
ఇటువంటి వాళ్ళను పై అధికారులు అమితంగా అభిమానిస్తారు. తలుచు
కుంటే ఎప్పటికైనా మంత్రి అయిపోగలననే విశ్వాసం ఇతనికుండేది.

"నిను దోచేశానన్నావుగదా! మొన్న నా దగ్గరనించి పన్నెండు
రూబుళ్ళు[1] గెల్చుకుందెవరో? యింకా..."

"ఆరిపిసుగా!" అన్నాడు పాన్నిన్. అలా అనడంలో అతని కంఠ
స్వరంలో దయారసమేగాక అసహ్యంతో కూడిన నిర్లక్ష్యభావంకూడా
ద్యోతకమైంది. ఇలా అని లీజాదగ్గిరికి వెళ్ళి అన్నాడు:

"ఒబెరాన్[2] నాటకప్రారంభగీతాలు యిక్కడ దొరకలేదు.
శాస్త్రీయ సంగీతసాహిత్యమంతా తనదగ్గిరుందని బెలెనిట్సీనా కోతలు
కోసింది. ఆవిడదగ్గిర లల్లాయిపదాలు, డాన్సు పాటలు తప్ప మరేంలేవు.
మాస్కోకు రాశాను. ఓ వారంరోజుల్లో ఆ గీతాలు వస్తాయి. మరిచే
పోయా. నిన్న కొత్తపాట ఒకటి రాశాను. సాహిత్యంకూడా నాదే. నీకు వినా
లనివుందా? దాని బాగోగులు నాకు తెలియవు కాని బెలెనిట్సీనా భేషుగ్గా
వుందంది. అయితే ఆవిడ అభిప్రాయానికి పెద్ద విలువయివ్వకూడదు. నీ అభి
ప్రాయం తెలుసుకోవాలనివుంది. పోనీ తొందరేంలే. రేపెప్పుడైనా..."

"రేపటిదాకా యెందుకు? యిప్పుడే వినిపించరాదూ?" అంటూ
వారి సంభాషణకు అడ్డంవచ్చింది మేరియా.

---

1 రష్యన్ నాణెం. సుమారు మన రూపాయిన్నరకు సమానం.

2 సంగీతనాటకం. కర్త: జర్మన్ వాగ్గేయకారుడు వీబర్ (1786-1826)

"సరే మీ యిష్టం." అని మనుకకాంతులు విరజిమ్మే మందహాసం చేస్తూ జవాబిచ్చాడు పాన్లిన్. ఆ మందహాసం ఎంత త్వరగా పొడగట్టిందో అంత త్వరగా మాయమైంది. మోకాలితో కుర్చీపీట అవతలికి నెట్టి పియానోముందు కూర్చుని మెట్లునొక్కి మాటలు స్పష్టంగా వినిపించేటట్టు పాన్లిన్ పాడసాగాడు.

"చింతతో సిగసువాల్చిన చింతకొమ్మపై
ఎగబాకు నెలరాజు సొగసులే చూడు!

చూలాలువలె సాగు నీలాలనుబ్బుతో
జాబిల్లి కొంటెగా దోబూచులాడు.

అంతరాళముచుండి కాంతిదండును పంపి
భూలోక సామ్రాజ్యమును ఏలుతాడు!

ఎడదలో నున్నట్టి కడలి నుప్పొంగించు
చందమామవు నీవె అందాలరాణి!

అడ్డుకట్టలులేని అంచుల్లు కనరాని
తరగ లురలించు సాగరము నాయెడద.

నీకంటి కొలనులో నీలాలు దోగితే
గుండాలు పడి గుండె ఘూర్ణిల్లుతాది.

నీ చూపులో వెలుగు సేడల్లు బారుతే
పసిడి యిసుకను గుండె పరచుకొంటుంది.

తలుచుకుంటూ నిన్ను కలగుండు పడతాను
మనసు విప్పేసరికె మైమరుస్తాను!

నీవు మాత్రము రాణి! నిండుజాబిల్లిలా
ఊఁ యనక ఆ యనక ఊరుకుంటావు!"

రెండో భాగం అతిశ్రద్ధతో, అమిత భావోద్రేకంతో పాన్షిన్ పాడాడు పియానో వెలువరించిన వివిధ ధ్వనులు సముద్ర తరంగాలను జ్ఞప్తికి తెచ్చాయి. 'మనసు విప్పేసరికి మైమరుస్తాను' అనే మాటలు ఉచ్చరించి పాన్షిన్ ఒక్క నిట్టూర్పు విడిచాడు. దృష్టి కిందికి సారించి శృతి తగ్గించాడు. పాట పూర్తి అయింది. లీజా స్వర కల్పన చాలా బాగుందని మెచ్చుకుంది. మేరియా హృదయాకర్షణీయంగా ఉందంది. జెడియొనొవస్కీ సైతం "బహు రమ్యంగా వుంది. సంగీతం సాహిత్యం రెండూ ఆహ్లాదకరంగా వున్నాయి" అనేశాడు. లెనోచ్కా గాయకునికేసి విచిత్రపుచూపు చూసింది. అక్కడ కూడినవారందరికీ ఈ యువగాయకుని స్వర కల్పన ఆనందం కలిగించింది. కాని అప్పుడే వచ్చి హాలు గుమ్మంలో నిల్చున్న ఒక వృద్ధునికి మాత్రం ఆనందం కల్గించినట్టు లేదు. వంచిన తల, బుజాలకదలిక యీ విషయాన్నే సూచిస్తున్నాయి. ఒక మోటు జేబురుమాలుతో బూట్లమీది దుమ్మును దులిపేసుకుని కళ్ళు కుంచించి, పెదవులు గట్టిగా నొక్కుకుని, అసలే వంగిపోయిన నడుం ఇంకా వంచి ఆ వృద్ధుడు మెల్లిగా అడుగులు వేసుకుంటూ కచేరీ గదిలో ప్రవేశించాడు.

"ఓ! క్రిస్టొఫర్ ఫియొడరోయిచ్! నమస్కారం" అన్నాడు పాన్షిన్ అందరికంటే ముందుగా ఆసనంనించి దిగ్గునలేచి.

"మీరు యిక్కడ వున్నారనుకోలా. అనుకుని వుంటే మీ ముందు పాడటానికి ధైర్యంచేసే వాణ్ణిగాదు. దేశీ సంగీతం మీకు నచ్చదని నాకు తెలుసు"

"ఆపాట నే విననేలేదు" అన్నాడా ఆగంతకుడు వచ్చీరానీ రష్యన్ భాషలో. అక్కడ ఉన్నవారందరికీ వంగి నమస్కరించి గది మధ్యలో వికారంగా నుంచున్నాడు.

"మాన్షియర్ లెమ్! లీజాకి పాఠం చెప్పడానికి వచ్చారనుకుంటా" అంది మేరియా.

"ఉహు - ఎలిజవెటా మైకెలోవ్నాకి చెప్పాలని కాదు, ఎలీనా మైకెలోవ్నాకి చెప్పాలని వచ్చా".

"సరే. మంచిది. లెనోచ్కా! లెమ్‌తో మేడమీదికి వెళ్ళు."

ఆ బాలిక వెంట లెమ్ వెళ్లబోతుండగా పాన్షిన్ వారిని ఆపి "పాఠం చెప్పడం అయిపోయాక వెళ్లిపోకండి, క్రిస్టాఫర్ ఫియోడరోయిచ్! ఎలిజవెటా నేనూ బిథోవెన్[1] కృతి పాడాలనుకుంటున్నాం, వినుదురుగాని" అన్నాడు.

ఆ వృద్ధుడు ఏదో గొణుక్కోసాగాడు. దానిమీద పాన్షిన్ తప్పుడు ఉచ్చారణ చేస్తూ జర్మన్ భాషలో "ఎలిజవెటా మైకెలోవ్నాకి మీరు అంకిత మిచ్చిన ప్రార్థనా గీతం నాకు చూపించింది. అద్భుతంగా వుంది. శాస్త్రీయ సంగీతం మెచ్చుకోలేనివాణ్ణని అనుకోకండి. కాకపోతే ఆ సంగీతం మధ్యమధ్య కొంచెం విసుగెత్తిస్తుంది. అయితేనేం సొంపుగా వుంది."

ఆ వృద్ధునికి కోపం వచ్చింది. లీలాకేసి కోరచూపు చూసి చరచరా చక్కాబోయాడు.

పాన్షిన్ రచించిన గేయాన్ని తిరిగీ పాడమని కోరింది మేరియా. కాని ఆ జర్మన్ పండితుని చెవులకు ములుకుగా ఉండే గేయం తిరిగీ పాడి అతనికి బాధకల్గించనంటూ నిరాకరించి, బిథోవెన్ కృతి పాడదామని పాన్షిన్ లీజాను ప్రోత్సహించాడు. దానిమీద మేరియానిట్టూర్చి తోటలోకి షికారు వెడదాంరమ్మని జెడియొనొవస్కీని పిలిచింది. జెడియొనొవస్కీ వికటంగా నవ్వి, అంగీకార సూచకంగా తలవంచాడు. రెండు వేళ్ళతో సున్నితంగా హాటుతీసుకుని మేరియా వెంట బయటికి వెళ్ళిపోయాడు. గదిలో పాన్షిన్, లీజా లిద్దరే మిగిలారు. స్వరకల్పన గుర్తించిన కాగితం తీసుకుని లీజా మడత విప్పింది. ఇద్దరూ పియానో ముందు మౌనంగా కూర్చున్నారు. పైనించి మధ్య మధ్య ఆగుతూ లెనోచ్కా వివిధ స్థాయిలలో వాయిస్తున్న పియానో ధ్వనులు వినిపిస్తున్నాయి.

1. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన జర్మన్ వాగ్గేయకారుడు (1770 - 1829)

## ౨

క్రిస్టాఫర్ థియోడర్ గోట్లాబ్ లెమ్ సాగ్జనీలోని చిమ్నిట్జ్ అనే పట్టణంలో 1786 లో జన్మించాడు. ఇతని తలిదండ్రులు కడు బీదవారు. సంగీతం వారికి జీవనాధారం. తండ్రి ఫ్రెంచి కాహళీమూ, తల్లి వీణా వాయించి జీవనం గడుపుతుండేవారు. లెమ్ అయిదవ ఏటనే మూడు జంత్రాలు వాయించడం అభ్యసించాడు. ఎనిమిదో ఏట ఇతని తలిదండ్రులు చనిపోయారు. పదో ఏటనించీ సంగీతకళను ఆధారంచేసుకుని లెమ్ పొట్ట పోసుకో నారంభించాడు. చాలాకాలం ఊళ్లమ్మట తిరుగుతూ, హోటళ్ళలోనూ, సంతల్లోనూ, పెళ్ళిళ్ళల్లోనూ, విందుల్లోనూ వాయిస్తూ కాలక్షేపం చేశాడు. తర్వాత ఒక ఆర్కెస్ట్రాలో చేరి క్రమక్రమేపీ దానికి నాయకుడయాడు. ఇతని వాయిద్యం అద్ధ్వాన్నంగా ఉండేది. కాని సంగీత శాస్త్రంలో మంచి పరిజ్ఞానం అలవడింది. ఇరవై ఎనిమిదో ఏట రష్యాకి లెమ్ వలస వెళ్ళాడు. రష్యాలోని ఒక పెద్దమనిషి అతన్ని ఆహ్వానించి తీసుకు వెళ్ళాడు. ఆ పెద్దమనిషికి సంగీతమంటే తలకాయ నెప్పి. దర్జాకోసం ఒక ఆర్కెస్ట్రాను పోషిస్తున్నాడు. ఏడు సంవత్సరాలపాటు లెమ్ అతని దగ్గిర సంగీత దర్శకుడుగా పనిచేశాడు. చివరికి పట్టి చేతులతో బైటికి

పోవలసి వచ్చింది. ఆ పెద్దమనిషి దివాళాతీసి లెమ్‌కి ఇవ్వాలసిన జీతానికి గాను మొదట ప్రాంసరీనోటు రాసిద్దామనుకున్నాడు. గాని బాగా ఆలోచించి మానుకున్నాడు. లెమ్‌కి ఒక్క ఫార్తింగయినా ముట్టలేదు. రష్యానించి ఇక వెళ్ళిపొమ్మని అనేకమంది అతనికి సలహాఇచ్చారు. కళాకారుల పాలిటి కల్పవృక్షంగా భావించబడేరష్యానించి రిక్తహస్తాలతో ముష్టివానిలా వెళ్ళిపోవడానికి లెమ్‌కి మనస్కరించలా. రష్యాలోనే ఉండిపోయి తన అదృష్టం పరీక్షించుకుందామని నిశ్చయించుకున్నాడు. పాపం! ఈజర్మన్ గాయకుడు ఇరవై ఏళ్ళనించీ తన అదృష్టం పరీక్షించుకుంటూనే ఉన్నాడు. అనేకమంది పెద మనుషుల కొలువులో ఉన్నాడు. మాస్కోలో తదితర పట్టణాలలో తన అదృష్టాన్ని పరీక్షించాడు. అనేక బాధలు సహించాడు. దారిద్ర్యం అనుభవించాడు. ఎన్నో కష్టతరంగాలను ఎదుర్కొన్నాడు. ఇన్ని కష్టాల్లోనూ మాతృభూమికి తిరిగిపోవాలనే కోరిక మాత్రం ఇతనిలో చావలేదు. ఆ ఒక్క ఆశతోనే నిలదొక్కుకుని బలకగల్గాడు. ఈ అంతిమ కోరికను గూడా అదృష్టదేవత తీర్చలేదు. యాభై య్యోపడి పైబడింది. శరీరం కృశించి పోయింది. రుగ్మత ప్రవేశించింది. ఇక ఏమిటి చేయడం? తానసహ్యించుకొనే రష్యాను వదిలిపోవాలనే ఆశనునిరాశ చేసుకుని ఓ —— పట్టణంలో అట్టే ఉండిపోయాడు. సంగీత పాఠాలు చెప్పుకుంటూ జీవయాత్ర గడుపుతున్నాడు.

లెమ్ ఆకారం చూట్టానికి ముచ్చటగా ఉండదు. మనిషి పొట్టి. వంగిపోయిన నడుం, జారిపోయిన బుజాలు. జానెడులోతు పొట్ట. పొడుగ్గా చట్టాలాంటి పాదాలు. నీలిరంగు బండ కాలిగోళ్ళు. ఎర్రటి చేతులు. స్పష్టంగా కనిపించే నరాలు. కొమ్ముల్లాంటి గోళ్ళు. ముడతలుపడ్డ ముఖం. సొట్టబుగ్గలు. ఒగుసుకుపోయిన పెదిమలు. మితభాషి. దీనితో పాటు, అలవాటైపోయిన పెదిమలు బిరవడం, కొరుక్కోవడం చూపరులలో అసహ్యభావం కలిగించేవి. సన్నని నుదురుమీద చిందరవందరగా జుట్టు, ఆరిపోయే దీపంలా జీవంలేని కళ్ళు. మోయలేని శరీరాన్ని అడుగడుక్కూ ఊపుకుంటూ అతి ప్రయాసమీద నడిచేవాడు. అతని చేష్టలు, పంజరంలో బంధింపబడ్డ గుడ్లగూబ మిడిగుడ్లు మిణకరిస్తూ నిస్సహాయ స్థితిలో వికృతంగా కొట్టుకోవడం జ్ఞప్తికి తెస్తాయి. పాపం! హృదయాన్ని

ద్రవ్యాలు చేసే దుఃఖం ఇతనిమీద శాశ్వత ముద్రను వేసి అసలే అసహ్యం గొల్పే ఆకారాన్ని మరింత వికృతం చేసింది. ప్రథమ పరిచయంలోనే ఒక నిశ్చితాభిప్రాయానికి రానివారికి మాత్రం సర్వనాశనమై పోయిన ఈ వ్యక్తిలో మంచితనం, చిత్తశుద్ధి, ఏదో అసాధారణతా గోచరిస్తాయి. బాచ్ 1 హాన్‌డెల్ 2 అంటే ఇతనికి మహా ఇష్టం. సంగీతంలో పాండిత్యం, మంచి భావనా పటిమా, మనోబలం గల లెమ్‌కి, అదృష్టం ఎదురు తన్నక పోయినట్లయితే, జర్మన్ వాగ్గేయకారుల సరసను స్థానం లభించిందేమో ఎవరికి తెలుసు? పాపం! ఏ దుష్ట నక్షత్రాన పుట్టాడో! లెమ్ చాలా గేయాలు రచించాడు. కాని ఏం లాభం? ఒక్కటీ ప్రపంచపు వెలుగుచూడ లేదు. లెమ్‌కి లౌక్యం తెలీదు. ఆశ్రయించడం తెలీదు. ఏ సమయంలో ఎలా ప్రవర్తించాలో తెలీదు. చాలాకాలం కిందట ఇతనిలాంటి దరిద్రుడే ఒక జర్మన్ గాయకుడు ఇతని గేయాలు రెండు ప్రచురించాడు. కాని అవి దుకాణాల బీరువాలలోనే బూజుపట్టి పోయాయి. అర్ధరాత్రివేళ నీటిలో విసిరి పారేసినట్లు అతని గేయాలు కాలగర్భంలో లీనమైనాయి. ఎలా రాసి పెట్టిందో అలాజరుగుతుందని లెమ్ మనసు నిబ్బరంచేసుకున్నాడు. వృద్ధాప్యం బాధిస్తోంది. మనసు కూడా చేతుల్లానే రాయి అయిపోయింది. కాలిటిన్‌ల ఇంటి సమీపంలోని ఒక చిన్న ఇంటిలో ఉంటున్నాడు. బిక్షుక గృహం నించి తీసుకువచ్చిన వంటవాడు మాత్రమే అతనికి తోడు నీడ. లెమ్ అసలు పెళ్ళేచేసుకోలేదు. దూరం షికారు వెళ్ళడం, బైబిలో, ప్రార్థనా గీతాలో, ష్లెగల్ 3 అనువదించిన షేక్స్పియరు 4 రచనలో చదవడం అతనికి పరిపాటి. చాలాకాలంగా గేయాలు రచించడమే లేదు. కాని అతని శిష్యవర్గంలో ఉత్తమురాలైన లీజా అతన్ని సుషుప్తి నించి మేల్కొల్పింది. ఇందాక పానిన్ ఉటంకించిన గేయం లీజా ప్రేరణమీద లెమ్ కూర్చిందే. ఈ గేయానికి సాహిత్యం ప్రార్థనా గీతాలనించి తీసుకుని దానికి తన రచన

1. జర్మన్ వాగ్గేయకారుడు. 2 ఆంగ్ల స్వర కర్త. జన్మతః జర్మన్ (1685 - 1759)

3. జర్మన్ కవి, విమర్శకుడు, పండితుడు (1772 - 1829)

4. ఉత్తమ ఆంగ్ల నాటక రచయిత (1564-1616). 37 నాటకాలు రాశాడు.

కొద్దిగా చేర్చాడు. ఆ గేయం రెండు బృందగానాలకోసం ఉద్దేశింపబడింది. ఒకటి ఆనంతదాయకమైంది. రెండోది విషాత భరితమైంది. చివరికి రెండూ కలిసి ఒకే ఒక గేయంగా రూపొంది పాడబడతాయి. "ఓ కరుణామయా! భగవాన్! ఈ పాపులను క్షమించు. చెడు ఆలోచనల నించీ, ఐహిక వాంఛల నించీ విముక్తి కల్గించు." ఇదీ అతని గేయం. ఇక ముఖపత్రం మీద "సన్మార్గ వర్తనులే ధర్మపరులు. ప్రార్థనా గీతం. రచన: సి. టి. జి. లెమ్. అంకితం: ప్రియ శిష్యురాలు. ఎలిజవెటా కాలిటిన్‌కి" అనే మాటలు జాగ్రత్తగా ముద్దులొలికే అక్షరాలతో రాసిచ్చాడు. "సన్మార్గ వర్తనులే ధర్మపరులు", "ఎలిజలెటా కాలిటిన్" అనే మాటల చుట్టూ సూర్యకిరణాలను చిత్రించాడు. దానికింద "నీకు మాత్రమే" అని రాశాడు. పాన్షిన్ ఈ గేయ ప్రసక్తి తెచ్చేసరికి లెమ్ మహా బాధపడ్డాడు. పిచ్చికోపం వచ్చి లీజాకేసి కోరచూపు చూసాడు.

## ౬

పాన్షిన్ పట్టుదలతో, బిగ్గరగా బిథోవెన్ కృతి రెండో చరణం వాయించ నారంభించాడు. కాని లీజా పాట ఎత్తుకోలేదు. అతను వాయించటం ఆపి ఆమెకేసి చూశాడు. అతని వంకే తదేక దృష్టితో చూస్తున్న లీజా కళ్ళల్లో అసంతుష్టి గోచరించింది. పెదవులపై చిరునవ్వు లేదు. ముఖంలో విషాదం పొడగట్టింది.

"యేమిటి సంగతి?" అని అడిగాడు పాన్షిన్.

"నీ మాట యెందుకు నిలబెట్టుకోలేదు. క్రిస్టాఫర్ ఫియొడొరొయిచ్ కీర్తనను గురించి ఒక్కమాటన్నా అతనితో అనవని మాట యిచ్చినమీద నేగా నీకది చూపించా".

"క్షమించు. ఎలిజబెటా మైకొలొవ్నా ! నోరు జారింది"

"నీ మూలంగా మా పని తలకిందులైంది. ఇక ఆయన నా మాట నమ్మనే నమ్మడు."

"యేం చెయ్యను చెప్పు? చిన్నప్పటినించీ జర్మనీవాడు కంటబడితే చాలు, సహించలేకపోతున్నా. యేదో విధంగా యేడిపించుకు తినాలని మనసు గోజిల్లుతుంది"

"అదేమిటి? పాపం! అతను కటిక దరిద్రుడు. వొంటరివాడు. భగ్నజీవి! అతనంటే జాలేయడం లేదూ? యేడిపించుకు తినాలని బుద్ధి యెలా పుడుతుంది?"

పాన్షిన్ కలవరపడి, "దీనికంతటికీ నాకు దూరదృష్టి లేకపోవటమే కారణం. ఊహూ - కాదని వాదించను. నా సంగతి నాకు బాగా తెలుసు. విచక్షణా జ్ఞానం లేకపోవటం నాకెంతో హానికలగచేస్తోంది. దీనిమూలంగా నాకు అహంభావం జాస్తీ అని పేరు వచ్చింది." అన్నాడు.

పాన్షిన్ ఒక్క నిమిషం ఆగాడు. ఏ విషయం మీద సంభాషణ ప్రారంభమైనా చివరకు తన విషయం చెప్పి మరీ ముగించటం అతనికి అలవాటు. ఆ చెప్పడం కూడా ఎంతో సున్నితంగా, ఏమాత్రం నటన లేకుండా, ఉల్లాసంగా, యదాలాపంగా చెప్పినట్లు చెప్పేవాడు.

"మీ వాళ్ళ సంగతే తీసుకో. మీ అమ్మకు నేనంటే మంచి అభిప్రాయం వుంది. యెంతో దయతో ఆదరిస్తుంది. నువ్వు...నన్ను గురించి యేమనుకుంటున్నావో నాకు తెలీదు. యిక మార్ఫా టిమొఫెయెవ్నాకి నేనంటే గిట్టదు. బహుశా దూరదృష్టి లేకుండా ఆవిడతో యేదో అని కోపం తెప్పించివుంటా. నేనంటే ఆమెకి గిట్టదు కదూ?"

"ఆ-నువ్వంటే ఆవిడకి గిట్టదు" అంది లీజా ఒక నిమిషం తటపటాయించి.

పాన్షిన్ పియానో మెట్లమీద వేళ్లు సారించాడు. కనిపించీ కనిపించని వెటకారపు నవ్వు అతని పెదవులమీద నాట్యమాడింది.

"సరే. నీ అభిప్రాయ మేమిటి? నాకు అహంభావం జాస్తీ అని నువ్వూ అనుకుంటున్నావా?

"నీ విషయం నాకు అంతగా తెలీదు. కాని నీకు అహంభావం వుందనుకోను. పైగా నీకు నేనెంతో కృతజ్ఞత చూపాల్సుంది. నువ్వు..."

"నువు చెప్పదలిచిందేమిటో నాకు తెలుసు. తెలుసు" అన్నాడు పాన్షిన్ తిరిగి పియానో మెట్లమీద వేళ్ళు సారిస్తూ. "పాటలు, పుస్తకాలూ తెచ్చి యిస్తున్నందుకు, నీ అల్బంలో బొమ్మలు గీసిపెడుతున్నందుకు కృతజ్ఞత! అంతేనా? ఇన్ని చేస్తున్నా నాకు అహంభావం లేదని యెలా అనుకోవటం? నీకు విసుగెత్తిస్తున్నాననిగాని చెడ్డవాడననిగాని నువ్వను

కోవటంలేదనే తెలుస్తున్నా... కాకపోతే స్నేహితుణ్ణిగానీ తండ్రినిగానీ వేళాకోళం చెయ్యకుండా వదిలిపెట్టనని అనుకుంటున్నావు గదూ?"

"గొప్పవాళ్ళలాగానే నీకూ శ్రద్ధలేదు. మరుపు యెక్కువ. అంతే" అంది లీజా.

పాన్షిన్ కొద్దిగా ముఖం చిట్లించుకుని "యిక నా విషయం మాట్లాడద్దు. ఆ కృతిపాడదాం. ఒక్కమాట మాత్రం చెప్పాలని వుంది" అన్నాడు పియానో మీది సంగీతగ్రంథం దులుపుతూ. "నాకు అహంభావం ఎక్కువని అనుకుంటే అనుకోగాని ననుమాత్రం గొప్పవాణ్ణనకు. ఆ తోక అసహ్యకరమైంది. నేను కళాకారుణ్ణి. గొప్ప కళాకారుణ్ణి మాత్రం కాకపోవచ్చు. ఆ విషయం యిప్పటికిప్పుడే నిరూపిస్తాను చూడు. ఊఁ - పాట ప్రారంభిద్దాం?"

"సరే ప్రారంభిద్దాం" అంది లీజా.

పల్లవి బాగానే వెళ్ళింది. కాకపోతే పాన్షిన్ మధ్య మధ్య సరిగా వాయించలేకపోయాడు. అతను నేర్చుకున్న గేయాలూ, స్వంత గేయాలూ బాగా వాయించగలడు కొత్త స్వరాలు అందుకోటం చాతకాదు. ఆ కృతి రెండోభాగం, అనుపల్లవి తగలడిపోయింది. పాన్షిన్ వాయించటం ఆపేసి నవ్వుతూ కుర్చీ వెనక్కి జరిపాడు. "యేం లాభంలేదు. యిక యివాళటికి వాయించలేను. నా వాయిద్యం లెమ్ చెవిని పడితే మూర్ఛపోయి వుండును"

లీజా లేచి పియానో మూసేసి పాన్షిన్‌కేసి తిరిగి "యిక యిపుడేం చేద్దాం" అంది.

"నీ ప్రశ్న కూడా నీలానే వుంది. ఒక్క నిమిషం కూడా వూరికే కూచోలేవు గదా! సరే-నీకిష్టమైతే యింకా వెలుతురు వుండగానే రెండు బొమ్మలు గీద్దాం. బహుశా చిత్రకళాధి దేవత - ఆవిడ పేరేమిటి? - ఆవిడ కన్నా నామీద దయ వుడుతుందేమో? నీ ఆల్బం యేదీ? మొన్న ఆరంభించిన బొమ్మ యింకా పూర్తికాలేదనుకుంటా?"

ఆల్బం తీసుకురావడానికి లీజా పక్కగదిలోకి వెళ్ళింది. పాన్షిన్ జేబులోంచి సన్నటి రుమాలు తీసి గోళ్ళు తుడుచుకుని, కళ్లు కుదించుకుని తన చేతుల్ని గురించి ఆలోచించ సాగాడు. అవి తెల్లగా పసందుగా ఉన్నాయి. ఎడమచేతి బొటనవేలికి బంగారపు తీగ ఉంగరం ఉంది. లీజా

ఆల్బ్ం తీసుకుని తిరిగి వచ్చింది. పాస్సిన్ కిటికీదగ్గిర కూర్చుని ఆల్బం తెరిచాడు.

"ఆ - నేను గీసిన ప్రకృతి దృశ్యం చూచి నువు గీస్తున్నా వన్న మాట! బాగుంది. బలే బాగుంది! ఇక్కడ మాత్రం - పెన్సిలు యేదీ? - వీడలు స్పష్టంగా లేవు. చూడు."

పాస్సిన్ పొడుగాటి రేఖలు చాలా గీసేశాడు. ఈ ప్రకృతిదృశ్యాన్నే ఎప్పటినించో చిత్రిస్తూనే ఉన్నాడు. ముందు చెల్లాచెదరుగా పెద్ద పెద్ద చెట్లు, వెనక చిన్న మైదానం, ఇంకా వెనక పర్వత శిఖరాలు ఆ చిత్రంలో చిత్రితమైనాయి. లీజా వెనకనించి బొమ్మకేసి చూస్తోంది.

"జీవితంలో లాగానే సర్వసాధారణంగా చిత్రలేఖనంలో కూడా సున్నిత రేఖలు, సాహసం ప్రధానం" అన్నాడు పాస్సిన్ తల అటు ఇటూ తిప్పుతూ.

సరిగ్గా ఆ సమయానికి లెమ్ గదిలో ప్రవేశించి వంగి నరాలన్నీ బిగించి నమస్కరించి వెళ్ళిపోదామనుకుంటుండగా పాస్సిన్ పెనసలూ, ఆల్బం అవతలకి గిరాటేసి లెమ్ తోవకి అడ్డం తగిలాడు.

"యెక్కడికి వెళుతున్నారు? టీకి వుండరూ"

"యింటికి వెడుతున్నా. తలనొప్పిగా వుంది" అన్నాడు లెమ్ చిరచిర లాడుతూ.

"అలా కాదు. వుండండి. షేక్స్పియర్ని గురించి చర్చిద్దాం."

"నాకు తల నెప్పిగా వుంది" అని తిరిగీ అన్నాడా వృద్ధుడు.

"మీరు రాకుండానే బిథోవెన్ కృతి ప్రారంభించాం" అని మొదలు పెట్టాడు పాస్సిన్ ఆప్యాయంగా లెమ్ని చేతులతో చుట్టివేస్తూ, మధుర మందహాసం చేస్తూ. "కాని సాగలా".

"నీ పాటే మళ్ళీ పాడుకుంటే బాగుండి పోయేది" అని లెమ్ పాస్సిన్ చేతులు తోసేసుకుని వెళ్ళిపోయాడు.

లీలా ఆయన వెంట పరిగెత్తి పోర్చ్లో కలుసుకుంది.

"క్రిస్టాఫర్ ఫియొడొరిచ్! ఒక్క మాట వినండి. మీకు కోపం తెప్పించాను. క్షమించండి" అంది లీజా జర్మన్ భాషలో అతనితో పాటు గేటుదాకా వెడుతూ. లెమ్ జవాబియ్యలేదు.

"వ్లాడిమియర్ నికొలాయిచ్‌కి మీ పాట చూపించాను. అతను దాన్నెంతో మెచ్చుకుంటాడనే అనుకున్నా. అలాగే యెంతగానో మెచ్చుకున్నాడు కూడా."

లెమ్ ఆగి "సరే" అన్నాడు రష్యన్ భాషలో. తర్వాత తన మాతృభాషలో "అతనికేం అర్థంకాదు. నీకు తెలీటంలా? అతనేదో సర్దాకి సంగీతం పాడుతుంటాడు. అంతే." అన్నాడు.

"అర్థం అతనికంతా అర్థమవుతుంది. అన్నీ స్వయంగా పాడగలడు."

"ఊ–అయితేనేం అతను పాడేదంతా వట్టిచవకబారు సంగీతం. ప్రజలకి అతనూ, అతనిపాటా నచ్చుచ్చు. అతనికదే సంతృప్తి. అంతే. నాకేం కోపంలేదు. నా పాటా, నేనూ వట్టి పిచ్చి ఫుల్లాయలం. నాకొంచెం సిగ్గేసింది. మరేం పర్వాలేదులే."

"క్షమించు, క్రిస్టాఫర్ ఫియొడొరిచ్!" అని గొణిగింది లీలా.

"సరే" అని తిరిగీ అన్నాడు లెమ్.

"నువ్వు మంచి పిల్లవి...అదిగో – యెవరో వస్తున్నారు. నమస్తే. నువ్వు మంచి పిల్లవి" అని లెమ్ తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ గేటువేపుకి వెళ్ళిపోయాడు. ఆ గేటులోంచి ఒక పెద్దమనిషి వస్తున్నాడు. బూడిద రంగు కోటూ, వెడల్పాటి అంచుల గడ్డి హాటూ ధరించాడు. లెమ్ వినమ్రతతో వంగి అతనికి నమస్కరించి ముందుకు సాగిపోయాడు. (అపరిచిత వ్యక్తులకు నమస్కరించటం, పరిచయస్థులు వీధిలో కనిపిస్తే మొహం తప్పించటం లెమ్ నియమాలు). ఆ అపరిచిత వ్యక్తి వెళ్ళిపోతున్న లెమ్‌కేసి ఆశ్చర్యంగా చూసి లీజాను జాగ్రతగా పరికించి సరాసరి ఆమె దగ్గిరకి వెళ్ళాడు.

# 8

అతను హాటు తీసేసుకుని "గుర్తుపట్టలా? చూసి యెనిమిదేళ్ళయినా నిను యిట్టే గుర్తుపట్టేశాను. అప్పుడు నువు చిన్నపిల్లవి...నాపేరు లావ్రెటస్కీ. మీ అమ్మ యింట్లోనే వుందా? వెళ్ళి మీ అమ్మని చూడచ్చా?" అన్నాడు.

"మీరు వెళ్ళి మా అమ్మను చూస్తే చాలా సంతోషిస్తుంది. మీరు వూళ్ళోకి వచ్చారని వింది కూడా."

"నీ పేరు ఎలిజవెటా కాదూ?" అన్నాడు లావ్రెటస్కీ పోర్చి మెట్లు ఎక్కుతూ.

"ఆ - అవును"

"నాకు బాగా జ్ఞాపకమే. నీ మొహం జన్మలో మరిచేపోలేం. నీకు మిఠాయి అదీ తెచ్చిపెడుతూండేవాణ్ణి."

లీజా సిగ్గుపడి "యెంత చిత్రమైన మనిషి!" అని తనలో తాననుకుంది. లావ్రెటస్కీ హాలులో ఒక నిమిషం ఆగాడు. లీజా కచేరీ గదిలోకి వెళ్ళింది. అక్కడనించి పాన్షిన్ కంఠస్వరమూ, నవ్వూ వినవస్తున్నాయి. తోటలో షికారుచేసి అప్పుడే తిరిగివచ్చిన మేరియా డిమిట్రీయెవ్నాకి,

జెడియొనోవస్కీకి ఊళ్ళో ముచ్చట్లు చెబుతూ తను చెబుతున్న కట్టుకథలకి తానే బిగ్గరగా నవ్వుతున్నాడు. లావ్రెటస్కీ వచ్చాడని వినగానే మేరియా కంగారు పడింది. తెల్లబోయింది. అతన్ని కలుసుకోడానికి ముందుకు వెళ్ళి "బావున్నావా? నువు రావడం నాకు మహా సంతోషంగా వుంది" అన్నది.

"బావున్నావా?" అని అడిగాడు లావ్రెటస్కీ ఆమె చేతిని స్నేహపూర్వకంగా నొక్కుతూ. "పరిస్థితులన్నీ సవ్యంగానే వున్నాయి కదూ?"

"కూర్చో, కూర్చో. యెంత సంతోషంగా వుందనుకు నా మొట మొదట నా కూతురు లీజాని నీకు పరిచయం చెయ్యనీ."

"నా అంతట నేనే లీజాతో పరిచయం కలిగించుకున్నా" అన్నాడు లావ్రెటస్కీ.

"వీరు మాన్సియర్ పాన్షిన్... సెర్జీపెట్రోవిచ్ జెడియొనోవస్కీ... కూర్చో. కూర్చో...యిక్కడికి వచ్చేశావన్నమాట! నా కళ్ళని నేనే నమ్మలేకపోతున్నా. బావున్నావా?"

"కనిపించడంలా? బాగా కులాసాగానే వున్నా. నువ్వూ బాగా ఆరోగ్యంగానే వున్నట్టున్నావ్. యెనిమిదేళ్ళ క్రితానికీ యిప్పటికీ నీలో పెద్దమార్పేం కనిపించడంలా".

"వొకరి నొకరం చూసి చాలా కాలమైంది" అన్నది మేరియా విచారంగా. "యెక్కడ నించీ రావడం? యిక యిక్కడే కొంతకాలంపాటు వుండిపోతావా."

"నేను బెర్లిన్ నించి వచ్చా. రేపు మా గ్రామం వెడతా. బహుశా అక్కడ కొంత కాలంపాటు వుండిపోతా."

"లావ్రికీలో వుంటావు గదూ?"

"ఊహుం - లావ్రికీలో కాదు. యిక్కడ నించి యిరవై అయిదు వెర్స్టుల దూరంలో నాకో గ్రామం వుంది. అక్కడికి వెడదామనుకుంటున్నా"

"అది గ్లాఫిరా పెట్రోవ్నా నించి సంక్రమించింది కదూ!"

"ఆఁ - అదే."

"కాని లావ్రికీలో నీకెంతో అందమైన యిల్లుందిగా"

లావ్రెటస్కీ కొంచెం ముఖంచిట్లించుకుని "ఆ... కానిఆ గ్రామంలో నాకు చిన్న యిల్లొకటి వుంది. ప్రస్తుతానికి దాంతోనే సరిపెట్టుకుంటా. అంతకంటె పెద్ద యిల్లు నాకిపుడు అవసరంలేదు"

మేరియా తెల్లబోయింది. కుర్చీలో కొయ్యలా బిగుసుకుపోయి నిరాశా పూరిత దృక్కులు పరపింది. పాన్షిన్ ఆమెకి ఆపరాగా వచ్చి లావ్రెటస్కీతో సంభాషణ ప్రారంభించాడు. మేరియా సంబాళించుకుని పడక కుర్చీలో వాలింది. మధ్యమధ్య ఒక మాట విసురుతూ, ఆగంతకుని కేసి జాలిగా చూస్తూ, అతిగా నిట్టూరుస్తూ, విచార సూచకంగా తలాడించడంతో లావ్రెటస్కీ విసిగెత్తిపోయి "వంట్లో బాగా లేదా యేం?" అని ఆమెని ప్రశ్నించాడు.

"భగవంతుని దయవల్ల బాగానే వున్నా. అలా అడిగావేం?" అంది మేరియా.

"యెందుకా? నువు అదోరకంగా వున్నట్టు వకక్షణం నాకనిపించింది."

మేరియా అవమానానికి గురిఅయినదానిలా చూపుపెట్టి అనుకుంది: "ఓ - అలాగా! అలా అయితే బాధపడనక్కరలా. నీదంతా దున్నపోతు మీద వాన కురిసిన విధం. ఇంకోడైతే నీ పరిస్థితుల్లో చిక్కి శల్యమై పోయేవాడు. ఇక నువ్వో, మాంచి ఆరోగ్యంగా వున్నావు". మేరియా ఈ మాటలు తనలో తాననుకుని ఊరుకోలేదు. బిగ్గరగా తియ తియ్యగా ఈ భావాలను వెల్లడించింది.

లావ్రెటస్కీ విధికి తలనొగ్గినవానిలా గోచరించలేదు. రష్యన్ జాతికి లక్షణమైన ఎర్రటి ముఖం, విశాలమైన తెల్లటి నుదురు, బొద్దు ముక్కు, వెడల్పాటి నోరు. ఈ లక్షణాలన్నిటిలో అతను పుట్టిపెరిగిన మైదానాల జీవశక్తీ, దార్ఢ్యమూ గుబాళిస్తున్నాయి. ఆకారం శిల్పి చెక్కినట్టుంది. జుట్టు పిల్లవానికిలా ఉంగరాలు తిరిగివుంది. ప్రముఖంగా కనిపించే నీలి నేత్రాలలో మాత్రం విచారమో-లేక అది అలసటో -ద్యోతకమవుతోంది. గళం పెద్దది.

విసిగెత్తి పోతున్నా పాన్షిన్ సంభాషణ కొనసాగిస్తూనే ఉన్నాడు. ఇటీవల అతను పంచదారను శుభ్రపరిచే విధానంలోని మంచి చెడ్డలను గురించి ఫ్రెంచి భాషలో రెండు చిన్న గ్రంథాలు చదివాడు. ఆ పుస్తకాల గొడవే ఎత్తకుండా వాటిలోని సారం అతి వినయంతో వివరించసాగాడు.

"ఆ - ఫెద్యాయే కదూ!" అంటున్న మార్ఫా గొంతు పక్కగది గుమ్మంలో హఠాత్తుగా వినిపించింది. "అవును, ఫెద్యాయే" అంటూ ఆ ముదుసలి గబగబా గదిలోకి వచ్చింది. లావ్రెటస్కీ లేచి నిల్చోకముందే మార్ఫా అతన్ని కావలించుకుంది.

"యేదీ నిను తిన్నగా చూడనీ" అంది ఒక అడుగు వెనక్కి వేసి "యెంత అందంగా వున్నావ్! కొంచెం వయసు ముదరతే మాత్రమేంపోయిందిలే! అందం యేమాత్రం తగ్గలా. నా చేతులు ముద్దెట్టుకోకు. రా, ముసలి మొహం అనుకోకుండా నా మొహం ముద్దెట్టుకో. నను గురించి 'అత్తయ్య బతికేవుందా?' అని అడిగిన పాపాన పోయావా? అరె దొంగా! నా చేతుల్లో పుట్టావ్. సరే - కానీ. నను తలుస్తావని యెలా అనుకుంటావులే. మంచివాడివి గనక మా యింటికి వచ్చావు" అని మేరియాకేసి తిరిగి "వీడికేవన్నా పలహారం పెట్టావా?" అని అడిగింది.

"అఖ్ఖే! నాకేం అక్కర్లా" అని తొందరగా అన్నాడు లావ్రెస్కీ.

"కాస్త టీ అన్నా తాగుదూ. పాపం! యే దూర దేశాన్నుంచి వచ్చాడో! కాస్త టీ తాగడానికైనా నోచుకోలా? లీజా! వెళ్ళి త్వరగా టీ తీసుకురా. నాకు బాగా గ్యాపకం. చిన్నప్పుడు వీడు పట్టి తిండిపోతు. యిప్పటికీ వీడికి తిండంటే మహాయిష్టమే ననుకుంటా."

"నమస్తే మార్ఫా టిమొఫెయెవ్నా!" అన్నాడు పాన్షిన్ పక్కగా వచ్చి కలవరపడుతున్న మార్ఫాకి వంగి నమస్కరిస్తూ.

"క్షమించండి. యీ గందరగోళంలో మిమ్మల్ని చూడలా" అని మళ్ళీ లావ్రెటస్కీ కేసి తిరిగి "నువ్వు అచ్చంగా మీ అమ్మ పోలికే. కాకపోతే ఒక్క ముక్కు మాత్రం మీ నాన్న పోలిక. అంతే. కొంతకాలంపాటు యిక్కడ వుండిపోతావా? మళ్ళీ తుర్రుమంటావా?" అని అడిగింది మార్ఫా.

"రేపు బయలుదేరి వెళ్ళిపోతున్నా అత్తయ్యా!"

"యెక్కడికి వెడుతున్నా?"

"వాసిలెవస్కోయెకి"

"రేపే?"

"ఆ-రేపే"

"సరే, రేపే వెళ్ళాలనుకుంటే రేపే వెళ్లు. దేవుడే వున్నాడు! నీకు తెలీందేంవుంది? వెళ్ళేముందు వచ్చి నను చూసి మరీ వెళ్ళు."

మార్ఫా అతని బుగ్గలు నిమిరి "నిన్న యీ పాపిష్టి కళ్ళతో చూస్తా ననుకోలేదు నాయనా! అంటే అప్పుడే చచ్చిపోతానని కాదు. కనీసం

యింకా పదేళ్ళయినా బతికుంటూ. మన పెస్టోవ్ కుటుంబం వాళ్ళది మొండి ప్రాణాలు. మనం అందరికంటె రెట్టింపు సంవత్సరాలు బతుకుతామని మీ తాత అంటుండేవాడు. ఆ విదేశాలలో యెంతకాలం తిరిగొచ్చావ్ ? యివాళ నిను చూట్టం కనులపండుగ్గా వుంది. యిదివరలోలాగానే పదిపూడ్లు* వంటి చెత్తో లేవనెత్తగలవా ? మీ నాన్న చాదస్తుడైతే ఆయాడుగాని నీకు చదువు చెప్పడానికి ఆ స్విడ్డగండువాణ్ణి పెట్టి మంచిపనిచేశాడు. మీ యిద్దరూ కొట్టుకునేవారు గ్యాపకముందా ? దాన్ని కసరత్తు అనేవాళ్ళు గదూ ! ఆ - నేనూరికే వాగుతూ పాన్షిన్‌తో చచ్చలకి అడ్డంవస్తున్నా కామోసు. సరే. అయితేనేంగాని, వరండాలో టీ తాగుదాం రా. యిక్కడ మంచి తియ్యాటి మీగడ వుంది. మీ లండన్, పారిస్‌లలో దొరికే పాడు మీగడ లాంటి దనుకున్నావేం ? రాండి, రాండి. ఫెద్యా ! యేదీ నీ చెయ్యి. అబ్బ యెంత బలిష్టంగా వుందో ! నీ చేతిమీద ఆనుకుంటే పడిపోతాననే భయం అక్కర్లా."

అంతా లేచి బయటి వరండాలోకి వెళ్ళారు. ఒక్క జెడియొనోవస్కీ మాత్రం వారితో కలిసి వెళ్ళకుండా జారుకున్నాడు. మేరియాతో, మార్ఫాతో, పాన్షిన్‌తో లావ్రెటస్కీ మాట్లాడుతున్నంతసేపూ ఒకమూల కూర్చున్నాడు. కళ్ళు మిణకరిస్తూ చిన్నపిల్లవాడిలా నోరుతెరుచుకుని ఆశ్చర్యంతో అంతా విని ఈ ఆగంతకుని విషయం ఊరంతా చాటటానికి వెళ్ళిపోయాడు.

అదే రోజున రాత్రి పదకొండు గంటలకి మేరియా ఇంట్లో యీ కింది ఘటనలు జరిగాయి: కింద భాగంలో కచేరీగది గుమ్మంలో, తగు సమయం కనిపెట్టి పాన్షిన్ లీజాదగ్గిర శెలవు పుచ్చుకుంటూ ఆమె చేతులు పట్టుకుని "నేనిక్కడి కెందుకు వస్తున్నానో నీకు తెలుసు. ఇంత తరుచుగా రావడం? దేనికో, నేను వేరే చెప్పడ మెందుకు స్పష్టంగా కనిపిస్తుంటే" అన్నాడు. కాని జాలీ జవాబియ్యలేదు. చిరునవ్వు నవ్వలేదు. కనుబొమలు కొద్దిగా ఎత్తి నేలకేసిచూస్తూ సిగ్గుపడుతోంది. చేతిని మాత్రం పాన్షిన్ చేతిలోంచి వెనక్కి లాక్కోలేదు. ఇక మేడమీద మార్ఫాగదిలో మెరుగు మాసిపోయిన దేవతావిగ్ర హాల ముందు దీపం మినుకు మినుకు మంటోంది. లావ్రెటస్కీ పడక కుర్చీలో, మోకాళ్ళచుట్టూ మోచేతులు పెనవేసుకుని చేతుల్తో మొహం

* పూడు = 36 పౌనులు

కప్పుకుని కూర్చున్నాడు. ఆ ముసిలావిడ అతనిముందు నిల్చుని మెల్లిగా జుత్తు నిమురుతోంది. మేరియా దగ్గిర శెలవు పుచ్చుకున్నాక లావ్రెటస్కీ మార్ఫా దగ్గిర గంటన్నర సేపున్నాడు. అయినా మార్ఫాతో ఒక ముక్కయినా మాట్లాడలేదు. ఆమె కూడా అతన్ని ఒక్క ప్రశ్న అయినా అడగలేదు.....అవును. మాట్లాడటానికేముంది? ప్రశ్నల అవసరమేముంది? ఆమెకి అంతా అర్థమయింది. అతని నిండు హృదయానికి కావలసిన సానుభూతిని అందిచ్చింది.

## ౧

ఫియొదోర్ ఇవనోవిచ్ లావ్రెట్స్కీ గొప్ప ఇంటి బిడ్డ. ఇతని మూలపురుషుడు ప్రష్యానించి వాసిలీ ట్యోమ్నీ పరిపాలనా కాలంలో[1] రష్యాకి వలస వచ్చాడు. బ్యెజెట్స్కీ వెర్ఖ్‌లో రెండువందల చెట్వెర్టుల[2] భూమి పట్టా పొందాడు. అతని సంతతివారు అనేక ఉద్యోగాలు చేశారు. దూర దూరమండలాలలో రాజకుటుంబీకుల కిందా, జమీందార్ల కిందా పని చేశారు. కాని వారిలో ఒక్కడూ ఉన్నతోద్యోగం చెయ్యలేదు, ఇంత సంపాదించనూ లేదు. వీరందరిలోకల్లా ఎక్కువ సంపన్నుడూ, పేరు ప్రతిష్ఠలు గడించినవాడూ, ఫియొదోర్ ముత్తాత, ఆంద్రీ. అతను క్రూరుడు. అహంకారి, కుశాగ్రబుద్ధి, జిత్తులమారి. అతని క్రౌర్యం, ముక్కోపం, క్రమబద్ధంకాని ఔదార్యం, తీరనిధనదాహం గురించి నేటికీ జనులు కథలుగా చెప్పుకుంటారు. స్థూలకాయుఁ, పొడగరి. నల్లటి చాయ. పేడి మూతి. బహు తొందరగా మాట్లాడేవాడు. ఎల్లప్పుడూ నిద్రమత్తుతో జోగుతూండేవాడు. మెత్తగా మాట్లాడుతున్నాడంటే అందరూ వణికిపోయేవారు. భార్య కూడా అతనితో సరితూగే మనిషే. మిడిగుడ్లు, గద్దముక్కు, పాలిపోయిన గుండ్రటి మొహం, గయ్యాళి, పగపట్టిన తాచు. జన్మతః జిప్సీ[3] జాతికి చెందింది.

1. 1425-1462
2. చెట్‌వర్ట్ 5/8 ఎకరం
3. లంబాడీల వంటి సంచార జాతి

ఆమె ఎన్నడూ భర్తకి లొంగి పడుండలా. అతనుమాత్రం ఆమె ప్రాణాలు కొరికేసేవాడు. మూర్జాల దాంపత్యం నెరపినా భర్త మరణించిన తర్వాత ఆమె అట్టేకాలం జీవించలా.

ఆండ్రీ కొడుకు పియోటర్‌కి అంటే ఫియొడోర్ తాతకి తండ్రి పోలికలు రాలా. అతను సామాన్య భూస్వామి. మట్టి బుర్ర. ఇల్లు అదిరి పోయేటట్టు కేకలేసేవాడు. లేకపోతే మందకొడిగా పడుండేవాడు. మోటు మనిషి. కాని దుర్మార్గుడు కాదు. నల్గురికీ ఆతిథ్యమివ్వడమన్నా, వేట కుక్కలతో వేటకి బయలుదేరడమన్నా అతనికి మహాసర్దా. ముప్పయి ఏళ్ళు దాటేసరికి రెండువేలమంది 'దాసులతో' మంచి స్థితిలో ఉన్న జమీ ఒకటి అతనికి సంక్రమించింది. దాసులందరినీ తరిమివేసి, జమీలో కొంత భాగం అమ్మేశాడు. పరిచారకులందర్నీ ఎందుకూ కొరగానివాళ్ళని చేశాడు. అలగాజనం, పరిచయస్థులూ, అపరిచయస్థులూ వెచ్చగా ఉండే అతనిగృహంలో చీమల్లా గుమిగూడేవారు. మస్తుగా తిని, తప్పతాగి, చేతికి దొరికిందల్లా కైంకర్యం జేసి అతన్ని తెగ పొగడుతూ ఆశీర్వదిస్తుండేవారు. అతనూ మనసు సరిగా లేనపుడు ఈ అతిథులందరినీ ఇచ్చకాలమారి వెధవలనీ, దుర్మార్గులనీ తిట్టేవాడు. కాని వీరు దగ్గర లేందే అతనికి తోచేదికాదు. ఇక అతని భార్య చాలా నెమ్మదైంది. పియోటర్, తండ్రి మాటమీద పొరుగింటివారి అమ్మాయిని పెళ్ళాడాడు. ఆమె పేరు అన్నా పావ్లోవ్నా. ఆమె ఏ విషయంలోనూ జోక్యం కలిగించుకునేది కాదు. సంతోషంతో అందరికీ ఆతిథ్యమిచ్చేది. ఇతర్ల ఇళ్ళకి విందులకు తానూ వెళ్ళేది. కాని పౌడరు కొట్టుకోవటమంటే అసహ్యించుకునేది. ముసలితనంలో అంటూ ఉండేది: "నెత్తిమీద ఉన్నిపగిడీ పెట్టి, జుట్టు దువ్వి, చమురురాసి, పౌడరు చల్లి యువపిన్నులు గుచ్చుతారు. యెంత కొట్టుకున్నా ఆచమురు, ఆ పౌడరు వదిలిచావవ్. కాని పౌడరు కొట్టుకోకుండా బయటికి వెళ్ళడమే! యెన్ని గుండెలుండాలి! అబ్బ! నరకం". మంచి జోరుగా పరిగెత్తే పందెపుగుర్రాల వెనక స్వారీచెయ్యడం, పొద్దున్నుంచి సాయంత్రం దాకా పేకాడటం ఆమెకి మహా ఇష్టం. భర్త పేకాట దగ్గిరికి వస్తే తాను గెల్చుకున్న డబ్బు దాచేసుకునేది. కాని తండ్రి ఇచ్చిన ఆస్తి, స్వంత డబ్బు భర్త అధీనంలోనే ఉంచింది. ఆమెకి సంతానం ఇవాన్ (ఫియొడోర్ తండ్రి) అనే కొడుకు,

గ్లాఫిరా అనే కూతురు. ఇవాన్ కన్నతండ్రి ఇంట పెరగలా. కుబెనస్కాయా రాకుమారి అనే ఆమె యింట పెరిగాడు. ఆమె వయోవృద్ధురాలు. వరసకు ఇవాన్‌కి అత్త అవుతుంది. ఆమె ఆస్తికి ఇవాన్‌నే వారసుణ్ణి చేసింది. (అలా కాకపోతే ఇవాన్‌ని పంపడానికి తండ్రి అంగీకరించలా.)

ఆమె ఇవాన్‌ని బొమ్మని అలంకరించినట్లు అలంకరించేది. రకరకాల పంతుళ్ళను చదువు చెప్పడానికి నియోగించింది. కోర్టిన్ డి వాసిలీస్ అనే ఫ్రెంచి పండితునికి అతని చదువు బాధ్యత అప్పగించింది. అతను జీన్ జాక్విస్ రోషియో [1] అనుయాయి. ఒకప్పుడు మతాధికారి. మంచి యుక్తిపరుడు. వలస వచ్చిన వారిలో అతను రత్నంలాంటివాడని ఆమె ఉద్దేశ్యం. చివరికి ఈ రత్నాన్ని దభైయ్యో పడిలో పెళ్ళాడి ఆస్తి అంతా అతనిపేర పెట్టింది. తియ్యటి కబుర్లుచెప్పి కోర్టిన్ ఆవిడ డబ్బంతా చేతబుచ్చుకుని చల్లగా పారిస్ ఉడాయించాడు. తరవాత కొద్దికాలానికే ఆమె మొగానికి కోటావేసుకుని, సువాసనలు విరజిమ్మే అత్తర్లు రాసుకుని, నీగ్రో నౌకరు కుర్రాళ్ళు, కుక్కపిల్లలు, గోడవలుచేసే రామచిలకలమధ్య 15 వ లూయీ రాజునాటి పట్టుసోఫామీద పొడుండబ్బా చేత్తో పుచ్చుకుని భర్త పరిత్యజించాడనే చింతతో ప్రాణాలు విడిచింది.

ఇలా ఆకస్మికంగా సర్వనాశనం (ఆమె చావుకాదు పెళ్ళి) తటస్థించిం తర్వాత ఆ ఇంట్లో ఉండటమంటే ఇవాన్‌కి ఏవగింపు పుట్టింది. బోలెడంత ఆస్తికి వారసుడల్లా హఠాత్తుగా ఆమెని దేబిరించుకు బతకాల్సిన స్థితికి దిగజారవలసివచ్చింది. అతను పెరిగిన పీటర్స్బర్గ్‌లో ఆదరించేవారు లేకపోయారు. ఎంత కష్టపడ్డా రాణింపుకురాని ప్రభుత్వోద్యోగాలంటే అసహ్యంవేసింది. (అలాగ్జాండరు చక్రవర్తి పరిపాలనాకాలం అది). గత్యంతరంలేక తిరిగి గ్రామసీమకు కన్నతండ్రి దగ్గిరికి చేరకొన్నాడు. ఆ కుగ్రామంలో ఆ పాత ఇల్లు మురికికంపు కొట్టుకుంటూ వికారంగా ఉంది. ఆలనా పాలనాలేక బిక్కుబిక్కుమంటున్న ఆకుగ్రామజీవితం అడుగడుక్కీ అతన్ని కుంగదీసింది. ప్రాణం విసిగెత్తిపోయింది. ఒక్క తల్లి మినహా,

---

1 రోషియో : (1712–1778) ఫ్రెంచి వేదాంతి. విప్లవ రచయిత. ఇతని రచనలు ఫ్రెంచి విప్లవానికి దోహదం చేశాయి.

ఇంటిల్లిపాదీ అతన్ని అనుమానంతో చూడసాగారు. తండ్రికి అతని బస్తీ షైకీ, కోట్లూ, లేసులూ, పుస్తకాలూ, ఫ్లూటూ, సున్నితమైన అలవాట్లు కంటగింపుగా ఉండేవి. తరచు కొడుకును ఎందుకో ఒకందుకు సాధిస్తూ గొణుగుతుండేవాడు. "యిక్కడ వీడికి యేదీ సరిపడదు. తిండిలో కూడా సుకుమారమే. కడుపునిండా తినడు. వాడికి అసలు మనిషివాడే గిట్టదు. గదుల్లో సామాన్లు ఎక్కువగా ఉంటే నచ్చదు. తాగినవాళ్ళు కంటపడితే కంపించిపోతాడు. వీడిముందు బానిసల్ని కొట్టటానికి వీల్లేదుగదా! గవర్నమెంటు ఉద్యోగం చెయ్యమంటే చెయ్యడు. ఆరోగ్యమా మంచిదికాదు. వట్టి ఆడంగివెధవ! యిదంతా యెందుమూలానో తెలుసా? వీడిబుర్రంతా ఆ వాల్టేరు 1 గ్రంథాలతో నిండిపోయింది." అనేవాడు. వాల్టేరు గ్రంథాలుగాని, ఆ 'నాస్తిక వెధవ' డిడెరాట్ 2 గ్రంథాలుగానీ చదవకపోయినా ఆ ముసిలాడికి వాళ్ళంటే మహా చెడ్డమంట. అసలు అతనికి అక్షరజ్ఞానమే శూన్యం. పియోటర్ ఆండ్రీయిచ్ పొరబడలేదు. డిడెరాట్ వాల్టేర్, రోషియో, రెయనాల్ 3 హెల్వెటియస్ 4 మొదలైన రచయితల రచనలతో ఇవాన్ బుర్ర కిక్కిరిసిపోయింది. అతని గురువు – ఆ పించను పుచ్చుకున్న మఠాధికారి (కోర్టిన్) – పద్దెనిమిదో శతాబ్దపు విజ్ఞానమూ, అదీ యిదీ అంతా అతని బుర్రలోకి ఎక్కించాడు. ఇవాన్ ఆ విజ్ఞానమంతా తలలో పెట్టుకుని తిరుగుతున్నాడు. కాని అది అతని బుర్రలోనే అట్టే ఉండిపోయింది. రక్తంలో జీర్ణంకాలేదు. మనసుకు ఎక్కలేదు. గాఢ విశ్వాసంగా పరిణమించలేదు ......... అయితే నేటికీ గాఢ విశ్వాసాలు అలవరచుకోలేని మనం, యాభై ఏళ్ళకితం జీవించిన యువకునిలో అవి లేవని ఆక్షేపించగలమా?

---

1 వాల్టేర్ : (1694-1778) ఫ్రెంచి మేధావి. వేదాంతి, సాహితీవేత్త. తనకాలంనాటి ఫ్రెంచి మత, మూఢాచారాలను ఎదిరించి అష్టకష్టాలు పడ్డాడు. ఇతని రచనలు ఫ్రెంచి విప్లవానికి దారితీసినవి.

2 డిడ్ రాట్ : (1713-1783) ఫ్రెంచి మేధావి, విజ్ఞానసర్వస్వ రచయిత, అభ్యుదయవాది.

3 రెయనాల్ : (1715-1796) ఫ్రెంచి రచయిత

4 హెల్వెటియస్ : (1715-1771) ఫ్రెంచి వేదాంతి, రచయిత

ఇంటికి వచ్చిన అతిథులుకూడా ఇవాన్ ముందు కులాసాగా మెలగలేకపోయారు. ఇవాన్ వాళ్ళకి మొహం చూపేవాడేకాదు. అతనంటే అందరికీ భయం ఏర్పడింది. ఇక అతని సోదరి గ్లాఫిరా అతనికంటె పన్నెండేళ్ళు పెద్ద. ఆమెతోనూ ఇవాన్‌కి సరిపడలా. గ్లాఫిరా విచిత్రమైన వ్యక్తి. కురూపి. గూను. బక్కపల్చన. మిడిగుడ్లు. బిగుసుకు పోయిన పెదవులు. చిన్నినోరు. ఆకృతిలో, కంఠస్వరంలో, కంటి చూపులో ఆమె అచ్చంగా వాళ్లనాయనమ్మ పోలికే. తలబిరుసుతనం, అత్యాశవల్ల పెళ్ళిమాటే చెవిని పెట్టలేదు. ఇవాన్ తిరిగి ఇంటికిరావడం ఆమెకిష్టంలేదు. కుబేనస్కాయా ఇవాన్ బాధ్యత వహిస్తే తండ్రి ఆస్తిలో సగమైనా తనకు దక్కుతుందని ఆశపడింది. పిసినారితనంలో కూడా నాయనమ్మ పోలికే ఆమెకి వచ్చింది. ఇంతేకాదు. తమ్ముడంటే గ్లాఫిరాకి చుప్పనాతనంకూడా. అతను బాగా చదువుకున్నవాడు. ఫ్రెంచిభాష పారిస్ వాసులలాగా చక్కగా మాట్లాడగలడు. ఇక తనో "బాన్ జోర్" 1 అని కూడా సరిగాఅనలేదు. తలిదండ్రులకి కూడా ఫ్రెంచిరాదుగదా అని సరిపుచ్చుకోలేకపోయింది.

ఇవాన్‌కి ఆ కుగ్రామంలో పొద్దుపోవడంలేదు. విసిగెత్తిపోయి మనసు స్థిమితం తప్పింది. ఒక సంవత్సరంపాటు ఆ కుగ్రామంలో కాలం గడిపాడు. అయితేనేం అతనికి ఆ ఒక్క సంవత్సరం పదియుగాలనిపించింది. తల్లితో మాత్రం హృదయం విప్పి మాట్లాడేవాడు. తల్లి గదిలో కూర్చుని తాండ్ర తింటూ ఆవిడ చెప్పే అల్లిబొల్లి కబుర్లు వింటుండేవాడు.

అన్నా పావ్లోవ్నా దాసీ జనంలో మలాన్యా అనే చక్కని పడుచు ఉంది. నిర్మలమైన నేత్రాలు. సున్నితమైన ఆకారం. తెలివిగలది. గంభీరమైంది. తొలిచూపులోనే అతని హృదయం ఆకర్షించింది. ప్రేమించాడు. సిగ్గుతో భయపడుతూ భయపడుతూ ఆమె చెప్పే జవాబులు, తీయని కంఠస్వరం, మధుర మందహాసం అతణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. రోజురోజుకూ ప్రేమ బలీయం గాజొచ్చింది. ఆమె కూడా అతన్ని హృదయ పూర్వకంగా, గాఢంగా ప్రేమించి అతని ప్రేమకలాపానికి తలఒగ్గింది. జమీందార్ల ఇళ్ళల్లో రహస్యాలు అట్టే కాలం దాగటం కష్టం. త్వరలోనే మలాన్యా, చిన్నదొరల సంబంధం అందరికీ తెలిసిపోయింది. ఈవార్త చివరికి

1. గుడ్ మార్నింగ్.

పియోటర్ ఆంద్రీచ్ చెదిని పడింది. ఇంకెప్పుడైనా అయినట్లయితే దీన్ని చిన్న విషయంగా పరగణించి పట్టించుకోకపోయేవాడే. కాని కొడుకు మీద చాలా కాలంనించీ పగబట్టుకు కూర్చున్నాడేమో ఈ పీటర్స్‌బర్గ్ మేధావిని, ఈ పోకిల్లాని అవమానపర్చడానికి అవకాశం జారవిడువలా.

గందరగోళం బయలుదేరింది. మలాన్యాని సామాను గదిలో పెట్టి తాళం వేశారు. ఈ హడావిడికి హడిలిపోయి అన్నా పావ్లోవ్నా పరుగెత్తుకుంటూ వచ్చింది. భర్తని శాంతపర్చాలని యత్నించిందిగాని పియోటర్ ఎవరిమాటా వినేస్థితిలో లేడు. కొడుకుమీద మండిపడుతూ 'నీతి నియమాలు, మతం గితంలేని జిత్తులమారి వెధవ !" అని తిట్టసాగాడు. కుబెనస్కాయా మీద అతనికున్న కసి అంతా కొడుకుమీద కురిపించి అనేక దుర్భాషలాడాడు. మొదట ఇవాన్ మారుమాటాడలేదు. తొందరపడలేదు. కాని తండ్రి అవమానకరమైన శిక్షలకు పాల్పేస్తానని బెదిరించేసరికి కోపం ఆపుకోలేకపోయాడు. "సరే- డిడెరాట్‌ని యెలాగో వీధిలోకి లాగావా, కాస్త వోపిక పట్టు, ఆయన తడాఖా కూడా చూపిస్తాను. నోరు మెదపకుండా కూర్చునేటట్టు చేస్తా" అని తనలో అనుకుని లోపల భయం వేస్తున్నా ఇవాన్ గభీర, శాంత స్వరంతో "నాకు నీతినియమాలు లేవనడం సమంజసం గాదు. చేసిన తప్పు సమర్థించుకోవాలని నాకేంలేదు. యిలాంటి దురభిమానాలకి నేను అతీతుణ్ణి. నే చేసిన తప్పుకు పరిహారంగా మలాన్యాను పెళ్లి చేసుకుంటా" అని తెలియజేశాడు. ఈ మాటలతో అనుకోకుండానే ఇవాన్ లక్ష్యం సిద్ధించిది. పియోటర్ నిర్ఘాంతపోయి ఒక్క నిమిషం కొడుకు కేసి రెప్పవాల్చకుండా చూశాడు. మరుక్షణంలో కోలుకుని ఉన్నపాళంగా ఇవాన్‌మీద పడి పిడికిళ్ళతో పొడవసాగాడు. అదృష్టంకొద్దీ ఇవాన్ ఆ రోజున తల నున్నగా దువ్వాడు. కొత్త ఇంగ్లీషు కోటూ, ఎత్తు బూట్సులు, బిగుతు లాగూ తొడిగాడు. అన్నా గొంతెత్తి పెద్దగా ఏడుస్తూ చేతులతో ముఖం కప్పేసుకుంది. ఇక ఇవాన్ ఇంట్లోనించి ఉరుకుతూ, దొడ్డి, తోట అన్నీదాటి రోడ్డెక్కి తండ్రి అడుగుల చప్పుడు, తిట్లు వినబడనంతవరకు ఒకటే పరుగుచ్చుకున్నాడు... "ఆగు, ఆగు దొంగవెధవా ! ఆగకపోతే శాపనార్థాలు పెట్టేస్తా" అని అరిచాడు తండ్రి. ఇవాన్ పొరుగు పెద్దమనిషి ఆశ్రయం పొందాడు. పియోటర్ డస్సిపోయి, చెమటలు

కక్కుకుంటూ ఇంటికి చేరుకున్నాడు. రొప్పుతూనే చిల్లిగవ్వయినా కొడుక్కి ముట్టజెప్పవనీ, ఇవాన్ పుస్తకాలన్నీతగలబెట్టి మలాన్యాని దూరగ్రామానికి అప్పటికప్పుడే పంపించివేయమనీ నౌకర్ల కాజ్ఞాపించాడు. కొంతమంది మంచి మనసుగలవాళ్ళు ఇవాన్‌ని వెదికిపట్టుకుని జరిగిందంతా చెప్పారు. అంతా విని ఇవాన్ అవమానంతో కుంగిపోయి, మండిపడి తండ్రిమీద పగదీర్చుకుంటానని ప్రతినబట్టాడు. ఆ రాత్రే మలాన్యా ఎక్కివెడుతున్న బండిని తోవలో అడ్డగించి ఆమెని తీసుకుని దగ్గరలోఉన్న పట్టణానికివెళ్ళి వివాహమాడాడు. ఇవాన్‌కి ఆశ్రయమిచ్చిన పొరుగు పెద్దమనిషి పించను పుచ్చుకున్న నావికుడు. ఇలాంటి ప్రేమ వివాహాలంటే సర్దా పడేవాడు. అతను ఇవాన్‌కి కొంత డబ్బు సర్దాడు.

ఆ మర్నాడు ఇవాన్ తండ్రికి అతి వినయం ఉట్టిపడేటట్టు ఉత్తరం రాసి మలాన్యాని తీసుకుని తన దాయాది డిమిట్రీ పెట్రోవ్ నివసిస్తున్న గ్రామం వెళ్ళాడు. అక్కడ డిమిట్రీతోపాటే మార్ఫాకూడా నివసిస్తోంది. జరిగిన గొడవ అంతా చెప్పి ఏదైనా ఉద్యోగం చూసుకోటానికి పీటర్స్‌బర్గ్ వెడతానని కొంతకాలంపాటు తన భార్యని వారి దగ్గర అట్టేపెట్టుకోమనీ బతిమాలుకున్నాడు. 'భార్య' అనేమాట అంటూ పిచ్చిగా ఏడ్చాడు. అంత చదువూ, వేదాంతం ఏమైపోయిందో అలగాజనంమాదిరిగా మోకాళ్లమీదపడి వారిని ప్రార్థించాడు. కనికారపు గుండెగల పెట్రోవ్‌లు వెంటనే అతని ప్రార్థన మన్నించారు. తండ్రి మనసు కరుగుతుందేమోననే భ్రాంతితో ఇవాన్ మూడు వారాలపాటు అక్కడ గడిపాడు. కాని ప్రయోజనం లేకపోయింది. తండ్రి మనసు కరుగుతుందనే ఆశ కూడా అంతరించింది.

పియోటర్ పెట్రోవిచ్ కొడుకు పెళ్ళి సంగతి విని మంచంపట్టాడు. తనముందు కొడుకుపేరు ఎత్తరాదని ఆజ్ఞాపించాడు కాని ఇవాన్ తల్లి గురువుగారి దగ్గిర అయిదువందల రూబుళ్ళు అప్పుజేసి కొడుక్కి పంపింది. కోడలికి ఒక దేవతా విగ్రహం [1] పంపింది. స్వయంగా ఉత్తరం రాయటానికి ధైర్యం చాలక "మనసు పాడుచేసుకోవద్దు. దేవుడి దయవల్ల అన్నీ సవ్యంగా చక్కబడి మీ నాన్న నిన్ను క్షమిస్తారులే. ఇంకొకటి కోడలైతే

1 దేవతా విగ్రహం బహూకరించడం క్రైస్తవమతాచారం

బావుండేదని అనిపించినా దేవుడి దయ యిలా వుంది! కాబట్టి కోడల్ని ఆశీర్వదిస్తున్నా" అని కబురంపింది. డబ్బూ ఈ కబురూ తీసుకెళ్ళిన రైతు అనాయాసంగా రోజుకు 60 మైళ్లు నడవగలవాడు. ఇవాన్‌కి డబ్బూ కబురూ అందించి కష్టపడి వచ్చినందుకు బహుమానంగా ఒక రూబులు గుంజాడు. కొత్తదొరసానినిచూసి చెయ్యి ముద్దాడి తిరిగి చక్కాబోయాడు.

ఇవాన్ పెట్రోవిచ్‌కి మనసు కుదట పడింది. వెంటనే బయలుదేరి పీటర్స్‌బర్గ్ వెళ్ళాడు. భవిష్యత్తేమీ ఆశాజనకంగాలేదు. దారిద్ర్యంతో బాధ పడాల్సి వస్తుందేమో తెలీదు. కాని ఆసహ్యాం గొల్పే గ్రామసీమ నుంచి విముక్తి కల్గింది. పైగా తాను గురువులుగా భావించేవారికి ద్రోహం చెయ్య లేదు. రోషియో, డిడెరాట్ మొదలైనవారి బోధనలను ఆచరణలో పెట్టి చూపి వారి గొప్పదనం నిరూపించాడు. విధ్యుక్త ధర్మం నెరవేర్చాననే భావం, ఉత్సాహం, గర్వం అతని హృదయంలో ఉప్పొంగి పోయాయి. భార్యని విడిచి ఉండటం అతనికేమంత బాధాకరమనిపించలేదు. పీటర్స్ బర్గ్‌లో తలవని తలంపుగా ఆతనికి అదృష్టం కలిసొచ్చింది. కుబెనస్కాయా అప్పటికింకా జీవించే ఉంది. మేనల్లునికి చేసిన ద్రోహానికి పరిహారంగా అయిదువేల రూబుళ్ళు, ఒక గడియారం బహూకరించింది. తన మిత్రులందరికీ అతన్ని గురించి సిఫారసు చేసింది. మూడు నెలల తర్వాత ఇవాన్‌కి లండన్ లోని రష్యా రాయబార కార్యాలయంలో ఉద్యోగం దొరికింది. వెంటనే ఒక ఇంగ్లీషు పడవలో బయలుదేరి లండన్ వెళ్ళాడు (అప్పటికింకా పొగ ఓడలు అమల్లోకి రాల్లేదు). కొన్ని నెలల తర్వాత అతనికి పెస్టోవ్ దగ్గర నించి ఉత్తరం వచ్చింది. అందులో "1807 ఆగస్టు 20 తారీఖున పోక్రోవస్కోయె అనే గ్రామంలో" ఇవాన్ పెడ్రోవిచ్‌కి మొగపిల్లవాడు పుట్టాడనీ, ఆ పిల్లవాడికి ఫియొడోర్ అని నామకరణం చేశామనీ పెస్టోవ్ తెలియపర్చాడు. మలాన్యా సెర్గెయెవ్నా ఆ ఉత్తరం చివర నాలుగుపంక్తులు రాసింది. ఆ నాల్గు పంక్తులు ఇవాన్‌కి ఆశ్చర్యం గొల్పాయి. మార్ఫా అతని భార్యకి చదవడం రాయడం నేర్పిందని అతనికి తెలీదు. కాని ఇవాన్ సంతానం కలిగిందనే సంబరంతో తలమునకలు కాలేదు. ఆ రోజుల్లోని పేరుకెక్కిన ఫిర్నిసో లేక లాయిజీసో (అప్పటి కింకా పురాణాలలో పాత్రలపేర్లు పెట్టుకోటం ఫాషనుగా ఉంది) ఎవరో ఒకామెను ఇవాన్

ప్రేమ మొలకెత్తింది. అనుసంధానమైంది. ప్రపంచం గిర్రున సుళ్లు తిరుగుతూ ఆనందోన్మత్తమైంది. అతని హృదయం నీలికళ్ళ ఆ వన్నెలాడి ఆధీనమైంది. డబ్బులేదు. అయితేనేం? పేకాటలో అదృష్టం పండింది. అనేక మందితో పరిచయం కలిగింది. రకరకాల వినోదాలలో పాల్గొంటున్నాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే 'దర్జా' వెలిగిస్తున్నాడు.

# ౭

కొడుకు తన్నెదిరించి మలాన్యాను వివాహం మాడాడన్న కోపాగ్ని పియోటర్ మనసులో చాలాకాలందాకా ప్రజ్వరిల్లుతూనే ఉంది. ఇవాన్ గనక ఓ ఆరునెలల తర్వాత పశ్చాత్తాపపడి తండ్రి కాళ్లమీద పడిఉంటే, ముందు నాలుగు తిట్టి వంకీకర్రతో రెండు కొట్టి పియోటర్ కొడుకుని క్షమించేవాడే. కాని ఇవాన్ విదేశాలలో ఉండిపోయాడు. పైగా అతనికా ధ్యాసేలేదు. "ఊ...యేమిటీ?" అంటూ భార్య తన్ను శాంతపర్చ యత్నించినపుడల్లా పియోటర్ కసురుకునేవాడు. "వెధవ! పాపం యెందుకని వూరుకున్నా. యిదే మానాన్న అయితే ఆ దుర్మార్గుడి పీక తన చేతుల్లో పిసికేసేవాడే. అవును యిలాంటివాళ్లని అలా చేయాల్సిందే." అనికూడా అనేవాడు. ఇలాంటి దారుణ వాక్యాలు విన్నపుడల్లా అన్నాపావ్లోవ్నా రక్షించమని దేవుణ్ణి చాటుగా ప్రార్థించేది. ఇక కోడలి విషయంలో పియోటర్ మొదట చేతులు దులిపేసుకున్నాడు. కోడల్ని గురించి పెస్టోవ్ రాసిన జాబుకు జవాబురాస్తూ కోడలసేమాటే తన చెవిని పడరాదనీ, పారిపోయివచ్చిన బానిసలకి ఆశ్రయమివ్వడం చట్ట విరుద్ధచర్య అని హెచ్చరించడం తన కర్తవ్యంగా భావిస్తున్నాననీ తెలియజేశాడు. కాని తర్వాత తర్వాత మనమడు పుట్టాడనే వార్త చెవిసోకే

సరికి అతని మనసు మెత్తపడింది. బాలింతరాలి ఆరోగ్యం ఎలా ఉన్నదీ రహస్యంగా వాకబుచేసి తెలుసుకున్నాడు. తాను పంపించినట్టు కోడలికి తెలియకుండా డబ్బుకూడా పంపాడు.

ఫెద్యాకి ఏడాది దాటకముందే అన్నాపావ్లోవ్నాకి ప్రాణంమీదికి వచ్చింది. మంచంలో తీసుకుంటూ ఇంకా కొద్ది రోజులుకి చనిపోతుందనగా కాంతి తరిగిపోతున్న కళ్లనిండా కన్నీరు నింపుకుని మతగురువు ముందు తనకి కోడల్ని చూడాలనీ, తన మనమణ్ణి ఆశీర్వదించాలనీ ఉందని భర్తతో చెప్పింది. భార్య ఆరోగ్యం విషయమై ఆందోళన పడుతున్న పియోటర్ ఆమెని ఓదార్చి కోడల్నీ మనమణ్ణి తీసుకురావడానికి బండి పంపాడు. ఆ సందర్భంలోనే మొదటిసారిగా కోడలిపేరు (మలాన్యాసర్జియెవ్నా) ఉచ్చరించాడు. కొడుకుని, మార్ఫా టిమొఫెయెవ్నాని వెంటబెట్టుకుని మలాన్యా అత్తవారింటికి వచ్చింది. మార్ఫా ఒంటరిగా ఆమెని వెళ్ళనీయలేదు. అంత అవసరమొస్తే మలాన్యా తరఫున మాట్లాడడానికి నిశ్చయించుకుని మరీ వచ్చింది. భయంతో సగంచచ్చి మలాన్యా పియోటర్ చదువుల గదిలో ప్రవేశించింది. దాది ఫెద్యాని ఎత్తుకుని ఆమె వెనక వెళ్ళింది. పియోటర్ మాట్లాడకుండా మలాన్యాకేసి చూచి ఊరుకున్నాడు. అతని చేతులు ముద్దుపెట్టుకోటానికి మలాన్యా ముందుకు వెళ్ళి వణికిపోతున్న పెదవులతో ఎలానో అతని చేతులు నిశ్శబ్దంగా ముద్దుకుంది.

“సరే మంచిది. బావున్నావా? మీ అత్తని చూద్దుగాని పద.” అని లేచి పియోటర్ ఫెద్యా మీదికి వంగాడు. ఆ పసివాడు చిరునవ్వు నవ్వి తాతకేసి చేతులు చాచాడు. దాంతో ఆ వృద్ధుని మనసు పూర్తిగా కరిగిపోయింది. “ఆ – పిచ్చికుంకా! మీ నాన్నని క్షమించమనా? నిన్ను మాత్రం యిక వదిలెయ్యనులే.” మలాన్యా అత్తగారిగదిలో అడుగు పెట్టీ పెట్టగానే గుమ్మందగ్గిర మోకాళ్ళమీద కూలబడింది. అన్నాపావ్లోవ్నా పక్కదగ్గిరికి రమ్మనికోడలికి సంజ్ఞ చేసింది. మలాన్యా పక్కదగ్గిరికి వెళ్ళగానే అన్నా ఆమెని కౌగలించుకుని మనమణ్ణి ఆశీర్వదించింది. యమబాధతో వికృతమైపోయినముఖం భర్తవేపు తిప్పి ఏదో చెప్పబోయింది.

"నాకు తెలుసు. నువు చెప్పబోయేదేదిటో నాకు తెలుసు." అని గొణిగి "బెంగెట్టుకోకు కోడలు యిక మన యింట్లోనే వుండిపోతుంది. కోడలికోసం వాన్కాని (ఇవాన్‌ని) క్షమిస్తా." అన్నాడు.

ఎంతో ప్రయాసమీద అన్నా భర్త చెయ్యిపట్టుకుని ముద్దిడుకుంది. ఆ సాయంత్రమే కాలంచేసింది.

పియోటర్ అన్నమాట నిలబెట్టుకున్నాడు. కొడుక్కి ఉత్తరం రాస్తూ "మీ అమ్మ ఆఖరి కోరిక తీర్చేందుకూ, ఫియోడర్ మొహంచూసీ నిను క్షమిస్తున్నాను. మలాన్యా యిక నా యింట్లోనే వుంటుంది." అని తెలియజేశాడు.

మలాన్యాకి మేడ మూడో అంతస్తులో ఉండటానికి రెండు గదు లిచ్చారు. తరచు వారింటికి అతిధులుగా వచ్చే ఒంటికంటి బ్రిగేడియర్ స్కురెఖిన్‌కి అతని భార్యకి మలాన్యాని పియోటర్ పరిచయం చేశాడు. ఇద్దరు దాసీలని, ఒక నౌకరు కుర్రాణ్ణి ఇచ్చాడు. మార్ఫా వెళ్ళిపోయింది. అవిడకీ గ్లాఫిరాకీ పడలేదు. రోజుకి మూడు నాలుగుసార్లయినా పోట్లాడు కునేవారు.

పాపం! ఆ ఇంటిలో మలాన్యా పరిస్థితి మహాఘోరంగా క్లిష్టంగా ఉండేది. కాని కాలం గడిచినకొద్దీ ఆ పరిస్థితికీ, మామగారి స్వభావానికీ అలవాటు పడిపోయింది. పియోటర్‌కికూడా మలాన్యా అంటే వెర్రి అభిమానం ఏర్పడింది. కాని ఎన్నడోగాని ఆమెతో మాట్లాడేవాడుకాడు. అతనుచూపే దయలో ఆమంటే న్యూనతాభావం ఛాయామాత్రంగా గోచ రించేది. మాలాన్యాకి ప్రధాన శత్రువు గ్లాఫిరా. తల్లి బతికుండగానే ఇంటి పెత్తనమంతా ఆమె తన గుప్పిటిలోకి చిక్కించుకుంది. తండ్రితోసహా ఇంటిల్లిపాదీ ఆమె ఎలా ఆడిస్తే అలా ఆడవలసిందే. ఆమె అనుమతిలేందే చిటికెడు పంచదారయినా బయటికి తీయడానికి వీల్లేదు. ఈ అధికారా న్నంతా ఇంకొకతకు - అందులోనూ మాలన్యాకి - ప్రాణం వుండగా ధార పోయడమే? ఇవాన్ పెళ్ళి పియోటర్ హృదయంలోకంటె ఆమె హృద యంలో ఎక్కువ కోపాగ్నిని రగిల్చింది. 'నడ మంత్రపు సిరిపట్టిన' మలాన్యాని కూడా తన గుప్పెటలో పెట్టుకోవాలని గ్లాఫిరా సంకల్పించింది. ఒక్క గంటలో మలాన్యా ఆమెకి దాసురాలైపోయింది. మలాన్యా చాలా

నెమ్మదైంది, దిక్కులేంది, పిరికిమనిషి, రోగిష్టి, పైగా గాబరాపడిపోయింది. ఇటువంటిది ఆ గయ్యాళి గ్లాఫిరాని ఎదిరించి మనగల్గడమెలా? ప్రతి నిత్యమూ గ్లాఫిరా, మలాన్యా పూర్వస్థితిని జ్ఞప్తికి తెచ్చి "నీ తాహతు యెరిగి మరీ ప్రవర్తించు" అంటూ మందలించేది. ఎంత వెగటు గొల్పినా ఈ మందలింపులను ఏదో విధంగా భరించి మలాన్యా సర్దుకు పోయేది.... కాని ఫెద్యా ఆమెకు కాకుండా పోయాడు. ఇది మరీ ఘోరం! పిల్లవాణ్ణి సాకలేదనే వంకతో గ్లాఫిరా తల్లీ పిల్లల్ని ఎడంచేసింది. పిల్లవాణ్ణి చూడ నిచ్చేదికాదు. అతని పోషణ బాధ్యత గ్లాఫిరా స్వయంగా వహించింది. పిల్లవాణ్ణి పూర్తిగా తన అదుపులో పెట్టుకుంది. పుట్టెడు దుఃఖంతో కుమిలి పోయి మలాన్యా త్వరగా ఇంటికి వచ్చెయ్యమని భర్తకు ఉత్తరాలు రాసింది. పియోటర్‌కికూడా కొడుకుని చూడాలని ఆతురతగానే ఉంది. కాని ఇవాన్ ఇంటికి తిరిగి రాలేదు. తాను రాకపోవడానికి అవీ ఇవీ ఏవో వంకలు చెబుతూ తన భార్యని పోషిస్తూ తనకి డబ్బు పంపినందుకు తండ్రికి కృతజ్ఞతాభివందనాలు తెల్పుతూ త్వరలోనే తిరిగి వస్తానని జాబు రాశాడు. అంతే. 1812వ సంవత్సరం వచ్చింది. ఆ సంవత్సరంలో ఇవాన్ ఇంటికి తిరిగి రావలసి వచ్చింది, ఆరు సంవత్సరాల ఎడబాటు తర్వాత మొదటిసారిగా కలుసుకున్నపుడు పాత గొడవలు తలపెట్టకుండా తండ్రికొడుకులు ఒకరినొకరు గట్టిగా కౌగిలించుకున్నారు. నిజం. పాత గొడవలు తలపెట్టే సమయంకాదది. రష్యా అంతా ఆయుధాలు ధరించి[1] శత్రువుల నెదిరించడానికి తలపడింది. తండ్రీకొడుకు లిద్దరూ తమలో రష్యన్ రక్తం ప్రవహిస్తున్నదని భావించారు. పియోటర్ స్వంతడబ్బుతో ఒక జాతీయ సైనిక దళం నిర్మించాడు. కాని యుద్ధం ఆఖరైపోయింది. అపాయం దాటిపోయింది. ఇవాన్ పెట్రోవిచ్‌కి మళ్ళీ విసుగెత్తింది. దూరప్రదేశాల ఆకర్షణకు అతను లొంగిపోయాడు. అతను అలవాటు పడి పోయిన ప్రపంచం, అతనికెంతో సుఖం చేకూర్చే ప్రపంచం అతన్ని ఆకర్షి స్తోంది. మలాన్యా భర్తని ఆపలేకపోయింది. అతని దృష్టిలో ఆమె నలుసు అయిపోయింది. ఆమె ఆశలు భగ్నమైనాయి. ఇవాన్ కూడా పిల్లవాణ్ణి గ్లాఫిరా పెంచడమే మంచిదనే అభిప్రాయాని కొచ్చాడు. పాపం!

1. రష్యాపై నెపోలియన్ దండయాత్ర.

మలాన్యా ఈ దెబ్బ తట్టుకోలేకపోయింది. తిరిగి కొడుకుతో ఎడబాటు భరించలేకపోయింది. కొద్ది రోజుల్లోనే ఆమె తన స్వత్వమునే ఏమాత్రం సంకోచించకుండా పరిత్యజించేసింది. జీవితకాలంలో ఆమె ఎవరినీ ఎదిరించి ఎరగదు. రుగ్మతనుకూడా అలానే ఎదిరించలేకపోయింది. మాటపడిపోయింది. మొహంలో చావుకళ పడింది. కాని ఆమె ఆకృతిలో పూర్వపు సాధుత్వం, కళ్ళల్లో పూర్వపు తడబాటూ గోచరిస్తూనే ఉన్నాయి. గ్లాఫిరాకేసి కళ్లప్పగించి చూసి, పూర్వం మరణశయ్యపై అన్నాపావ్లోవ్నా భర్తచేతని ముద్దిడుకున్నట్లే తన ఒకగానొక కొడుకుని ఆమెకి అప్పగించింది. ఈ విధంగా ఆమె భౌతిక జీవితం అంతమైంది. ఈ సాధుశీల, ఈ దయార్ద్రహృదయ బతుకు లేతమొక్కను తల్లి నేలనించి వేరుచేసి ఎండలో గిరాటువేసినట్లయింది. ఆమె కనుమూసింది. అనంతకాల గర్భంలో లీనమైపోయింది. ఆమెకోసం ఎవరూ ఏడవలేదు. పియోటర్, ఆమె దాసీమాత్రం విచారపడ్డారు. కరుణ ఉట్టిపడే ఆము మొహం కనిపించక పియోటర్ బాధపడ్డాడు. "శెలవు. అమాయకురాలా! శెలవు" అన్నాడు చర్చిలో ఆమె భౌతికదేహం ముందు వంగుతూ. సమాధిలో గుప్పెడు మన్ను వేస్తూ బావురుమని ఏడ్చాడు.

ఆమె చనిపోయిన తర్వాత అతనూ అట్టే కాలం బతకలేదు. మహా బతికితే అయిదారు సంవత్సరాలు బతికాడేమో? గ్లాఫిరానీ మనవణ్ణీ వెంటబెట్టుకుని వెళ్ళి మాస్కోలో మకాం పెట్టాడు. అక్కడ 1819 శీతాకాలంలో అతనూ చనిపోయాడు. చనిపోయేముందు అన్నాపావ్లోవ్నా, మలాషాల సమాధుల పక్కన తననూ సమాధి చేయమని కోరాడు. ఆ సమయంలో ఇవాన్ పెట్రోవిచ్ పారిస్‌లో జల్సాగా తిరుగుతున్నాడు. 1816 లో తన పదవికి రాజీనామా ఇచ్చేశాడు. తండ్రి మరణవార్త వినగానే రష్యాకి బయలుదేరాలని నిశ్చయించుకున్నాడు. ఎస్టేటు అజమాయిషీ ఏర్పాట్లు చెయ్యాలి. ఫెడ్యాకి అప్పుడే పదమూడో ఏడు వస్తోంది. కుర్రవాడి చదువు సంధ్యల విషయం తీవ్రంగా ఆలోచించాలి.

# ౧౦

ఇవాన్ పెట్రోవిచ్ రష్యాకి తిరిగి వచ్చాడు. కాని ఆంగ్లేయ జీవిత విధానంమీద పిచ్చి వ్యామోహం అతనికి ఏర్పడింది. వత్తుగా కత్తిరించుకున్న క్రాపూ, గంజిపెట్టిన చొక్కా, పొడుగాటి బటానీరంగు కోటూ, చలనంలేని ముఖకవళికా, నిర్మోహమాటంగా మాట్లాడటం, ఉదాసీన వైఖరీ, పళ్ళ సందులగుండా ఉచ్చారణా, నిర్జీవంగా హఠాత్తుగా నవ్వటం, ఎప్పుడూ మొహం చిట్లించుకోవటం, రాజకీయాలమీదా రాజ్యతంత్ర శాస్త్రంమీదా ఉపన్యాసాలు దంచటం, ఉడికీఉడకని గొడ్డు మాంసం మీదా ద్రాక్షాసారా మీదా అమిత అపేక్షా – ఇవన్నీ అతనిలోని ఆంగ్లేయ వ్యామోహాన్ని వెల్లడిస్తున్నాయి. అయితే చిత్రమేమంటే ఆంగ్లేయ వ్యామోహం ఇంత ఉన్నా దేశభక్తికేం కొరతలేదు. దేశభక్తుణ్ణని చెప్పుకునేవాడు. కాని అతనికి రష్యాతో ఎక్కువ పరిచయంలేదు. రష్యన్ ఆచారం ఒక్కటీ తెలీదు. ఇంతేగాదు రష్యన్ భాషని అదో విధంగా మాట్లాడేవాడు. మామూలు సంభాషణ కూడా మొరటుగా ఉండేది. సంభాషణ ఏదైనా ముఖ్య విషయం మీదికి మరలగానే "మనం స్వయంగా ఆలోచించాలి", "ఇది ప్రకృతి తత్వానికి అనుగుణ్యంగా

లేదు." ఇలాంటి భావాలు ప్రకటించేవాడు. దేశ సవీకరణకూ, శ్రేయో వృద్ధికీ చాలా పథకాలు రష్యా వచ్చేటప్పుడు కూడా తెచ్చాడు.

ఇవాన్‌కి రష్యాలో ఏదీ నచ్చలేదు. ముఖ్యంగా అచ్చటి అ... అతనికి మరీ ఏవగింపు కలిగించింది. సోదరిని కలుసుకోగానే ఇంటి విష... లలో తీవ్రమైన మార్పులు చేయ సంకల్పించానని తెలియజేశాడు. ... నించి కొత్తపద్ధతులు అమలు జరుగుతాయని హెచ్చరించాడు. గ్లాఫి... మాట్లాడకుండా పళ్ళు కొరుక్కొని "యిక నాగతేంగాను" అని మనసు అనుకుంది. కాని తిరిగి గ్రామసీమకు వెళ్ళిన తర్వాత ఆమె భయం ప... పంచలైంది. ఇంట్లో కొన్ని మార్పులు జరిగిన మాట వాస్తవమే. తిండిపో... రాయళ్ళనీ, ఇచ్చకాలమారి వెధవల్నీ తరిమేశారు. వారిలో ఒకామె గు... రెండో ఆమె పక్షవాతంతో తీసుకొంటోంది. మూడవవ్యక్తి [1]ఒచకో... యుద్ధకాలంనాటి మేజరు. అతనికి పిచ్చి ఆకలి. అందుకని రొట్టె, గుగ్గి... తిన్నంత పడేసేవారు. పూర్వం తరుచుగా వచ్చే అతిథులందరికీ ఉద్వా... చెప్పారు. వాళ్ళందరినీ తోసిరాజని ఇంకొక అతను తరుచు అతి... రావడం ప్రారంభించాడు. అతను ఇవాన్ ఇంటికి కొంచెం దూరంలో ... సించేవాడు. అందగాడు. నెమ్మదైనవాడు, పట్టి తెలివితక్కువ దద్ద... అయితేనేం జమీందారు.

మాస్కోనించి కొత్తరకం సామాను దిగింది. ఉమ్మేసుకోటా... మూకుళ్లు, గంటలు, చేతులు కడుక్కోటానికి నీళ్ళస్టాండులు ఇంట్లో అమర్చా... భోజనాలు వడ్డించటంలోకూడా మార్పు వచ్చింది. విదేశీ సారాబదు... వోడ్కా, దేశవాళీసారాలు వాడకంలో కొచ్చాయి. సేవకులకు కొత్త... దుస్తులు కుట్టించారు. కుటుంబ బిరుదావళికి కొత్త బిరుదులుచేరాయి.

గ్లాఫిరా అధికారం విస్తమైనా తగ్గలేదు. సామాగ్రి కొనటం మొద... ఇంటి వ్యవహారాలన్నీ ఆమె ఆజ్ఞలమేరకే జరుగుతున్నాయి. విదేశాలని... వచ్చిన నౌకరు ఒకడు గ్లాఫిరాని ఎదిరించి నౌకరీ కోల్పోయాడు. గ్... యజమానికి అతనంటే అభిమానం ఎంతఉన్నా బర్తరఫుచేయక తప్పిందికా...

1. ఒచకోవ్ : నల్లసముద్రంమీది రష్యన్ రేవుపట్నం. దుర్గం. ... కోసం రష్యాకీ, టర్కీకీ 1788 లో పెద్ద యుద్ధంజరిగింది.

గృహనిర్వహణలో, ఎస్టేటునిర్వహణలో గ్లాఫిరా పలుకుబడి చెక్కుచెదర లేదు. ఎందులోనూ పూర్వానికి భిన్నంగా లేదు. ఇవాన్ ఈ అవ్యవస్థకు నూత్నజీవం పోయాలని ఎంత కుతూహలపడ్డా మార్పేమీ జరగలేదు. కాక పోతే అక్కడక్కడా శిస్తులు హెచ్చించటం, వెట్టిచాకిరీ తీవ్రంచేయటం, రైతులు సరాసరి • ఇవాన్‌కి ఎదీ విన్నవించుకోరాదని ప్రకటనచేయటం మాత్రం జరిగింది. అంతే. ఇవాన్ తన నూతన విధానం ఫెడ్యా చదువులో పూర్తిగా ప్రవేశపెట్టాడు. తక్కిన వ్యవహారాలన్నీ కట్టిపెట్టి కొడుకు చదువువిషయంలో నిమగ్నుడైనాడు.

# ౧౧

విదేశాలలో ఇవాన్ పెట్రోవిచ్ ఉన్నంతకాలం ఫెడ్యాని గ్లాఫిరా పెంచింది. తల్లి చనిపోయేటప్పటికి అతనికి నిండా ఎనిమిదేళ్ళయినా లేవు. ఎప్పుడో కాని తల్లిని చూట్టం పడేది కాదు. తల్లంటే అతనికి అమిత ప్రేమ. పాలిపోయిన ఆమె మొహం, బిక్కచూపులూ, జంకుతూ జంకుతూ తనను ముద్దాడటం అతని హృదయంలో హత్తుకుపోయాయి. ఆమె పరిస్థితిని కొంత వరకు ఫెడ్యా అవగాహనచేసుకున్నాడు. తనకూ తల్లికీ మధ్య అడ్డుగోడలున్నాయనీ వాటిని పడగొట్టడానికి ఆమెకు ధైర్యంగానీ, శక్తిగానీ లేదనీ గ్రహించాడు. ఫెడ్యా తండ్రిదగ్గిరికి వెళ్ళకుండా తప్పించుకుతిరిగేవాడు. ఇవాన్ కూడా కొడుకుని పిల్చి ముద్దాడి ఎరగడు. ఫెడ్యాతాత మాత్రం అప్పుడప్పుడూ తల నిమిరి చేతిని ముద్దాడనిచ్చేవాడు. "మడ్డిమృగం, ఎద్దుమొద్దు స్వరూపం" అని పిల్చేవాడు.

మలాన్యా చనిపోయినతర్వాత ఫెడ్యా పూర్తిగా గ్లాఫిరా గుప్పిటలో చిక్కుకుపోయాడు. గ్లాఫిరా అంటె అతనికి పెద్దభయం. సూదిలాంటి ఆమె చూపు, కర్కశస్వరం అతనికిభీతిగొల్పేవి. ఆమె ముందు మాట్లాడటానికి అతనికి గుండె చాలేదికాదు. ఖర్మంచాలక కుర్చీలో కాస్త అటూ ఇటూ కదిలాడో గ్లాఫిరా "ఊఁ, యేమిటీ? కదలకుండా కూర్చోలేవూ?" అని

కనురుకునేది. ఆదివారంనాడు ప్రార్థనలయినాక ఆడుకోనిచ్చేది. ఆడుకోనిచ్చేదంటే లావుపాటి పుస్తకం ఒకటి చదవనిచ్చేది. ఆ పుస్తకంలో ఏముందో ఎవరికీ అర్థమయేదికాదు. ఆ గ్రంథం రచించింది మాక్సిమోవిచ్-అంబోడిక్. దాని పేరు "సాంకేతికాలు, చిహ్నాలు". ఆ పుస్తకంలో వెయ్యికిపైగా బొమ్మలున్నాయి. వాటి భావం ఓ పట్టాన అర్థంగాదు. అయిదుభాషల్లో వ్యాఖ్యానం ఉంది. బొద్దుగా దిగంబరిగా ఉన్న మన్మథుని[1] బొమ్మలే వీటిలో ఎక్కువగా ఉన్నాయి. ఒక బొమ్మపేరు 'కుంకుమరంగు - ఇంద్రధనస్సు'. దానికింద 'దీని పలుకుబడి అపారం' అని రాసి ఉంది. ఇంకో బొమ్మ 'ముక్కుతో పువ్వుపట్టుకుని ఎగురుతున్న నారాయణపక్షి'. దీనికింద 'అన్నీ నీకు తెలుసు' అని రాసి ఉంది. 'మన్మథుడు-పిల్లను నాకుతున్న ఎలుగ్గొడ్డు' అనేది ఇంకోబొమ్మ. దీని భావార్థం 'కొంచెంకొంచెం'. ఫెద్యా ఈ బొమ్మలన్నిటినీ శ్రద్ధగా పరిశీలించాడు. చిన్న చిన్న విషయాలదగ్గరనించీ అతనికి గుర్తే. కొన్ని బొమ్మలు అతని ఆలోచనలను రేకెత్తించేవి. పాపం! ఇతరవినోదాలేవీ అతనికి తెలీవు. వివిధభావాలు సంగీతం నేర్చుకోవలసిన వయసురాగానే వాటిని బోధించడానికి ఓ స్వీడన్ దేశస్తురాలిని కొద్దిజీతంమీద గ్లాఫిరా నియమించింది. ఆ పంతులమ్మకి పెళ్ళికాలేదు. వయసుమళ్ళింది. లేడిచూపులు. ఫ్రెంచి, జర్మన్ భాషలలో ఆమెకి మిడిమిడి జ్ఞానం ఉంది. ఒక్క బిగువున పియానో వాయించగలదు. అన్నిటికంటె మించి దోస ఆవకాయ బాగా వెయ్యగలదు. ఆ పంతులమ్మ సహచర్యంలో, గ్లాఫిరా దాసీవాపిలెవ్నాల సహచర్యంలో ఫెద్యా నాలుగేళ్ళు గడిపాడు. ఆ బొమ్మల పుస్తకం చేతబట్టి అతను ఎక్కువగా ఒకమూల కూర్చునేవాడు. ఇలా సూర్యోదయందగ్గిరనించి, సూర్యాస్తమానందాకా కూర్చుంటూ రోజులకి రోజులు గడిపాడు. ఆ గదిలోపలికప్పు ఎత్తు తక్కువ. అడవిమొక్కల వాసనగొట్టేది. ఒకేఒక కొవ్వొత్తి మసకమసకలాడుతుండేది. మందవాడిగా, ఆయాసంతో కీచురాయి అరిచేది. గోడమీద చిన్న గడియారం గబగబా టిక్ టిక్ మనేది. గోడ బొర్రెలలో ఎలికలు గీకుతూ పళ్ళు కొరుక్కుంటూ శబ్దంచేసేవి. ఇక ఆ ముగ్గురు ముదుసళ్ళు ముగ్గురు

1 పాశ్చాత్యులు మన్మథుని రెక్కలున్న చంటిపిల్లవానిగా, దిగంబరిగా చిత్రించారు.

అదృష్టదేవతల్లాగా [1] శబ్దం చేయకుండా తొందరతొందరగా నూదులతో కుట్టుతూ కూర్చునేవారు. వారి చేతి నీడలు ఆ చీకట్లో భీతిగొల్పేవి. ఆ పని వాడి మనసులో కూడా ఇలాంటి భయంకర విషాదభావాలే పెంపొందాయి.

ఫెద్యా ముచ్చట గొలిపే పిల్లవాడు కాదు. పాలిపోయిన మొహం, బొద్దు శరీరం, మోయరానిబరువు. అచ్చమైన రైతుబిడ్డలా ఉండేవాడు. బయట గాలిలో ఫెద్యా తిరుగుతూంటే నిగనిగలాడిపోయేవాడే. సోమరిపోతైనా బాగా చదువుకునేవాడు. సాధారణంగా ఏడ్చేవాడు కాదు. కాని అప్పుడప్పుడు మొండికేసేవాడు. అలా మొండికేసినపుడు ఎవరూ ఆతన్ని అదమాయించ లేకపోయేవారు. చుట్టూ ఉన్నవారెవరినీ ఫెద్యా ప్రేమించలేడు.... చిన్నతనంలో ప్రేమ ఎరగని హృదయం శోకతప్తంగాక మరేమవుతుంది?

ఇలాంటి కొడుక్కి కాలయాపన లేకుండా తన నూత్నవిధానంలో చదువు చెప్పనారంభించాడు ఇవాన్. "అన్నిటికంటె ముందు వీణ్ణి మనిషిని చెయ్యాలి. స్పార్టాన [2] లాగా ధైర్య సాహసోపేతుణ్ణి చెయ్యాలి." అని గాఫిరాతో చెప్పాడు. తన పథకం ప్రకారం ముందుగా కొడుకుచేత స్కాచి నిక్కరు తొడిగించాడు. ఈ పన్నెండేళ్ళ కుర్రాడు ఈకల టోపీ పెట్టుకుని కులుక్కుంటూ నడిచేవాడు. స్వీడన్ దేశపు పంతులమ్మ బదులు స్విడ్జర్లండు దేశీయుడొకడు ఫెద్యాకు చదువు చెప్పడానికి కుదిరాడు. అతను శరీర వ్యాయామం నేర్పటంలో దిట్ట. సంగీతం నేర్చుకోటం పురుషలక్షణం కాదనే భావంతో పూర్తిగా మానిపించేశాడు. జీన్ జాక్వీస్ రోషియో సూచనల ననుసరించి ప్రకృతి విజ్ఞానశాస్త్రం, అంతర్జాతీయ న్యాయశాస్త్రం, గణితశాస్త్రం, వడ్రంగం ఫెద్యా అభ్యసించాల్సిన విషయాలు. ధైర్య సాహసాలు పెంపొందటానికి వంశబిరుదావళి శాస్త్రం ఫెద్యా అభ్యసించాలి. ఇవి భవిష్యత్తులో "మనిషి"గా తయారవటానికి ఫెద్యా నేర్చుకోవలసినవి.

తెల్లవారగట్ల నాల్గింటి కల్లా ఫెద్యాని లేవగొట్టేవారు. అపుడు చన్నీటి స్నానం చేయాలి. ఎత్తయిన గడచుట్టూ తాళ్ళమీద పరుగెత్తాలి.

---

1. అదృష్టదేవతలు : రోమన్ పురాణాలలో ముగ్గురు దేవతలు మానవుల అదృష్టాన్ని నిర్ణయిస్తారని వర్ణింపబడింది.

2. స్పార్టాన్లు : పురాతన గ్రీసునగరం స్పార్టావాసులు. వారు ధైర్య స్థయిర్యాలకు, సహనానికీ, నిరాడంబర జీవితానికీ పేరుగాంచారు.

ఒంటిపూట భోజనం. గుర్రపుస్వారి. విలువిద్య నేర్చుకోటం. తండ్రి లానే ఆత్మశక్తిని వృద్ధిచేసుకోటం. ఇదే ఫెడ్యా దినచర్య. ఈ దినచర్యను సాయంత్రం పుస్తకంలో రాసి, దానిమీద తన అభిప్రాయాలుకూడా ప్రకటించాలి.

ఇవాన్ పెట్రోవిచ్ ఫ్రెంచి భాషలో కొడుక్కి సలహాలు రాసి స్తుండేవాడు. ఫెడ్యా రష్యన్ భాషలో 'నువు' అని తండ్రిని సంబోధించే వాడుగాని అతని ముందుకూర్చోటానికి ధైర్యం ఉండేదికాదు. ఈ నూత్న విధానం ఫెడ్యాకి ఆశ్చర్యం కలిగించింది. గందరగోళ పర్చింది. మనసును పాడుచేసింది. కాని ఈ విధానంవల్ల అతని ఆరోగ్యం బాగుపడింది. మొదట జ్వరం తగిలింది కాని తొందరలోనే కోలుకున్నాడు. క్రమేపీ బలం పట్టింది. ఇవాన్ కొడుకుని చూసుకొని గర్వపడేవాడు. "వీడు ప్రకృతిబిడ్డ- నా సృష్టి" అనేవాడు. ఫెడ్యాకి పదహారేళ్లు వచ్చేసరికి అతని మనసులో స్త్రీలంటే అసహ్యాభావం రేకెత్తించాలని ఇవాన్ తలపెట్టాడు. ఫెడ్యాకి అమితసిగ్గు. నూనూగు మీసాలు వచ్చాయి పుంసత్వం తొణికిసలాడుతోంది. ఉడుకురక్తం. స్త్రీలపట్ల ఉదాసీనభావం వహిస్తున్నట్లు, ఒంటరి జీవితం గడపాలని అభిలషిస్తున్నట్లు, నాగరికత తెలియనట్లు ఫెడ్యా నటించసాగాడు.

కాలం గడిచిపోతోంది. ఇవాన్ పెట్రోవిచ్ ఒక్క శీతాకాలం మినహా తక్కిన కాలమంతా లావ్రికోలోనే గడుపుతున్నాడు. శీతా కాలంలో మాత్రం ఒక్కడూ మాస్కో వెళ్ళి హోటల్లో బసచేసేవాడు. విడవకుండా క్లబ్బులకు వెళుతుండేవాడు. కచేరీ గదులలో తన పథకాలను వివరిస్తూ వాటిని సమర్థించేవాడు. పూర్వంకంటె ఎక్కువ ఆంగ్లవ్యామో హంతో అసంతృప్తితో దేశనాయకునిలా ప్రవర్తించ సాగాడు. ఇంతలో 1825 1వ సంవత్సరం వచ్చేసింది. దాంతోపాటు విషాదమూ, కష్టపరం పరలూ ప్రజల నావహించాయి. ఇవాన్ పెట్రోవిచ్ ప్రాణమిత్రులూ, పరిచయస్తులూ ప్రభుత్వ హింసాకాండకు గురయ్యారు. ఇవాన్ తన

1. రాజభవన తిరుగుబాటు. ఇందులో ఒకటవ నికోలసుని చంపాలని కుట్ర జరిగింది. రాజ్యాంగం కావాలని గొప్ప ఆందోళన ప్రదర్శనాలు జరిగాయి. ప్రభుత్వంకాల్పులు సాగించింది. దీనినే డిశంబరిస్టు ఉద్యమం అంటారు.

గ్రామానికి వెళ్ళి తక్కిన ప్రపంచంతో సంబంధం పెట్టుకోకుండా ఏకాంత జీవితం గడపసాగాడు. ఇంకో సంవత్సరం గడిచింది. హఠాత్తుగా ఇవాన్ ఆరోగ్యం దెబ్బతిన్నది. శరీరం దుర్బలమైపోయింది. జబ్బు ప్రవేశించింది. మతంలో విశ్వాసంలేని ఇవాన్ చర్చికి వెళ్ళి బిగ్గరగా సాముదాయక ప్రార్థనలలో పాల్గొనారంభించాడు. యూరపువారి జీవిత విధానానికి అలవాటు పడ్డవాడల్లా రష్యన్ తరహా వేడినీటిస్నానం చేయనారంభించాడు. రెండు గంటలకి భోజనం చేయటం, తొమ్మిది గంటలకల్లా పక్కమీదచేరి బట్లరు చెప్పే కట్టుకథలు వింటూ నిద్రపోవటం – ఇదే అతని దైనందిన కార్యక్రమం. ఈ ప్రజానాయకుడు తన పథకాలు, ఉత్తరాలు తగల బెట్టేశాడు. గవర్నరుకనిపిస్తేసరి వణికిపోయేవాడు. పోలీసుఇన్స్పెక్టరుకి వంగి వంగి సలాములు చేసేవాడు. మనోబలం తనకెంతో గలదనుకొనే యీ ధీరుడు కాస్త కురుపులేస్తే పులుసు చల్లారిపోతే వణికిపోయేవాడు. మూలిగేవాడు.

గ్లాఫిరా తిరిగీ ఇంట్లో అధికారం చెలాయించనారంభించింది. మళ్ళీ అల్లగాజనం, అమీనాలు, జమీ మేనేజర్లు ఇంట్లో ప్రవేశిస్తున్నారు. వీరంతా గ్లాఫిరాను 'లోభిముండ' కింద జమకట్టేవారు. ఇవాన్‌లోవచ్చిన ఈ మార్పు ఫెద్యామీద తన ప్రభావం నెరపింది. ఫెద్యాకి పందొమ్మిదోఏడు రాబోతోంది. ఆలోచించసాగాడు. తండ్రి గుప్పిటనించి తప్పించుకో నారంభించాడు. ఇవాన్ మాటలకీ చేతలకీ ఉన్న తేడా, అతని స్వేచ్ఛావాదానికీ, నిరంకుశత్వానికీ గల తేడా గుర్తించాడు. కాని తండ్రిలో ఇంత విపరీతమైన మార్పు వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. ఈ అహంకారి (ఇవాన్) అసలు నైజం బయటపడింది. విశ్వవిద్యాలయంలో చేరటానికి ఫెద్యా మాస్కో వెళ్ళాలనుకుంటుండగా ఇవాన్ పెట్రోవిచ్‌కి ఇంకో ఆపద సంభవించింది. ఒక్కరోజులో ఇవాన్‌కి అంధత్వం ప్రాప్తించింది.

రష్యన్ డాక్టర్ల శక్తిసామర్థ్యాలలో నమ్మకంలేక ఇవాన్ విదేశాలకి వెళ్ళడానికి అనుమతికోసం ప్రయత్నించాడు. కాని ప్రభుత్వం నిరాకరించింది. దానిమీద కొడుకుని వెంటబెట్టుకుని రష్యాఅంతా మూడుసంవత్సరాలపాటు తిరిగాడు. ఒక డాక్టరుదగ్గరనించి ఇంకోడాక్టరుదగ్గిరికి, ఒక పట్టణంనించి ఇంకోపట్టణానికి ఒకటే తిరుగుడు. ఇక తనకు కళ్ళురావని అధైర్యపడిపోయి ఎప్పుడూ ధుమధుమలాడుతూ వైద్యుల్ని, కొడుకుని,

పరివారాన్ని వేపుకుతినేవాడు. లాద్రికీకి తిరిగివచ్చేసరికి నీచడిపోయి అస్త మానము ఏడ్చే పిల్లవానిలా తయారయాడు. ఇంటిల్లిపాదికీ చెడురోజులు దాపరించాయి. భోజనంచేసేటపుడుమాత్రం ఇవాన్ మెదలకుండా ఉండే వాడు. అంతకు పూర్వం ఎన్నడూ తిననంత పిచ్చితిండి తినటం మొదలు పెట్టాడు. తక్కినవేళల్లో తను హైరానాపడేనాడు, ఇతర్లని హైరానా పెట్టేవాడు. ప్రార్థనలు చేసేవాడు, విధిని దూరేవాడు తననూ, తన రాజ కీయాలనూ, తన నూత్న విధానాన్నీ దుమ్మెత్తిపోసేవాడు. వేటిని చూసుకుని గర్వించేవాడో, వేటినిగురించి డప్పాలుకొట్టేవాడో, వేటిని ఆదర్శంగాపెట్టు కోమని కొడుక్కి బోధించాడో వాటన్నిటినీ ఇవాన్ వదిలేసుకున్నాడు. దేంట్లోనూ తనకు విశ్వాసం లేదని ఖండితంగా చెప్పేవాడు. మరుక్షణంలో దైవప్రార్థన చేసేవాడు. ఒక్క నిమిషంకూడా ఒంటరిగా ఉండలేక ఇంటిల్లి పాదినీ అహోరాత్రులూ తనచుట్టు కూర్చొని కథలు చెప్పమనేవాడు. అలాగే కథలు చెబుతూంటే మధ్య మధ్య "మీరు చెప్పేవన్నీ పచ్చి అబద్ధాలు" అంటూ కథకి అడ్డువచ్చేవాడు.

ఈ బాధలన్నిటినీ గ్లాఫిరా ఎలాగో ఒకలాగ భరించింది. ఆమెలేందే ఇవాన్‌కి ఒక్క నిమిషమయినా గడిచేదికాదు. ఈ చలచిత్తపురోగి పిచ్చి కోరికలన్నీ తీరుస్తుండేది. గొంతుదాకా ఉన్న కోపం ఎక్కడ బైటపడి పోతుందోనని గ్లాఫిరా ఒకొక్కప్పుడు ఇవాన్‌కి వెంటనే సమాధాన మిచ్చేదికాదు. ఈ విధంగా ఇంకో రెండు సంవత్సరాల బతుకు ఈడ్చి ఇవాన్ ఒకరోజున తనను బాల్కనీలోని ఎండపొడలోకి తీసుకువెళ్ళమన్నాడు. బాల్కనీలోకి తీసుకువెళ్ళిన తర్వాత "గ్లాషా, గ్లాషా! తెలివితక్కువ మొద్దా! ఏదీ నా..." అని తడబడుతూ మాట పూర్తి చెయ్యకుండానే శాశ్వతంగా కనుమూశాడు. గ్లాఫిరా బట్లరు చేతుల్లోంచి పులుసుకప్పు తీసుకుని, ఊపిరి బిగబట్టి నిల్చొని, తమ్ముని కేసి ఒక పర్యాయం చూసి మెదలకుండా అక్కడే ఉంది. ఫెద్యా కూడా అక్కడే ఉన్నాడు. అతనూ ఏమీ మాట్లాడలేదు. బాల్కనీ పిట్టగోడకు ఆనుకుని తోటకేసి తదేక దృష్టితో చాలాసేపు చూశాడు. వసంతకాలపు సూర్య కాంతిలో ఆ పచ్చ పచ్చని తోట సువాసనలు విరజిమ్ముతూ ధగధగ లాడిపోతోంది. ఫెద్యాకి ఇపుడు ఇరవై మూడేళ్ళు. ఈ ఇరవైమూడేళ్లూ ఎంత విపరీతమైన వేగంతో గడిచిపోయాయి! ఫెద్యా భావిజీవితం వికసిస్తోంది.

# ౧౨

కన్న తండ్రికి అంత్యక్రియలు జరిపి, ఇంటి వ్యవహారాలూ జమీ అజమాయిషీ గ్లాఫిరాకి అప్పగించి లావ్రెటస్కీ మాస్కోకి బయలుదేరి వెళ్ళాడు. ఏదో తెలియరాని, ప్రతిఘటించరాని శక్తి అతన్ని మాస్కో వైపుకి ఆకర్షించింది. తన చదువులోగల లోపాలను గుర్తించాడు. ఇక ఏమాత్రం జాగుచెయ్యకుండా ఆ లోటును భర్తీ చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. గడిచిపోయిన అయిదు సంవత్సరాలలో ఎంతో చదివాడు కాని బయటి ప్రపంచాన్ని చూడలా. అతనిలో అనేక భావాలు పొంగి పొరలుతున్నాయి. కొన్ని కొన్ని విషయాలలో అతనికున్న ప్రావీణ్యత చూసి ఏ అధ్యాపకుడైనా అసూయ పడాల్సిందే! కాని సామాన్యంగా ప్రతి విద్యార్థికీ తెలిసిన అనేక విషయాలు లావ్రెటస్కీకి తెలీవు. తనకు స్వతంత్ర భావాలు లేవని గ్రహించాడు. తన వైఖరి పరిహాసాస్పదంగా ఉందనీ అతనికి మనసులో తెలుసు. ఆ ఆంగ్ల వ్యామోహితుడు కొడుకుని నిర్దాక్షిణ్యంగా తప్పు తోవను పట్టించాడు. అతని వెర్రి మొర్రి విద్యా విధానం విషఫలితాలిచ్చింది. చాలా కాలంపాటు లావ్రెటస్కీ తండ్రి ఆజ్ఞలను నోరెత్తకుండా శిరసావహించాడు. చివరకి సత్యం గ్రహించేసరికి, ఏంలాభం? జరగవలసిన అపకారమేమో జరిగిపోయింది. పాత అలవాట్లు అతనికి

స్వాభావికాలై పోయాయి. నలుగురితో కలిసి మెలిసి ఉండలేకపోయాడు. ఇరవైమూడో ఏడు. హృదయంలో ఆర్పరాని ప్రేమాగ్ని ప్రజ్వరిల్లుతోంది. కాని ఆడదాని ముఖంకేసి చూట్టానికి అతనికి ధైర్యం చాలేదికాదు. బుద్ధికుశలత, వివేకం, పట్టుదల, భావనాశక్తి, సోమరితనం - ఇన్ని లక్షణాలున్న లావ్రెటస్కీ యుక్తవయసులోనే జీవితసుడిగుండంలో దూకితే బాగుండిపోయేది. అలాగాక కృత్రిమ ఏకాంతవాసం చేయాల్సి వచ్చింది... ఇప్పుడు కళ్ళు తెరిచాడు. కాని ఎవరితోనూ మాట్లాడకుండా తనలో తాను కుంచించుకుపోతూ పూర్వంలాగానే ప్రవర్తించ సాగాడు. ఇన్నేళ్ళొచ్చి బడిపిల్లవానిలాగా ముస్తాబవటం నిజానికి హాస్యాస్పదంగానే ఉంటుంది. అయితేనేం వెక్కిరిస్తారనే భయం అతనికి ఎన్నడూ కలగలేదు. ఆ స్పార్టాన్ శిక్షణ ఇతరులు తన్నుచూసి ఏమనుకొంటారో అనే భీతిని పోగొట్టింది. ఏమాత్రం సంకోచించకుండా లావ్రెటస్కీ విద్యార్థిలా దుస్తులు ధరించి పదార్థ విజ్ఞానశాస్త్రం, గణితశాస్త్రం చదవటానికి విశ్వ విద్యాలయంలో చేరాడు. మంచి భారీమనిషి, కందగడ్డలాంటి మొహం. మితభాషి. బాగా పెరిగిన గడ్డం. ఈ లక్షణాలన్నీ తోటి విద్యార్థులలో అతనంటే విపరీతాభిప్రాయం కలిగించాయి. జోడు గుర్రాల సార్టులో సరిగ్గా వేళకి కాలేజీకి వచ్చే ఈ వికృతపు మనిషి చంటిబిడ్డలాంటివాడని వాళ్ళకేం తెలుసు? గర్వపోతు అనుకుని తోటి విద్యార్థులు అతనితో కలిసి తిరిగేవారు కాదు. వారికి అతనితో కలిసి తిరగాలసిన అగత్యమూ లేదు. లావ్రెటస్కీ సైతం వారికి దూర దూరంగానే ఉండేవాడు. విశ్వ విద్యాలయంలో చదివిన మొదటి రెండు సంవత్సరాలలో ఒకే ఒక విద్యార్థితో అతనికి చనువు కుదిరింది. అతనిదగ్గర లాటిన్ భాష నేర్చుకునేవాడు. ఆ విద్యార్థి పేరు మైకెలెవిచ్. అతను మంచి హుషారు పురుషుడు. కవి. అతనికి లావ్రెటస్కీ అంటే నిష్కల్మషమైన ప్రేమ ఏర్పడింది. లావ్రెటస్కీ జీవితంలో వచ్చిన ముఖ్యమైన మార్పుకు ఈ విద్యార్థే అనుకోకుండా కారకుడయాడు.

ఒకరోజున నాటకశాలలో (ఆ రోజుల్లో మొచలోవ్ కీర్తి తారాపథం అంటుతోంది. అతని ప్రదర్శనం ఒక్కదానికైనా మానకుండా లావ్రెటస్కీ హాజరవుతున్నాడు.) లావ్రెటస్కీ ఒక యువతిని బాక్సులో చూచాడు. అంతకుపూర్వం స్త్రీలు పక్కగా వెళుతుంటే అతని హృదయ స్పందించేది.

కాని ఆ యువతిని చూసినపుడు స్పందించినంతగా ఎన్నడూ స్పందించలేదు. మొఖమల్ మెత్తమీద మోచేతులానించి ఆ యువతి కదలకుండా కూర్చుని ఉంది. వన్నె తక్కువైనా మరులుగొల్పే గుండ్రటి మొహం. ఆ ముఖ కవళికలో తరుణ యవ్వనోత్సాహం తొణికిసలాడుతోంది. సన్నని కను బొమలు. అందమైన కళ్లు, భావం ఉట్టిపడే పెదవులు, తళుక్కుమనే చిరునవ్వు. వీటన్నిటిలోనూ శిరోహస్త భంగిమాలలోనూ ఆమె మధురహృదయం ప్రతిబింబిస్తోంది. బహు పసందుగా సింగారించుకుంది.

ఆమెపక్కన నలభైఅయిదేండ్లామె కూర్చుని ఉంది. శరీరం ముడతలు పడి పాలిపోయింది. మెడ తక్కువదుస్తులూ, నల్లటి హాటూ ధరించింది. మొహంలో ఆనందం తాండవిస్తోంది. బోసినవ్వు. బాక్సులో బాగా లోపల వీ రిద్దరికీ వెనక ఒక ముదుసలి కూర్చున్నాడు. వదులు కోటూ, వెడల్పాటి మెడపట్టీ ధరించాడు. మోటుగాఉన్నా గంభీరమైన ముఖకవళిక. చిన్నవైనా తీక్షణమైన కళ్ళు, అపనమ్మకం వెలువరించేచూపు, రంగువేసిన మీసాలూ చెంపలూ, ఎపుడూ ఆలోచిస్తున్నట్టు కనిపించే చిన్న నుదురు, సొట్టబుగ్గలు. ఇవన్నీ అతను పించనుపుచ్చుకున్న సైనికాధికారియని చెప్పకయే చెబుతున్నాయి. ఈమనోహర దృశ్యాన్ని తదేకదృష్టితో చూస్తున్నాడు లావ్రెటస్కీ.

ఇంతలో హఠాత్తుగా ఆ బాక్సు తలుపులు తెరచి మైకెలెవిచ్ ప్రవేశించాడు. మాస్కోలో లావ్రెటస్కీకి పరిచయస్తుడు అతి డొక్కడే. అలాంటివారు తన మనసునంతా హరించిన ఆ యువతిని కలుసుకోవటం లావ్రెటస్కీకి విచిత్రంగానూ భావగర్భితంగానూ తోచింది. ఆబాక్సులోఉన్న వారంతా మైకెలెవిచ్‌ని మిత్రునిలాగా పరిగణించడం కనిపెట్టాడు. నాటకం చూడాలనే ఆకాంక్ష అంతరించింది. ఆ రాత్రి మొచలోవ్ అద్భుతంగా అభినయిస్తున్నా అతని మనసును ఆకర్షించలేకపోయాడు. నాటకంలో మంచి కరుణారసఘట్టం జరుగుతుండగా లావ్రెటస్కీ అప్రయత్నంగా ఆ సుందరాంగికేసి చూశాడు. ఆమె ముందుకు వంగింది. చెక్కిళ్ళు మెరిసిపోతున్నాయి. రంగస్థలంమీద లగ్నమైన దృష్టి మెల్లగా మరలి అతనిమీద పడింది... ఆ రాత్రంతా ఆ దృష్టే అతన్ని వెంటాడింది. కృత్రిమంగా నిర్మించిన అడ్డకట్ట కూలిపోయింది. అతను ఆవేగంతో వణికిపోయాడు. రక్తం ఉడుకెత్తింది.

ఆ మర్నాడు మైకెలెవిచ్‌ని చూస్తానికి వెళ్ళాడు. ఆ సుందరాంగి పేరు వార్వారా పావ్లోవ్నా కొరోబినా అనీ, ఆమెతోపాటు బాక్సులోఉన్న వారు ఆమె తలిదండ్రులనీ మైకెలెవిచ్ తెలియజేశాడు. ఆ కిందటిసంవత్సరం మాస్కోదగ్గిర ఒక జమీందారు ఇంట్లో పిల్లలకు చదువుచెబుతుండగా వారి పరిచయం మైకెలెవిచ్‌కి అయింది. ఆ హుషారు పురుషుడు (మైకెలెవిచ్) ఆ యువతిని పొగడుతూ ఆకాశాని కెత్తేశాడు.

“అరే భాయీ! ఆ అమ్మాయి అద్భుతమైన వ్యక్తి. మంచి తెలివి తేటలుగలది. లలితకళల్లో నేర్పరి. పైగా దయార్ద్రహృదయ” అన్నాడు మైకెలెవిచ్. లావ్రెట్స్కీ ఆమెనిగురించి ప్రశ్నించటాన్నిబట్టి అతనికిఆమంటే సదభిప్రాయం కలిగిందని గ్రహించి మైకెలెవిచ్ ఆమెని లావ్రెట్స్కీకి పరిచయం చేస్తానని తెల్పాడు. “ఆమె తండ్రికి గర్వమంటూ లేదు. యిక తల్లి చంద్రుణ్ణి ఆకుపచ్చనిజున్నుతో చేశారంటే నమ్మేటంత తెలివితక్కువది. నన్ను వారు తమ కుటుంబంలో ఒకనిగా చూసుకుంటారు.” అనీ చెప్పాడు. లావ్రెట్స్కీకి సిగ్గేసి ముఖం ఎర్రబారింది. వినిపించకుండా ఏదో గొణిగి వెళ్ళిపోయాడు. సహజంగా తనకు అలవడ్డ బిడియంతో అయిదురోజులు కుస్తీపట్టి ఆరో రోజున కొత్తదుస్తులు ధరించి మైకెలెవిచ్ చెప్పినట్లు వినడానికి సంసిద్ధుడయ్యాడు. మైకెలెవిచ్ ఆ కుటుంబంలోని మనిషేగా! అందుకని పెద్దగా షోకు చేసుకోకుండా మామూలుగా తల దువ్వుకున్నాడు. మిత్రులిద్దరూ కొరోబిన్ యింటికి బయలుదేరారు.

# ౧3

వార్వారా పావ్లోవ్నా తండ్రిపేరు పావెల్ పెట్రోవిచ్ కొరోబిన్. అతను మేజర్ జనరల్‌గా పనిచేసి పించను పుచ్చుకున్నాడు. ఉద్యోగరీత్యా జీవితమంతా పీటర్స్‌బర్గ్‌లో గడిపాడు. మంచి యవ్వనంలో ఉన్నప్పుడు బాగా నాట్యం చేయగలడనీ చురుకైన సైనికుడనీ పేరుపొందాడు. పరిస్థితులు సరిగా లేనందువల్ల ఇద్దరు ముగ్గురు సాధారణ సేనానులకింద ఉద్యోగిగా పనిచేసి ఆ సేనానులలో ఒకతని కుమార్తెను ఇరవై అయిదు వేల రూబిళ్లు వరకట్నం పుచ్చుకుని వివాహం చేసుకున్నాడు. మిలిటరీ కవాతులో, డ్రిల్లులో ప్రావీణ్యం సంపాదించి ఎలాగో ఇరవై సంవత్సరాలలో జనరల్, ఒక రెజిమెంటుకి అధికారి అయాడు. ఆ సమయంలో శక్తినంతా ఉపయోగించి తన పదవిని సుస్థిరం చేసుకోటానికి యత్నించవలసింది. అలా ఉద్దేశించాడుకూడా. కాని చిన్న పొరపాటు జరిగింది. ప్రజాద్రవ్యం వినియోగించటంలో కొత్త దారితొక్కాడు. ఆ దారి ఉత్తమమైందిగనే కనిపించింది. కాని ఉపేక్ష వహించరాని విషయాలలో ఉపేక్ష వహించటంవల్ల పై అధికారులకు అతనిమీద అర్జీలు వెళ్ళాయి. వ్యవహారమంతా అసహ్యంగా తయారైంది. ఆ గొడవనించి ఎలాగో ఒకలాగ బైట పడగల్గాడు కాని పైనించి పించను పుచ్చుకోవలసిందని తాకీదు

వచ్చింది. ఎక్కువ పనీ పాటూ లేని ఉద్యోగం ఇంకేదైనా సంపాదించుకుందామని రెండు సంవత్సరాలపాటు పీటర్‌బర్గ్‌లో వీధులవెంట తిరిగాడు. కాని లాభం లేకపోయింది. ఇంతలో అతని కూతురు కాలేజీ చదువు పూర్తి అయింది. నానాటికీ ఇంటిఖర్చు అధికమవుతోంది......మనసులో ఏమాత్రం ఇష్టం లేకపోయినా పావెల్ కుటుంబాన్ని మాస్కోకి తరలించాడు. అక్కడ జీవన వ్యయం తక్కువ. స్టారో - కొన్యుషెనీ వీధిలో ఒక చిన్న ఇల్లు అద్దెకు పుచ్చుకుని మాస్కోలో స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు. సంవత్సరానికి 2750 రూబుల్సు ఆదాయం వస్తుంది. దాంతో కాలక్షేపం చేస్తున్నాడు. మాస్కో నగరవాసులు ఆ ఒక్క కుటుంబాన్నే కాదు ప్రపంచం అంతా వచ్చినా ఆతిథ్యమిచ్చే స్వభావంగలవారు. పింఛను పుచ్చుకున్నా మిలిటరీ మనిషిగా పొడగట్టే పావెల్ మాస్కోలోని ఉత్తమ కుటుంబాల కచేరీ గదులలో ప్రత్యక్షం కాసాగాడు. రంగువేసిన జులపాలు, కారునల్లని మీదపట్టీమీద సెయింట్ అనీ పతకంచూసి నాట్యసమయంలో పేకాటబల్లచుట్టూ తిరిగే యువకులు అతన్ని వెంటనే గుర్తుపట్టేవారు. పదిమందిలో తన ఆధిక్యత నిలుపుకోటమెలాగో పావెల్‌కి తెలుసు. ఎవరితోటీ ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. ముక్కుతో మాట్లాడడం అతనికి అలవాటు. కాని తనకంటె గొప్పవారితో మాట్లాడేటపుడు ఆ అలవాటును కప్పిపుచ్చేవాడు. పేకాటలో మహా తెగింపు చూపేవాడు. ఇంటివద్ద మితంగా భుజించినా విందులకు వెడితే ఆరుగురు తినేది ఒక్కడూ లగాయించేవాడు. ఇక అతనిభార్య విషయంలో పెద్దగా చెప్పదగ్గదేం లేదు. ఆమె పేరు కాలియోపా కార్లోవ్నా. ఆమె ఎడమకంటిలో చుక్క ఉంది. అందుకని తనది చాలా సున్నితమైన మనసు అనుకునేది. జన్మతః జర్మను. కడుపునిండా తిండిలేనిదానిలాగా ఎప్పుడూ ఆందోళన పడుతుండేది. బిగుతైన మొఖమల్ దుస్తులు, నల్లటి హాటూ, మెరుగుపోయిన గుల్లగాజులూ ధరించేది. వార్వరా పావ్లోవ్నావారి ఏకైక పుత్రిక. కాలేజీచదువు పూర్తిచేసేటప్పటికి ఆమెకి పదిహేడేళ్ళు. ఆ కాలేజీ విద్యార్థినులలో మిక్కిలి అందమైంది కాకపోయినా మంచి తెలివిగలది. మంచి గాయకురాలు. చదువులో ప్రభుత్వపతకాలు బహుమతి పొందింది. ఆమెమీద లావ్రెట్స్కీ కన్నుపడేసరికి ఆమెకి పద్ధెనిమిది ఏళ్ళు.

# ౧౪

కోర్సాబిన్ల కచేరీ గదిలో ప్రవేశించే సరికి లావ్రెట్‌స్కీకి కాళ్ళు వణికాయి. కాని భయం తొందరలోనే తొలగిపోయింది. కుటుంబ ప్రతిష్ఠలో ఏదో కొంత మచ్చ ఉన్నవారు సర్వసాధారణంగా ఇతరులను ఆప్యాయంగా ఆదరిస్తారు. అలాంటి ఆదరణపొందినపుడు రష్యావారిలో ఆనువంశికంగా ఉండే ఉత్సాహం ఇనుమడిస్తున్నది. ఈ యిద్దరు యువకులూ వచ్చినకొద్ది క్షణాలకే కాలిదయోవ్నా చల్లగా తప్పుకుంది. ఇక వార్వరా పావ్లోవ్నా మహా శాంతంగా కూర్చుని ఆప్యాయంగా ఆదరించటంతో లావ్రెట్‌స్కీ మనసు కుదట బడింది. లావ్రెట్‌స్కీ మనసేమిటి, ఎవరి మనసైనా కుదటబడుతుంది. సుందరమైన ఆకృతి, మందహాసం చేస్తున్నట్టుండే నేత్రాలు, బుజాల వంపు, గులాబీరంగు చేతులు, మందగమనం, మృదుమధుర స్వరం పురుషులను వశంచేసుకునే ఆకర్షణతో గుబాళిస్తున్నాయి. ఆ ఆకర్షణగుప్పిట చిక్కని సువాసనలాంటిది. లలితము మృదులము, వర్ణనాతీతము. పురుషహృదయాలను కలిచివేస్తుంది, ఉద్రిక్తపరుస్తుంది. అంతేగాని బిడియపడేటట్టు చేసేదిగాదు.

ఆ కిందటిరాత్రి జరిగిన నాటక ప్రదర్శనం ప్రసక్తి తెచ్చాడు లావ్రెట్‌స్కీ. వెంటనే ఆమె మొంచలోవ్ ని గురించి మాట్లాడసాగింది. నిట్టూర్పు

విడవలేదు. ఆశ్చర్యం ప్రకటించలేదు. అతని అభినయకౌశలాన్ని గురించి స్త్రీలదృష్టిలో యుక్త యుక్తంగా మాట్లాడింది. మైకెలెవిచ్ సంగీతవిషయం ఎత్తగానే ఏమాత్రం జంకు లేకుండా పియానో ముందు కూర్చుని చోపిన్ 1 రచించిన నాట్యగీతం ఒకటి సున్నితంగా వాయించింది. ఆరోజుల్లో చోపిన్ నాట్యగీతాలు ప్రజాదరణ పొందుతున్నాయి.

మధ్యాహ్న భోజనాలవేళ లావ్రెటస్కీ వెళ్ళిపోదామనుకున్నాడు కాని బలవంతంమీద ఆగిపోయాడు. పావెల్ అప్పటికప్పుడు బజారు పంపి 'లాఫిటీ' అనే ఉత్తమ రకం సారాయి తెప్పించి భోజన సమయంలో లావ్రెటస్కీకి ఆహ్లాద మొనగూర్చాడు.

లావ్రెటస్కీ బాగా చీకటి పడ్డతర్వాత ఇంటికి చేరుకుని దుస్తులు మార్చకుండా, చేతుల్తో కళ్ళు కప్పుకుని మంత్రముగ్ధునిలా కూర్చున్నాడు. ఓం ప్రథమంగా జీవిత పరమార్థం ఏమిటో లావ్రెటస్కీ గుర్తించినట్టుంది. అతని ఊహలు, నిశ్చయాలు, ఆ చెత్తా చెదారమంతా ధూళిలో కలిసి పోయాయి. అతని హృదయం ఒకేఒక భావంలో, ఒకే ఒక కోరికలో - ఆనందం, మృదుమధుర ప్రేమా అనుభవించాలనే కోరికలో సమ్మిళితమైపో యింది. ఆ నాటినించీ తరచుగా వార్వరా ఇంటికి వెళ్లసాగాడు. ఆరు నెలల తర్వాత వార్వరాకి తన ప్రేమను వెల్లడించి వివాహమాడమని కోరాడు. ఆమె అంగీకరించింది. లావ్రెటస్కీ మొదటిసారిగా తన ఇంటికి వచ్చినప్పుడే అతనికి ఎంతమంది దాసులున్నదీ మైకెలెవిచ్‌ని అడిగి పావెల్ తెలుసుకున్నాడు. వార్వరా ఈ ఆరు నెలలు మనోనిబ్బరం సడలనివ్వ లేదు. తనకు కాబోయే భర్త భాగ్యవంతుడనే సంగతి ఆమెకూ తెలుసు. ఇక కాలియోపా కార్లోవ్నా సంతోషం పట్టలేక కొత్తపాటు కొనుక్కుంది.

1. చోపిన్ : (1809-49) పోలెండు దేశపు వాగ్గేయకారుడు. స్వర కల్పనలో మేటి.

## ౧౫

కొన్ని షరతులమీద లావ్రెటస్కీ వివాహం నిశ్చయమైంది. మొదటిది: అతను వెంటనే చదువుకు స్వస్తి చెప్పాలి. 'కాలేజీకుర్రాణ్ణి' ఎవతె పెళ్ళాడుతుంది? పైగా భూస్వామి, భాగ్యవంతుడు ఇరవై ఆరేళ్ళవాడు పాఠాలు చెప్పించుకోవటమా? సిగ్గుచేటు! రెండు: పెళ్ళిదుస్తులు కొనటం, పెళ్ళికుమారునికి బహుమతులు కొనటం వార్వారా ఇష్టప్రకారం జరగాలి. ఆమెకి మంచి వ్యవహార ప్రజ్ఞానముంది, రసజ్ఞత ఉంది. భోగలాలసత, ఆ భోగాలను సమకూర్చుకునే సామర్థ్యం ఉంది. వివాహమైన మరుక్షణంలో దంపతులిద్దరూ లావ్రికికి బయలుదేరారు. ప్రయాణానికి వార్వారా మంచి సదుపాయమైన బండీ సంపాదించింది. భోగాలను సమకూర్చుకునే ఈ సామర్థ్యం చూసి లావ్రెటస్కీ ఆశ్చర్యచకితుడైనాడు. ఆమెకి ఎంత దూరదృష్టి! ఎంత జాగ్రత! ఎంత సమీకరణశక్తి! ఇవన్నీ లావ్రెటస్కీకి ప్రతి విషయంలోనూ గోచరించాయి. ఇంట్లో మూలమూలల దుస్తులు పెట్టుకునే బీరువాలే! ఎంతో అందమైన అలంకరణ సామాగ్రి, కాఫీ గిన్నెలు! ఉదయం వార్వారా స్వయంగా చేసిన కాఫీ ఎంత రుచిగా ఉంది!

ఆ సమయంలో, లావ్రెటస్కీకి పరిశీలనాదృష్టి లేదు. ఆనంద సాగరంలో తలమునకలు వేస్తున్నాడు. చంటి పిల్లవానిలా ఆ ఆనందానికి

అంకితమైపోయాడు...నిజం! లావ్రెటస్కీ చంటిపిల్లవాడిలా వట్టి అమాయకుడు. అతని భార్య ఆనందవారాశి. సకలభోగాలూ సమకూర్చి ఆనందసాగరంలో ముంచెత్తుతానని అతనికి అభయమివ్వలేదూ? వాగ్దానం చేసినంత ఎక్కువే ముట్టజెప్పింది. దంపతులిద్దరూ లావ్రికీకి నడి వేసవిలో వెళ్ళారు. కంటె అక్కడ ఇల్లు బావురుమంటోంది. ఏమూల చూసినా చెత్తా చెదారమే. నౌకర్లు పూర్వకాలపు వాళ్ళు. పరిహాస పాత్రులు. ఈ పరిస్థితులను సూచనామాత్రంగానైనా భర్తకి తెలపటానికి వార్వారా ఇచ్ఛగించలా. లావ్రికీలోనే స్థిరంగా ఉండిపోవాలని ఆమె తలచిఉంటే ఇంటితో మొదలుపెట్టి ఆమె అన్నీ మార్చేసేదే. ఆ నిర్జన ప్రదేశంలో స్థిరంగా ఉండిపోవాలనే ఆలోచనే ఆమె కెన్నడూ కలగలేదు. సత్రంలో రోజులు గడిపినట్లు ఆ ఇంట్లో కాలం గడిపింది. సకల ఇబ్బందులూ భరించింది. మధ్యమధ్య వాటిని పరిహసిస్తూనే ఉంది. మార్ఫా టిమొఫెయెవ్నా, ఫెడ్యాని చూడాలని వచ్చింది. వార్వారాకి మార్ఫా అంటే ఇష్టం ఏర్పడింది.

కాని మార్ఫాకిమాత్రం వార్వారాఅంటే ఇష్టం ఏర్పడలేదు. వార్వారాకి గ్లాఫిరాతోనూ సరిపడలేదు. అల్లుని వ్యవహారాలలో జోక్యంకలిగించుకోవాలని పావెల్ కి కాంక్షకలిగింది. ఈ కోరిక బైటపడకపోయినట్లయితే గ్లాఫిరా గొడవచేసేదికాదు. అంత దగ్గిరబంధువుయొక్క ఎస్టేటును అజమాయిషీ చేయటం జనరల్ చేసిన వాని హోదాకు భంగకరంగాదని పావెల్ అభిప్రాయపడ్డాడు. దగ్గిర బంధువుల ఎస్టేటే గాదు ముక్కూమొహం ఎరగనివారి ఆస్తి అయినాసరే అజామాయిషీ చేయటానికి పావెల్ తయారే. వార్వారా బహునేర్పుతో పాచికవేసింది. తన మనసులోని అభిప్రాయం ఏమాత్రం బయటికిపొక్కనీయలేదు. భర్తతోకలిసి భోగాలనుఅనుభవిస్తూ ఆ గ్రామీణ జీవితంలోని సౌఖ్యాలలో మునిగిపోతున్నట్లూ, ఇతరవిషయాలు పట్టించుకోనట్లూ నటించి క్రమక్రమంగా గ్లాఫిరాకి ఒళ్ళుతెలీనికోపం వచ్చేటట్టుచేసింది. ఒకరోజు ఉదయం గ్లాఫిరా, లావ్రెటస్కీ చదువులగదిలోకి చరచరా వెళ్ళి తాళపుగుత్తె బల్లమీదపారేసి, ఇక ఇంటి వ్యవహారాలుచూట్టం తనవల్ల కాదనీ, ఒక్క నిమిషంకూడా తానాఇంట్లో ఉండలేననీ తెలియజేసింది. ఇలాంటి ఆకస్మిక సంఘటనను ఎదుర్కోటానికి భర్తను వార్వారా తయారు చేసి ఉంచిందేమో, లావ్రెటస్కీ గ్లాఫిరా ఇల్లువిడిచి పోవటానికి వెంటనే సమ్మతించాడు. ఇలాజరుగుతుందని గ్లాఫిరాకలలోనైనాఅనుకోలేదు. "సరే-

మీకందరికీ భారమై పోయావన్నమాట! యిక్కడనించి - నేపుట్టి పెరిగిన యింటినించి నను తరిమేస్తోందెవరో నాకు తెలుసు. ఒక్క మాట మాత్రం జ్ఞాపకం పెట్టుకో, నీకూ యిల్లంటూ లేకుండా పోతుంది. దేశదిమ్మరివై పోతావు. నే చెప్పదలచిందింతే." అంది. ఈ మాటలు అంటుంటే గ్లాఫిరా కళ్ళుబైర్లుకమ్మాయి. అరోజునే ఆమె స్వగ్రామానికి వెళ్ళిపోయింది. వారం రోజుల తర్వాత జనరల్ కోరోబిన్ వచ్చి దొంగవిచారం వెలిబుచ్చి ఎస్టేటు అజమాయిషీ అప్పగించుకున్నాడు.

సెప్టెంబరులో వార్వరాభర్తని తీసుకుని పీటర్స్‌బర్గ్ వెళ్ళింది. రెండు శీతాకాలాలు వారుఅక్కడ కులాసాగాగడిపారు. వేసవికి సారస్కోయేసెలో అనే చోటికి వెళ్ళారు. పీటర్స్‌బర్గ్‌లో వారు తీసుకున్న మేడ అందమైంది. గాలిబాగా వీస్తుంది. మేడంతా రకరకాల సామానుతో సొగసుగా అలంకరించారు. మధ్యతరగతి వారితోటీ, పెద్దపెద్ద ఘరానామనుషులతోటీ లావ్రెటస్కీ దంపతులకు పరిచయంఏర్పడింది. అనేకమందికి ఆతిథ్యం ఇస్తుండేవారు. మంచిమంచి పాటకచేరీలూ, నాట్యప్రదర్శనాలూ తమ ఇంట్లో ఏర్పాటుచేస్తుండేవారు. చిమ్మటపురుగులను అగ్ని ఆకర్షించినట్టు వార్వరా కూడా అతిథులను ఆకర్షించేది. ఈ మాదిరి ఉద్రిక్తజీవితం లావ్రెటస్కీ అభిరుచులకు సరిపడలేదు. వార్వరా భర్తని ప్రభుత్వోద్యోగంలోచేరమని ప్రోత్సహించింది. కాని తండ్రి వాంఛితాలకూ, తన వాంఛితాలకూ విరుద్ధమైన ప్రభుత్వోద్యోగంలో చేరటమంటే అతనికి అసహ్యంవేసింది. లావ్రెటస్కీ వార్వరాకోసం మాత్రమే పీటర్స్‌బర్గ్‌లో ఉంటున్నాడు. ఆ ఉద్రిక్త వాతావరణానికి దూరంగా ఉండాలంటే అభ్యంతర పెట్టేవారెవరూ లేరు. ఆ ఇంటిలో అన్నిసదుపాయాలూగల చదువులగది ఉంది. ఏకాంతంగా ఉంటానికి భార్య అడ్డు పెట్టదు. ఇంకేం, నాటినించీ అంతా సత్యంగా జరిగిపోతోంది. పూర్తిగాని చదువుపూర్తిచేసుకోవాలని సంకల్పించి లావ్రెటస్కీ చదువుప్రారంభించాడు. ఇంగ్లీషు నేర్చుకోటం మొదలుపెట్టాడు వ్రాతబల్లముందు ఎపుడూ వంగిఉండే అతనివిశాలవక్షం, ఏ డిక్షనరీచాటునో సగందాగి ఉండే అతని ఎర్రటిముహం చూట్టానికి చిత్రంగానే ఉండేది. ఉదయంపూట చదువు, మధ్యాహ్నం రాజభోజనం. (వార్వరాకి పాకశాస్త్రంలో మంచి ప్రావీణ్యంఉంది) సాయంకాలం సువాసనలు విరజిమ్ముతూ

కళ్ళుమిరుమిట్లు గొలిపే ఆకర్షణీయ ప్రపంచంలోకి - నవయువతులతో శోభించే ప్రపంచంలోకి అడుగిడేవాడు. ఆ ప్రపంచానికి కేంద్రం అతని హృదయం చూరగొన్న భార్యే. వారికో కొడుకుపుట్టాడు. లావ్రెటస్కీ ఎంతో సంతోషించాడు. కానీ ఆపిల్లవాడు అట్టేకాలం జీవించలా. వసంత ఋతువులో చనిపోయాడు. డాక్టర్ల సలహామీద లావ్రెటస్కీ భార్యను విదేశాలలోని ఆరోగ్యప్రదేశాలకు తీసుకువెళ్ళాడు. కొడుకు పోయాడనే చింత ఆమెలో పోగొట్టాలాయెను. ఉష్ణప్రదేశాలలో అయితే ఆమె ఆరోగ్యం బాగుపడుతుంది. అందుకని వేసవికాలం, ఆకురాలు కాలం వారు జర్మనీ, స్విజర్లండులలో గడిపారు. శీతాకాలంనాటికి పారిస్ చేరుకున్నారు.

పారిస్‌లో వార్వరా గులాబీ పువ్వులా వికసించింది. పీటర్స్‌బర్గ్‌లో సంపాదించినట్టే పారిస్‌లోకూడా ముచ్చట గొల్పే ఇల్లు సంపాదించింది. లావ్రెటస్కీకి జన్మలో ఎన్నడూ ఎరగని దుస్తులు బహూకరించింది. మంచి బానీని, మంచి వంటవాణ్ణి, చురుకైన నౌకర్ని కుదిర్చింది. మంచి సామాన్లు, చక్కని పియానో కొంది. వారంరోజులు అయేసరికి పారిస్‌లో పుట్టిపెరిగిన దానిలా వార్వరా తయారైంది. ఆమెకి చాలామందితో పరిచయంకూడా లభించింది. మొదట్లో రష్యావారుమాత్రమే ఆమె యింటికి వస్తుండేవారు. తర్వాతతర్వాత ఫ్రెంచివారుకూడా రాసాగారు. ఆ ఫ్రెంచివారంతా బ్రహ్మచారులు. చనువుగా మెలిగేవారు, మర్యాదస్తులు. వారిపేర్లు సహితం అతి శ్రావ్యంగా ఉండేవి. తెగ మాట్లాడేవారు. సున్నితంగా వంగి నమస్కరించేవారు. కళ్ళు కుదించేవారు. తళతళలాడే తెల్లటి దంతాలు, గులాబీ రంగు పెదవులు. ఇక వారి మందహాసం, ఎవరు అనుకరించగలరు? ప్రతివాడూ తన స్నేహితులందరినీ తీసుకొచ్చి వార్వరాకి పరిచయం చేసేవాడు. కొద్ది కాలంలోనే వార్వరా పేరు పారిస్‌లో నలుమూలలా మోగిపోయింది.

నేటిలాగా ఆ రోజుల్లో (1836) పత్రికా రచయితలు, విలేకరులు ఇంకా పుట్టచీమల్లాగా మూగేవారుకాదు. అయితేనేం జూల్స్ అనే పత్రికా రచయిత వార్వరా ఇంటికి తరచు వస్తుండేవాడు. అతని మొహం అసహ్యం గొల్పేది. కొంచెం అపఖ్యాతికి పాల్పైనాడుకూడా. అహంకారి. నీచుడు. వార్వరాకి అతనంటే అసహ్యం వేసింది. కాని అతను చాలా పత్రికలకు వ్యాసాలు రాస్తుండేవాడు. ఆ వ్యాసాలలో వార్వరాని గురించి

ఎక్కువగా రాస్తూ, ఆమె సౌందర్యవతి అనీ, దయార్ద్ర హృదయ అనీ, ఫ్రెంచి వనితలలా చమత్కారంగా మాటాడుతుందనీ పొగిడాడు. ఫ్రెంచి వారికి ఇంతకన్నా వేరే పొగడ్తేం కావాలి ? సంగీతంలో ఎంతో ప్రావీణ్యత ఉందనీ, నాట్యం బహు పసందుగా చేస్తుందనీ పత్రికలలో రాశాడు. (వార్వరా నాట్యం చేస్తుంటే ఆమె దుస్తుల అంచులతోపాటు ప్రేక్షకుల హృదయాలుకూడా కదలాడిపోయేవి.) క్లుప్తంగా చెప్పాలంటే ఆమె పేరు దేశదేశాలా వ్యాపింపజేశాడు. ఇదీ సంతోషించదగ్గ విషయమే.

అప్పటికే అభినేత్రి మార్స్ వేషాలు వేయటం మానుకుంది. రాచెలీ యింకా నాటక రంగంమీదికి అడుగు పెట్టలేదు. అయినా వార్వరా తరుచు నాటకాలు చూట్టానికి వెళ్ళేది. ఇటాలియన్ సంగీతం వింటుంటే ఆమె మైమరచిపోయేది. నాటకశాలలో ఆవలిస్తూ కూర్చునేది. అధునాతన శృంగారనాటకం ఒకదానిలో డోర్వాన్ నటిస్తుంటే వార్వరాకి ఆనంద బాష్పాలు వెలువడేవి. అన్నిటికంటె మించి లిస్ జిట్ అనే యువ నటుడు ఆమె కచేరీ గదిలో రెండుసార్లు నాట్యం చేశాడు. అతని నాట్యం నిరాడంబరంగా మాడ ముచ్చటగా అద్భుతంగా ఉంది. ఇలా కులాసాగా శీతాకాలం వెళ్ళిపోయింది. శీతాకాలపు ఆఖరు రోజుల్లో వార్వరాకి దర్బారు ప్రవేశం కూడా లభించింది.

ఇక లావ్రెట్స్కీకి జీవితం భారంగా ఉన్నా విసిగెత్తలేదు. ఆనందమూ కలగలేదు. పత్రికలు చదివేవాడు. సార్బోన్, కాలేజీ డి ఫ్రాన్స కళాశాలల్లో ఉపన్యాసాలకి హాజరయ్యాడు. ఫ్రెంచి శాసనసభా సమావేశాలకి వెళ్లి శ్రద్ధగా చర్చలు విన్నాడు. నీటి వనరులమీద ఒక సుప్రసిద్ధ గ్రంథం అనువదించ నారంభించాడు. "నేను గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోలేను. అంతా సవ్యంగానే జరిగిపోతుంది. వచ్చే శీతాకాలంనాటికి నేను రష్యా వెళ్ళి యేదో ఒక పనికి నడుంకట్టాలి." అనుకున్నాడు. కాని అపనేవిటో అతనికీ విస్పష్టంగా తెలీదు. శీతాకాలంనాటికి రష్యా వెడతాడో లేదో గాని ఈలోపున భార్యతో బాడెన్ బాడెన్ వెళతానికి సన్నాహం చేస్తున్నాడు... ఆకస్మిక సంఘటన ఒకటి అతని కార్యక్రమాన్నంతా తలకిందులు చేసింది.

# ౧౬

ఒకరోజున వార్వరా ఇంట్లోలేని సమయంలో లాగ్రెటస్కీ ఎందుకో ఆమె పడకగదిలోకి వెళ్ళటం తటస్థించింది. జాగ్రతగా మడిచిన కాగితం ఒకటి నేలమీద కనిపించింది. యాదృచ్ఛికంగా ఆ కాగితంతీసాడు. ఫ్రెంచి భాషలో దానిమీదఉత్తరం రాసిఉంది. అనాలోచితంగా చదివాడు.

"ప్రేయసీ! దేవకన్యా! బెట్సీ! (నినుబార్బ్ అనిగానీ వార్వరా అనిగానీ సంబోధించలేక పోతున్నా) వీధిమూలలో నీకోసం నిరీక్షించా, కాని నువురాలేదు. రేపు ఒంటిగంటన్నరకి మనగదికిరా. నీ పెట్టపూరి బొండాం మొగుడు ఆవేళప్పుడు చదువుకుంటూంటాడు. మీ మహాకవి పుష్కిన్* రాసిన ఆపాట, "ముసలిమగడు, చెనటిమగడు" పాడుకుందాం. నీ చిరుపాదాలమీదా, చేతులమీదా వేయిముద్దులు......"

నీ

ఎర్నెస్ "

ఈ ఉత్తరంలోని అంతరార్థం వెంటనే లాగ్రెటస్కీకి అవగాహన కాలేదు. మళ్ళీచదివాడు. తల గిర్రునతిరగసాగింది. హఠాత్తుగా ఒరిగిన ఓడ టాపులాగా అతని కాలికింద భూమి ఊగిపోతున్నట్లనిపించింది. కెవ్వుమని కేకేసి, పెద్ద నిట్టూర్పు విడిచి బావురుమని ఏడ్చేశాడు.

---

*రష్యన్ కవితా పితామహుడు (1799-1837)

లాౖవెటస్కీకి పూర్తిగా మతిపోయింది. అప్పటివరకు భార్యను గుడ్డిగా నమ్మాడు. ఆమె ఇతరులను ప్రేమించి తన్ను మోసగిస్తుందని ఎన్నడూ భావించలేదు. ఈ ఎర్నెస్టు-అతని భార్యా ప్రియుడు - ఇరవై మూడేళ్ళ యువకుడు, అందగాడు. పొగరుబోతు. చప్పిడిముక్కు, సాగసైన మీసాలు, ఆమె పరిచయస్తులలోకల్లా పనికిమాలినవాడు. అరగంట గడిచింది. లాౖవెటస్కీ ఆ కాగితాన్ని నలిపివేస్తూ, నేలకేసి వెర్రిగా చూస్తూ, అలాగే నిల్చుండిపోయాడు. కళ్ళు చీకట్లు కమ్మాయి. ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్లుంది. ఆ చీకట్లో పాలిపోయిన మొహాలు భూతాల్లా అతనికేసి చూస్తున్నట్టనిపించింది. బాధతో అతని హృదయం కుంచుకుపోయింది. అంతులేని మహా అఘాతంలో పడిపోతున్నట్లనిపించింది. వార్వరా షికారు వెళ్లి అప్పుడే తిరిగి వచ్చింది. ఆమె పట్టు దుస్తుల గరగర శబ్దం అతన్ని మైకంనించి మేల్కొల్పింది. లాౖవెటస్కీ ఆ పాదమస్తకం వణికిపోయి ఆగదిలోంచి బయటికి పరుగెత్తాడు. ఆ నిమిషంలో ఆమెని చిత్రవధ చేసో, చితకబాదో, లేకపోతే సామాన్య రైతులా గొంతుపిసికో చంపేయగలడు. అతని వాలకంచూసి వార్వరా ఆశ్చర్యపోయింది. అతన్ని నివ్వారించాలని చూసింది. కాని 'బెట్సీ' అని మాత్రమే మెల్లగా అని లాౖవెటస్కీ ఆ ఇంట్లోనించి చరచరా వెళ్ళిపోయాడు.

లాౖవెటస్కీ ఒకజట్కాలో కూర్చుని ఊరుబయటికి తీసుకువెళ్ళమన్నాడు. ఆ పగలూ ఆ రాత్రీ కాలుగాలిన పిల్లిలా తిరిగాడు. మధ్యమధ్య తరుచు ఆగుతూ నిరాశాభావంతో చేతులు విదిలించుకొని సాగాడు. ఒకొక్క సమయంలో పిచ్చివానిలా ప్రవర్తించాడు. ఒకొక్క సమయంలో జరిగిందంతా అతనికి తమాషా అనిపించింది. సంతోషించాడు. ఉదయన చలివేసింది. పొలిమేరలోని ఒక తుక్కుహోటలుకువెళ్ళి ఓ గది తీసుకుని కిటికీముందు కుర్చీవేసుకు కూర్చున్నాడు. ఆవలింతలు ముంచుకొచ్చాయి. కాళ్ళమీద నిలబడ లేకపోయాడు. శారీరకంగా శక్తి ఉడిగిపోయింది. విచారం కుంగదీసింది. కాని అతనికి ఏమాత్రం బడలిక అనిపించలేదు. అయితేనేం బడలిక అతన్ని తినేస్తోంది. ఏమీ పాలుపోక శూన్యంలోకి దృష్టిసారిస్తూ కూర్చున్నాడు. "ఎన్నడూ చూడని గదిలో ఒంటరిగా కూర్చున్నాడు. అవయవాలన్నీ బిగుసుకుని బండబారిపోయాయి. నోరుచేదుగా ఉంది. హృదయం భారంగా ఉంది" ఇదంతా ఎలా సంఘటించిందో అతనికి అర్థంకాలా. తన

వార్వరా ఆ ఫ్రెంచివాడికి ఎందుకు లొంగిపోయింది? ఇంకొకణ్ణి ప్రేమిస్తూ తనతో యథాప్రకారం ప్రేమతో మనోనిబ్బరంతో విశ్వాసంతో ఎలా మెలగగల్గింది? ఇదేం అతనికి అర్థంకాలా. పెదవులు తడిఆరిపోయాయి.

"నాకేంబోధపడటంలా" అనుకున్నాడు.

"పీటర్స్‌బర్గ్‌లోకూడా యిలాగే......?"

ఈప్రశ్న పూర్తిచేయకుండానే వదిలేసి పైనించి కిందివాకా వణికి పోతూ ఆవలించాడు. మధుర, విషాదస్మృతులు అతన్ని సమంగా బాధింప జొచ్చాయి. కొన్నిరోజులకితం తనూ, ఎర్నెస్టూ కూచుని ఉండగా వార్వరా పియానోమీద "ముసిలిమగడు, చెనటిమగడు" అనే పాటపాడిందనే విషయం లావ్రెటస్కీకి హఠాత్తుగా స్మరణకు వచ్చింది. అప్పటి ఆమెముఖ కవళిక, తళుక్కుమని మెరిసిపోయినకళ్లూ, చెక్కిళ్ళపై వెలసిన రక్తిమా జ్ఞప్తికి వచ్చి దిగ్గునలేచాడు. వాళ్ళదగ్గిరికివెళ్ళి ఇలా అనాలనుకున్నాడు: "నాతోనా యీ సరాగాల్లు! మా ముత్తాత రైతుల్ని యెముకలు విరగ్గొట్టిచంపేవాడు. మాతాతరైతు..." ఇలా అని వాళ్ళిద్దరనీ చంపేద్దామనుకున్నాడు. మళ్ళీ ఇదంతా స్వప్నంలా అతనికి తోచింది. ఊహూఁ – స్వప్నంకాదు, తమాషా అనిపించింది. "వళ్ళు ఒకమాటు విదిలించుకుని నలుమూలలూచూస్తే సరిపోతుంది." అని తలపోసాడు...నలమూలలా చూశాడు. గద్ద దొరికిన జంతువును గోళ్ళతో గుచ్చినట్లు వేదన అతని హృదయ హృదయాంతరాళాలోకి చొచ్చుకుపోతోంది. వీటి అన్నిటికీ మించి కొద్దికాలంలో ఆనితకి సంతానం కలుగబోతోంది...అతని జీవితం ఆసాంతం విషమయమై పోయింది. చివరికి తిరిగీ పారిస్ వెళ్ళాడు. ఒకహోటలులో గదతీసుకుని ఈకిందిజాబూ దాంతో పాటు ఎర్నెస్ట్ రాసినజాబూ వార్వరాకి పంపాడు.

"నాలేఖతో పాటు పంపిన కాగితంముక్క వల్ల నీకు సకలవిషయాలూ బోధపడతాయి. ఎప్పుడూ అతిజాగ్రతగాఉండే నువ్వు ఇంత ముఖ్యమైన కాగితం జారవిడవడం చిత్రంగానేవుంది. (పాపం లావ్రెటస్కీ ఆలోచించి ఆలోచించి ఈ ముక్కలు రాశాడు) ఇక నీముఖం చూడదలుచుకోలేదు. నను కలుసుకోవాలని నువ్వూ పట్టుపట్టవనే తలుస్తాను. సంవత్సరానికి 15 వేల ఫ్రాంకులు నీకు మనోవర్తి యివ్వదలచాను. అంతకంటె నేను ఎక్కువ యిచ్చుకోలేను. నీ చిరునామా గ్రామకచేరీకి పంపు యిక నీయిష్టం

వచ్చినట్టు, నీ యిష్టమొచ్చినచోట నివసించచ్చు. నువు సుఖంగా ఉండాలనే నా కోరిక. జవాబురాయనక్కరలేదు."

జవాబు రాయనక్కర లేదన్నాడేగాని ఊహించరాని ఈఘోరకృత్యంలోని నిజానిజాలు వివరిస్తూ వార్వరా లేఖ రాస్తుందనే లావ్రెటస్కీ ఆశించాడు. లేఖకోసం కొట్టుకుపోయాడు. వార్వరా ఫ్రెంచి భాషలో జవాబు రాసింది. ఈ ఆఖరి దెబ్బతో లావ్రెటస్కీ తల పూర్తిగా తిరిగిపోయింది. అదివరకున్న ఆ కాస్త భ్రమా అంతరించింది. ఏదో యింకా కాస్త భ్రమపెట్టుకున్నందుకు సిగ్గుపడ్డాడుకూడా. ఆ లేఖలో వార్వరా తనను సమర్థించుకోలేదు. ఒకమాటు చూడనిమ్మని మాత్రమే కోరింది. తిరుగులేని నిర్ణయం వెంటనే తీసుకోవద్దని ప్రార్థించింది. ఆ ఉత్తరంమీద అక్కడక్కడా కన్నీటి మరకలున్నా ఆ రాతలో నిర్లక్ష్యం, బెట్టుసరీ ధ్వనించాయి. లావ్రెటస్కీ విషపు నవ్వు నవ్వి అంతా బాగానే ఉందని చెప్పవలసిందిగా ఆ ఉత్తరం తెచ్చినవానితో చెప్పాడు. మూడు రోజులయాక ఇటలీ వెళ్ళాడు. ఇటలీ ఎందుకు వెళ్లాడో అతనికే తెలీదు. మాతృదేశానికి కాకపోయినప్పుడు ఎక్కడికి వెడితేనేం? భార్యకి ఇవ్వదలచిన మనోవర్తి విషయమై ఎస్టేటు మానేజరికి రాశాడు. ఇంతే గాదు. తన మామగారి దగ్గిరనించి వెంటనే రికార్డులన్నీ అప్పగించుకుని 'ఆ దొరగార్ని' లావ్రికీనించి ఉన్నపాళంగా పంపించివేయమని కూడా తెలియజేశాడు. నెత్తిమీద గుడ్డ వేసుకుని వెళ్ళిపోయే మామగారు పడే ఇబ్బందులు, తన హుందాతనానికి దెబ్బతగిలిందని పడే బాధా కావేషంతో మనసులో చిత్రించుకుని సంతృప్తి పడ్డాడు. దీనితోపాటే గ్లాఫిరాని లావ్రికీకి తిరిగిరమ్మనీ, తన బదులుగా వ్యవహరించటానికి అధికార పత్రం ఆమె పేర పంపుతున్నాననీ రాశాడు. గ్లాఫీరా లావ్రికీకి తిరిగి రాకపోవటమేగాక ఆ అధికారం తన కవసరం లేదని పత్రికలలో ప్రకటించింది. ఇటలీలోని ఒక చిన్న పట్టణంలో రహస్య జీవితం గడుపుతూ లావ్రెటస్కీ భార్యా జాడలు తీయాలనుకున్నాడు. అంతకుముందు నిర్ణయించుకున్న ప్రకారం ఆమె బాడెన్-బాడెన్‌కి వెళ్లిందని పత్రికల్లో చదివాడు. జూల్స్ రాతల్లో ఆమె పేరు కనిపించింది. అలవాటు ప్రకారం నిర్లక్ష్య భావంతో జూల్స్ రాసిన ఆ రాతలో సానుభూతి గోచరించింది. అది చదివేసరికి లావ్రెటస్కీకి

నిలువెల్లా అసహ్యం పుట్టింది. తర్వాత కొంత కాలానికి కూతురు పుట్టిందనే సంగతి లావ్రెటస్కీకి తెలిసింది. రెండు నెలల తర్వాత వార్వరా మొదట మూడు నెలల మనోవర్తి తీసుకుందని ఎస్టేటు మానేజరు అతనికి ఉత్తరం రాశాడు. ఆ తర్వాత వార్వరా విషయమై ఒకటికంటె ఒకటి మరీ అధ్వాన్నమైన పుకార్లు బయలుదేరి చివరికి దేశదేశాల పత్రికల్లోకీ ఎక్కాయి. ఇక లాభంలేదు, వార్వరా పూర్తిగా అప్రతిష్ట పాలైపోయింది.

లావ్రెటస్కీ ఆమె జాడ లరయటంలేదు. కాని అతనుకోలుకోటానికి చాలా కాలం పట్టింది. ఒకప్పుడు భార్యకోసం తహతహ లాడిపోయేవాడు. పట్టుదల వదిలి, చివరికి ఆమెను క్షమించటానికైనా సిద్ధ మవుదామనుకున్నాడు. తిరిగి ఆ మృదుమధుర స్వరం వినాలని, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకోవాలనీ కాంక్షించాడు. కాని కాలం దాని దారిన అది గడిచిపోతోంది. కష్ట పరంపరలకు లావ్రెటస్కీ బలయిపోవాలని రాసి పెట్టలేదు. అతని దృఢస్వభావం జయించింది. సవ్యమైన మార్గం గోచరించింది. తలపైపడిన ఆపిడుగుకూడా అకస్మికంగా పడిందని అతనికి అనిపించలా. భార్యని పూర్తిగా అర్థం చేసుకున్నాడు. మన మనసున కెక్కినవారిని దూరంగా ఉన్నపుడే బాగా అర్థంచేసుకోగలం. పూర్వపు పట్టుదల ఇపుడు లేకపోయినా తిరిగి విద్యా వ్యాసంగంలో నిమగ్నంకావచ్చు. కావలసినంత పనిచెయ్యవచ్చు. జీవిత పరీక్షలో, బాల్య శిక్షణలో లావ్రెటస్కీకి నాస్తిక దృక్పథం అలవడటం మంచిదే అయింది. ప్రపంచమంటే ఉదాసీనభావం ఏర్పడింది. నాలుగు సంవత్సరాలు గడిచాయి. స్వదేశానికి తిరిగి వెళ్ళి తనవాళ్ళ మొహం చూడగలననే ధైర్యం అతనికి వచ్చింది. పీటర్స్ బర్గ్‌లో గానీ మాస్కోలో గానీ ఆగకుండా సరాసరి ఓ-పట్టణం వచ్చాడు. ఇదీ లావ్రెటస్కీ పూర్వ జీవితగాథ.

# ౧౮

ఆ మర్నాడు ఉదయం పదిగంటలకి లావ్రెటస్కీ మేరియా డిమిట్రియెవ్నా ఇంటి పోర్చి మెట్లు ఎక్కుతుండగా లీజా ఎదురైంది. హేటు పెట్టుకొని చేతితొడుగులు తొడుక్కుని ఉంది.

"యెక్కడికి వెడుతున్నా?" అని అడిగాడు లావ్రెటస్కీ.

"ప్రార్థనలకి. యివాళ ఆదివారంగదూ -"

"నువు చర్చికి వెడుతూంటావన్నమాట?"

లీజా అతనికేసి ఆశ్చర్యంగా చూసి ఊరుకుంది.

"క్షమించు ఆ...అదికాదు. యింకోగంటలో బయలుదేరి మావూరు వెళ్ళిపోతున్నా. యీ సంగతి నీతో చెబుదామనివచ్చా."

"యిక్కడికి మీ వూరు చాలాదూరమా?"

"యిరవైఅయిదు వెర్స్టులుంటుంది."

సరిగ్గా ఆ సమయానికి లెనోచ్కా అక్కడికి వచ్చింది. కూడా దాసీది ఉంది.

"సరే మమ్మల్ని మరిచేబోకేం" అన్నది లీజా మెట్లుదిగుతూ.

"నన్నూ మర్చేబోవద్దు. మర్చేబోయా. నువెలాగూ చర్చికి వెడుతున్నావుగదా నాబదులుకూడా ప్రార్థనలు చెయ్యి."

లీజా ఆగి అతనికేసి తిరిగింది. ముఖంకేసి సూటిగాచూస్తూ "అలాగే నీ బదులూ ప్రార్థనలు చేస్తా. రా, లెనోచ్కా రా" అంది.

లావ్రెటస్కీ కచేరీగదిలోకి వెళ్ళాడు. అక్కడ మేరియా డిమిట్రియెవ్నా ఒంటరిగా కూర్చునివుంది. ఉడుకులాం వాసనా వనౌషధుల వాసనా కొడుతోంది. తలకాయ నొప్పిగా ఉందనీ రాత్రల్లా నిద్రపట్టలేదనీ మేరియా ఆందోళన వెలిబుచ్చింది. ఆపసోపాలు పడుతూ అతన్ని ఆదరించి క్రమేపీ సంభాషణలోకి దిగింది.

"వాల్డిమిర్ నికొలాయిచ్ అన్నివిధాలా యోగ్యుడు. నీ అభిప్రాయం యేమిటి?"

"యెవరా వాల్డిమిర్ నికొలాయిచ్?"

"యెవరా? పాన్షిన్. నిన్న యిక్కడ నువ్వుచూడలా, అతను. నువ్వంటే అతనికి మంచి అభిప్రాయమే యేర్పడింది. యిదిగో నీ మనసులోనే వుంచుకో. అతనికి లీజా అంటే పర్రిప్రేమ. మంచికుటుంబంలోవాడు. వృద్ధిలోకి రాదగిన వాడు. తెలివిగలవాడు.

భగవంతుడి దయవుండాలిగాని... యిక చెప్పేదేవుంది? నాకు పరమానందం కలుగుతుంది. తల్లిబాధ్యత మరేం సామాన్యమైందా? పిల్లలసౌఖ్యం తలిదండ్రులమీద ఆధారపడివుంటుంది. ఆబాధ్యత తప్పించుకోటానికి వీల్లేనిది. యింతసేపటినించీ ఒక్కదాన్నే కూర్చుని పనంతాచేస్తున్నా. యీ పిల్లల్ని పెంచిందెవరు? చదువుసంధ్యలు చెప్పించిందెవరు? నేను. ఫ్రెంచి పంతులమ్మనికూడా చదువుచెప్పటానికి పెట్టా..."

మేరియా డిమిట్రియెవ్నా తనబాధ్యతలను గురించీ, చిక్కులను గురించీ, పిల్లలమీద తన ప్రేమను గురించీ వర్ణించసాగింది. లావ్రెటస్కీ మాట్లాడకుండా హాటుచేతుల్లో అటూఇటూ తిప్పుతూ ఆమెకేసి తీవ్రంగా చూసేసరికి మేరియా ఉపన్యాసం దంచటం కట్టిబెట్టి "లీజాని చూచావుకదా నీ అభిప్రాయమేమిటి?" అని అడిగింది.

"ఎలిజా మైకొలెవ్నా మహామంచిపిల్ల" అని జవాబిచ్చి లావ్రెటస్కీ వంగి నమస్కరించి ఆమెవద్ద శెలవుతీసుకున్నాడు. మార్ఫాటిమొఫెయెవ్నాని చూట్టానికి తిన్నగా లోపలికి వెళ్ళాడు. మేరియా వెళ్ళి

పోతున్న లావ్రెనెట్స్కీ కేసి అసంతృప్తితో చూసి తనలో అనుకుంది: "పట్టి అడివిమనిషి! అందుకనే వీడిభార్య వీడితో అంటిపెట్టుకుని వుండలేక పోయింది."

మార్ఫా టిమొఫెయెవ్నా తన "స్వంతకుటుంబాన్ని" చుట్టూకూర్చొ బెట్టుకుని తనగదిలో కూర్చుని ఉంది. ఈ కుటుంబంలో అయిదుగురున్నారు. అయిదుగురూ ఆమెకి ఇష్టులే. అందులో ఒకటి చక్కటి జీనువాయిపిట్ట. ఈలవేయటం, దొంగతనంగా నీళ్ళుతాగటం మానివేసిం తర్వాత ఈ పిట్టంటే మార్ఫాకి మంచి ఇష్టంఏర్పడింది. రెండోది రోస్కా అనేకుక్క. ఈకుక్క పట్టి పిరికి జంతువు. మూడోది ఒకపిల్లి. దీనిపేరు మాట్రోస్. దీనికి కోపంజాస్తి. నాలుగోది తొమ్మిదేళ్ళపిల్ల. నల్లటిఛాయ. ఒకచోటా కాలునిలవదు. పెద్ద పెద్దకళ్ళు. చిన్నదైనా సన్ననిముక్కు. పేరు సురోచ్కా. ఇక ఐదవది యాభై అయిదేళ్ళముదుసలి. ఆమెపేరు నాస్టాస్యా కార్పోవ్నా ఒగర్కోవా. నల్లటిదుస్తులమీద బూడిదరంగు జాకెట్టు తొడిగింది. సురోచ్కా అనాథ బాలిక. రోస్కాని చేరదీసినట్టే సురోచ్కానీ మార్ఫా దయతో చేరదీసింది. ఇద్దరూ ఒకరోజున మార్ఫాకి వీధిలోకనిపించారు. ఇద్దరూ ఆకలితో వడిలి పోయున్నారు. వానలో తడిసి ముద్దయిపోయున్నారు. రోస్కావిషయం ఎవరికీ పట్టలేదు. ఇక సురోచ్కాకి మాత్రం ఒకమేనమామ ఉన్నాడు. పట్టి తాగుబోతు. తింటానికి అతనికేలేదు. ఇక సురోచ్కాకేం పెడతాడు? తిండికి బదులు మొట్టికాయలు పెట్టేవాడు. మార్ఫా సురోచ్కాని చేర దీయటం అతనికి పరమానందం కల్గించింది.

మార్ఫా ఒకమాటు ఒకమఠం చూట్టానికి వెళ్ళినపుడు నాస్టాస్యా పరిచయమైంది. తన్మయత్వంలో ప్రార్థనలుచేస్తున్న నాస్టాస్యాని చూసి మెచ్చుకొని పలకరించింది. కాసేపు బాతాఖానీకొట్టినాక టీకి నాస్టాస్యాని ఇంటికి తీసుకుపోయింది. అప్పటినించీ నాస్టాస్యా ఆ ఇల్లువదిలిపెట్టలేదు. నాస్టాస్యా ఎప్పుడూ సంతోషంగా ఉండేది. సాధుశీల, పూర్వసువాసిని. పిల్లలులేరు. మంచిమనిషి. గుండ్రటితల, నెరసినజుట్టు, తెల్లటిచేతులు, కోమల మైన ముఖం. దయ ఉట్టిపడే ముఖాకృతి. నవ్వుపుట్టించే వంకరముక్కు. మార్ఫాఅంటే ఆమెకి మంచి భక్తివిశ్వాసాలుండేవి. అయితేనేం మార్ఫా ఆమె మెత్తని మనసును వేళాకోళానికి గురిచేస్తుండేది. నాస్టాస్యాకి

యువకులంటే సర్దా. అమాయికంగా సరాగమాడినా పడుచుపిల్లలా సిగ్గు పడేది. ఆమెకున్నదంతా 1200 రూబుళ్ళు. తిండిఖర్చంతా మార్ఫాయే భరించేది. ఆమెకి తనతో సమానమైన హోదా ఇచ్చేది. నీచంగా ఆమెని చూట్టం మార్ఫాకి గిట్టేదికాదు.

"ఆ, ఫెద్యా?" అంది అతన్ని చూచీచూడటంతోనే "కిందటి రాత్రి నాకుటుంబాన్ని నువుచూడలా. యిదిగో, అందరం టీకికూర్చున్నాం. యివాళ శెలవుగదూ, అందుకని టీ తాగటం యిది రెండోసారి. అందర్నీ నువుబుజ్జగించచ్చు. సుర్చోక్కామాత్రం నిను ముట్టుకోనియ్యదు. యీ పిల్లి ముట్టుకుంటే బరుకుంది. యివాళ వెళ్ళిపోతున్నావా?"

"ఆ వెళ్ళిపోతున్నా .." అంటూ లావ్రెట్స్కీ చిన్న స్టూలుమీద కూర్చున్నాడు. "మేరియా డిమిట్రియెవ్నాదగ్గర శెలవుపుచ్చుకున్నాను. ఎలిజవెటా మైకెలెవ్నాని చూచా."

"ఎలిజవెటా మైకెలెవ్నా యేమిటోయ్! నీకేంపరాయిదా? లీజా అని పిలువు. జాగ్రత్త అటూఇటూ కదిలావంటే సుర్చోక్కా స్టూలుకాస్తా విరిగి చక్కాబోతుంది."

"చర్చికి వెడుతోంది. లీజాకి యింత దైవభక్తి వుందని నేనెన్నడూ అనుకోలా."

"అవును. లీజాకి దైవభక్తి నీకంటే నాకంటే యెక్కువ."

"నీకు దైవభక్తి లేదాయేం" అంది నాస్టాస్యా అస్పష్టంగా. "యివాళ ఉదయం ప్రార్థనలకి వెళ్ళలేదనుకో. సాయంత్రం వెడతావుగా."

"ఉహుం- వెళ్ళను. నువ్వొక్కదానివే వెళ్ళు. నాకుబద్ధకంగాఉంది. టీ తాగుతూ పొద్దుపుచ్చుతా" అంది మార్ఫా. నాస్టాస్యాని తనతో సమానంగా చూసుకుంటున్నా మాట్లాడేటప్పుడు మార్ఫా 'నువు' అని సంబోధించేది. నాస్టాస్యా కూడా పెస్టోవ్ కుటుంబానికి చెందిందే. ఇవాన్ గ్రోజ్నీ ఆల్బంలో ముగ్గురు పెస్టోవుల చిత్రాలున్నాయి. ఈ విషయం మార్ఫా ఎన్నడూ మరిచేపోలేదు.

"ఒకటి అడగాలనుకున్నా. మేరియా డిమిట్రియెవ్నా నాతో యిపుడే...అతని పేరేమిటి ? — ఆ...పాన్షిన్, అతనెలాంటివాడు?" అని ప్రశ్నించాడు లావ్రెట్స్కీ.

"అరె దేవుడా! ఒక్క నిమిషమైనా దాని నోరు వూరుకోదు గదా! యెప్పుడూ వాగుతూండాల్సిందే" అని గొణుక్కుంది. "యెటువంటి పెళ్ళి కొడుకుని పట్టుకొచ్చిందో నీతో రహస్యంగా చెప్పిందనుకుంటా. ఆ ఒక్క పురోహితుడి కొడుకుతో చెప్పి వూరుకుంటే పోదూ? అందరితోనూ అసోదంతా చెప్పి దుప్పతెంపక పోతే! అమ్మయ్యా! యింతకీ 'అలాలేదూ చూలూలేదు. అప్పుడే టాంటాం వెయ్యటం మొదలెట్టింది".

"అమ్మయ్యా అన్నావెందుకు?"

"యెందుకంటే ఆయనగారు నాకు నచ్చలా...యింతకీ సంతోషించ వలసిందే వుంది?

"నీకు నచ్చలేదన్నమాట!"

"అవును. నచ్చలా. అందర్నీ అతను బుట్టలో వేసుకోగలడా యేం? నాస్టాస్యా కార్పోవ్నా అతన్ని ప్రేమిస్తోంది. యింకేం కావాలి?".

పాపం! నాస్టాస్యా ఆశ్చర్యంతో వణికిపోయి "అదేవిటి మార్ఫా టిమొఫెయెవ్నా! అలా అంటావ్? నీకు పాపభీతి లేదూ?" అంది. ఆమె మొహమూ, మెడా సిగ్గుతో ఎర్రబారిపోయాయి.

"వాడికి - ఆ వెధవకి — ఆడదాని మనసు వశం చేసుకోవటం యెలాగో బాగా తెలుసు. యీవిడికి పొడుం డబ్బీ ఒకటి బహుమతీ చేశాడు. ఫెడ్యా! ఒక పట్టు పొడుం అడిగిచూడు. ఆడబ్బీ యెంత అందంగా వుందో తెలుస్తుంది. గాని మూతమీద గుర్రం యెక్కిన రౌతు బొమ్మ వుంది. నాస్టాస్యా! కప్పిపుచ్చుకోవాలనుకోకు" అంది మార్ఫా. నాస్టాస్యా నిస్పృహతో చేతులు పైకెత్తింది.

"యిక లీజా సంగతేవిటి? ఆమెకి అతను నచ్చాడా?" అని అడిగాడు లావ్రెట్స్కీ.

"ఆ - నచ్చాడనుకుంటా. కాని అపరిచిత హృదయాలున్నాయే, అవి కీకారణ్యాల్లాంటివి. అందులో పడుచుపిల్లవి మరీను. మచ్చుకి సురోచ్కా హృదయమే తీసుకో. ఆ హృదయంలో యేం వుందో తెలుసుకోవాలని యత్నించు. నువు రాగానే సురోచ్కా బయటికి వెళ్ళిపోకుండా దాక్కుం దెందుకో చెప్పు చూదాం?"

సురోచ్కా ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ చంగున బయటికి వెళ్ళిపోయింది. లావ్రెటస్కీ లేచి నుంచుని "అవును. పసిపిల్లల హృదయాలు అంతుతెలీని అగాధాలు" అంటూ శెలవు తీసుకోసాగాడు.

"మళ్ళీ త్వరలోనే దర్శనం యిస్తావుగా?" అంది మార్ఫా.

"ఆఁ—మా వూరు దగ్గిరేగా!"

"అవునవును. నువ్వు వాసిలెవస్కోయెలో వుండి పోదామనుకుంటున్నావు గదూ. లావ్రికీలో వుండాలని లేదుగా. సరే. నీ యిష్టం నాకెందుకు? అక్కడికి వెళ్ళిం తర్వాత మీ అమ్మ సమాధీ, మీ నాయనమ్మ సమాధీ దర్శించుకో. నీకు విదేశాలలో మంచి మంచి భావాలు అలవడ్డట్టున్నాయి. నువ్వు వారిని దర్శించటానికి వచ్చావని ఆ సమాధిలో వాళ్ళు అనుకోగలరేమో యెవరికి తెలుసు? ఫెడ్యా! గ్లాఫిరా ఆత్మశాంతికి కూడా ప్రార్థనలు చేయించు. యిదిగో! యీ రూబిలు తీసుకో. ఊఁ—తీసుకో! ప్రార్థనలు చేయించమంటున్నది నేనుగా. అది బతికుండగా మాకిద్దరికీ పడింది కాదు. అయితేనేం ఆమె ఒకర్లాంటిది కాదు. మంచి తెలివి గలది. చిన్నప్పుడు నిన్ను బాగా పెంచింది. వినుగెత్తుతోందా? సరే - వెళ్ళిరా, నాయనా!" అని మార్ఫా అతన్ని కావలించుకుంది.

"లీజా, పాన్షిన్‌ని యేం పెళ్ళిచేసుకోదులే, బెంగెట్టుకోకు. వాడికంటె మంచిమొగుడే దొరుకుతాడు." అంది మార్ఫా.

"నేనేం బెంగెట్టుకోవటం లేదు." అని జవాబిచ్చి లావ్రెటస్కీ వెళ్ళిపోయాడు.

## ౧౮

నాలుగుగంటల తర్వాత లావ్రెట్స్కీ స్వగ్రామానికి బయలుదేరాడు. అతను ఎక్కిన బగ్గీ పల్లెటూరు రోడ్డువెంట సాగిపోతోంది. పది, పదిహేను రోజుల్నుంచీ వాన కురవలేదు. దూరాన అడవులు తగలబడిపోతున్న వాసన కొడుతోంది. గాలిలో మంచు తెల్లగా తేలియాడుతూ దూరపు అడవులను మసుగుపరుస్తోంది. నీలిఆకాశంలోకి నీడల్లాగా మబ్బులు పాకిపో తున్నాయి. పొడిగాలి వీస్తోంది. ఉష్ణమేమీ తగ్గలేదు. బగ్గీలోని మెత్త మీద తలానించి గుండెలమీద చేతులుముడుచుకొని లావ్రెట్స్కీ చూస్తు న్నాడు. వెనకను పరుగెత్తుకుపోతూ విసనకర్రలా విస్తరించుకుపోతున్నట్టున్న పొలాలను, పొదలను, పరిగెత్తే బగ్గీకేసి మందకొడిగా చూస్తున్న పక్షులను, మొక్కలతో, తుప్పలతో, బూడిదతో నిండిపోయిన భూఖండాలనూ చూస్తూ లావ్రెట్స్కీ ప్రయాణం చేస్తున్నాడు. ఆ నిర్జన మైదానాల నగ్న సౌందర్యం, చెట్లు, చేమలు, నిమ్నోన్నత ప్రదేశాలు, వాగులు, వాటి గట్ల మీది పొదలు, కుగ్రామాలు, సన్నటి రావిచెట్లు, తరచు నరులకంటబడని ఈ రమ్యన్ ప్రకృతిదృశ్యాలను చూస్తుంటే హృదయనాళాలను సైతం గుంజి వేసే మధుర విషాదభావాలు అతన్ని కదలించివేశాయి. మెల్లగాఅతనిభావాలు

రెక్కలు విప్పుకోసాగాయి. బాల్యదశ, తల్లీ జ్ఞాపకం వచ్చాయి. ఆమె చనిపోవటం, చనిపోయేముందు అతనిని ఆమెదగ్గిరకు తీసుకువెళ్ళటం, ఆమె అతని తలను రొమ్ములమీద హత్తుకొని ఏడ్వటం, ఏడ్చి గ్లాఫిరా వైపు చూసి ఏదో అనబోయి మళ్ళీ తమాయించుకోటం అతని స్మృతిపథంలో గోచరించాయి. తండ్రి జ్ఞాపకంవచ్చాడు. ఉత్సాహంతో, ఎడతెగని అసంతృప్తితో కంగుమనే గొంతుతో, ఆ తర్వాత అంధత్వంతో, విచారంతో, మాసినగడ్డంతో తండ్రి రూపం అతని కనులముందు ప్రత్యక్షమైంది. ఒక సంఘటన జ్ఞప్తికి వచ్చింది. ఒకనాడు భోజనసమయంలో ఒకచుక్క సారా ఎక్కువతాగి అతనితండ్రి ఫులుసుబంతిమీద ఒలకబోసుకున్నాడు. హఠాత్తుగా నవ్వి తన ప్రేమవిజయాలను వర్ణిస్తూ గుడ్డికన్ను మిణకరించటం, మొహం ఎర్రబారటం లావ్రెటస్కీకి గుర్తుకువచ్చింది. అంతేకాదు. ఆ సమయంలో వార్వరా జ్ఞాపకంవచ్చి అకస్మాత్తుగా బాధకులోనైనవానిలాగా కన్ను మిణకరించటం కూడా జ్ఞప్తికివచ్చింది. ఆ తర్వాత లావ్రెటస్కీ లీజానిగురించి ఆలోచించసాగాడు.

“యిదిగో! యీ నూత్నవ్యక్తి యిపుడిపుడే జీవితపథంలో అడుగిడుతోంది. అందమైంది. పాపం జీవితం యెలా తయారవుతుందో! ఆకర్షణీయంగా కూడావుంది. తెల్లగావున్నా నవనవలాడే మోహం. గంభీరమైన నొసలు, కళ్ళు. యేకల్మషమూయెరగని అమాయకపుచూపు. మంచిపట్టుదలమనిషి. చక్కటి అవయవసౌష్ఠవం. గాలిలో తేలిపోతున్నట్లుంటుంది నడక. కోమల గాత్రం హఠాత్తుగాఆగి, శ్రద్ధగా విని, చిరునవ్వు నవ్వకుండా ఆలోచనలో పడి, జుట్టువెనక్కు విసురుకోటం నాకెంతో ముచ్చట గొల్పుతుంది. పాన్షిన్ యీమెకు తగినవాడనుకోను. అయితే అతనిలో లోపమేమిటి? మరినా యీ పనికిరానివి? అందరిలాగానే ఆమెజీవితమూ గడిచిపోతుంది. ఓ సమయం తీరింది.” అనుకొని లావ్రెటస్కీ కళ్ళుమూసుకున్నాడు.

కాని నిద్రపట్టలేదు. మత్తుగా ఉంది. పూర్వస్మృతులు పదేపదే అతని హృదయాన్ని వశపర్చుకో సాగాయి. ఎండలోగాని లావ్రెటస్కీ ఆలోచనలు రాబర్టుపీల్*మీదా, ఫ్రెంచిచరిత్రమీదా నిలకడస్తున్నాయి. తానే

* బ్రిటిష్ రాజకీయవేత్త. కొంతకాలంపాటు ప్రధాని. (1788–1850)

జనరల్ అయితే యుద్ధంలో ఎలా విజయాలు చేపట్టేవాడినో అని ఊహించ సాగాడు. ఫిరంగికాల్పుల ధ్వనులు, అపాయసూచక ధ్వనులు అతనికి వినిపించి నట్టయింది... తలకిందికి ఒరిగింది. మెలకువ వచ్చింది... అవే పొలాలు, అవే మైదానదృశ్యాలు. బగ్గీ వెంట పరుగెత్తే బంగారు చెప్పులు ఆకాశమధ్యంలో మెరుస్తున్నాయి. బండివాడి మీసాలు గాలితోపాటు ఎగురుతున్నాయి. "బలేపునరాగమనం!" ఈ భావం అతని కెంతో వచ్చింది. "ఊం — తొందరగా పోనీ" అని లావ్రెట్స్కీ చొక్కా దగ్గరగా లాక్కొని మెత్తమీద ముడుచుకు పడుకున్నాడు. బండీ కుదుపులకు మళ్ళీ లేచి కళ్ళు పూర్తిగా విప్పి చూశాడు. ముందర కొండమీద ఒక చిన్న గ్రామం కనిపించింది. కుడిపక్కన జీర్ణావస్థలో ఉన్న ఒకఇల్లు గోచరించింది. ఆ ఇంటికి తలుపులూ, కిటికీలూ మూసి ఉన్నాయి. ఇంటిముందు వంకరటింకర పోర్చి ఒకటుంది. పోర్చిముందు వెరాండా. వెరాండానిండా సరిగా ఎదగని దురదగొండి మొక్కలు, సిందూర మానుతో కట్టిన పడ్డ కొట్టాం ఉన్నాయి. ఇదే వాసిలెవస్కోయె. బగ్గీ గేటు దగ్గిర ఆగింది. లావ్రెట్స్కీ నౌకరు ఉరక బోతున్నవాడిలా బగ్గీ పెట్టెమీద నిలుచుని 'హేయ్' అని అరిచాడు. ఎక్కడో చాటునించి కీచుమని కుక్క మొరుగు వినిపించింది. ఆ నౌకరు ఉరకబోతున్నట్టు ఇంకో అడుగు ముందుకు వేసి 'హేయ్' అని తిరిగీ అరిచాడు. వినిపించీ వినిపించని ఆ కుక్క మొరుగు తిరిగీ వినిపించింది. ఒక్కక్షణం తర్వాత ఆకాశాన్నుంచి ఊడిపడ్డట్టు ఒకతను వెరాండాలో ప్రత్యక్షమయ్యాడు. తల ముగ్గుబుట్టలా ఉంది. బనీను తొడుక్కున్నాడు. కళ్ళకి చెయ్యి అడ్డంపెట్టుకుని బగ్గీ కేసి తేరిపార జూశాడు. అటూ ఇటూ తొక్కిసలాడి వెళ్ళి గేటుతాళం తీశాడు. దురదగొండిమొక్కల మీదుగా చప్పుడుచేసుకుంటూ బగ్గీ వెరాండాలోకి వెళ్ళి పోర్చిముందు ఆగింది. ఆ నౌకరు గబగబా వెళ్ళి పోర్చిమెట్లకింద పంగలాపుల్ని వంకరటెంకరగా నిల్చున్నాడు. బగ్గీ ముందు తలుపు తెరిచి టోపి తీసేశాడు. యజమాని దిగగానే చేతులు ముద్దాడాడు.

"బాగున్నావా, తాతా! నీపేరు ఆంటన్ అనుకుంటా. యింకా బతికే వున్నావన్నమాట." అన్నాడు లావ్రెట్స్కీ.

ఆ ముసలినౌకరు మాట్లాడకుండావంగి నమస్కరించి ఇంటితాళం చెవులు తేవటానికి వంకరటింకరా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు. బండి

వాడు కదలకుండా నడుంమీద చేతులు ఆనించుకుని మూసిఉన్న తలుపు వంక నోరు తెరుచుకు చూశాడు. లావ్రెట్స్కీతో కూడా వచ్చిన బంట్రోతు కిందికిదూకి బగ్గీ మీద ఒకచేతి నానించి ఆసలానికి అంటుకొని పోయిన వానిలా ఠీవిగా నిల్చున్నాడు. ఆముసలి నౌకరు తాళంచెవులు తెచ్చి పాము లాగా మెలికలు తిరుగుతూ తాళాలు తీశాడు తలుపు తెరిచి పక్కకు తప్పుకుని మళ్ళీ వంగి నమస్కరించాడు.

ఇంటి హాలులోకి ప్రవేశిస్తూ "మళ్ళీ నాయింటికి తిరిగొచ్చానన్న మాట!" అని అనుకున్నాడు లావ్రెట్స్కీ. ఒకటి తర్వాత ఒకటిగా కిటికీ రెక్కలు తీశారు. నిర్మానుష్యమైన ఆగదులలోకి సూర్యకాంతి వచ్చిపడింది.

# ౧౯

లావ్రెట్‌స్కీ ప్రవేశించిన ఆ ఇల్లు గత శతాబ్దంలో దేవదారుతో నిర్మించిన బాపతు. రెండు సంవత్సరాల క్రితం ఆ ఇంట్లోనే గ్లాఫిరా పెట్రోవ్నా చనిపోయింది. ఆ ఇల్లు జీర్ణావస్థలోనున్నట్లు కన్పట్టినా ఎంత సేపన్నా ఇంకా యాభై ఏళ్ళపాటు నిలిచుంటుంది. లావ్రెట్‌స్కీ గదులన్నీ ఒకమాటు చుట్టివచ్చాడు. గ్లాఫిరా చనిపోయినతర్వాత ఆ ఇంటి కిటికీలు తెరవనేలేదు. వాటన్నిటినీ అతనిపుడు తెరిపించాడు. ద్వారబంధపు పైచెక్క కింద కదలకుండా ధూళిగప్పి పడున్న ఈగలికీ దోమలకీ మాత్రం ఈ తెరవటంవల్ల ఇబ్బంది కలిగింది. ఇంట్లో వస్తువులన్నీ ఎలా పెట్టినవి అలానే ఉన్నాయి. ఎవరూ వాటిని ముట్టుకోలేదు. చదువులగదిలో కాథరిన్ ది గ్రేట్ ♦కాలంనాటి పట్టుసోఫాలు అరిగి చిరిగిపడున్నాయి. ఆ గదిలోనే ఆ ఇంటి యజమానురాలు ఎక్కువ మక్కువపడిన పడకకుర్చీ ఉంది. కాకపోతే ఆమె వృద్ధాప్యంలోకూడా ఆ కుర్చీలో వెనక్కి ఆనుకొని ఎరగదు. గోడమీద లావ్రెట్‌స్కీ ముత్తాత ఆంద్రేయ్ లావ్రెట్‌స్కీ చిత్రం వేలాడుతోంది.

♦ రష్యా చక్రవర్తిని (1729–96)

తూపు చెడ్డ నల్లటి అట్టమీద ధుమధుమ లాడుతున్నట్టున్న అతని మొహం కనిపించీ కనిపించకుండా ఉంది. వాలిపోతున్న బండ కనురెప్పలు, కోపపు చూపు, ముడుతలు పడి ఆలోచిస్తున్నట్టున్న నుదురుమీద నిక్కబొడుచుకున్న వెంట్రుకలు ఆ చిత్రంలో రూపితమైనాయి. ఆ పట చట్రం మూల నించి దుమ్ముకొట్టుకున్న పూలదండ ఒకటి వేలాడుతోంది. "గ్లాఫిరా యీ వంశ స్వయంగా గుచ్చారు" అని చెప్పాడు, అంటన్. పూర్వకాలంనాటి చారల పందిరిమంచం ఒకటి ఉంది. వెలిసిపోయిన తలగడదిండ్లు, చినిగిపోయిన దుప్పటి ఆ మంచంమీద పడున్నాయి. మంచం తలవైపున "స్వర్గంలో మేరీకన్య'కు స్వాగతమిస్తున్నట్టు చెక్కబడిన విగ్రహం ఉంది. గ్లాఫిరా చనిపోయేముందు ఈ విగ్రహాన్ని పెదవులకు హత్తుకుని ప్రాణాలు విడిచింది. కిటికీదగ్గర ఒక బల్ల, ఆ బల్లమీద నల్లబడిపోయిన గిల్టు చట్రంలో కళాయి పోయిన అద్దం ఉంది. పడకగదిపక్కన పూజామందిరం. ఆ మందిరంలో ఒకమూల పెద్దవిగ్రహం ఉంది గోడలు వట్టిగా ఉన్నాయి. నేలమీద చినిగిపోయి మైనపు మరకలతో నిండిన కంబళి ఒకటుంది. ఆ కంబళిమీద గ్లాఫిరా మోకరిల్లి ప్రార్థనలు చేసేది. లావ్రెట్స్కీ ఒంట్రోతుతో అంటన్ గుర్రపుశాల తాళాలు, బగ్గీషెడ్డు తాళాలూ తీయడానికి వెళ్లాడు. అంటన్ బదులు ముసలావిడ ఒకతె లావ్రెట్స్కీ ముందు ప్రత్యక్షమైంది. తల ఊరికే వణుకుతోంది. కళ్ళల్లో జీవకళ లేదు. కాకపోతే నోరెత్తకుండా సంవత్సరాల తరబడి సేవకావృత్తిలో ఉండటంవల్ల ఆతురతా, భక్తిపూర్వక పశ్చాత్తాపం ద్యోతకమవుతున్నాయి. ఆమె లావ్రెట్స్కీ చెయ్యి ముద్దుకుని ఆజ్ఞలకోసం నిరీక్షిస్తూ గుమ్మంలో మొదలకుండా నిల్చుంది. లావ్రెట్స్కీ ఎంతకొటుకున్నా ఆమె పేరుగాని చూచిన జాడగాని జ్ఞాపకం రాలేదు. ఆమె పేరు అప్రాక్సియా. నలభైసంవత్సరాలకితం గ్లాఫిరా ఆమెని ఇంట్లో నించి తప్పించి కోళ్ళదొడ్లో ఉంచింది. ఎక్కువగా మాట్లాడేది కాదు. పిచ్చిదానిలా అతనివైపు దీనంగా చూసింది. ఈ వృద్ధదంపతులు కాక ఇంకా ముగ్గురు పిల్లలు అక్కడే ఉన్నారు. ముగ్గురికీ పొనకడుపులే. ముగ్గురూ పొడుగాటి చొక్కాలు తొడిగారు. వీరు అంటన్ మునిమనుములు. వీరుగాక ఆ ఎస్టేటుమీద ఒక చెయ్యిపోయిన రైతు తొకడున్నాడు. అనిటివాడవటంవల్ల అతనికి ఏపని చెప్పేవారు కాదు. గోడపుంజులాగా కురుగుతు మంటూ తిరుగుతూంటాడు. ఏపనీ చేతగాదు. లావ్రెట్స్కీ ఇంటికిరాగానే మొరిగినకుక్క

కూడా ఎందుకూ కొరగానిదే. జాతిగా క్షీణించిపోయింది. గ్లాఫీరా ఆజ్ఞ ప్రకారం బలువాటి ఇనపగొలుసులతో పదేళ్ళపాటు ఆ కుక్కను కట్టేసుంచారు. ఆ గొలుసుభారంతో దానికి నడవటమే కష్టమైపోయింది. ఇల్లంతా ఒకమాటు చూసివచ్చి లావ్రెట్‌స్కీ తోటలోకి వెళ్ళాడు. ఆతోట అతనికి ప్రీతిగొల్పింది. ఆ తోటలో కలుపుమొక్కలు, సీమబెగి, గోరింటపొదలు విపరీతంగా పెరిగాయి. కాని నిమ్మచెట్లనీడ కావలసినంత ఉంది. ఆ నిమ్మచెట్లను దగ్గర దగ్గరిగా నాటారు. బహుశా ఏ వందసంవత్సరాలకిందటో వాటిని కత్తిరించుంటారు. తోటచివర చిన్న కోనేరుంది. నీళ్ళు నిర్మలంగాఉన్నాయి. నీటిమీద రెల్లు వలలా పరుచుకొని ఉంది.

మానవ నివాసస్థాయులు తొందరగానే చెరిగిపోతాయి. గ్లాఫీరా గృహం ఇంకా పాడుపడలేదుగాని ప్రశాంతంగా నిద్రపోతున్నట్టుంది. నిద్రమూక చెయిగలని ప్రతిదీ ఈ ప్రపంచంలో ఇలానే నిద్రిస్తుంది. లావ్రెట్‌స్కీ ఒకమాటు ఊరంతా తిరిగాడు. చెంపలమీద చేతులు పెట్టుకుని స్త్రీలు అతనికేసి వినయంతో చూశారు. పురుషులు దూరాన్నుంచే సలాములు చేశారు. పిల్లలు పరుగెత్తుకుపోయారు. ముభావంగా కుక్కలు మొరిగాయి. అతనికి ఆకలివేసింది. సేవకులు, వంటవాడు సాయంత్రానికి కాని చేరుకోరు. లావ్రిక్కీనించి బళ్ళమీద ఆహారపదార్థాలింకా రాలేదు. ఇక ఆంటన్ ఒక్కడే శరణ్యమయాడు. యజమానికి భోజనపు ఏర్పాట్లుచేయడానికి ఆంటన్ స్వయంగా పూనుకున్నాడు. ఒక కోడిని పట్టుకుచంపి ఈకెలు తీసాడు. అప్రేక్సియా దాన్ని శుభ్రంచేసి వండింది. వంట పూర్తికాగానే ఆంటన్ వడ్డించాడు. చాకూ, ముండ్లగరిట, మెరుగుపోయిన ముక్కాలి ఉప్పుగిన్నె, సన్నటిమూతిగల గాజుసారాబుడ్డి అమర్చాడు. దీర్ఘాలు తీసుకుంటూ వడ్డించటం అయింది, భోజనానికి రమ్మని లావ్రెట్‌స్కీని పిలిచాడు. లావ్రెట్‌స్కీ కూర్చున్న కుర్చీవెనక కుడిపిడికిలికి తువాలు చుట్టుకొని నిలుచున్నాడు. అతనిశరీరం చీకటిమానులా ఉండి గపుఋకంపు కొడుతోంది. లావ్రెట్‌స్కీ పులుసుతాగి కోడినితినబోయాడు. దాని చర్మంమీద పెద్దపెద్ద చెమటకాయలున్నాయి. కాళ్ళమీద ఆమూలనించి ఈమూలకి స్నాయుపుంజం కన్పిస్తున్నాయి. మాంసం పొగచూరువాసన కొట్టింది. భోజనంముగించి లావ్రెట్‌స్కీ కాస్త టీ దొరికితేబాగుండునన్నాడు. "ఓ- యిప్పుడే-తెస్తా" అని అముసిలాడు టీ పట్టుకు చక్కావచ్చాడు. వెతగ్గా వెతగ్గా ఎర్రకాగితం

ముక్కలలో పొట్లంకట్టిన కొన్ని టీ ఆకు దొరికింది. గడ్డకట్టుకు పోయిన పంచదార ముక్కలు దొరికాయి. కెటిల్లో టీ తయారైంది. లావ్రెట్స్కీ పెద్ద కప్పుతో టీ తాగాడు. బాల్యంనించీ అతనికి ఆ కప్పు అక్కడ ఉన్న జ్ఞాపకము. కప్పుపైన చిల్లపేక బొమ్మలున్నాయి. పూర్వం అతిథులకు మాత్రమే దీంతో టీ ఇచ్చేవారు. ఇక ఇప్పుడు లావ్రెట్స్కీ కూడా ఒక అతిథిలాగానే ఆ కప్పుతో టీ తాగాడు. సాయంత్రానికి సేవకులు వచ్చారు. గ్లాఫిరా మంచంమీద పడుకోటానికి లావ్రెట్స్కీకి మనస్కరించలా. భోజనశాలలో పక్క వేయించుకున్నాడు. దీపం ఆర్పివేసిన తర్వాత విషాదభావాలు అలముకోగా చాలా సేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు. చాలాకాలంగా పాడుపడ్డ ఇంట్లో రాత్రి పడుకుంటే అందరికీ కలిగే భావాలే అతనికీ కలిగాయి. నాలుగు వైపులనించి వచ్చి అతన్ని ముంచి వేసిన చీకటికి ఈ కొత్తమనిషి రావటం ఇష్టం లేనట్టనిపించింది. గోడలు సైతం ఉలిక్కిపడ్డట్టున్నాయి. నిట్టూర్పు విడిచి దుప్పటి కప్పుకొని నిద్రపోయాడు. ఇంట్లోవారంతా నిద్రపోయాక అంటన్ లేచి, అప్రెక్సేయాతో ఏవో గుసగుసలాడాడు. మెల్లగా మూల్గి దైవమును ప్రార్థించాడు. దగ్గరిలో మంచి ఎస్టేటు, సుందరభవనాలూ ఉండగా లావ్రెట్స్కీ వాసిలయెవ్స్కోయెలో స్థిరంగా ఉండిపోతాడని వాళ్ళిద్దరూ అనుకోలేదు. వారికి అంటే లావ్రెట్స్కీకి ఏవగింపు పుట్టిందనీ, అక్కడ విషాద స్మృతులు అతన్ని బాధిస్తాయనీ వారికేం తెలుసు? గుసగుసలు పూర్తయాక అంటన్ కర్రముక్క తీసుకుని రాత్రి కాపలా గంట కొట్టాడు. ఆ గంట కొట్టాంకి వేలాడుతూంది. ఎన్నాళ్ళయిందో ఆ గంటను మోగించి! తర్వాత ముగ్గుబుట్టలాంటి తలమీద ఏమీ కప్పుకోకుండానే వరండాలో పడుకుని నిద్రపోయాడు. ఆ నిశీధి సౌమ్యంగా కోమలంగా ఉంది. ఆ ముసలి సుఖంగా నిద్రపోయాడు.

## ౨౦

ఆ మర్నాడు లావ్రెట్స్కీ పెందలకడే లేచాడు. ఎస్టేటు అమీనుతో మాట్లాడి దంపుడుకొట్టు చూసివచ్చాడు. కుక్క మెళ్ళో గొలుసు తీసివేయమన్నాడు. గొలుసు తీసివేస్తుంటే ఆ కుక్క అరిచిందేగాని ఇవతలకి రాలేదు. ఇంటికి తిరిగివచ్చి రోజల్లా మందకొడిగా పడున్నాడు. కదలకుండా మెదలకుండా కిటికీదగ్గిర కూర్చుని చుట్టూ ఉన్న ఆ ప్రశాంతజీవిత ప్రవాహధ్వనులను, జనపద నిశ్చలత్వంలోని అపూర్వధ్వనులను వింటున్నట్టు కనిపించాడు. పరదగొంపిముక్కలనుండి బిగ్గరగా స్వరం ఒకటి వెలువడింది. ఒక దోమ ఆ స్వరం అందుకుంది. ఆ స్వరం సమసిపోయింది. దోమ మాత్రం కూనిరాగం తీస్తూనేఉంది. ఈగల ఎడతెగని రణగొణధ్వని మధ్య లోకప్పమీదవేసి తుమ్మెద తలకొట్టుకున్న శబ్దంవినిపిస్తోంది. బయట వడ్డను స్వరంలో కోడిపుంజుకూసింది. చప్పుడుచేసుకుంటూ బండి ఒకటి పక్కగా వెళ్ళింది. గ్రామంలో ఎక్కడో తలుపు కిర్రుమంది. "యేవంటారు?" అని ఒక స్త్రీ గద్గదికస్వరం వినిపించింది. చేతుల్లో ఆడిస్తూ ఆంటన్ రెండేళ్ళ బాలికని "బలే చిట్టీ ?" అంటున్నాడు. "క్యాసులీసుదురా" అని మళ్ళీ ఆ ఆడగొంతు వినిపించింది. తర్వాత హఠాత్తుగా నిశ్శబ్దం రాజ్యం చేసింది.

ఎక్కడా చప్పుడు అన్నమాట వినిపించటంలేదు. ఆకులు కదలాడటంలేదు. వానకోయిలలు ఒకదానితర్వాత ఒకటి నేలమీద గిర్రున తిరిగాయి. చప్పుడు చెయ్యకుండా అవి అలా తిరగటం విచారం గొలుపుతోంది. "చివరికి యిక్కడ కాలుపెట్టాను" అనుకున్నాడు లావ్రెట్స్కీ. "యిక్కడ జీవితం ప్రశాంతంగా హడావిడిలేకుండా జరిగిపోతుంది." అని తలపోయసాగాడు. "దీని పరిధిలోకి యెవరువచ్చినా దీనికి లొంగిపోవల్సిందే. యిక్కడ బాదరబందీ యేంవుండదు. మనసును యేదీ బాధించదు. నాగలిచాళ్లవెనకగా దున్నేవానికిలాగా కష్టపడేవానికి యిక్కడ అంతా సవ్యంగా జరిగిపోతుంది. ఈ ఏకాంత నిశ్శబ్దతలో ఎంత శక్తి ఎంత బలం దాగివుంది ? కిటికీ కింద దట్టమైన పచ్చికలోనించి బర్డాక్ మొక్కలు పొడుచుకొస్తున్నాయి. లోవెజ్ మొక్కలు కొమ్మలువేసాయి. ఇంకా పైన పొదరింటిమీద తీగలు అల్లుకొంటున్నాయి. దూరాన పంటకొచ్చిన మెట్టపొలాలు ధగధగలాడుతున్నాయి. ఓటు కంకె వేసింది. ప్రతి ఆకూ, ప్రతి గడ్డిపోచా పెరిగిపోతున్నాయి. "నా జీవితంలోని ఉత్తమకాలమంతా స్త్రీని ప్రేమించటంతోనే గడచిపోయింది." అని అనుకోసాగాడు లావ్రెట్స్కీ "యీ ఒంటరి జీవితపు విసుగుదల నా కనులు విప్పుగాక ! నాకు చిత్తశాంతి కల్గించి నా కర్తవ్య నిర్వహణకు సంసిద్ధుణ్ణి చేస్తుందిగాక !" అనుకున్నాడు. మళ్ళీ ఆ నిశ్శబ్దతను ఏ ఆశాలేకుండా వినసాగాడు. కాని మళ్ళీ ఏదో జరుగుతుందనే ఆశ అతన్ని పీడిస్తోంది. నలుదిక్కులనించి నిశ్శబ్దత అతన్ని కమ్మివేసింది. నిర్మల నీల ఆకాశంలో సూర్యుడు మెల్లగా సాగిపోతున్నాడు. మబ్బులు మందమందగా విహరిస్తున్నాయి. ఎక్కడికి పోతున్నాయో ఎందుకు పోతున్నాయో వాటికి తెలుసుకాబోలు ! ఇతర ప్రదేశాలలో జీవితం ఆందోళనయుతంగా వుంది. తొందరతొందరగా పరుగిడుతోంది. మార్గంలో ఘర్షణపడుతోంది. ఇక్కడో బురదనేలపై నీరులా నిశ్శబ్దంగా జీవితం సాగిపోతోంది. బాగా సాయంకాలంపడేదాకా లావ్రెట్స్కీ కంటికి కనుపించకుండా జారిపోతున్న ఈ జీవితంగురించి ఆలోచనలు తెంచుకోలేకపోయాడు. వసంతకాల ప్రారంభంలో మంచులా గడిచిపోయిన రోజుల చింత అతని హృదయంలో కరిగిపోయింది. ఇంకో విచిత్రమేమంటే ఎన్నడూ లేనంత బలీయంగా, తీవ్రంగా దేశభక్తి అతని హృదయంలో అధివసించింది.

## ౨౧

లావ్రెట్‌స్కీ రెండువారాలలో గ్లాఫిరా ఇంటిని అంతా సర్ది పెరాబా, తోటా శుభ్రపరిపించాడు. లావ్రికీనించి సామాను దిగింది. సారా, పుస్తకాలు, పత్రికలు పట్నంనించి వచ్చాయి. కొత్తగుర్రాలను కొనుక్కొచ్చాడు. క్లుప్తంగా చెప్పాలంటే లావ్రెట్‌స్కీ తనకు కావలసినవన్నీ అమర్చుకుని అక్కడ స్థిరపడిపోయాడు. అక్కడ అతను గడుపుతున్నది భూస్వామి జీవితమో తాపసి జీవితమో ఎవరూ చెప్పలేరు. ఎట్టి మార్పులూ లేకుండా రోజులకి రోజులు గడిచిపోతున్నాయి. కాని అతనికి విసుగ్గా లేదు. ఎవర్నీ కలుసుకుని మాట్లాడేవాడు కాదు. ఎస్టేటు వ్యవహారాలలో అతిశ్రద్ధ తీసుకోసాగాడు. గుర్రంమీద ఆ చుట్టుపక్కలంతా పరిశీలించి వచ్చాడు. చదువు ప్రారంభించాడుగాని ఎక్కువగా సాగలేదు. చదువుకోటంలో కంటె ముసలి ఆంటన్ చెప్పే గాథలు వినటంలో అతనికి ఎక్కువ ఆసక్తి కలిగింది. సాధారణంగా లావ్రెట్‌స్కీ పైపు, కప్పు టీ ముందు పెట్టుకుని కిటికీదగ్గర కూర్చునేవాడు. ఆంటన్ చేతులు వెనక్కి కట్టుకుని ద్వారందగ్గర నిలబడి పూర్వకాల విశేషాలను కథలుగా వర్ణించేవాడు. ఆరోజుల్లో సీటు ధాన్యం, కాయధాన్యం చిల్లరగాగాక బస్తాల కొలతను అమ్మేవారట! బస్తా

ఖరీదు యిందుమూలాను కోపెక్‌లకంటె హెచ్చు ఉండేదికాదట ! పట్టణానికి సమీపాన దండకారణ్యాలు, మైదానాలు నలుదిక్కులా వ్యాపించి ఉండేవట. "మరి యిప్పుడు?" అని యెనభై ఏళ్ళను పైబడ్డ ఆ ముసలి గొణుగుతూ "అడవులు కొట్టేసినారు. ఒంటిగా వెళ్ళటానికైనా జాగాలేదు" అన్నాడు. ఆంటన్ అతని యజమానురాలు గ్లాఫీరా పెట్రోవ్నాని గురించికూడా అనేక గాథలు చెప్పాడు. ఆవిడ ఎంత తెలివైందో, ఎంత పొదుపరో తెలియజేశాడు. "మాస్కో యువకుడొకడు ఆమె దయ సంపాదిద్దామని తరుచు అక్కడికి వచ్చేవాడు. అతను వస్తాడని ఆమె ఎర్రరిబ్బన్ల టోపీ పెట్టుకుని పసుపుపచ్చ గౌను ధరించేది. ఆవిడకి ఆస్తి యెంతవుందని ఆ యువకుడు తెలివితక్కువగా వాళ్ళనీ వీళ్ళని విచారించటం మొదలెట్టేసరికి ఆమె అంతా తెలిసి మండిపోయి ఆగ్రహించి అతన్ని యింటికి రానిచ్చిందికాదు. కాగితం ముక్క దగ్గరనించీ ఆస్తి అంతా తాను చనిపోయిన తర్వాత లావ్రెటస్కీకి ముట్టాలని నిర్ణయించింది." ఈ విషయాలన్నీ ఆంటన్ తెలియ జేశాడు. ఆ ఇంట్లో వస్తువులన్నీ ఎక్కడివక్కడ అలాగే ఉన్నాయి. గ్లాఫీరా ధరించే టోపీ, పసుపుపచ్చ గౌను లావ్రెటస్కీకి కనిపించాయి. పాతకాగితాలు, పత్రాలు దొరుకుతాయేమోనని లావ్రెటస్కీ ఇల్లంతా వెదికాడు. ఒక పాతపుస్తకం మాత్రం దొరికింది. ఇంకేం దొరకలా. ఆ పుస్తకంలో లావ్రెటస్కీ తాత పియోటర్ ఆండ్రీచ్ ఒకచోట "టర్కీ సామ్రాజ్యంతో హిజ్ ఎక్సలెన్సీ ప్రిన్స్ అలెగ్జాండర్ అలెగ్జాండ్రోవిచ్ ప్రొజొరొవస్కీ సంధిచేసుకున్నందుకుగాను పీటర్స్‌బర్గ్‌లో ఉత్సవాలు" అని రాసిపెట్టాడు. ఇంకోచోట గుండెజబ్బుకు మందు రాస్తూ దానికింద యిలా రాశాడు. "ఈ చికిత్సావిధానం జనరల్ భార్య ప్రాస్కోవ్యా ఫ్యోడోరోవ్నా సాల్టికోవాకు త్రిమూర్తుల చర్చి ప్రధాన పురోహితుడు ఫియోడోర్ అవక్సెంటియెవిచ్ తెలియజేశాడు." ఇంకోచోట రాజకీయవార్త "ఫ్రెంచి 'పులుల' గురించి యింకే గొడవా పడనక్కరలా" అనిఉంది. దీని ప్రక్కన "మెస్కోవస్కియె వెదొమోస్తి అనే పత్రిక సీనియర్ మేజర్ మైకేల్ పెట్రోవిచ్ కొలిచెవ్ మరణవార్త ప్రకటించింది. యితను పియోటర్ వాసిలెవిచ్ కొలిచెవ్ కొడుకా ?" అని రాసిఉంది. లావ్రెటస్కీకి పాతకాలెండర్లు, స్వప్నఫలితాలనుగూర్చిన గ్రంథాలు, అంబోడిక్ రచించిన ఆ నిగూఢగ్రంథం దొరికాయి. "సాంకేతికాలు, చిహ్నాలు" అనే పుస్తకం మరిచేపోయిన అనేక విషయాలను

తిరిగి లావ్రెట్స్కీకి జ్ఞప్తికి తెచ్చింది. గ్లాఫిగా సింగారపుబల్ల సొరుగులో
బొగ్గాలోపల నల్లరిబ్బనుతో కట్టి నల్లమైనంతో సీలువేసిన ఒక పాకెట్టు
దొరికింది. యవ్వనంలోవున్న అతనితండ్రి చిత్రం ఆపాకెట్టులో వుంది. నుదురు
మీద ఉంగ్రాలుతిరిగిన ముంగురులు, బాదంకాయల్లాంటి కళ్ళు, తెరచుకున్న
నోరు. ఇదీ ఆ చిత్రంలోని అతని తండ్రిరూపవైఖరి. తెల్లటిదుస్తులుధరించి
తెల్లగులాబీపువ్వు చేతబట్టుకొని ఉన్నట్టున్న స్త్రీ బొమ్మకూడా ఒకటుంది.
అది అతని తల్లిచిత్రం. గ్లాఫిరా తనచిత్రం గీయించుకోటానికి ఎన్నడూ సమ్మ
తించలేదు. "దొరా, ఆరోజుల్లో నేనీయింట్లో నివసించక పోయినా
మీ ముత్తాత ఆంద్రీ ఆఫనసియిచ్‌ని చూచినజ్ఞాపకం. ఆయన చనిపోయే
టప్పటికి నాకు పద్ధెనిమిదేళ్ళు. ఒకమాటు తోటలో ఆయనకి నేను ఎదురు
పడ్డాను. నాఒళ్ళంతా వణికిపోయింది. ఆయననన్నేంచెయ్యలా. 'నీపేరేవిటి?'
అని అడిగ ఆయనగదిలోకి వెళ్ళి జేబురుమాలు తెమ్మన్నారు. ఆయన మహా
గొప్పవాడు. ఆయన్ని పోలిన వారెవరూలేరు. దీనికంతకు కారణం ఆయన
దగ్గిర ఒకతాయెత్తు వుండటమే. ఈ తాయెత్తుని ఆథోస్ కొండమీది ఒకసన్యాసి
యిచ్చాడు. 'నాకెంతో ఆదరంతో ఆతిథ్యమిచ్చినందుకిదె నీకు బహూక
రిస్తున్నాను. దీన్నిధరించావంటే నీకు నరకభయం వుండదు' అని ఆ సన్యాసి
చెప్పాడు దొరా! ఆరోజులు అలాంటివి. యజమాని యేంచేసినా సాగి
పోయేది. మీ ముత్తాతకి యెవరన్నా యెదురుచెబితే వాళ్ళకేసి అట్టేచూసి
'పోతాపక్షీ' అనేవాడు. యీమాట ఆయనకి మహాయిష్టం. ఆయన, మీ
ముత్తాత ఒక కొయ్యయింట్లో వుండేవాడు. ఆయన సంపాదించి పెట్టినవి
వెండికంచాలేమిటి అవేమిటి ఇవేమిటి ఆగదినిండావున్నాయి. ఆయన మహా
పొదుపరి. ఆసొఫాసీసాకూడాఆయనదే. దాంతో వోడ్కాతాగుతుండేవాడు.
యికమీతాత పియోటర్ ఆంద్రీచ్ రాతియిల్లు కట్టించాడు. యేంప్రయోజనం?
వ్యవహారమంతా తలక్రిందులైంది తండ్రినాటికంటె పరిస్థితి అధ్వాన్నమయింది.
జీవితంలో యెన్నడూ సుఖపడియెరుగడు. డబ్బంతా తగలేశాడు. అతనిపేరు
మీదుగా ఒక్కటే మిగల్చలా. చివరికి వెండిచమ్చా అన్నా ఆయనజ్ఞాపకార్థం
లేదు. యిప్పుడువున్నదంతా గ్లాఫిగాదొరసాని పొదుపరితనం జాగ్రత్తవల్ల
మిగిలిందే".

"అతణ్ణి లోభిముండ అనేవారట నిజమేనా?" అని ప్రశ్నించాడు.
లావ్రెట్స్కీ.

"యెవరనేవారం?" అన్నాడు ఆంటన్ అసంతృప్తి సూచించే స్వరంతో.

ఒకమాటు ముసలి ఎలాగో ధైర్యంచేసి "దొరా! అమ్మగా రెలా వుంది. యెక్కడుంది?" అని అన్నాడు.

"నా భార్యకి విడాకు లిచ్చేశాను. యిక దాన్నిగురించి నన్నేం అడగద్దు" అన్నాడు లావ్రెట్స్కీ అతికష్టంమీద "సరే దొరా!" అని జవాబిచ్చాడు, ఆంటన్ విచారంతో.

మూడువారాలు గడచిపోయింతర్వాత కాలిటిన్‌లను చూట్టానికి ఒక రోజున లావ్రెట్స్కీ గుర్రంమీద ఓ——పట్టణానికి బయలుదేరాడు. ఆ సాయంత్రమంతా వా రింట్లోనే గడిపాడు. లెమ్‌కూడా అక్కడే వున్నాడు. లావ్రెట్స్కీకి అతనంటే ఎంతో అభిమానం ఏర్పడింది. తండ్రి చలవళ్ల ఏదీ వాయించటం చేతకాకపోయినా లావ్రెట్స్కీకి సంగీతమంటే, అందులోనూ శాస్త్రీయసంగీతమంటే మహా ఇష్టం. ఆ సాయంత్రం పాన్షిన్ అక్కడికి రాలా. గవర్నరు జనరల్ ఏదో పనిమీద అతన్ని పొరుగూరు పంపించాడు. లీజా పియానో చక్కగా వాయించింది. లెమ్‌లో ఉత్సాహం పొంగి పొరలింది. మహా హుషారుగా కాగితం ఒకటి తీసుకుని దాన్ని గొట్టం లాగా చేసి, అటూ యిటూ లయకు అనుగుణ్యంగా ఊపుతూ తిప్పసాగాడు. ఈ దృశ్యం చూసి మేరియాడిమిత్రియెవ్నా కాసేపు నవ్వి వెళ్ళి పడుకుంది. బీథోవెన్ పాటలంటే అమోఘసహ్యం. ఆపాటలు వింటుంటే ఉద్రేకం భరించ లేకపోయేది. అర్ధరాత్రి అవగానే లావ్రెట్స్కీ లెమ్‌ని దిగబెట్టటానికి ఆయన యింటిదాకా వెళ్ళి తెల్లవారుగట్ల మూడు గంటలదాకా అక్కడే ఉండి పోయాడు. లెమ్ ఎన్నెన్నో చాలా విషయాలు మాట్లాడాడు. వంగివడిచేవాడల్లా నిటారుగ నిల్చోటం మొదలెట్టాడు. కళ్ళు చారెడంతై వెలిగిపోయాయి. నుదిటిమీద ముంగురులు నిల్చున్నాయి కూడా. లెమ్ విషయంలో ఈ మధ్య ఆసక్తి తీసుకున్నవా రెవరూ లేరు. లావ్రెట్స్కీకి అతనంటే ఆసక్తి కల్గింది. ఎంతో ఆప్యాయంతో సానుభూతితో అనేకప్రశ్నలు లెమ్‌ని అడిగాడు. ఈ ఆదరణ అతని మనసును కదిలించింది. తన స్వీయకల్పనలు చూపించాడు. తన స్వంతరచనలు కొన్ని, షిల్లర్ * వ్రాసిన ఫ్రిడోలిన్ అనే బుర్రకథ

* విశ్వవిఖ్యాతిగాంచిన జర్మన్ నాటక రచయిత. విమర్శకుడూ (1750-1805)

వినిపించాడు. ఆ గ్రంథాన్ని లెమ్ స్వయంగా సంగీతం కూర్చాడు. లావ్రెట్స్కీ లెమ్‌ని ఎంతగానో పొగడి కొన్ని పాటలు మళ్ళీ పాడించి విన్నాడు. వెళ్ళిపోయేముందు తన ఇంటికి వచ్చి కొన్ని రోజులు ఉండమని ఆహ్వానించాడు. లావ్రెట్స్కీని పంపిస్తూ లెమ్ అందుకు అంగీకరించి గేటు దాకా వచ్చి కరచాలనం చేశాడు. కాని లావ్రెట్స్కీ వెళ్ళిపోయి, ఒక్కడే మిగిలిన తర్వాత ఆ చల్లగాలిలో ఉషఃకాంతులలో చుట్టూ చూసి కస్సి విడిచి వణికి పోయాడు. ఏదో నేరం చేసినవాడిలాగా గదిలోకి వెళ్ళి పక్కమీదికి వాలుతూ “నాకు మతిపోయినట్టుంది” అని గొణుక్కున్నాడు. రెండు రోజులు పోయిన తర్వాత తీసుకువెళ్ళడానికి బగ్గీతో లావ్రెట్స్కీ రాగా లెమ్ జబ్బుగా ఉన్నట్లు నటించాడు. కాని లావ్రెట్స్కీ లెమ్ గదిలోకి వెళ్ళి రావలసిందని బలవంతపెట్టాడు. తన కోసం లావ్రెట్స్కీ పియానో తెప్పించాడనే సంగతి వినేసరికి లెమ్‌కు ఉత్సాహం వచ్చింది. ఇద్దరూ కాలిటిన్‌ల ఇంటికి వెళ్ళి సాయంత్రమంతా అక్కడే గడిపారు. కాని కిందటి సాయంత్రమంత హుషారుగా లేదు. అక్కడ పాన్షిన్ ఉన్నాడు. లెమ్ తన ప్రయాణాన్ని గురించి వారికి చెప్పాడు. దారిలో కలుసుకున్న పెద్దమనుషులను అనుకరించి చూపాడు. లావ్రెట్స్కీకి నవ్వు వచ్చింది. లెమ్ ఒకమూల మాట్లాడకుండా ఘుమఘుమలాడుతూ మూటలాగ ముడుచుకొని కూర్చొని సాలెపురుగులాగా కదలాడటం మొదలెట్టాడు. లావ్రెట్స్కీ శెలవు తీసుకుంటుంటే లెమ్‌కి ప్రాణం లేచివచ్చింది. బగ్గీలో కూడా లెమ్ మాట్లాడకుండా ముడుచుకు కూర్చున్నాడు. కాని చల్లటిగాలి, నీడలు, పచ్చిగడ్డి వాసనా, రావిపూల వాసనా, నక్షత్రకాంతీ, గుర్రాల డెక్కల చప్పుడూ, సన్నాయి కిస్సుబుస్సులు, ఆ గోడ్డు ప్రాంతపు ఆకర్షణ, ఆ వసంతరాత్రి ఆకర్షణ లెమ్ హృదయంలో ప్రవేశించాయి. మొదటగా అతనే మాట్లాడటం మొదలుపెట్టాడు.

# ౨౨

అతను సంగీతంగురించీ, లీజాని గురించీ, తిరిగీ సంగీతంగురించీ మాట్లాడసాగాడు. లీజాని గురించి మాట్లాడేటప్పుడు చాలా నెమ్మదిగా మాట్లాడాడు. లావ్రెటస్కీ లెమ్ రచించిన కృతులమీదకి సంభాషణ మళ్ళించి. పరిహాసకంగా సంగీతనాటకం రాసిస్తానన్నాడు.

"ఊఁ సంగీతనాటకమా? దానికి సంగీతం కూర్చటం నా తలకు మించినపని. సంగీతనాటకానికి కావలసిన భావనాశక్తీ, రసోద్దీపనశక్తీ నాకిప్పుడులేవు. నా శక్తి ఉడిగిపోతోంది...ఏమైనా సాధించగలిగితే-పదం ఒకటి చెప్పగలిగితే నాకు సంతృప్తికలుగుతుంది. సంగీతానికి తగిన సాహిత్యం కావాలి."

ఇలా చెప్పి లెమ్ మౌనం వహించాడు. ఆకాశంవైపు చూస్తూ చాలాసేపు కదలకుండా కూర్చున్నాడు.

"ఉదాహరణకు 'తారలారా! ఓ విశుద్ధ తారలారా!' యిలాంటిదైతే."

లావ్రెటస్కీ అతనికేసి తిరిగి చూచాడు.

"తారలారా! విశుద్ధతారలారా!" అని తిరిగి మొదలుపెట్టాడు లెమ్. ధర్మపరులను, అధర్మపరులను సమదృష్టితో చూస్తారుమీరు. కాని అమాయకహృదయం మిమ్ము అర్థంచేసుకోగలదు. "ఊహుం-కాదు. అమాయక హృదయం మిమ్ము ప్రేమించగలదు. -నేను కవినిగాను, కాలేను. అలాంటి ఉదాత్తమైంది......"

లెమ్ హాటువెనక్కి తోసుకున్నాడు. ఆ మసకమసక సంధ్యాకాంతిలో అతనిముఖం తెల్లబోయియున్నట్లు, యువకునిముఖంలాగా. కనిపించింది.

"ఇకమీరో!" స్వరంక్రమంగా తగ్గిపోయింది. 'యెవరు ప్రేమిస్తున్నారో, యెవరు ప్రేమించగలరో మీకు తెలుసు. మీరొక్కరే దుఃఖోపశమనం చేయగలరు.' హుం-యిలా కాదు, నేను కవినిగాను. సరే. యేదైనా యీమాదిరిగా వుంటే......"

"నేనూ కవినిగాను. క్షమించండి." అన్నాడు లావ్రెటస్కీ.

"వ్యర్థస్వప్నాలు" అని లెమ్ బగ్గీలో ఒకమూల పొతుకపోయి కళ్లు మూసుకున్నాడు. నిద్రపోవాలని యత్నిస్తున్నాడు......కొన్నిక్షణాలు గడిచాయి......"తారలు! విశుద్ధతారలు! ప్రేమ" అని లెమ్ అనడం లావ్రెటస్కీ చెవినిపడ్డది. "ప్రేమ" అని తనలో అనుకుని లావ్రెటస్కీ ఆలోచనలో మునిగిపోయాడు. అతనిహృదయం బరువెక్కింది.

"క్రిస్టొఫర్ ఫియొడోరిచ్! మీరు ఫ్రిడోలిన్‌కి కూర్చిన సంగీతం బహు రమణీయంగావుంది. మీ రేమనుకుంటున్నారు? ఫ్రిడోలిన్‌ని ఆ జమీందారు తన భార్యకి పరిచయంచేసింతర్వాత అంటే అతను ఆమెకి ప్రియుడిగా తయారైంతర్వాత..."

"అది నువ్వే వూహించుకోవాలి. అటువంటి అనుభవం నీకయిందిగా" హఠాత్తుగా ఆగి, కంగారుపడి లెమ్ మొహం తిప్పేసుకున్నాడు. లావ్రెటస్కీ బలవంతాన చిరునవ్వు తెచ్చిపెట్టుకుని, తనూ మొహంతిప్పేసుకుని రోడ్డుకేసి చూడసాగాడు.

నక్షత్రాలకాంతి క్రమక్రమంగా తగ్గిపోతోంది. బగ్గీ వాసిలెవస్కోయెలో పోర్చిముందు ఆగేసరికి ఆకాశం తెల్లబారింది. లావ్రెటస్కీ, లెమ్‌కి ఒక గదిచూపించి తన చదువులగదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. బయట తోటలో ఉషఃకాంతులు ప్రసరిస్తున్నాయి. కోకిల ఆఖరుసారి గాన చాలా

పించింది. కాలిటిన్లతోటలో కోకిల కూయడం లావ్రెట్స్కీకి జ్ఞాపకం వచ్చింది. కోకిల గానం ప్రారంభించగానే కిటికీకేసి చూచే లీజానేత్రాల కదలికకూడా అతనికి జ్ఞాపకంవచ్చింది. ఆమెనుగురించి ఆలోచించసాగాడు. "కన్య" అని కొంచెం వినిపించేటట్టు గొణిగాడు. "విశుద్ధతారలు" అనుకుని, మందహాసంచేస్తూ పక్కమీదవాలాడు.

కాని లెమ్ చాలాసేపు పక్కమీదే కూర్చున్నాడు. మోకాళ్ళమీద ఒక సంగీతగ్రంథం ఉంది. మధురరాగవ్యంజనం ఒకటిఅతన్ని వెంటాడుతోంది. హృదయం కదిలింది. భావం రేకెత్తింది. ఆ రాగమధురిమ తన చుట్టూ తిరుగుతోందని అతనికి తెలుసు. కాని దానిని పట్టలేకపోయాడు. "నేను కవినీగాను, పాటకణ్ణిగాను" అని గొణుక్కున్నాడు. అలసిపోయిన అతని శిరసు భారంగా తలగడామీద వాలింది.

# 23

ఆ మర్నాడు గృహమేధీ, అతిథీ, తోటలోని ఒక నిమ్మచెట్టుకింద కూర్చుని టీ తాగారు.

"మాస్టారూ! తొందర్లోనే మీరు కృతి ఒకటి రాయాలి."

"యే సందర్భంలో?"

"పాన్షిన్ లీజాల వివాహసందర్భంలో. నిన్న అతను చూపిన శ్రద్ధ సక్తులు మీరు గమనించలా? కొంచెమించుమించు వివాహం నిశ్చయమైపోయినట్టే వుందే!"

"ఉహూం-యెన్నటికీ అలా జరగదు."

"యెందుకనేం?"

"సాధ్యంకాదు కనుక. అయితే-" ఒక నిమిషంఆగి లెమ్ అన్నాడు: "ఈ ప్రపంచంలో ముఖ్యంగా మీ రష్యాలో యేదైనా సాధ్యమే."

"ప్రస్తుతానికి రష్యాగొడవ వదిలేసి చెప్పండి-యీ పెళ్ళికేం?"

"ఉహుం—యీ పెళ్ళి సవ్యమైందికాదు. ఎలిజివెటా మైకెలొవ్నా నిష్కపటి, గంభీరమైంది. ఆమె భావాలు చాలా ఉదాత్తమైనవి...ఇక పాన్షిన్ పట్టి సర్దాపురుషుడు"

"అయితేనేం, లీజా అతన్ని ప్రేమిస్తోందికదూ?"

లెమ్ లేచి, "ఊహుం—అతన్నేం ప్రేమించడంలా. వట్టి అమాయకురాలు. ప్రేమంటే యేమిటో ఆమెకి తెలీదు. మాడంవాన్ కాలిటినా అతను చక్కనివాడని చెబితే లీజా తలూపుతుంది. లీజాకి పందొమ్మిదేళ్ళు వచ్చినా యింకా చిన్నపిల్లే. ఉదయం, సాయంత్రం ప్రార్థనచేస్తుంది. సరే బాగానేవుందిగాని అతన్ని ప్రేమించడంలా. ఆమె సౌందర్యాన్ని మాత్రమే ప్రేమించగలదు. అతను సుందరపురుషుడుకాడు. అంటే అతని ఆత్మ సౌందర్యోపేతమైందికాదు" మెల్లగా పచార్లుచేస్తూ నేలకేసిచూస్తూ యీ మాటలు గబగబా తీవ్రంగా అన్నాడు.

"మాస్టారూ! మీరే లీజాని ప్రేమిస్తున్నట్లుంది" అన్నాడు లావ్రెటస్కీ హఠాత్తుగా. లెమ్ టపీమని ఆగి "నన్ను పరిహాసం చేయకండి. నేనేం పిచ్చివాణ్ని కాను. నేను భవిష్యత్తులోని వెలుగునుకాదు, చీకట్లను చూస్తున్నాను."

లావ్రెటస్కీ మనసు పశ్చాత్తాపంతో నిండిపోయింది. క్షమించమని లెమ్‌ని వేడుకున్నాడు. టీ తాగినతర్వాత లెమ్ తన కృతిపాడాడు. భోజనాలసమయంలో లీజావిషయం లావ్రెటస్కీ ముందుగా ఎత్తాడు. లెమ్ అందుకుని మాట్లాడసాగాడు. లావ్రెటస్కీ అతిశ్రద్ధతో వినవారంభించాడు.

"క్రిస్టాఫర్ ఫీయొడోరిచ్! యేమంటారు? యిక్కడ అంతా సక్రమంగానే వుంది. తోట విరగబూసింది. లీజాని, వాళ్ళ అమ్మనీ పిల్లల్ని యిక్కడికిరమ్మని ఆహ్వానిస్తే బాగుండదూ? మీ కిష్టమేనా?"

లెమ్ ప్లేటుమీదికివంగి 'సరే' అన్నాడు, వినిపించీ వినిపించకుండా.

"పానిన్‌ని పిలవకపోతే నేం?"

"పిలవక్కర్లా" అన్నాడు లెమ్ పసిపిల్లవానిలా నవ్వుతూ.

రెండురోజుల తర్వాత కాలటీనను చూడడానికి లావ్రెటస్కీ వెళ్ళాడు.

# ౨౪

లావ్రెటస్కీ వెళ్ళేసరికి అంతా ఇంట్లోనే ఉన్నారు. అతను వెళ్ళిన వెంటనే తన ఉద్దేశం వెల్లడించలేదు. ఈ విషయం ముందుగా లీజాతో చర్చిద్దామనుకున్నాడు. అవకాశంచిక్కింది. కచేరీగదిలో వాళ్ళిద్దరినీ వదిలి తక్కినవాళ్ళంతా అవతలికి వెళ్ళారు. సంభాషణ ప్రారంభమైంది. లీజా సామాన్యంగా ఎవరిముందూ సిగ్గుపడదు. పైగా లావ్రెటస్కీ పరిచయస్తుడే నాయె. లావ్రెటస్కీ ఆమె మాటలు విన్నాడు. ముఖకవళికలు పరిశీలించాడు. లెమ్ చెప్పినమాటలు స్మృతికి తెచ్చుకుని అవిసరైనవనే భావించాడు. చనువులేకుండా పరిచయంమాత్రమేగల ఇద్దరు వ్యక్తులు ఒక్కొక్కపుడు హఠాత్తుగా క్షణికం ఒకరినొకరు ఆకర్షించుకుంటారు.

చనువు కలిగిందనే పరిజ్ఞానం వారి దృక్కులలో, స్నేహపూర్వక మందహాసాలలో, చేష్టలలో వ్యక్తమవుతుంది. సరిగ్గా లావ్రెటస్కీ లీజాల విషయంలో కూడా అలానే జరిగింది. అతనికేసి దయతో చూస్తూ, "యితను యిలాంటివాడు" అనుకుంది. లావ్రెటస్కీ కూడా "యీమె యిటువంటిది" అనుకున్నాడు. ఏమాత్రం సంకోచంలేకుండా 'నా మనోభారం తొలగించుకోవాలనివుందిగాని నీకు కోపంవస్తుందేమోనని భయపడుతున్నాను" అని ఆమె అనడం అతనికి ఆశ్చర్యంగొల్పలేదు.

"భయమెందుకు? చెప్పదలచిందేదిటో నిర్భయంగా చెప్పు" అని లావ్రెటస్కీ ఆమెకు ఎదురుగా నిల్చున్నాడు.

"నువు మంచివాడివే." అని ప్రారంభించింది లీజా. ఈయన "మంచి వాడే" అనే భావం ఆమె మనసులో ప్రవహించింది. "క్షమించాలి. నీతో ధైర్యంచేసి అనకూడదనుగాని... యెలా... నీభార్యని యెందుకు వదిలేశావు?"

లావ్రెటస్కీ ఉలిక్కిపడి లీజాకేసిచూచి ఆమెదగ్గరగా కూర్చుని "బిడ్డా! ఆ గాయాన్ని తాకకు. నీచేతులు చాలా మెత్తనివైనా గాయాన్ని రేపుతాయి."

"ఆమె నీకు..." లావ్రెటస్కీమాటలు విననట్టు అన్నది.

"ద్రోహంచేసిందని నాకు తెలుసు. నే నామెను వెనక వేసుకునిరా తలంచుకోలేను. అయినా దేవుడు కూర్చిన భార్యని యెలా తోసివేయ గల్గావు?"

"యీ విషయంలో మనదృక్పథాలు యెక్కడా కలవవ్. ఎలిజవెటా మైకెలోవ్నా! మనం ఒకర్నొకరం అర్థంచేసుకోలేం." అని తీక్షణంగా సమాధానమిచ్చాడు లావ్రెటస్కీ.

లీజా తెల్లబోయింది. శరీరం కొద్దిగా వణికింది. కాని ఆమె మౌనం వహించలేదు. "దేవుడు నిన్ను క్షమించాలంటే, ముందు నువ్వు క్షమించడం నేర్చుకోవాలి." అని లీజా మెల్లిగా గొణిగింది.

"క్షమించడం! నువు యెవరిపక్షాన మాటాడుతున్నావో ఆమెని గురించి సమగ్రంగా తెలుసుకున్నావా? దాన్ని క్షమించడం! మళ్ళీ నా యింట్లోకి రానివ్వడమా, ఆ హృదయంలేనిదాన్ని! అసలు ఆమెకి తిరిగి రావాలని వుందని నీకెవరు చెప్పారు? ప్రస్తుతం హాయిగా బతుకుతూనే వుంది... ఈ విషయం మాట్లాడి ప్రయోజనంలేదు. దానిపేరు కూడా నీ నోటివెంట రాదగిందిగాదు. నువు మహాపరిశుద్ధురాలివి. అది యెలాంటి మనిషో కూడా నీకు తెలీదు."

"ఆమెను తిట్టడం దేనికి?" అంది లీజా ఎంతో కష్టంమీద. ఆమె చేతులు వణుకుతున్నాయి. "నువ్వే ఆమెని వదిలివేస్తివిగా" అంది.

"ఆమనిషి యెలాంటిదో నీకు తెలీదు." అన్నాడు లావ్రెటస్కీ ఏమాత్రం సహనం చూపకుండా.

"అయితే ఆమెనెలా పెళ్ళిచేసుకున్నావు?" అని అడిగింది లీజా కనులు కిందికి వంచుతూ.

లావ్రెటస్కీ దిగ్గునలేచి, "యెందుకు చేసుకున్నానా? అప్పుడు నేను యువకుణ్ని. ప్రపంచానుభవం లేదు. బాహ్యసౌందర్యానికి కళ్ళుమూసుకుని లొంగిపోయాను. అప్పుడు ఆడవాళ్ళసంగతి నాకేం తెలీదు. ఆడవాళ్ళ సంగతే కాదు, అప్పుడు నాకేం తెలీదు. భగవంతునిదయవల్ల నీ వివాహం శుభప్రదంగా పరిణమించుగాక! అయినా గట్టిగా యేం చెప్పలేం."

"నాకు దురదృష్టంపడుతుందేమో!" అంది లీజా. (ఈమాటలు గొంతు కడ్డు పడ్డాయి.) "విధికితలవొగ్గాలి, స్పష్టంగా చెప్పలేక పోతున్నా. తల వొగ్గలేకపోతే ......"

లావ్రెటస్కీ పిడికిలిబిగించి నేలతన్నాడు. "కోప్పడకు క్షమించు." అంది లీజాతొందరగా.

సరిగ్గా ఆసమయానికి మేరియా డిమిట్రియెవ్నా ఆగదిలోకి వచ్చింది. లీజా వెళ్ళిపోదామని లేచింది.

'ఒక్కక్షణం ఆగు.' అన్నాడు లావ్రెటస్కీ హఠాత్తుగా.

"నిన్ను, మీ అమ్మనీ ఒక వరం అడగాలనుకుంటున్నా.. మీరంతా మాయింటికోమాటువచ్చి సర్దాగా గడపరాదూ? పియానో తెప్పించాను. లెమ్ కూడా అక్కడే వున్నాడు. లిలాక్ పూలు విరగపూచాయి. పరిశుభ్రమైన పల్లెటిగాలిలో హాయిగాగడిపి ఆరోజేతిరగరావచ్చు సరేనా?"

లీజా తల్లికేసిచూసింది. మేరియా డిమిట్రియెవ్నా అసంతుష్టిదృక్కులు పరిపింది. కాని ఆమెనోరువిప్పి సమాధానమిచ్చే అవకాశం ఇవ్వకుండా లావ్రెటస్కీ చటుక్కున మేరియాచేతులు రెండూ ముద్దాడాడు, హృదయాన్ని తాకే ఇలాంటి ప్రదర్శనాలకి లొంగిపోవడం మేరియాకి అలవాటే. పైగా 'అడివిమనిషి' ఇంత మర్యాదచేస్తాడని ఆమె అనుకోలేదు చివరికి మేరియా అంగీకరించింది. ఏరోజున వెడదామా అని ఆమె ఆలోచిస్తుండగా, లావ్రెటస్కీ పొంగిపోయి లీజా దగ్గరగావెళ్ళి రహస్యంగా, "కృతజ్ఞుణ్ని. నువు మహమంచిదానివి. క్షమించు..." అన్నాడు. లీజా తెల్లటిముఖం సంతోషంతో, సిగ్గుతో, మందహాసంతో వెలిగిపోయింది. ఆమె నేత్రాలు

కూడా మందహాసంచేశాయి. లావ్రెటస్కీకి కోపం తెప్పించానేమోనని అంతకుముందు భయపడింది.

"వ్లాదిమిర్ నికొలాయిచ్ కూడా మాతో రావచ్చా?" అని మేరియా అడిగింది.

"ఓ-రావచ్చు. కాని మన బంధువులం నలుగురంమాత్రమే కలిసి వెడితే బాగుంటుందేమో!"

"కాని నే ననుకున్నా...సరే-నీ యిష్టం" అంది మేరియా.

లెనోచ్కా, షురోచ్కాలనికూడా తీసుకువెళ్లాలని నిశ్చయించారు. మార్ఫా టిమొఫెయెవ్నా రానని నిరాకరించింది. "క్షమించు యీ పెద్ద తనంలో ప్రయాణానికి తట్టుకోలేను. అక్కడ పడుకోవడానికి అనువైన స్థలం వుండదు. పైగా కొత్తచోట నాకు నిద్రపట్టదు. మీ కుర్రకారంతా సర్దాగా వెళ్ళిరండి." అంది.

లీజాని ఒంటరిగా కలుసుకోడానికి లావ్రెటస్కీకి మళ్ళా అవకాశం చిక్కలేదు. కాని ఆమె కేసి అదోవిధంగా చూట్టంతో ఆమెకి అతనంటే జాలివేసింది, సిగ్గువేసింది, సుహృద్భావం కలిగింది. వెళ్ళిపోయేటపుడు లావ్రెటస్కీ ఆమెచేతిని గట్టిగా పట్టుకున్నాడు. అతను వెళ్ళిపోయాక ఆమె ఆలోచనలో పడింది.

## ౨౫

లావ్రెట్స్కీ ఇంటికి చేరుకునేసరికి కచేరీగదిగుమ్మంలో ఒకతను తారసిల్లాడు. ఆ ఆగంతకుడు పొడుగ్గా బక్కగా ఉన్నాడు. తొడిగిన ఊదా రంగుకోటు చెమటకు తడిసిపోయిఉంది. ముడుతలుపడ్డా జీవకళఉట్టిపడే మొహం, చిందరవందరగాఉన్న బుగ్గమీసాలు, పొడుగాటిముక్కు, చిన్న వైనా మెరిసిపోయేకళ్ళు—అతను ఎవరోకాదు, లావ్రెట్స్కీ విద్యార్థిదశ నాటి ప్రాణస్నేహితుడు మైకెలెవిచ్. మొదట్లో లావ్రెట్స్కీ అతన్ని గుర్తుపట్టనే లేదు. పేరుచెప్పగానే ఎంతోఆప్యాయంతో గట్టిగా కాగలించుకున్నాడు. మాస్కో విడిచిపెట్టింతర్వాత మళ్ళీ ఇద్దరూ కలుసుకోవడమిదే. ప్రశ్నలవర్షం కురిసింది. ఎన్నడో మరిచిపోయిన సంగతులు తిరిగి జ్ఞాపకం చేసుకున్నారు. పైపుమీదపైపు తొందరగా పీల్చేస్తూ మధ్యమధ్య అపుడపుడు టీ చప్పరిస్తూ, పొడుగాటిచేతులు ఊపుకుంటూ మైకెలెవిచ్ ఇటీవల తన కార్యకలాపమంతా లావ్రెట్స్కీకి వర్ణించి చెప్పాడు. కాని అందులో పెద్దగా చెప్పుకోతగిందేమీ లేదు. మైకెలెవిచ్ మాటిమాటికీ కీచుమని నవ్వసాగాడు. ఒక నెలక్రితం ఓ పట్టణానికి మూడువందల వెర్స్టుల దూరంలో భాగ్యవంతుడైన ఒక ముత్తేదారుకచేరీలో అతనికి ఉద్యోగం దొరికింది. లావ్రెట్స్కీ విదేశాలనుంచి తిరిగివచ్చాడనివిని చూడడానికివచ్చాడు. మైకెలెవిచ్ యవ్వనంలోలాగానే అంత ఉద్రేకంతోను, అంత తొందరగాను మాట్లాడ

సాగాడు. లావ్రెటస్కీ తన పరిస్థితులనుగురించి మాట్లాడబోయేసరికి మైకలెవిచ్ అడ్డుతగిలి, "బాబా! విన్నా, విన్నా, అలా జరుగుతుందని యెవరు అనుకున్నారు!" అని గొణుగుతూ సంభాషణను లోకసామాన్య విషయాల మీదకి మళ్ళించాడు.

"రేపు నేను వెళ్ళిపోవాలి. ఈరాత్రిపొద్దుపోయేవరకు కూచుందాం. నీ అభిప్రాయాలూ, విశ్వాసాలూ, జీవితంలో నువ్వు నేర్చుకున్న విషయాలు, నీ జీవితసంఘర్షణలు తెలుసుకోవాలని నాకు చాలా ఆదుర్దాగావుంది. యిక నావిషయం: చాలా మార్పువచ్చింది. 'జీవితతరంగాలు నను ముంచెత్తివేశాయి.' యీ మాటలు అన్నదెవరు? నాలో చాలా మార్పువచ్చింది. కాని ప్రధానవిషయాలలో మార్పేమీ రాలేదు. నా కిప్పటికీ మంచితనంలో, సత్యంలో నమ్మకంపోలేదు. వట్టి నమ్మకమేకాదు, గాఢవిశ్వాసముంది. విను, నేనూ కవిత్వం గిలుకుతుంటానని నీకు తెలుసుగా. నా పద్యాల్లో పెద్దకవిత్వం లేకపోవచ్చు. కాని సత్యంవుంది. నేను మొన్న మొన్ననే రాసిన పద్యాలు చదువుతా, విను." మైకలెవిచ్ తన ఖండకావ్యం వినిపించాడు. అది చాలాపెద్దది. ఈకిందిచరణాలతో అంతమైంది.

"ముక్కుపచ్చలారలేదు, ఎక్కివచ్చినన్ వయస్సు
కొత్తకొత్త భావాలను గుత్తగొంది నా మనస్సు
పూజించినదాన్నంతా బూడిదచేశా నప్పుడు
బూడిదచేసినదంతా పూజిస్తున్నా నిప్పుడు"

ఆఖరి రెండు చరణాలు చదువుతూంటే మైకలెవిచ్‌కి కన్నీరు కారేటంత పనైంది. మూతి వంకరపోయింది. ఇది తీవ్ర ఉద్వేగానికి సూచన. ముఖం వికసించింది. లావ్రెటస్కీ వింటూకూర్చున్నాడు మైకలెవిచ్ ధోరణి అడ్డుకోవాలనేభావం అతనిలో రగిలింది. ఉడికి పొంగిపొర్లే ఉత్సాహం చూచేసరికి లావ్రెటస్కీకి ఒళ్ళుమండింది పావుగంట గడిచిందో లేదో ఇద్దరికీ వాదన ప్రారంభమైంది. అంతూపొంతూ ఉండని ఇలాంటి వాదనలు చేసుకోడానికి ఒక్క రష్యావాళ్ళే సమర్థులు. ఇద్దరూ కొన్ని సంవత్సరాలుగా రెండు విభిన్నప్రపంచాలలో జీవించారు. ఇతరులమాట అలావుంచి వారి భావాలే వారికి విస్పష్టంగా తెలీవు. విభిన్నఅభిప్రాయాలు వెల్లడిస్తూ, మాటకమాట అందుకొంటూ, అస్పష్టవిషయాలమీద ఇద్దరూ జీవన్మరణ సమస్యలాగా వాదించుకోవడం మొదలుపెట్టారు. వారు బిగ్గరగా,

కేకలు వేసుకోవడంతో ఇంటిల్లిపాదీ హడలిపోయారు. మైకెలెవిచ్ వచ్చిందగ్గరనుంచీ తన గదిలో కాలంవెళ్ళబుచ్చుతున్న లెమ్ ఆశ్చర్యపోయి ఏం జరుగుతుందోనని భయపడిపోయాడు. అర్ధరాత్రి దాటింది. "అయితే యిక నీ సంగతేమిటి? భ్రమలన్నీ తొలగిపోయాయన్నమాట!" అని బిగ్గరగా అన్నాడు మైకెలెవిచ్.

"భ్రమలన్నీ తొలగిపోయినవాడిలా కనిపిస్తున్నానా? అలాంటి వాళ్ళు పాలిపోయి, యెప్పుడూ రోగిష్టుల్లా వుంటారు. యిక నేను, ఒక్క చేతితో నిన్ను పైకి లేవనెత్తనా?"

"సరే. భ్రమలు తొలగినవాడివి కాకపోతే వట్టి అనుమానస్తుడివి. యిది మరీ అధ్వాన్నం. అనుమానస్తుడంటేయేమిటి? అదృష్టంనీకు ఎదురు తిన్నింది. సరే నీతప్పేముందిలే. పుట్టుకతోనే నీది వ్యక్తిక హృదయం, ప్రేమైక హృదయం, కాని బలవంతాన ఆడవాళ్ళంటే నిను దూరంగా వుంచారు. సహజంగా నువ్వు మొదటకలుసుకున్న స్త్రీ నీకు టోపీ వేసింది."

"నిన్నూ టోపీవేసింది." అన్నాడు లావ్రెటస్కీ.

"సరే, సరే! దీనికి నేనొక వుపకరణమయ్యాను. ఊహూఁ-కాదు: యిదంతా పిచ్చిపేలాపన. విధేమిటి? యెన్నో సరిగా తెలిసీ తెలియక అలవాటు కొద్దీ అనే ముక్క. అయితే యిందువల్ల యేం రుజువైంది?"

"చిన్నతనంలోనే నా నడుం విరగొట్టేశారనిరుజువు చేస్తోంది."

"సరిచేసుకో. నువ్వు మగాడివికదూ? నువ్వు శక్తిసామర్థ్యాలకోసం యాచించనక్కర్లేదు. కాని ఒక నిర్దిష్టవిషయాన్ని సార్వసాధారణీకరణ చేయలేవు. మార్పుచెందని నియమంగా తయారుచేయలేవు."

"యిందులో నియమమేముంది? నే నంగీకరించను......"

"ఊహూఁ-నియమూ, నీ నియమం......" అన్నాడు మైకెలెవిచ్.

ఇంకోగంట పోయింతర్వాత "నీకు అహంభావం హెచ్చు. ఆత్మానందంకోసం పరుగెత్తావు. జీవితంలో సౌఖ్యం ఒక్కటే చూచుకున్నావు" అన్నాడు మైకెలెచ్.

"ఆత్మానందం యేమిటోయ్?"

"అందరూ నిను అణగద్రొక్కారు. అంతా పాలిపోయింది."

"ఆత్మానందం అంటే యేమిటీ అని అడుగుతున్నా."

"అంతా కూలిపోయింది, యెందుకో తెలుసా? ఆధారం చూసుకోకుండా అడుగు వేశావు. పేకముక్కలతో మేడగట్టావు!"

"చెప్పగలచిందేమిటో స్పష్టంగా చెప్పు. ఆ అలంకారాలెందుకు? అవేవీ నాకు అర్థంకావు."

"యెందుకనంటే- సరే నవ్వాలనివుంటే-నవ్వు, నీకు విశ్వాసాలంటూ లేవు. వుత్సాహంలేదు. నీకు యెందుకూపనికిరాని మనసుమాత్రం వుంది. నవు తాతలనాటి వాల్టేరు అనుయాయివి. తెలిసిందా?

"నేను వాల్టేరు అనుయాయుడినా?"

"నీతండ్రిలాగానే నవ్వ్యాను. కాని నీకా అనుమానమే లేదు"

"నువు శతమొండివి." అన్నాడు లావ్రెటస్కీ.

"దురదృష్టవశాత్తు అంత గొప్పబిరుదు నాకింకా లభించలా."

తెల్లవారుజాము రెండుగంటలు దాటింది. "నువు అనుమానస్తుడివీ కాదు, భ్రమలు తొలగినవాడివీకాదు, వాల్టేరు అనుయాయివీకాదు వట్టి సోమరిపోతువి. చెడిపోయిన సోమరిపోతువి. సోమరిపోతులు పనీ పాటా చెయ్యలేరు. నోట్లో వేళ్ళెట్టుకొని కూర్చుంటారు. ఆలోచించనూలేరు. కాని నువు ఆలోచనాపరుడివి. యిలాంటివాడివి గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నావు. నువు పనీపాటా చెయ్యగలవు. కాని చెయ్యవు. కడుపునిండాతిని, పడుకుని 'మనుషులు చేసేదంతా వట్టిచెత్త, పనికిమాలింది' అందుకని యిలానే జరగాలి." అంటున్నావు.

"నేను గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నానని నీ కెలా తెలుసు? నా కటువంటి భావాలున్నాయని యెలా అనుకున్నావ్?"

నదురూ బెదురూలేకుండా మైకెలవిచ్ "మీ జాతివుందే, అదంతా బాగా చదువుకున్న సోమరిపోతుజాతి. జర్మనీవాడి బలహీనత యెక్కడుందో మీకు బాగా తెలుసు. యింగ్లీషువాళ్ళు, ఫ్రెంచివాళ్ళు దేంతో బాధపడుతున్నారో మీకుతెలుసు. మీ వెధవ సోమరితనాన్ని సమర్థించుకోడానికి మీ విజ్ఞానాన్ని ఆధారం చేసుకుంటారు. యేమీ చెయ్యకుండా గోళ్లుగిల్లుకుంటూ కూర్చోడం గొప్పగా మీరు చెప్పుకుంటారు. ధూళిదుమారం లేపే వాళ్లంతా వట్టి తెలివితక్కువదద్దమ్మలని ఆక్షేపిస్తారు. అవును,

మనలోనూ కొంతమంది పెద్దమనుషులున్నారు. వారు జీవితమంతా 'విసుగు మైకం' లో మునిగి, దానికి అలవాటుపడిపోయి, దానికి అంటిపెట్టుకుని వుంటారు, శ్లేష్మంలో యీగలాగా.'' అన్నాడు. మైకలివిచ్ తానుప్రయోగించిన ఉపమానానికి తానే నవ్వుకున్నాడు. ''ఓ-విసుగు మైకం!-యిది మన రష్యన్లచావుకొచ్చింది. ఆ వెధవ సోమరిపోతులు పనిచేద్దామని అనుకుంటూనే వుంటారు...''

''యెందుకట్లా తిట్టిపోస్తావు ?'' అంటూ అరిచాడు లావ్రెట్స్కీ. ''పనిచెయ్యాలి, పనిచేయాలిఅంటూ పెద్దగామాట్లాడడం సరే బాగానే వుంది...... ఓ * డెమాస్తనీస్ తిట్టిపోయడం కంటె చెయ్యగలిగిందేమిటో చెప్పదూ ?''

''యిదేనా నీకు కావలసింది. అది నే చెప్పేదికాదు. యెవరికివారే తెలుసుకోవాలి.'' అని జవాబిచ్చాడు డెమాస్తనీస్. ''భూస్వామివి, ఘరానామనిషివి ! యెంచెయ్యాలో తెలీదు. నీకు యెందులోనూ విశ్వాసంలేదు. విశ్వాసంవుంటే తెలిసేది. విశ్వాసంలేకపోతే విషయం గోచరించదు.''

''సరే, దాన్ని తగలేసెరి. కాసేపుపడుకోనిద్దూ.'' అని బతిమాలాడు లావ్రెట్స్కీ.

''ఒక్కనిమిషం, ఒక్క సెకనుకూడా పడుకోడానికి వీల్లేదు. ఒక్క సెకనుకూడా ! మృత్యువు యెవరికోసరమూ వేచివుండదు. అలాగే జీవితంకూడా.''

''గోళ్లుగిల్లుకుంటూ సోమరిపోతులై కూర్చోడానికి యిదేనా సమయం? యిదేనా తగినసలం?'' అన్నాడు మైకలెవిచ్ తెల్లవారజాముననాలుగు గంటలకి. ''యిక్కడ? యిప్పుడు? రష్యాలోనా? దైవసాక్షిగా, ఆత్మసాక్షిగా నిర్వహించవలసిన కర్తవ్యం, వహించవలసిన గురుతర బాధ్యతా ప్రతివ్యక్తిమీదా వున్నపుడా? కాలం గడిచిపోతోంది. మనం నిద్రపోతున్నాం. నిద్రపోతున్నా...''

---

* గ్రీకుదేశపు గొప్పవక్త 384 - 322 బి. సి

"మనం నిద్రపోవడంలేదు పైగా యితర్లకి నిద్రాభంగం కలగ జేస్తున్నాం. కోడిపుంజుల్లా అరుస్తున్నాం. అదిగో, విను. మూడోజాము కోడికూస్తున్నట్టుంది."

ఇలా హఠాత్తుగా లావ్రెటస్కీ అనడంతో మైకెలెవిచ్ తనలోతాను నవ్వుకొని ఊరుకున్నాడు. "సరే-యిక రేపు మాట్లాడుకుందాం." అన్నాడు మందహాసంచేసి పైపు కింద పెడుతూ.

"రేపు మాట్లాడుకుందాం." అని లావ్రెటస్కీకూడా అన్నాడు కాని మిత్రులిద్దరూ ఇంకో గంటసేపటివరకూ బాతాకానీ కొడుతూనే ఉన్నారు......కాకపోతే వారు గొంతెత్తిమాట్లాడలేదు. సంభాషణ గిఉత్సాహంగాలేదు. కరుణాపూరితంగాఉంది.తీవ్రత తగ్గింది.

లావ్రెటస్కీ ఎంతబతిమాలినా ఉండకుండా మైకెలెవిచ్ ఆ మర్నాడు వెళ్ళిపోయాడు. కాని మిత్రులిద్దరూ కావుదీరా మాట్లాడు కున్నారు. పాపం! మైకెలెవిచ్ దగ్గర చిల్లిగవ్వయినాలేదు. ఆకిందటి సాయంత్రమే మైకెలెవిచ్ ఒంటిమీద దీర్ఘకాల దారిద్ర్య చిహ్నాలులావ్రె టస్కీ గమనించాడు. జాలేసింది. బూట్లమడమలు అరిగిపోయాయి. కోటుగుండీ ఒకటి ఊడిపోయింది. చేతులకు తొడుగులు తొడుగుతున్నట్లు లేదు. క్షవరం చేయించినట్లులేదు. రాగానే స్నానంచేస్తానని అనలేదు. పిచ్చిగా తిండితిన్నాడు. మాంసంముక్కలు చేత్తోనే చీల్చుకుని తిన్నాడు. ఎముకలు పళ్ళతో కరకరా నమిలేశాడు...ప్రభుత్వోద్యోగవల్ల అతని కేమీ లాభించలేదు. ప్రస్తుతం ఉద్యోగమిచ్చిన మక్తేదారు తనకచేరీలో చదువుకున్నవాడిని పెట్టుకోవాలనే ఉద్దేశంతో అతనికి ఉద్యోగమిచ్చాడు. ఆఉద్యోగంమీదనే మైకెలెవిచ్ ఆశలన్నీ పెట్టుకు బతుకుతున్నాడు. అయి నప్పటికీ మైకెలెవిచ్ భయపడలేదు. మానవుని గమ్యం విషయమై, తన ఉద్యోగవిషయమై ఎంతో వ్యాకులతతో ఊబిలో దిగకుండా కాలంగడుపు తున్నాడు. పైగా అతను నిరాశావాది, భావవాది, నిని. మైకెలెవిచ్ వివాహంచేసుకోలేదు. కాని అనేకసార్లు ప్రేమపాశంలో చిక్కుకున్నాడు. తనప్రేమకు ఆలంబనమైన స్త్రీలందరికీ తలో ఒక ఖండ కావ్యం అంకిత మిచ్చాడు. ఎంతోఆవేశంతో రాసిన ఒక ఖండకావ్యంఒక అజ్ఞాత పోలండు వనితకు అంకితమిచ్చాడు. ఆపోలండు వనిత ఒక సామాన్య యూదు

స్త్రీ. ఆశ్వికదళ సేనానులలో చాలామందితో ఈమెకి సంపర్కం ఉన్న మాట యథార్థమే... సంపర్కం ఉంటేనేం?

మైకెలెవిచ్ లెమ్‌తో కూడా సరిగా మెసులుకో లేక పోయాడు. బడబడవాగుడు, చేతులు ఆదేపనిగా ఆడించడం ఆ జర్మన్‌కి భయంగొల్పాయి. ముష్టివాడు ఇంకో ముష్టివాణ్ణి దూరాన్నుండే పసిగడతాడు. కాని వృద్ధాప్యంలో వీళ్ళు స్నేహంగా ఉండలేరుకూడా. ఇదేం ఆశ్చర్యకరమైన విషయంకాదు. ఇద్దరికీ ఒకే లక్ష్యమంటూ లేదు. ఆశలంటూ లేవు.

వెళ్ళిపోయేముందు మైకెలెవిచ్ తిరిగి చాలాసేపు లావ్రెటస్కీతో బాతాకానీకొట్టాడు. ఇప్పటికైనా కళ్ళు తెరవకపోతే సాంతం ఖాళీఅయిపోతావని హెచ్చరించాడు. రైతుల యోగక్షేమాల విషయమై శ్రద్ధవహించమనీ, ఆదర్శప్రాయుడవుకమ్మనీ బతిమాలాడు. ఇదివరలో యమయాతనలు అనుభవించడం జ్ఞప్తికితెచ్చాడు. అదేధోరణిలో చాలాసార్లు తాను అదృష్టవంతుడననటూ, తనను గాలిలో ఎగిరేపక్షితోను, కలవపువ్వుతోను పోల్చుకున్నాడు.

'అయితేనేం, నల్లకలువవి.' అన్నాడు లావ్రెటస్కీ. 'ఊ-శబ్బన్న వాళ్ళే గొప్పవాళ్ళనుకోకు. నీలోకూడా అందరిలాంటి రక్తమే ప్రవహిస్తోంది. యీ మైకంనించి నిను మేల్కొల్పడానికి దేవకన్య వకతె నీకు కావాలనుకుంటా.'

"ఆ దేవకన్యలసంగతి తెలిసిపోయింది. యింకెందుకుబాబూ!"

"నోరుముయ్! నువ్వు వట్టి నిరాశాపరుడివి."

బగ్గీలో ఎక్కికూర్చుని కూడా మైకెలెవిచ్ ఇంకా ఏగో చె[illegible]తూనే ఉన్నాడు. అతి తేలిగ్గాఉన్న అతని తోలుపెట్టెను బగ్గీలోపెట్టా[illegible]. ఆ తోలుపెట్టె చెవులు దుమ్ముకొట్టుకని, సింహపుపంజా ఆకారంలో ఉన్నాయి. రష్యాభవిష్యత్తునిగురించి తన అభిప్రాయాలను వ్యక్తీకరి[illegible]గా భావిశ్రేయస్సుకై విత్తనాలు నాటుతున్నట్లు, మైకెలెవిచ్ చేతులు [illegible]చాడు. గుర్రాలు కదిలాయి. 'నా ఆఖరిమాటలుమూడూ జ్ఞాపకం ఉంచ[illegible]' అన్నాడు మైకెలెవిచ్ బగ్గీనించి బైటకి శరీరంవంచి, పడిపోకుండా జాగ్రత్తపడుతూ, 'మతం, అభ్యుదయం, మానవావళి... శెలవు.' కళ్ళ[illegible]కా

టోపీ క్రిందికిలాక్కున్నాడు. బగ్గీసాగిపోయింది. మెట్లమీద లావ్రెట్స్కీ ఒంటరిగా నిల్చుని బగ్గీ కనుచూపుమేరదాటేవరకూ దానికేసే తదేకదృష్టితో చూశాడు. "అతను చెప్పిందే సరైందనుకుంటున్నా." అనుకున్నాడు.

"నేను సోమరిపోతునే." మైకలెవిచ్‌తో ఎంత వాదించినా, అతని అభిప్రాయాలతో ఏకీభవించకపోయినా మైకలెవిచ్ చెప్పిందంతా అతని హృదయంలోకి చొచ్చుకుపోయింది. మనిషి మంచివాడైతేసరి ఎవరూ అతన్ని ప్రతిఘటించలేరు.

## ౨౬

అనుకున్న ప్రకారం రెండురోజులతర్వాత మేరియా డిమిట్రియేవ్నా పిల్లలను వెంటబెట్టుకుని వాసిలెవస్కొయే వచ్చింది. వచ్చీరావడంతోనే పిల్లలు సరాసరి తోటలోకి పరుగెత్తారు. మేరియా కాళ్ళీడ్చుకుంటూ గదులలో తిరుగుతూ వాటిని ఏదోవిధంగా మెచ్చుకోసాగింది. లావ్రెటస్కీ ఆహ్వానాన్ని అంగీకరించడం అతనిమీద కరుణావృష్టి కురిపించడంలా ఆమె భావించుకుంది. పూర్వపు రాచమర్యాదల ననుసరించి ఆంటన్, అప్రేక్సియాలు ఆమెచేతిని ముద్దిడుకోగానే ఎంతోదయ ఒలికిస్తూ మందహాసం చేసి టీ ఇమ్మని దీర్ఘాలుతీస్తూ అడిగింది. ఆంటన్ అతిథులువచ్చారని తెల్లటి చేతితొడుగులు ధరించాడు. కాని లావ్రెటస్కీ తాత్కాలికంగా నియమించిన బంట్రోతు టీ తీసుకు చక్కావచ్చాడు. ఈ బంట్రోతుకు మర్యాదలు తెలియవని ఆంటన్ వాదించేవాడు. తన్నులోని రాజని టీ ఆబంట్రోతు తెచ్చేసరికి అతనికి అమితకోపం వచ్చింది. భోజనాలవేళ ఆంటన్ పట్టుదలకు మేరియా కుర్చీవెనక నిల్చుని ఇంకెవరినీ ఆ ఛాయలకు రాకుండా చేశాడు. వాసిలెవస్కొయేకి అతిథులు రావడంవల్ల అతని కెంతో ఆనందమూ, కలవరపాటూ కలిగింది. తన యజమాని ఎటువంటి పెద్దమనుష్యులతో కలిసిమెలిసి తిరుగుతున్నాడో గ్రహించిన అతని హృదయం ఎంతోసంతోషించింది. ఆరోజున అతడొక్కడేకాదు తత్తరపడింది

లెమ్ కూడా హడావిడిగా తిరగసాగాడు. లెమ్ ఫుగాకురంగు పొట్టికోటు తొడిగి, రుమాలు మెడచుట్టూ గట్టిగా కట్టుకున్నాడు. మాటిమాటికీ గొంతు సవరించుకొంటూ ఎంతో చనువుగా అందరితో మెలగసాగాడు. లీజాకూ, తనకూ ఇదివరలో ఏర్పడ్డ చనువు నశించిపోలేదని గ్రహించి లావ్రెట్‌స్కీ ఎంతో సంబరపడ్డాడు. లీజా అక్కడకిరాగానే స్నేహపూర్వకంగా అతనికి చెయ్యి అందించింది.

• భోజనానంతరం లెమ్ జేబులోంచి స్వరప్రస్తారం గుర్తించిన కాగితం దీసి, పెదవులు బిగపట్టి, మెదలకుండా పియానోమీద పెట్టాడు. అది ఆ కిందటి సాయంత్రం ఒక జర్మన్ ప్రాచీన గేయానికి అతనుకూర్చిన స్వరం. ఆ గేయంలో నక్షత్రాలప్రసక్తిఉంది. లీజా వెనువెంటనే పియానో ముందు కూర్చుని వాయించనారంభించింది... పాపం ! ఆ స్వరం జటిలంగాఉండి అందరికీ విసుగెత్తించింది. స్వరకర్త ఏవో లోతుభావాలను రసవత్తరంగా ఆవిష్కరించాలని యత్నించాడు. ఆ పాటలో ఆయత్నం గోచరిస్తుంది. అంతే. యత్నం సఫలంకాలేదు. లీజా, లావ్రెట్‌స్కీలకి ఈ ముక్కే అనిపించింది. లెమ్ ఇది గ్రహించి నోరుమెదల్చకుండా కాగితం తీసుకొని జేబులో తిరిగిపెట్టుకున్నాడు. ఆ పాటను తిరిగి వాయిస్తానని లీజా సూచించగా లెమ్ తల అడ్డంగాఊపి "దానిగతి అంతేలే." అన్నాడు ముందుకు వంగి, తనలోకి తాను కుంచుకుని చక్కాబోయాడు.

సాయంకాలం అంతా చేపలు పట్టడానికి బయలుదేరి వెళ్ళారు. తోటలోని కొలనునిండా చేపలు, రొయ్యలు. మేరియానికొలను అంచున, చెట్టునీడను పడకకుర్చీలో కూర్చోబెట్టి పాదాలమీద రగ్గుకప్పి, మంచి గాలంఇచ్చారు. ఆంటన్‌కి చేపలుపట్టడంలో మంచిఅనుభవంఉంది. అందుకని అతన్ని ఆమెకి సహాయంగా ఉంచారు. ఆంటన్ గాలంతీసుకుని అటూ ఇటూతిప్పి హడావిడిచేసి, కొక్కానికి ఎరనుగుచ్చి, తట్టి దానిమీద ఉమ్మివేసి, పసందుగా శరీరంవంచి నీటిలోవేశాడు. చిన్నపిల్లల నిద్దరినీ వెంటపెట్టుకుని లెమ్ అడ్డుకట్టదగ్గరికి వెళ్ళాడు. లావ్రెట్‌స్కీ లీజా పక్కన బైఠాయించాడు. చేపలు విడవకుండా ఎరను కొరుకుతున్నాయి. గాలం లాగేసరికి గాలిలో చేపలు ఎగురుతూ సువర్ణ, ధవళవర్ణాలను విరజిమ్ముతున్నాయి. చిన్నపిల్లలు అపరిమిత సంతోషంతో కేకలువేయు

సాగారు. మేరియాకూడా రెండుపర్యాయాలు సంతోషంతో సున్నితంగా కేకలు వేసింది. లావ్రెటస్కీ లీజాలుమాత్రం అందరికన్నా తక్కువగా చేపలుపట్టారు. బహుశా ఇందుకు కారణం తక్కినవారంత శ్రద్ధ చేపలు పట్టడంలో వీరుచూపకుండా తెప్పలను నీటిఅంచుదాకా రానిస్తుండడం అయి ఉండవచ్చు. ఎత్తుగాఎదిగిన రెల్లుదుబ్బులు మెల్లగా వారిచుట్టూ కదలాడుతున్నాయి. కొలనునీరు ధగధగలాడిపోతోంది. వారూ మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. లీజా చిన్నతెప్పమీదనుంచుంది. లావ్రెటస్కీ వంగిన చెట్టుకొమ్మమీద కూర్చున్నాడు. లీజా తెల్లటివస్త్రంధరించి నడుముకు పటకా బిగించింది. ఒకచేతిలో గడిటోపీని ఊపుకూ, రెండోచేతిలో గాలం పట్టుకుంది. లావ్రెటస్కీ ఆమె పార్శ్వభాగంవంకేసీ, చెవులవెనుకకు తోసుకున్న జుట్టుకేసీ, సూర్యరశ్మిపడుతున్న మృదుకపోలాలకేసీ తదేకదీక్షగా చూచి "నా కొలను ప్రక్కన నిలిచిన నువ్వు యెంత మనోహరంగావున్నావు" అనుకున్నాడు. లీజా నీటికేసి చూస్తోంది. ఆమె నేత్రాలు కుంచుకుపోయినట్లుగనో, మందహాసం చేస్తున్నట్లుగనో ఉన్నాయి. సమీపంలోని నిమ్మచెట్టు నీడ వారిమీదపడుతోంది.

"కిందటిసారి మనం మాట్లాడుకున్న విషయం బాగా ఆలోచించి నువు చాలాచాలా మంచిదానవనే నిర్ణయానికి వచ్చాను" అంటూ లావ్రెటస్కీ సంభాషణ మొదలుపెట్టాడు.

"నేను నీ కలాంటిభావం కలిగించాలనుకోలేదు..." అని లీజా ప్రారంభించిందిగాని కలవరపడిపోయింది.

"నువ్వు మంచిదానివి. నేను పట్టి మోటుమనిషిని. కాని నువ్వంటే అందరికీ అంత ప్రేమయెందుకో నేను వూహించుకోగలను. ఉదాహరణకి లెమ్ విషయం తీసుకుందాం. లెమ్‌కి నువ్వంటే ఎంతో ప్రేమ."

లీజా కనుబొమ్మలు తటాలున ఎగురవేసింది. ఇష్టంలేనిమాటలు విన్నప్పుడు ఇలా కనుబొమలు ఎగుర వేయడం ఆమెకి అలవాటు.

"యివాళ లెమ్‌మీద నాకు జాలేసింది." అన్నాడు లావ్రెటస్కీ తొందరతొందరగా. "పాపం! [illegible]! యవ్వనంలోవుండి శక్తిసామర్థ్యాలు చూపకపోతే సహించవచ్చు. కాని వృద్ధాప్యంలో శక్తిసామర్థ్యాలులేకపోవడం మహాదారుణం. యింకా అధ్వాన్నమైన విషయం, శక్తి

వుడిగిపోతోందని గుర్తించడం. పాపం! ముసిలాడికిది పెద్దదెబ్బ. చూడు, ఆచేప గాలానికి పడ్డట్టుంది..." కొంచెంసేపైనాక

"పాన్షిన్ మంచి పాటవకటి కూర్చాడట గా?"

"ఆ-యేదో చిన్నపాట. పర్వాలేదు."

"నీ అభిప్రాయమేమిటి? ఆయన మంచి పాటగాడేనా?"

"ఆయనికి సంగీతంలో మంచి జ్ఞానం వుందనుకుంటాను. కాని సంగీతాన్ని ఆయన అదేపనిగా పెట్టుకోలేదు."

"సరే-ఆయన మంచివాడేనా?"

లీజా నవ్వి లావ్రెటస్కీకేసి తటాలునచూచి "యెంత చిత్రమైన ప్రశ్న వేశావ్?" అని గాలంవేసి తిరిగి బయటకులాగింది.

"యిందులో చిత్రమేముంది? యేదో నీకు బంధువును. యీప్రాంతాలకి మొన్నమొన్ననే వచ్చాను. అందుకని తెలుసుకుందామని అడిగా."

"బంధువ్వా?"

"ఆ-మేనమామనవుతా."

"పాన్షిన్‌ది దయార్ద్రహృదయం. తెలివిగలవాడు. మాఅమ్మకి ఆయనంటే మహాయిష్టం."

"నీకు యిష్టంలేదూ?"

"ఆయన మంచివాడు. యెందుకు యిష్టంవుండదు!"

"అయినా?" అని గొణుక్కుని లావ్రెటస్కీ మౌనంవహించాడు. విచారం, నిరసన ఒక్కమారే అతనిముఖంలో తళుక్కుమన్నాయి సాపేక్షగా ఆమెకేసి లావ్రెటస్కీ దృష్టినిలిపేసరికి లీజా కలవరపడిందిగాని మందహాసం చేస్తూనే ఉంది.

"సరే-వారు సుఖపడతారు." అని తనలోతాననుకుని మొహం అవతలకు తిప్పుకున్నాడు లావ్రెటస్కీ. లీజా సిగ్గుపడింది.

"ఫియొడోర్ ఇవనోవిచ్! మీరు పొరబడుతున్నారు. మీరు అలా అనుకో...మీకు పాన్షిన్అంటే యిష్టంలేదా?" అని హఠాత్తుగా లీజా అడిగింది.

"ఊహూ-నాకు యిష్టంలేదు."

"యెందుకని?"

"అతనికి హృదయమంటూ వుందనుకోను."

లీజా మొహంలో మందహాసం మాయమైంది. చాలాసేపు ఊరుకుని, "మనుషుల్ని చాలా నిశితంగా పరీక్షించి మరీ విలవగట్టడం మీకు అలవాటు!" అంది లీజా.

"ఊహుఁ-మనుషుల్ని నిశితంగా పరీక్షించడానికి నాకేం హక్కుంది. పైగా నేనే ఆత్మపరీక్ష చేసుకోవాలసివుంది. నాబతుకు నవ్వులపాలైందని మర్చిపోయావా?......ఆ-నువు నాకిచ్చిన వాగ్దానం నెరవేర్చావా?"

"యేమిటా వాగ్దానం?"

"నాబదులు ప్రార్థనచేశావా?"

"ఆ-అంతేకాదు. రోజూ నీబదులు ప్రార్థనచేస్తూనేవున్నా. యీ విషయం అంత చులకనగా చూడకు."

ప్రార్థనలను చులకనగా చూడాలని మనసులోకూడా యెన్నడూ అనుకోలేదనీ, ఇతర్ల విశ్వాసాలను తను అతిగా గౌరవిస్తానని లావ్రెటస్కీ లీజాకు నమ్మబల్కాడు. తర్వాత మతంమీద, మానవచరిత్రలో దాని స్థానంమీద, క్రైస్తవమత ప్రాముఖ్యంమీదా లావ్రెటస్కీ మాట్లాడాడు.

"ప్రతివాడూ క్రిస్టియన్ కావాలి" అంటూ లీజా ప్రారంభించింది కొంచెం ప్రయాసతో. "పరమాత్మని... భౌతిక పదార్థాలని తెలుసుకోడానికి కాకపోయినా ప్రతిమనిషీ యెప్పుడో ఒకప్పుడు మరణించాల్సి వుంది కాబట్టి."

లావ్రెటస్కీ ఆశ్చర్యంతో లీజాకేసి చూశాడు. వారిద్దరిచూపులూ కలుసుకున్నాయి.

"నువు యిపుడన్నమాట యేమిటీ?"

"ఆమాట నేనొక్కదాన్నే అనడంలేదు."

"ఊ - అలాగా... మరణాన్నిగురించి మాట్లాడవలసిన అవసరమిపుడేమొచ్చింది?"

'నాకు తెలీదు. కాని-యెందుకో తరచు మరణాన్నిగురించి ఆలోచిస్తుంటాను.'

"తరుచు గానా?"

"అవును"

"ఈ పళంగా నినుచూచినవాడెవడూ అనుకున్నడు. నీమొహం యెంతో ఆనందంతో వెలిగిపోతోంది. చిరునవ్వు—'

"అవును. యిపుడు నాకు చాలాఆనందంగావుంది."

ఆమె రెండుచేతులూ పట్టుకుని గట్టిగా నలిపివేయాలనే కాంక్ష లావ్రెటస్కీలో రేకెత్తింది.

'లీజా! లీజా!' అనిపిలచింది మేరియా డిమిట్రియేవ్నా. 'రా, యిలారా! నేనుపట్టిన యీ చేపనుచూడు.'

"వస్తున్నానమ్మా!" అంటూ లీజా తల్లిచెంతకు వెళ్ళింది. లావ్రెటస్కీ అలా నేకూర్చుండి పోయాడు "యిదివరలో జీవితానుభం యేమీ లేనట్లే నేనిమెతో మాట్లాడుతున్నా" అని తలపోయసాగాడు. లీజా వెళ్ళేముందు హాటును ఒకకొమ్మకు తగిలించి వెళ్ళింది. కొద్దిగా నలిగిపోయిన కోటు రిబ్బన్లకేసి లావ్రెటస్కీ ప్రేమతో, ఉద్వేగంతో తేరిపారజూచాడు. లీజా తొందరలోనే వచ్చి తెప్పఎక్కింది.

"వాల్డిమిర్ నికొలాయిచ్ పాన్షిన్‌కి హృదయమంటూ లేదని యెందుకు అనుకుంటున్నావు?" అని కొన్ని నిమిషాలతర్వాత అడిగింది.

"నేను పొరబడి వుండచ్చుని యిదివరకే చెప్పాగా. అయినా కాలమే అన్ని సంశయాలూ తీరుస్తుంది."

లీజా ఆలోచనాసాగరంలో పడింది. లావ్రెటస్కీ వాసిలవస్కోయెలో తన జీవితంగురించీ, మైకెలెవిచ్‌ని గురించీ, ఆంటన్‌గురించీ చెప్ప నారంభించాడు. లీజాతో మాట్లాడాలనీ, తనహృదయం విప్పిచెప్పాలనీ బలీయమైనకోరిక అతనికి కల్గింది. ఆమె ఎంతో ఆకర్షణీయంగావుంది. ఇతరులుచెప్పేది శ్రద్ధగా వింటుంది. మధ్యమధ్య ఆమె వెలిబుచ్చే అభిప్రాయాలు ఎంతో వివేకంతో కూడివవని అతనికి అనిపించింది. ఈ ముక్క లావ్రెటస్కీ ఆమెతో అన్నాడు. లీజాకి ఆశ్చర్యం వేసింది. "నిజంగానా? మాదాని నాసాట్యకిలాగానే నాకూ 'స్వంతమాటలు' అంటూలేవనే అభిప్రాయంతోనే యింతవరదాకావున్నా. ఆమె తన ప్రియుడితో ఒక మాట అందిట... 'నేను నీకు విసిగెత్తిస్తానేమో! నువెంత చక్కగానో మాట్లాడతావు, కాని మాట్లాడడానికి నాకుమాత్రం స్వంతమాటలంటూలేవు! అని"

"దానితల్లికడుపు చల్లగా నిజంచెప్పింది"అనుకున్నాడు లావ్రెటస్కీ.

# ౨౮

సాయంకాలం కావస్తోంది. మేరియాడిమిట్రియెవ్నా ఇక ఇంటికి వెళ్ళాలనే అభిప్రాయం వెల్లడించింది. చిన్న పిల్లన్ని చేపలగుంటనించి బల వంతాన లాక్కొచ్చారు. ప్రయాణసన్నాహాలు పూర్తిఅయాయి. లావ్రెటస్కీ మధ్యదారిలో కలుసుకుంటాననిచెప్పి గుర్రానికి జీను కట్టమని సేవకుల కాజ్ఞాపించాడు. మేరియాని బగ్గీలోకి ఎక్కిస్తుండగా లావ్రెటస్కీకి లెమ్‌విషయంగుర్తు వచ్చింది. కాని లెమ్ ఎక్కడా కనిపించలేదు. చేపలు పట్టడం పూర్తికాగానే లెమ్ ఎక్కడికో చక్కాబోయాడు. అంత ముసిలి వాడైనా ఆంటన్ మంచి ఉత్సాహంతో బగ్గీతలుపులు మూసి "యికపోనీ" అన్నాడు. బగ్గీబయలుదేరింది. వెనక సీటులో మేరియాడిమిట్రియెవ్నా, లీజా కూర్చుచున్నారు. ముందుసీటులో చిన్నపిల్లలిద్దరు, వాళ్ళదాది కూర్చున్నారు. సాయంకాలం, వెచ్చగాఉంది. రెండువైపులా బగ్గీకిటికీ లు మూసేశారు. లావ్రెటస్కీ బగ్గీపక్క, లీజా వైపున గుర్రంమీద ఎక్కి వెంట వెడుతున్నాడు. బగ్గీ తలుపుమీద చెయ్యివేసి, మెల్లగా నడుస్తున్న గుర్రం మీద కళ్ళెం వదిలేశాడు. మధ్యమధ్య లీజాతో ఒకటి రెండు మాటలు మాటాడాడు. సూర్యాస్తమయ కాంతులు మాసిపోతున్నాయి. చీకటి పడింది. గాలిలో వెచ్చదనంహెచ్చింది. మేరియా కునికిపాట్లుపడుతోంది. చిన్నపిల్లలు, దాది నిద్రపోయారు. బగ్గీకుదుపులేకుండా తొందరతొందరగా

సాగిపోతోంది. లీజా ముందుకు వంగింది. ఉదయిస్తున్న చంద్రుడి వెన్నెలలో ఆమె మొహం వెలిగిపోతోంది. సువాసనలు విరజిమ్ముతూ వాయువు ఆమె నేత్రాలమీద, చెక్కిళ్ళమీద విహరిస్తోంది. ఆమెకెంతో ఆనందం కలిగింది. ఆమెచెయ్యి బగ్గీతలుపుమీద, లావ్రెటస్కీ చేతికి పక్కగాఉంది. అతనూ ఎంతో ఆనందం అనుభవిస్తున్నాడు. బగ్గీతోపాటు గబగబా వెళుతూ తేనెలొలికే ఆయువతి మోహంనించి లావ్రెటస్కీ దృష్టిమరల్చలేదు. మృదుమధురస్వరంతో మంచిమంచి విషయాలు ఆ యువతి చెబుతుంటే విన్నాడు. సగందూరందాకా వెళ్ళినా అతనికాసంగతి తెలియనేలేదు. మేరియాను లేపడానికి ఇచ్ఛగించక లీజాచెయ్యి మృదువుగాఒత్తి "మనం, యిక స్నేహితులం కదూ?" అన్నాడు. లీజా తలూపింది. లావ్రెటస్కీ గుర్రాన్ని ఆపాడు. బగ్గీఊగుతూ, కిందికీ మీదికీ ఎగిరిపడుతూ సాగిపోయింది. లావ్రెటిస్కీ నెమ్మదిగా ఇంటిమొహంపట్టాడు. ఆవేసవి నిశారమణీయత అతని హృదయంలో ప్రవేశించింది. ప్రపంచమంతా అతనికి ఎంతో విచిత్రంగా, ఎంతో మధురంగా తోచింది. అతనికి దగ్గరగా, దూరంగాఉన్న ప్రతిదీ గాఢప్రశాంతంలో మునిగిపోయింది. దృగ్గోచరమైన వాటి లోతుపాతులు తెలుసుకోలేకపోయినా అక్కడినించి చాలాదూరంచూడవచ్చు. ఆ ప్రశాంతం యవ్వనవసంతతరంగాలతో, జీవకళతో ఉట్టిపడుతున్నట్లుంది. లావ్రెటస్కీఎక్కిన గుర్రం అటూయిటూ ఊగుతూ త్వరత్వరగానడుస్తోంది. దానినీడ పక్కగాపడి సాగిపోతోంది. దాని గిట్టల కదంలో ఎదో ఆకర్షణ ఉంది. కోలంకిపిట్ట కూత భావాలను రేకెత్తించి ఆకర్షిస్తోంది. వెన్నెలలో నక్షత్రాలు మాయమయాయి. అర్ధచంద్రుడు మింటప్రకాశిస్తున్నాడు. అతని కిరణాలు ఆకాశంలో నీలికాంతులు విరజిమ్ముతున్నాయి. అటునిటూ కదలాడుతున్న మేఘాలమీద కిరణాలు లేతపసుపుచాయలో అక్కడక్కడా పడుతున్నాయి. ఆనిశావాయువు లావ్రెటస్కీ కళ్ళను చెమ్మగిలచేసింది సర్వాంగాలను ఆవరించి స్వేచ్ఛగా అతని ఊపిరితిత్తులలో ప్రవేశించింది. లావ్రెటస్కీ మహాసంతోషంతో ఆ నిశావాయువును తాగివేశాడు. ఆసంతోషంలో పరమానందం అనుభవించాడు. "యిల్లలకగానే పండగైందా! తెలుసుకునేటట్టు చేస్తాను." అనుకున్నాడు. అయితే ఎవరినో, ఏమిటో పైకిమాత్రం అనలేదు......తర్వాత లీజానిగురించి తలపోయసాగాడు. పాన్షిన్‌ని ఆమె ప్రేమించి ఉండదని అనుకున్నాడు. వేరేపరిస్థితులలో

తానామెను కలుసుకున్నట్లయితే ఏంజరిగేదో భగవంతుడికే తెలియాలి' ఆమెకి స్వంత మాటలులేవనే లెవ్ అభిప్రాయంతో ఏకీభవించాడు. ఏమైనప్పటికీ అముక్కపూర్తిగా సత్యంకాదు. ఆమెకీ స్వంతమాటలంటూ ఉన్నాయి. ... "అంత తేలికనుకోకు." అనేమాటలు లావ్రెటస్కీకి జ్ఞాపకంవచ్చి తలవంచుకుని చాలాసేపు ప్రయాణం సాగించాడు. తర్వాత ఆలోచనలు కట్టిబెట్టి,

"పూజించినదాన్నంతా బూడిదచేశానప్పుడు
బూడిదచేసినదంతా పూజిస్తున్నానిప్పుడు"

నిఅ పాడుతూ కొరడాఝుళిపించి దౌడుతీయసాగాడు

ఇంటికి చేరుకోగానే గుర్రంమీదనించిదిగి కృతజ్ఞతా పూర్వకంగా మందహాసంచేస్తూ చుట్టూపరికించాడు. కొండమీద, లోయలమీద నిశ—దయార్ద్రహృదయ—నిశ్శబ్దంగా పవ్వళించి ఉంది. దాని అగాధాలనించో-ఆకాశాన్నుంచో, మరి పాతాళాన్నుంచో ఎవరూచెప్పలేరు—మలయ మారుతం వీవసాగింది. లావ్రెటస్కీ మనసులో లీజాని స్మరించి ఇంటిమెట్లమీదుగా పరుగెత్తాడు.

మర్నాడు మహామందకొడిగా గడిచిపోయింది. ఉదయాన్నే తుప్పర ప్రారంభమైంది. లెమ్ మొహంముడుచుకొని మౌనవ్రతం పట్టినవానిలా పెదవులు కదల్పనేలేదు. పడుకోబోయేటపుడు, రెండు వారాలనించీ బల్లమీద అలాగేపడున్న ఫ్రెంచిపత్రికలకట్ట లావ్రెటస్కీ కూడా తీసుకెళ్ళాడు. పత్రికలు విప్పి ఎగాదిగాచూశాడు. కొత్తవార్తలేమీ కనిపించలేదు. పత్రికలను పక్కన పెట్టేద్దామనుకుంటూండగా వేటుతిన్న వానిలాగు చటుక్కున పక్కమీదనించి లేచాడు. ఒకపత్రికలో మన పాతస్నేహితుడు మాన్సియర్ జూల్స్ ఒక వ్యాసంలో "విచార కరమైనవార్త" ఒకటి తెలియజేశాడు. అందాలరాణీ మదాండిలావ్రెటస్కీ హఠాత్తుగా చనిపోయిందనీ, తనకీ వార్త ఇపుడిపుడే చేరిందనీ ఆవ్యాసంలో జూల్స్ వెల్లడించాడు.

లావ్రెటస్కీ బట్టలువేసుకుని తోటలోకివెళ్ళాడు. తెల్లవార్లూ అక్కడే అటూయిటూపచార్లు చేస్తూనే ఉన్నాడు.

# ౨౮

ఆ మర్నాటి ఉదయం టీ తాగుతూ తిరిగి వెళ్ళటానికి గుర్రాలను సిద్ధం చేయించమని లెమ్ లావ్రెట్‌స్కీని కోరాడు. "పాఠాలు మళ్ళీ ప్రారంభించాలి. కాలం యిప్పటికే చాలా వృథా అయిపోయింది." అన్నాడు. లావ్రెట్‌స్కీ వెంటనే జవాబివ్వలేదు. ఆలోచనలో మునిగిపోయినట్టున్నాడు. "సరే – నేనూ వస్తాను." అన్నాడు చివరికి. చిరుబురులాడుతూ, నౌకర్ల సాయం అపేక్షించకుండానే లెమ్ తన చిన్న సూటుకేసు సర్దుకున్నాడు. స్వరకల్పన కాగితాలను చించి, తగలబెట్టాడు. బగ్గీకి గుర్రాలను పూన్చారు. లావ్రెట్‌స్కీ గదిలోంచి బయటికి వస్తూ జూల్ వ్రాసిన వ్యాసం ఉన్న పత్రికను జేబులో పెట్టుకున్నాడు. దారివెంట ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. వారి వారి ఆలోచనలలో నిమగ్నులై ఉన్నారు. ఒకరి ఆలోచనలకొకరు అడ్డం రానందుకు సంతోషించారు. సామాన్యంగా రష్యాలో మిత్రులు ఎవరి తోవను వారు వెళ్ళేటప్పుడు ప్రశాంతంగా వెడతారు. అలాగే వీరిద్దరూ ప్రయాణం సాగించారు. లెమ్ బగ్గీదిగి సూటుకేసు తీసుకుని లావ్రెట్‌స్కీతో కరచాలనం చేయకుండానే (రెండు చేతుల్లోనూ సామానుంది,) అతనికేసి చూడనైనా చూడకుండా రష్యన్ భాషలో "నమస్కారం" అని చక్కాబోయాడు. లావ్రెట్‌స్కీ కూడా నమస్కారం చెప్పి తన గదికి పోనిమ్మని బగ్గీవాణ్ణి ఆదేశించాడు (లావ్రెట్‌స్కీ పట్టణంలో గది అద్దెకు

తీసుకున్నాడు). ఉత్తరాలురాసుకుని, అదరా బాదరా భోజనం చేసి మేరియా ఇంటికి వెళ్ళాడు అతను వెళ్ళేసరికి కచేరీగదిలో పానిన్ ఒక్క ఉన్నాడు. మేరియా ఇప్పుడేవస్తుందని చెప్పి పాన్షిన్ ఎంతో సుహృద్భావంతో సంభాషణ ప్రారంభించాడు. ఆరోజువరకు లావ్రెటస్కీ మీద దయ కురిపిస్తున్నవానిలా పాన్షిన్ ప్రవర్తించాడు. కాని లీజా, లావ్రెటస్కీ ఇంటికి తాము వెళ్ళడం మొదలైన విషయాలు చెప్పి "అతనెంతో తెలివిగలవాడు, అతిమంచివాడు" అని పొగడేసరికి ఇకనేం ఆ 'అతిమంచివాణ్ణి' తనవైపు తిప్పుకోవల్సిందేననుకున్నాడు. మేరియా కుటుంబమంతా వానిరాకనహ్కాయెంతగా ఆనందించారో వర్ణిస్తూ పాన్షిన్ లావ్రెటస్కీని ప్రస్తుతించసాగాడు. తర్వాత అలవాటు ప్రకారం తిరిగీ తన స్వంతవిషయాలకొచ్చి తనకు మీద ఆసక్తిమెండో వివరిస్తూ జీవితంమీద తనదృక్పథం, ప్రపంచ ప్రభుత్వసేవ, రష్యాభవిశవ్యంమీద అభిప్రాయాలు, రాష్ట్రగవర్నర్లను కట్టలో పెట్టుకోవలసిన ఆవశ్యకత, పీటర్సుబర్గ్‌లో తనకుఅప్పగించిన బాధ్యతలు తెలియజేశాడు. క్లిష్టపరిపాలనా సమస్యలను, రాజకీయ సమస్యలు ఇట్లే పరిష్కరించవచ్చునంటూ చాలాసేపు ఉపన్యాసందంచాడు. "నా ప్రభుత్వంలో నేనుంటే, ఇలాచేసేవాడిని, అలాచేసేవాడిని. నీబోటి తెలివిగలవాళ్ళు నాతో ఏకీభవిస్తారు." అని పదేపదే చెప్పాడు. ఈ మహా ఉపన్యాసాన్నంతా లావ్రెటస్కీ ప్రశాంతంగా విన్నాడు. పాన్షిన్ అందగాడు, మంచితెలివైనవాడు. మందహాసం కాంతులు జిమ్ముతుంది. స్వరం మధురమైంది. చూపుల్లో జిజ్ఞాసగోచరిస్తుంది. అయితేనేం, పాన్షిన్ లావ్రెటస్కీకి నచ్చలేదు. పాన్షిన్ సూక్ష్మగ్రాహి. తనఉపన్యాసం లావ్రెటస్కీకి ఆనందం కలిగించలేదని గ్రహించిన వెనువెంటనే ఏదోసాకుతో తప్పుకున్నాడు. అలా తప్పుకుంటూనే లావ్రెటస్కీ చాలా మంచివాడైనా అతనిది వక్రబుద్ధి అని మనసులో నిశ్చయించుకున్నాడు.

జెడీయనోవస్కీ వెంటరాగా మేరియా కచేరీగదిలో ప్రవేశించింది. తర్వాత మార్ఫా, లీజావచ్చారు. వారివెనుక తక్కినవాళ్ళు అందరొచ్చారు. కొద్దిసేపటికి సంగీతమంటే చెవులుకోసుకునే బెలెనిట్స్యనా వచ్చింది. బెలెనిట్స్యనా పొట్టిమనిషి. ముఖం అందమైందేకాని అలిసిపోయినట్లు. గలగలలాడే నల్లటిగౌను, బంగారపుగాజులూ ధరించింది. చేతిలో

విసనకర్రఉంది. ఆమెభర్తకూడా వచ్చాడు. అతను బొద్దుపాటి మనిషి. పాలిపోయిన కనుబొమలు, మొద్దుపెదవులు, వాటిపై తెచ్చిపెట్టుకున్న చిరునవ్వు. ఇదీ అతని ఆకారము. అతనిభార్య పదిమందిలో ఎన్నడూ అతనితో మాట్లాడేదికాదు. కాని ఇంటిదగ్గర ఎంతో ఆప్యాయంగా మాట్లాడేది. ఇంతలో పాన్షిన్ తిరిగివచ్చాడు. గదిఅంతా జనంతో, రణగొణధ్వనితో నిండిపోయింది. ఇంతమంది ఒకచోట కూడడం, ఈ అల్లరీ లావ్రెటస్కీకి సరిపడలేదు. బెలెనిట్స్యనా రెప్పవాల్చకుండా తనవంక చూచేసరికి లావ్రెటస్కీ వళ్ళుమండిపోయింది. లీజా మూలంగా కాకపోతే తక్షణమే అక్కడినించి లేచి చక్కాబోయేవాడే. రహస్యంగా లీజాతో ఒకమాట చెప్పాలనుకున్నాడు. కాని తగుసమయం దొరకలేదు. మనసులో ఆనందిస్తూ, కంటితో లీజానిచూస్తూ సంతృప్తి పడవలసివచ్చింది. ఆనాడున్నంత రమణీయంగా, అంత మధురంగా ఆమె ముఖమెన్నడూ లేదనిపించింది. బెలెనిట్స్యనాముందు లీజా మరీ ప్రకాశిస్తోంది. బెలెనిట్స్యనా కుర్చీలో కూర్చుని ఊరికే ఆడిపోతోంది బుజాలు ఎగరవేస్తోంది. వెర్రిగా పళ్ళికిలిస్తోంది. కళ్ళు కుంచించుకుని మళ్ళీ తెరుస్తోంది. లీజామాత్రం ప్రశాంతంగా కూర్చుంది. దొంగచూపులు చూడలేదు. నవ్వలేదు. మార్ఫా, బెలెనిట్స్యనా, జెడియొనొవస్కీ, షేరియా వెనకాలనే కూర్చున్నారు. జెడియొనొవస్కీ ఆట తెగనీయడంలేదు. తరుచు తప్పు ఆడాడు. కళ్ళు మిణుకరించి జేబుగుడ్డతో ముఖం తుడుచుకున్నాడు. పాన్షిన్ ఏడుపుముఖంపెట్టి నర్మగర్భంగా, విషాదస్వరంతో, తాపులుతిన్న ప్రతిభాశాలిలాగా మాట్లాడాడు. బెలెనిట్స్యనా అతనిముందు కులుకుతూ, తక్కుతూ, తారుతూ పాన్షిన్ని అతను రచించిన గేయం పాడమని బలవంతపెట్టింది. కాని పాన్షిన్ పాడలేదు. లావ్రెటస్కీ అక్కడఉండడం అతనికిచిరాకుకలిగించింది. లావ్రెటస్కీకూడా ఎక్కువగా మాట్లాడలేదు. అతని ముఖవైఖరి వింతగాఉండి లీజాకి విభ్రమం కలిగించింది. తనతో ఏదో అతను చెప్పదలచాడనేవిషయం ఆమె పసిగట్టిందిగాని అడగలేకపోయింది. కారణం ఆమెకే తెలియదు. టీ తేవడానికి పక్కగదిలోకి వెడుతూ అప్రయత్నంగా ఆమె లావ్రెటస్కీకేసి తలతిప్పి చూసింది. వెంటనే అతను ఆమెవెంట లోనికివెళ్ళాడు.

“యేమిటీ, నీవాలకం యిలావుందేం” అని అడిగింది లీజా.

"యేమిటీ?"

"నీ వాలకం మామూలుగా లేదు."

లావ్రెట్‌స్కీ బల్లమీదకివంగి అన్నాడు: "నీకో వార్త చెప్పాలని యిందాకటినించీ కాచుక్కూచున్నా. కాని యిప్పుడు ఉహుఁ—నోటితో చెప్పలేను. యిదిగో, యీ వ్యాసంలో గుర్తుపెట్టిన యీ పేరా చదువుకో." అంటూ తనతో కూడా తెచ్చిన పత్రిక ఆమెకి అందించాడు: "యిదంతా రహస్యంగా అట్టేబెట్టు. రేపుఉదయం మళ్లీవస్తా."

లీజాకేమీ అర్థంకాలేదు...ఇంతలో పాన్షిన్ గదిగుమ్మంలో ప్రత్యక్షమయాడు. లీజా పత్రికను జేబులో పెట్టుకుంది.

"ఓబర్‌మన్ చదివావా. ఎలిజవెటామైకలోవ్నా?" అని పాన్షిన్ చింతాకులితస్వరంతో ప్రశ్నించాడు లీజా ఏదోగొణిగి మేడపైకివెళ్ళింది. లావ్రెట్‌స్కీ కచేరీగదిలోకివెళ్ళి పేకాటదగ్గరికి చేరుకున్నాడు. మేరియా చిరాకుతో మండిపడుతూ జెడియొనొవస్కీ పేకాటలో ఎందుకూ పనికిరానివాడని టోపీకుచ్చులు ఆడించుకుంటూ చెప్పింది. "పేకాడటం వుందే—అదేం చాడీలు చెప్పడమంత తేలికగాదు." అన్నది.

ఆ అపరాధి (జెడియొనొవస్కీ) గుడ్లుమిటకరిస్తూ మొగం తుడుచుకోసాగాడు. లీజావచ్చి ఒకమూలకూర్చున్నది. లావ్రెట్‌స్కీ ఆమెకేసిచూశాడు. ఆమెకూడా అతనికేసిచూసింది. ఇద్దరూ స్తంభించిపోయారు. ఆమె ముఖంలో కలవరము, రహస్యదోషారోపణ అతనికి గోచరించాయి. ఆమెతో మాట్లాడాలని యత్నించాడుగాని మాట్లాడలేకపోయాడు. పట్టి అతిథిగా ఆమెతోపాటు ఆగదిలో ఉండలేక వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు. వెళ్ళుతున్నానని చెపుతూ రేపుమళ్లావస్తాననీ, ఆమె మైత్రిలో విశ్వాసముంచాననీ ఎలాగో ఒకలాగ అనగల్గాడు.

"సరే. రా" అంది లీజా అదే కలవరంతో.

లావ్రెట్‌స్కీ వెళ్ళిపోగానే పాన్షిన్‌కి ఉత్సాహంపొటమరించింది. జెడియొనొవస్కీకి పేకాటలో సలహాలివ్వడం ప్రారంభించాడు. బెలెనిట్స్యనాతో పరియాచకాలాడాడు. తనపాట పాడాడు. కాని లీజాతో ఇదివరలోలాగానే నర్మగర్భంగా విషాదస్వరంతో మాట్లాడాడు.

ఆరాత్రంతా లావ్రెటస్కీకి నిద్రపట్టలేదు. అతనికి ఏచింతాలేదు. మనసు ప్రశాంతంగాఉంది. అయినా నిద్రపట్టలేదు. అతను గతకాలపు స్మృతులను నెమరువేసుకోలేదు. గడచిన తనజీవితాన్ని తేరిపారజూచుకున్నాడు. హృదయంభారంగా, క్రమబద్ధంగా కొట్టుకుంటోంది. గంటలకు గంటలు గడచిపోయాయి. కాని అతనికి నిద్రపోవాలనిపించలేదు. మధ్య మధ్య ఒకే ఒక ఆలోచన–'అది నిజం కాకపోవచ్చు' ననే ఆలోచన అతని మనసులో మెరిసింది. అలా మెరసినపుడల్లాఆగి, తలవంచుకుని తిరిగి తన జీవితాన్ని సమీక్షించుకోసాగాడు.

# ౨౯

ఆ మరునాడు ఉదయం లావ్రెటస్కీ లీజాఇంటికి వెళ్ళాడు. మేరియా అతనికి పెద్దమర్యాదేం చేయలేదు. "ఊ-అదేపనిగా వస్తున్నాడేం చెప్మా!" అనుకుంది. నిజానికి లావ్రెటస్కీఅంటే ఆమెకి పెద్ద త్య్వమేమి లేదు. కాని పాన్షిన్ ఎంతచెబితే ఆవిడకిఅంత. ఆకిందటిరాత్రి పాన్షిన్ అదితలో లావ్రెటస్కీని పొగుడుతూమాట్లాడాడు. మేరియా లావ్రెటస్కీని ఇంటికివచ్చిన అతిథిగాలెక్కించలేదు. ఇద్దరూఒకేకుటుంబానికి చెందినవారు. దగ్గర బంధువుని పెద్ద మర్యాదచెయ్యడం అవసరమని ఆమె భావించలేదు. అరగంట అయింతర్వాత లావ్రెటస్కీ లీజాతోకలిసి పెరడులో షికారు చేయసాగాడు. వారికి కొద్దిదూరంలో లెనోచ్కా, షురోచ్కాలు పూల తోటలో పరుగిడుతున్నారు.

లీజా మామూలుగానే ప్రశాంతంగాఉంది. కాని ముఖంపాలిపోయి ఉంది. జేబులోంచి పత్రికతీసి లావ్రెటస్కీకి అందిస్తూ "ఘోరం!" అంది. లావ్రెటస్కీ జవాబియ్యలేదు.

"బహుశా నిజంకాకపోవచ్చు." అంది లీజా.

"అందుకనే యెవరితోనూ చెప్పొద్దన్నా."

లీజా కొంచెం ముందుకుసాగి వెళ్ళుతూ "నీకు బాధగా లేదూ?" అని అడిగింది.

"యేమిటో, నామనసు నాకే తెలియడంలేదు."
"అయితే నువ్వామెను యిదివరలో ప్రేమించావుకదూ?,'
"ఆ_"
"గాఢంగా ప్రేమించావుకదూ?"
"ఆ"
"ఆమెచావు నీకు బాధాకరంగాలేదూ?"
"అది యెన్నడో చచ్చిపోయినట్టుగానే నేను భావించుకున్నాను."
"అలాభావించుకోడం మహాపాపం! ... కోప్పడకు, నన్ను స్నేహితురాలి వన్నావుగా! స్నేహితురాలు యేవన్నాచెప్పచ్చు. నాకుమాత్రం యీచావు మహాఘోరం అనిపిస్తోంది...నిన్న నీముఖకవళికలు యేం బావుండలా... మొన్న నేగదూ ఆమెని తిట్టిపోశావు. ఆవేళటకి ఆమె చని పోయేవుంటుంది. ఘోరం. భగవంతుడి ఆగ్రహానికి గురైనావు."
లావ్రెటస్కీ వివపునవ్వునవ్వుతూ, "ఫలానా" ఇపుడు నాకుస్వేచ్ఛ లభించింది" అన్నాడు. లీజా వణికిపోతూ "అలా అనకు. స్వేచ్ఛ లభించి యేంలాభం? యిపుడు నువ్వావిషయం ఆలోచించకూడదు. నువు క్షమార్పణ..."
"నేను యెన్నడో క్షమించాను" అన్నాడు లావ్రెటస్కీ దిసుగులో చెయ్యి ఊపుతూ.
"అదికాదు నువునన్ను అపార్థంచేసుకున్నావు. నువు క్షమార్పణ కోరాలి."
"యెవరిని కోరాలి?"
"భగవంతుణ్ని. భగవంతుడుకాకపోతే మనల్ని యెవరు క్షమించ గలరు."
లావ్రెటస్కీ ఆమె చెయ్యి పట్టుకుని, "అ-ఎలిజవెటామైకెలోవ్నా! యిప్పటికే నాకు తగినశాస్తి జరిగింది. నామాటనమ్ము, ప్రాయశ్చిత్తం చేసుకున్నా"
"నీమాట గట్టిగానమ్మడానికి వీల్లేదు. యీమధ్యనాతో మాట్లాడే టపుడు ఆమెని క్షమించలేనన్నావు, అపుడే మర్చిపోయావా?" అంది లీజామెల్లగా. ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా సాగిపోతున్నారు. లీజా

హఠాత్తుగా ఆగి, "నీకూతురు సంగతేంచేశావు?" అని అడిగింది "లావ్రెటస్కీ ఉలిక్కిపడి మరేం ఆమర్దాపడక్కర్లేదు. నాలుగువైపులకి ఉత్తరాలు రాశాను. నాకూతురు భవితవ్యానికి...నీవన్నట్టు...యేంలోటులేదు. ఆదుర్దా పడకు." అన్నాడు లీజా మందహాసంచేసింది. ఆమందహాసంలో విషాదం ద్యోతకమైంది.

"అవును నిజం. స్వేచ్ఛలభించి యేంలాభం? నాకేం పోరుగుతుంది?" అన్నాడు లావ్రెటస్కీ.

"ఆ పత్రిక నీకెప్పుడందింది?" అని లీజా అడిగింది, లావ్రెటస్కీ ప్రశ్నకు జవాబు చెప్పకుండానే.

"మీరు మావూరు వచ్చివెళ్ళిన మర్నాడు."

"నువ్వు...నువ్వు ఒక కన్నీటి చుక్కయినా రాల్చావా?"

"ఊహుఁ-నిర్ఘాంతపోయాను. కాకపోయినా, కన్నీరెక్కడనుంచి వస్తుంది? నా హృదయంలోంచి పెకలించివేసి భస్మీపటలం చేసిన గతజీవితం గురించి దుఃఖించడమా? దాని చెడునడత నా సౌభాగ్యాన్ని నాశనంచేయ లేదు. నా జీవితంలో సౌఖ్యమనేది యెన్నడూ లేదని తెలియజేసింది. అంతే. దేనికి యేడవడం? ఆ-అవును యెవరికి తెలుసు? -పదిహేనురోజుల ముందు యీవార్త నాకు అందివుంటే యెక్కువగా విచారపడేవాడినేమో?"

"పదిహేనురోజుల క్రితమా? యీ పదిహేనురోజులలో యేం జరిగి వుండేని?" అని లీజా ప్రశ్నించింది. లావ్రెటస్కీ జవాబియ్యలేదు. హఠాత్తుగా లీజాని సిగ్గు ముంచేసింది.

"అవునవును. నువ్వు సరిగానే వూహించావు. యీ పదిహేనురోజులలో స్త్రీ పవిత్రహృదయపువిలువ కనుగొన్నాను. నా గతజీవితం నానుండి వెనక్కి వెనక్కి వెళ్ళిపోయింది..." అన్నాడు లావ్రెటస్కీ. అకస్మాత్తుగా. లీజా తత్తరపాటుచెంది లినోచ్కా, షురోచ్కాలు ఆడుకుంటున్న పూల తోట వైపుకి మెల్లగా నడవసాగింది.

"ఆ పత్రిక నీకు చూపించడం మంచిదేఅయింది." అన్నాడు లావ్రెటస్కీ, ఆమె వెనకాలే నడుస్తూ. "నీ నించి యేమీ దాచుకోలేను. నువ్వు అలాగే నాలో విశ్వాసముంచుతావని ఆశిస్తున్నా."

"అలానా?" అని లీజా ఆగి గొణిగింది. "అలాగైతే...ఊహుఁ-అసంభవం..."

"యేమిటి చెప్పు. చెప్పు!"

"నిజానికి నేను చెప్పగూడదు...సరే." అంది లీజా లావ్రెటస్కీ కేసి తిరిగి మందహాసం చేస్తూ. "సగం సగం దాపరికంవల్ల ప్రయోజనమేదిటి? నాకివాళ వో ఉత్తరం వచ్చింది తెలుసా?"

"పానిన్ దగ్గరనించికదూ?"

"అవును. నీకెలా తెలిసింది?"

"తన్ను వివాహమాడమని కోరుతూ రాశాడుకదూ?"

"అవును." లీజా లావ్రెటస్కీ కనులలోకి సూటిగా, గంభీరంగా చూసింది. లావ్రెటస్కీ కూడా అలాగే చూశాడు.

"సరే. యేమని జవాబిచ్చావు?" అని అడిగాడు ఎట్టకేలకు.

"యేం జవాబియ్యాలో నాకే తెలియడంలేదు" అన్నది లీజా కట్టుకున్న చేతులు పక్కకు జారవిడుస్తూ.

"నువ్వతన్ని ప్రేమించడంలేదా యేం?"

"అ-అతనంటే నా కిష్టమే. చక్కనివాడు."

"నువ్వు మూడురోజులకితం సరిగ్గా యీమాటలే అన్నావు. మనం ప్రేమ అని పిలిచే ప్రగాఢభావంతో ప్రేమిస్తున్నావా?"

"నువ్వనుకునే రీధంగా అయితే-లేదు."

"అంటే నువ్వతన్ని ప్రేమించడం లేదన్నమాట?"

"అవును. ప్రేమించడంలేదు. అదేమంత అవసరమా?"

"యేమిటీ?"

"మా అమ్మకి అతను నచ్చేడు. మంచివాడు. అతనిలో లోటు నాకేం కనిపించడం లేదు!"

"అయినా నువు తటపటాయిస్తున్నావు."

"అవును నీమూలంగానే, నువు చెప్పినమాటల మూలంగా-తటపటాయించవలసి వస్తోంది. మొన్న యేంచెప్పావో జ్ఞాపకముందా? కాని యిదంతా...బలహీనత..."

"ఓ-ఓడ్డా!" అని లావ్రెటస్కీ అరిచాడు. స్వరం కంపించింది. "విశుద్ధ విషయాలతో చెలగాటమాడవద్దు 'ప్రేమించకుండా అర్పించుకోను' అనే నా హృదయరోదనను బలహీనతగా భావించుకోకు. నువు ప్రేమించని వానిని వివాహమాడే బాధ్యత నెత్తిమీద పెట్టుకోవద్దు."

"నేను మాఅమ్మ చెప్పినట్లు చేస్తా. బాధ్యత నేనేం పెట్టుకోను." అని లీజా చెప్ప నారంభించింది.

"నీ అంతరాత్మ చెప్పినట్లు చెయ్యి. అదొక్కటే నీకు నిజంచెబు తుంది. అనుభవం, సబబు-అవన్నీ ధూళీదుమారం. యీ ప్రపంచంలోని ఆ ఒక్క సౌఖ్యాన్నీ నాశనం చేసుకోబోకు."

"నువేనా మాట్లాడేది ఫియొడోర్ ఇవనిచ్? నువు ప్రేమించి పెళ్ళిచేసు కున్నావుకదా యేంసుఖపడ్డావు?"

లావ్రెటస్కీ చేతులుపైకెత్తి, "నా విషయం యెత్తకు. యువకన్యా. చిన్నపుడు నన్ను పెంచడమే దారుణంగా పెంచారు. అటువంటపుడు ప్రేమలో పొరబాటుపడడం నీకర్థంకాని విషయం... యింతేకాదు. నను నేను మోసగించుకోవడమెందుకు? సుఖమంటూ యెరగనని యిప్పుడే నీతో చెప్పానుకాని నిజంకాదు. నేను సుఖపడ్డాను."

"ఫియొడోర్ ఇవనిచ్!" అంది లీజా మెల్లగా. (ఎవరి అభిప్రాయంతోనైనా ఏకీభవించలేకపోతే మెల్లగా మాట్లాడడం ఆమెకి అలవాటు. దానికి తోడు ఇపుడు మహాఆందోళనచెంది ఉంది.) "యీభూమ్మీద సౌఖ్యపడడం మనమీద ఆధారపడి లేదనుకుంటాను!"

"ఉంది. ఉంది. నామాటనమ్ము." (లావ్రెటస్కీ ఆమె చేతులుగట్టిగా పట్టుకున్నాడు. లీజా తెల్లబోయి కొంచెం భయపడ్డా అతనికేసి నిస్సంకోచంగా చూసింది.) "మన జీవితాలను మన చేతులారా నాశనం చేసుకోనంతవరకు యీ భూమ్మీద సౌఖ్యంఅంటూ వుంటుంది. కొంతమందికి ప్రేమ వివాహం దురదృష్టంగా పరిణమించవచ్చు. కాని నీ విషయంలో అలా కాదు. నీ గుణగణాలు మంచివి. నీ హృదయం పవిత్రమైంది. విద్యుక్త ధర్మం, ఆత్మ పరిత్యాగం మొదలైన పిచ్చిభావాలు పెట్టుకుని నువు ప్రేమించనివానిని వివాహమాడవద్దు... అలా వివాహమాడడం ఆత్మవిశ్వాసం లేకపోవడమే. యే సంబంధం అనుకూలంగావుంటే ఆ సంబంధం చేసుకోడంతో సమమైంది. నను విశ్వసించు. యిలా చెప్పడానికి నాకు హక్కువుంది. యీ హక్కుకోసం నే నెంతో త్యాగంచేశాను. యిక భగవంతుడు......"

లెనోచ్కా, షురోచ్కాలు, లీజాకి సమీపంలో నిల్చొని తనవంక ఆశ్చర్యంతో చూస్తున్నారనే పరిజ్ఞానంకలిగి లీజా చేతులువిడిచిపెట్టి 'క్షమించు' అని, తొందరతొందరగా అని, లావ్రెటస్కీ ఇంటివైపు బయలుదేరాడు.

"వొక్క విషయంమాత్రం చెబుతావిను." అన్నాడు మళ్ళీచక్కా వచ్చి. "తొందరపడి యే నిర్ణయమూ చేసుకోవద్దు. నే చెప్పిందంతా సావధానంగా ఆలోచించు. నమ్మకపోయినా, యెదో అనుకూలమైనచోట పెళ్ళి చేసుకుందామనుకున్నా పానిన్‌నిమాత్రం వివాహమాడకు. అతను నీకు తగినవాడు కాదు......తొందరపడనని వాగ్దానంచెయ్యి."

లీజా జవాబు చెబుదామనుకుంది. కాని ఒక్కమాటన్నా మాట్లాడలేను. అందుకు కారణం తొందరగా ఒక నిర్ణయానికి వద్దామనే ఉద్దేశం కాదు. ఆమె హృదయం గబగబా కొట్టుకోసాగింది. భయంతో ఆమెకి ఊపిరాడలేదు.

# 30

లావ్రెట్‌స్కీ లీజా ఇంటినుంచి వెళ్ళిపోతుండగా పాన్షిన్ ఎదురుపడ్డాడు. ఒకరికొకరు ముభావంతో నమస్కరించుకున్నారు. అంతే!

లావ్రెట్‌స్కీ తన గదికి వెళ్ళి తలుపువేసుకుని పడుకున్నాడు. ఇదివరకెన్నడూ లేనుగాని ఉద్వేగాలకులోనైనాడు. మత్తుగా పడుండి చాలాకాలమైందా? పాతాళలోకంలోకి కుంగిపోయాడా? ఇప్పుడిట్టి మార్పురావడానికి కారణమేమిటి? మళ్ళీ ఈ భూమ్మీద ఎలా నిలవగలడు? అతిసామాన్యమూ, అనివార్యమూ, హఠాత్సంభవమూ అయిన మృతి దీనికంతకీ కారణం. భార్యామృతిని గురించిగానీ, తనకు లభించిన స్వేచ్ఛనిగురించిగానీ అతను ఎక్కువగా ఆలోచించడంలేదు. లీజా పాన్షిన్‌కి ఏం జవాబిస్తుంది? అనే విషయమే ఎక్కువగా ఆలోచించసాగాడు.

గడచిన మూడురోజులనించీ లీజాని వేరొకదృష్టితో తాను పరికిస్తున్నట్టు లావ్రెట్‌స్కీ గుర్తించాడు.

ఇంటికి తిరిగివచ్చి ఆ నిశానిశ్శబ్దంలో తనలో తాను, "అలా అయితేనా?" అని అనుకోవడం స్మృతికి తెచ్చుకున్నాడు. గతానికి తాను అనుసంధించుకున్న 'అలా అయితేనా' అనేది, తాను ఊహించినట్టు కాకపోయినా, నిజమైంది. కాని స్వేచ్ఛ లభించినంతమాత్రాన ప్రయోజనమేమిటి? "తల్లిచెప్పినట్టు వింటుంది" అనుకున్నాడు. "పాన్షిన్‌ని పెళ్ళిచేసుకుంటుంది.

పోనీ తిరస్కరిస్తుందనుకో! అతన్ని తిరస్కరిస్తే నాకు పోయేదేమిటి?'' లేచి చక్కగా వెడుతూ అద్దంలో ముఖంచూసుకుని బుజాలు ఎగరేశాడు.

ఇలాంటి ఆలోచనలతో పగలంతా గడిచిపోయింది. సాయంకాలమైంది. లావ్రెటస్కీ లీజా ఇంటికివెళ్ళాడు. తొందరతొందరగా అడుగులు వేసుకుంటూ నడిచాడుగాని వారి ఇంటికి సమీపించినకొలదీ నడక మందగించింది. పోర్చిలో పానిన్ బగ్గీ నిలచిఉంది. "వచ్చాడూ! నాకు అహంభావం పనికిరాదు." అనుకుని లావ్రెటస్కీ ఇంట్లోకివెళ్ళాడు. ఇంట్లోఎవరూ అతనికి తారసిల్లలేదు. కచేరీగదిలో చడీచప్పుడీలేదు. తలుపుతెరిచాడు. మేరియా పానిన్‌తో పేకాడుతోంది. పానిన్ మాట్లాడకుండా లావ్రెటస్కీకి నమస్కరించాడు. మేరియా "తలవనితలంపుగా వచ్చావే?'' అని ముఖం కొంచెం ముడుచుకుంది. లావ్రెటస్కీ ఆమె దగ్గరగా కూర్చుని ఆమెచేతిలోని పేకముక్కలు చూడసాగాడు.

"యేమిటీ నీకూ వోకులవేలం అంటే యిష్టమే?'' అంది మేరియా స్వరంలో చిరాకును దాచుకుంటూ. తప్పు ఆడానికూడా పస్తాయిస్తూ చెప్పింది. పానిన్ ఓకులు 90 దాకా లెక్కబెట్టి గంభీరభావంతో ఆట మొదలుపెట్టాడు. రాజకీయవేత్తలు ఈ విధంగానే ఆడతారు. బహుశా పీటర్స్‌బర్గ్‌లో తన శక్తిసామర్థ్యాలను గుర్తింపజేయడానికి గొప్పవాళ్ళతో పానిన్ ఇలాగే ఆడిఉంటాడు. '101, 102, 103......' అతని స్వరం క్రమక్రమంగా హెచ్చుతోంది, ఆ స్వరంలో నింద గర్భితమైఉందో, ఆత్మసంతృప్తి గర్భితమై ఉందో లావ్రెటస్కీ తెలుసుకోలేక పోయాడు.

పానిన్ ఇంకా దర్జాగా పేక కలపడం గమనించి లావ్రెటస్కీ, "మార్ఫా టిమొఫెయెవ్నాని వెళ్ళి చూడవచ్చా." అని అడిగాడు. ఆ సమయంలో కళాకారుని చిహ్నాలేమీ పానిన్‌లో కనిపించలేదు. "ఆ మేడమీద వున్నట్టుంది. వెళ్ళి కనుక్కో." అంది మేరియా.

లావ్రెటస్కీ మేడమీదకువెళ్ళేసరికి మార్ఫా నటాస్యాతో పేకాడుతోంది. రోస్కా లావ్రెటస్కీనిచూసి మొరిగింది. కాని ముసలివాళ్ళిద్దరికీ లావ్రెటస్కీరాక సంతోషంకలిగించింది. మార్ఫా అమితోత్సాహంతో అంది: "ఆ-ఫెడ్యా! రా, రా, కూర్చో. వొక్క ఆటఆడి ఆపేస్తాంలే. శాంద్ర కాస్త తింటావా? షురోచ్కా! ఆ శాంద్ర దబ్బా తీసుకురా, యేం? యేవి

తిరవ్వూ? సరే నీయిష్టం. కాని చుట్టమాత్రం తాగకు బాబు! నాకు పొగాకు వాసన పడిచావదు. మాట్రానుకు తుమ్ములువస్తాయి." లావ్రెట్‌స్కీ తనకప్పుడు చుట్టతాగాలనేం లేదని చెప్పాడు.

"కిందికివెళ్లావా? అక్కడ యెవరున్నారు? పాన్షిన్ యింకా తచ్చాడుతూనే వున్నాడా? లీజా కనిపించిందా? లేదూ...యిక్కడికి వస్తానన్నది...అదిగో! దేవకన్యలకి కూడా అసూయకలిగించే మనిషి-అదిగో, రానేవచ్చింది."

లీజా గదిలో ప్రవేశించింది. లావ్రెట్‌స్కీని చూడగానే ఆమెకి సిగ్గేసింది. "వొకనిమిషం నీ దగ్గరకూర్చుండి పోదామని వచ్చా." అని ప్రారంభించింది లీజా.

"వొక నిమిష మేంకర్మం! మీబోటి పెళ్ళికానిపిల్లలకందరికీ యింత ఆదరాబాదరా యెందుకు? చూడు, చుట్టంవచ్చాడు. కూర్చో. కూర్చుని కాసేపు వీడితో కబుర్లుచెప్పు" అంది మార్ఫా.

దానిమీద లీజా కుర్చీ అంచుపైన కూర్చుని లావ్రెట్‌స్కీకేసి తలెత్తి చూసింది. పాన్షిన్‌కీ తనకీ జరిగినసంభాషణ అతనితో చెప్పాలనుకుంది. కాని చెప్పడం యెలా? లీజా సిగ్గూ, కలవరమూపడింది. ఆమెకి మొన్నమొన్ననే లావ్రెట్‌స్కీతో పరిచయమైంది. అతను ఎన్నడూ చర్చికివెళ్ళడు. భార్యామృతికి కలతపడలేదు. ఇటువంటివాడితో తన రహస్యాలన్నీ చెప్పాలని బుద్ధిపుడుతున్నదేమిటి?...నిజం! ఆమె విషయంలో అతనెక్కువ శ్రద్ధతీసుకుంటున్నాడు. ఆమెకి అతనిలో విశ్వాసం కుదిరింది. ఆకర్షణ కలిగింది. అయినా ఆమె పవిత్రహృదయానికి అతను అపరిచితుడే. సమయానికిమార్ఫా దేవుడిలా అడ్డుపడి అంది: "కాసేపు అతనితో నువ్వుకాకపోతే యెవరు కబుర్లుచెప్పి సంతోషపెట్టగలరు, చెప్పు! నేనా ముసలిముండని. నాకంటే వీడే తెలివైనవాడు. యిక నటాస్యా అంటావా, వీడికంటె చాలాచిన్నది. పడుచుకుర్రాడైతే దానికి యీడూ జోడుగా వుంటాడు."

"ఫియొడొర్ ఇవనిచ్‌ని యెలా సంతోషపెట్టను? పియానో వాయించమంటే వాయిస్తా." అన్నది లీజా సంకోచంతో.

"బలే! తెలివితేటలంటే అలావుండాలి. సరే, కిందికివెళ్ళి, వాయించడం అయిపోయినాక మళ్లీ ఒకసారి పైకిరండి. పెళ్ళిపెటాకులూలేని ముసలిదుందని. నాకని తీర్చుకోవాలి." అంది మార్ఫా.

లీజా బయలుదేరింది. లావ్రెట్స్కీ ఆమెను అనుసరించాడు. మెట్లు దిగుతూ లీజా అంది:

"మానవహృదయం వైరుధ్యాలకునిలయం అనేమాట నిజం. నీజీవితోదాహరణ నాకు భయంపుట్టించాల్సింది. ప్రేమ వివాహాలలో విశ్వాసం సడలించాల్సింది. కాని నేను..."

"అతన్ని తిరస్కరించావుకదూ?" అన్నాడు లావ్రెట్స్కీ అమాంతంగా.

"లేదు. తిరస్కరించాలేదు, అంగీకరించాలేదు. నామనసులోనిభావాలన్నీ విప్పిచెప్పి యింకా కొంతకాలం ఆగమన్నాను. నీకు మనసుకుదుటపడిందా?" అని గబగబా మెట్లు దిగేసింది లీజా.

పియానో మూత ఎత్తి, "యేం వాయించనూ?" అని అడిగింది. "నీ యిష్టంవచ్చింది వాయించు." అన్నాడు లావ్రెట్స్కీ ఆమెను బాగాచూడడానికి అనువైనచోట కూర్చుంటూ.

లీజా చాలాసేపు పియానో వాయించింది. వాయించినంతసేపూ వేళ్ళమీదనుంచి దృష్టిమరల్చనేలేదు. చివరికి తలెత్తి లావ్రెట్స్కీకేసి చూసి వాయించడం ఆపేసింది. అతనిమొహం చిత్రంగా ఆకర్షిస్తూ ఉంది.

"యేమిటి సంగతి?" అని అడిగింది లీజా.

"మరేంలేదు. పరమానందంగావుంది. నినుచూస్తుంటే నాకు మహాసంతోషం కలుగుతోంది. కానీ..."

కొంచెంసేపైనాక "అతను నిజంగా నన్ను ప్రేమిస్తుంటే ఆ ఉత్తరం రాసేవాడుకాడని నా కనిపిస్తోంది. యిప్పట్లో జవాబిచ్చేస్థితిలో నేనులేనని అతనిమనసుకు తట్టివుండేది." అంది లీజా.

"అదికాదు ప్రధానవిషయం. నువు అతన్ని ప్రేమించడంలేదు. అదీ ప్రధానమైన విషయం."

“క్షేమించడంలేదూ? యిలా యెలా మాటాడుకోగల్గుతున్నావు శ్యా! నేను నీ భార్యగురించి ఆలోచిస్తున్నా. నువు నన్ను భయపెడ్తున్నావు.''

“వోల్డమార్! మా లీజా బహుపసందుగా పాట్టంలేదూ?” అని మేరియా పాన్షిన్ని అడుగుతోంది.

“ఆ. అవును. మహాపసందుగా పాడుతోంది.'' అంటున్నాడు పాన్షిన్.

మేరియా తనతో పేకాడుతున్న ఆ యువకుని (పాన్షిన్) కేసి ఆప్యాయంగా చూసింది. కాని అతడు ఇంకా గంభీరంగా, పరధ్యానగా ఓకులు లెక్కపెట్టసాగాడు.

# 3౧

లావ్రెటస్కీ యువకుడేంకాదు. లీజాఎడ తనభావాల విషయమై ఎట్టిభ్రాంతీ అతనికిలేదు. ఆమెను తాను ప్రేమిస్తున్నట్టు ఆరోజున గుర్తించాడు. ఈభావం అతన్ని ఉత్తేజితుణ్ణిచెయ్యలేదు. "ముప్ఫయి యేళ్ళొచ్చి మళ్ళీ నాఆత్మను స్త్రీపరంచేయడంకంటె చెయ్యతగినపని యింకేమి లేదూ?" అని తనలోతాను తలపోశాడు. "కానీ లీజా దాని మాదిరిమనిషికాదు. నీచపర్చే త్యాగాలు చెయ్యమని కోరదు. నాచదువుకి భంగం కలిగించదు. పైగా చిత్తశుద్ధితో కష్టించిపనిచెయ్యమని ప్రోత్సహిస్తుంది. మహోత్తమగమ్యం చేరుకోడానికి చేతులుకలిపి బయలుదేరతా. అవును."

మళ్ళీ ఇలాంటి ఆలోచనలు కట్టిబెడుతూ, "సరే. బాగానేవుంది. కాని నన్ను అనుసరిస్తానికి ఆమెకి యీషణ్మాత్రమూ యిష్టంలేదు. నన్ను చూస్తే భయంవేస్తోందనలా? అయితేనేం, పాన్షిన్‌ని ప్రేమించడంలేదు... సరే కాస్తనయం" అనుకున్నాడు.

లావ్రెటస్కీ తిరిగి వాసిలెవస్కోయె వెళ్ళాడుకాని పట్టుమని నాలుగురోజులైనా అక్కడ ఉండలేకపోయాడు. విసిగెత్తిపోయింది. అంతేకాదు, అతనిస్థితి సందిగ్ధంగా ఉంది. జూల్స్ ప్రకటించినవార్తలోని నిజానిజాలు రూఢిగా తెలియలేదు. లావ్రెటస్కీరాసిన ఉత్తరాలకు జవాబులు

రాలేదు. పట్టణానికి తిరిగివచ్చి ఆ సాయంత్రం లీజాఇంట్లో కాలక్షేపం చేశాడు. మేరియాకి తనంటే కోపంగాఉందని గ్రహించి ఆమెతో పేక ఆడి పదిహేనురూబుళ్ళు కావాలని ఓడిపోయి ఆమెని ప్రసన్నురాలిని చేసుకున్నాడు. ఆ కిందటిరోజు సాయంకాలం సంఘంలో అవహేళనకు పాత్రుడైన అతనితో ఎక్కువగా చనువుగా ఉండవద్దని మేరియా లీజాని ఆదేశించింది. అయినా అరగంటసేపు లీజాతో అతను ఒంటరిగా గడిపాడు. లీజా ఏదో ఆలోచనలో మునిగిఉన్నట్టు కనిపించింది. నాలుగురోజులనించీ కనపడనందుకు లీజా లావ్రెటస్కీని నిష్ఠూరోక్తులాడింది. మర్నాడు ఆదివారం. "చర్చికి వెళ్ళవా?" అని ప్రశ్నించింది.

అతను జవాబివ్వడానికి అవకాశంఇవ్వకుండానే మళ్లీఅంది: "పద. మనమిద్దరం ఆమె ఆత్మశాంతికి ప్రార్థనలుచేదాం." తన నిర్ణయంకోసం వేచిఉండమని పాన్షిన్‌కి చెప్పాలో అక్కరలేదో తోచకుండా ఉందనీ చెప్పింది.

"యెందుచేత" అని ప్రశ్నించాడు.

"నేనేం నిర్ణయించుకోబోతున్నానో యిప్పుడిప్పుడే వూహించగలుగుతున్నా." అని జవాబిచ్చింది, లీజా. తలనొప్పిగా ఉందనిచెప్పి చేతివేళ్ళ కొనలు లావ్రెటస్కీకి అందిచ్చి మేడపైకి చక్కాబోయింది.

ఆ మర్నాడు లావ్రెటస్కీ చర్చికివెళ్ళాడు. అతను వెళ్ళేసరికే లీజా వచ్చిఉంది. ఆమె మనఃపూర్వకంగా ప్రార్థించింది. కనులు కాంతితో ప్రకాశించాయి. నెమ్మదిగా తలవంచి ఎత్తింది. తనకోసం కూడా ఆమె ప్రార్థించిందనే భావం అతనికి కలిగింది. హృదయం చెప్పనలవిగాని ఆర్ద్రతకు లోనైంది. చుట్టూ ప్రశాంతంగానిలుచున్న మనుష్యులు, పరిచితమైన ముఖాలు, పవిత్రప్రార్థనలు, ధూపదీపాలవాసనలు, కిటికీలోంచి వాలుగాపడుతున్న సూర్యకిరణాలు—ఇవన్నీ అతని మనసును చూరగొన్నాయి. అతను చర్చికి వెళ్ళి ప్రార్థించి చాలాకాలమైంది. ఇప్పుడైనా మాటలతో దేవుని ప్రార్థించలేదు. కాని ఒక్క క్షణంకాలంమాత్రం శారీరకంగాకాదుగాని మానసికంగా సాష్టాంగదండప్రణామం చేశాడు. బాల్యంలో చర్చికివెళ్ళి గంటల తరబడి ప్రార్థించడం అతనికిజ్ఞాపకంవచ్చింది. అప్పుడు ఏదో చల్లనిచెయ్యి అతని నుదురును తాకినట్లనిపించేది. ఆ చల్లనిచెయ్యి తనయిలవేల్పుదనీ,

ఆయన దయకు పాత్రుడనైనాననీ లావ్రెటస్కీ అనుకునేవాడు...లీజాకేసి చూశాడు... "సరే. యిక్కడికి లాక్కొచ్చావుగదా. యికనన్నూ, నా ఆత్మనీ వశపర్చుకో" అనుకున్నాడు. ఆమె ఇంకా మెల్లిగా ప్రార్థన చేస్తూనే ఉంది. ఆమె మొహం ఆనందంతో తొణికిసలాడుతోందని అతనికి అనిపించింది. అతని హృదయంకూడా ప్రేమతో పొంగిపోయింది. తన భార్య ఆత్మకి శాంతికలిగించమనీ, తనను రక్షించమనీ ప్రార్థించాడు.

వారిద్దరూ పోర్చిబయట కలుసుకున్నారు. ఉత్సాహంతో, గంభీరంతో ఆమె అతన్ని పలకరించింది. చర్చి ఆవరణలోని గడ్డిమీద, స్త్రీల దుస్తులమీద, రుమాళ్ళమీద సూర్యుడు కాంతిని వెదజల్లుతున్నాడు. పరిసరాల లోని చర్చిలగంటలు గాలిలో మ్రోగుతున్నాయి. కంచెలమీద పిచ్చుకలు కిచకిచమంటున్నాయి. లావ్రెటస్కీ హాటుతీసుకుని నిలబడ్డాడు. చిరునవ్వుతో మొహం వెలిగిపోతోంది. మందమారుతం వీచింది. అతనిజుట్టు, లీజా హాటురిబ్బన్లూ, ఆ మందమారుతంలో కదలాడాయి. లీజానీ, లెనోచ్కానీ బగ్గీలోఎక్కించి, దగ్గరఉన్న డబ్బంతా బీదలకిదానంచేసి మెల్లిగా అడుగులు వేసుకుంటూ లావ్రెటస్కీ ఇంటిమొహం పట్టాడు.

## 3-౨

పాపం! లావ్రెటస్కీకి గడ్డురోజులు దాపురించాయి. నిరంతరం విపరీతమైన ఆందోళనతో కొట్టుమిట్టాడుతున్నాడు. ప్రతిరోజూ పోస్టాఫీసుకి స్వయంగా వెళ్ళి ఆత్రంతో ఉత్తరాలు, పత్రికలు చింపి చూస్తున్నాడు. భార్యామరణవార్త నిజమో అబద్ధమో తెలిపేసమాచారం అతనికేం దొరకలేదు. ఒకొకపుడు అతనిమీద అతనికే విసుగుపుట్టేది. "యిక్కడ-నేను-శవాలకోసం కాచుకూర్చునే రాబందులాగా- నాభార్య చావుకబురుకోసం కాచుకూర్చున్నాను." అనుకున్నాడు. నిత్యమూ లీజా ఇంటికి వెళుతూనే ఉన్నాడు. కాని అక్కడా అతనిమనసుకు స్వస్థతచిక్కలేదు. ఆ ఇంటియజమానురాలు—మేరియా అతనికేసి చురచురా చూసేది. అధికృతాభావంతో ప్రవర్తించేది. ఇక పాన్షిన్ అతివినయం ప్రకటించేవాడు. లెమ్ ద్వేషం నటిస్తూ అతనికేసి చూచేవాడు కాదు. అన్నిటికన్నా ఘోరం-లీజా అతనిని తప్పించుకు తిరిగేది. అంతకుపూర్వం ఆమెకి అతనిలో ఎంతో నమ్మకం ఉండేది. ఇక ఇపుడు ఇద్దరూ ఒంటరిగా ఉండటం తటసించినపుడు లీజా కంగారుపడేది. ఏమి మాట్లాడాలో కూడా ఆమెకి తోచేదికాదు. అతనికి అలాంటపుడు కంగారుపుట్టేది. కొద్ది రోజులలోనే లీజా పూర్తిగా మారిపోయింది. ఆమె కదలికలలో, స్వరంలో, నవ్వులో గర్భితమై ఆతురతా, కంపమూ పొడగట్టేది. మేరియా ఆవిడగొడవలో ఆవిడ ఉండడంవల్ల అను

మానమేమీ కలలేదు. కాని మార్పుమాత్రం వీరిద్దరినీ కనిపెడుతూ నేఉంది. తనభార్య మృతివార్తపడ్డ పత్రికను లీజాకు చూపించినందుకు లావ్రెట్‌స్కీ ఒకటి రెండుసార్లు పస్తాయించాడు. ఆమె పవిత్ర ప్రకృతికి సరిపడనిదేదో తన మనసులో ఉందని గ్రహించాడు. పానిన్‌కి ఏమి జవాబివ్వాలనే ఆంతర సంఘర్షణవల్లనే ఆమెలో ఈమార్పు వచ్చిందని అతను విశ్వసించాడు. ఒకమాటు సర్ వాల్టర్ స్కాట్ *నవల ఒకటి చదవడానికికని లావ్రెటస్కీ వద్ద తీసుకొని లీజా కొన్నిరోజులైనతర్వాత తిరిగి అతినికి ఇచ్చివేసింది.

"యీ పుస్తకం చదివావా?" అని లావ్రెటస్కీ ప్రశ్నించాడు.

"ఊహుం.-యిపుడా పుస్తకం చదివేటంత మనస్థిమితం నాకులేదు" అని లీజా జవాబిచ్చి వెళ్ళిపోయింది.

"వక్కక్షణం ఆగు. మనిద్దరం వంటరిగాఉండి చాలాకాలమైంది. నన్నుచూస్తే నీకు భయంవేస్తున్నట్టుంది?" అన్నాడు లావ్రెటస్కీ.

"అవును"

"భయమెందుకూ?"

"యేమో యెందుకో, నాకే తెలీడంలేదు."

లావ్రెట్టస్కీ ఒక నిమిషంఆగి, "వక నిర్ణయానికివచ్చావా చెప్పు." అని అడిగాడు.

"యేమిటి నీవుద్దేశం?" అని అడిగింది లీజా కిందికిచూస్తూ.

"నావుద్దేశం నీకు తెలుసు గా!" లీజా హఠాత్తుగా సిగ్గుపడి, "ఓ-వన్నడగవద్దు. నాకేం తెలీదు. నాసంగతి నాకేతెలీడంలేదు." అని చకా్కబోయింది.

ఆ మర్నాడు మధ్యాహ్న భోజనానంతరం లావ్రెటస్కీ లీజా ఇంటికి వెళ్ళాడు. సాయంకాలప్రార్థనలకి సన్నాహాలు జరుగుతున్నాయి. భోజనశాలలో ఒకమూల, చదరపుబల్లమీద శుభ్రమైనగుడ్డ పరిచిఉంచి. ఆ గుడ్డమీద గిల్టు చట్రంలో బిగించిన చిన్నచిన్న దేవతాప్రతిమలు గోడకి ఆనించి ఉన్నాయి. విగ్రహాల శిరసులమీద మెరుగుపోయిన ఆభరణాలున్నాయి. ఒక ముసిలినౌకరు వదులుపాటి కోటూ, చెప్పులూ తొడుక్కొని

---

* ప్రఖ్యాత ఆంగ్ల నవలాకారుడు (1771—1832)

మెల్లిగా, ఏమాత్రం చప్పుడూ చేయకుండా నడుస్తూవచ్చి సెమ్మెలలో కొవ్వొత్తులు పెట్టి నమస్కరించి మళ్ళీ మెల్లిగా చక్కాబోయాడు. కచేరీగదిలో చీకటిగా ఉంది. అక్కడ ఎవరూ లేరు. లావ్రెట్‌స్కీ భోజనశాలలో అటూయిటూ తిరిగి ఆరోజున ఎవరి ఇలవేల్పు జన్మదినమూ కాదనీ, ఎలిజవెటా, మార్ఫాల కోరికమీద ఈ ప్రార్థనలు జరుగుతున్నాయనీ, అద్భుతాలు ప్రదర్శించే ఒక దేవతావిగ్రహాన్ని అక్కడికి తేదలచారుకాని ముప్పయి వెర్స్టుల దూరంలో ఉన్న ఒక రోగికి రోగం నయంచేయడానికి ఆవిగ్రహం అక్కడ ఉండిపోయిందనే జవాబువచ్చింది ఇంతలో ఒక మతగురువు తన అనుచరులతో సహా వచ్చాడు. అతను మధ్యవయస్కుడు. బట్టతల. వచ్చి బిగ్గరగా దగ్గాడు. స్త్రీలు వరసగా ఒక పంక్తిలో వచ్చి అతని దీవనలు పొందడానికి చేరువకు వెళ్ళారు. లావ్రెట్‌స్కీ మాట్లాడకుండా వారికి తలవంచి నమస్కరించాడు. వారూ అలాగే అతనికి నమస్కరించారు. గురువు కాసేపుఆగి, మళ్ళాదగ్గి, మెల్లగా, "యిక ప్రారంభిద్దామా?" అని అడిగాడు.

"ప్రారంభించండి, స్వామీ!" అంది మేరియా డిమిత్రియెవ్నా.

గురువు దుస్తులు ధరించసాగాడు. ఆయన అనుచరుడొకాయన నిప్పు తెప్పించి, దానిమీద సాంబ్రాణి వేశాడు. సాంబ్రాణివాసన హాలంతా వ్యాపించింది. సేవకులు, సేవకురాళ్ళువచ్చి గుమ్మంలో గుమిగూడారు. రోస్కా (కుక్క) అదివరకెన్నడూ మేడదిగి కిందికివెళ్ళలేదేమో హఠాత్తుగా భోజనశాలలోకి ఉరుక్కుంటూ వచ్చింది. అంతా దానిని తరిమేయాలని చూశారు. అది కంగారుపడి అటూయిటూ పరుగెత్తి హఠాత్తుగా కూర్చుంది. ఒక నౌకరు దానిని అవతలకి తీసుకుపోయాడు. ప్రార్థనలు ప్రారంభమయాయి. లావ్రెట్‌స్కీ ఒక మూలకు చేరుకున్నాడు. అతనికి చిత్రమైన ఉద్వేగం, దాదాపు విషాదంతో కూడిన ఉద్వేగం కలిగింది. అతనిమనసు అతనికే తెలియడంలేదు. మేరియా అందరికన్నాముందునిల్చుని అటూయిటూ చూస్తూ, మధ్యమధ్య హఠాత్తుగా ఇంటి పైకప్పుకేసి చూడసాగింది. నిజానికి ఆమెకి విసుగెత్తింది. మార్ఫా ఆతురంతో ఉన్నట్టు కనిపించింది. నాస్తాస్యా కార్పోవ్నా నేలదాకావంగి నమస్కరించి ముర్మురధ్వని చేసుకుంటూ లేచి నిలబడింది. లీజా కదలకుండా మెదలకుండా నేలకు అంటుకొని పోయినట్లు నిల్చుంది. త్రికరణశుద్ధిగా ప్రార్థిస్తోందని ఆమె ముఖకవ

కలు వెల్లడిస్తున్నాయి. ప్రార్థనలు అయిపోయాక కొలువతోపాటు గురువు చేతిని కూడా లీజా ముద్దిడుకుంది. మేరియా గురువును టీకి ఆహ్వానించింది. అతను మతసంబంధమైన దుస్తులువిడిచి, లౌకిక ప్రవృత్తితో స్త్రీలతో కలసి టీకి బయలుదేరాడు.

సంభాషణ మెల్లగా సాగింది. గురువు నాలుగుకప్పులు టీ తాగాడు. మాటిమాటికీ బట్టతలను జేబురుమాలతో తుడుచుకుంటూ, అవోష్నికోవ్ అనే వర్తకుడు చర్చిగోపురానికి బంగారుపూత పూయించడానికని ఏడువందల రూబుళ్ళు విరాళమిచ్చాడని వెల్లడించాడు, పుట్టుమచ్చలు పోవడానికి అమోఘమైన మందు చెప్పాడు.

లావ్రెటస్కీ ఏదోవిధంగా లీజా కూర్చున్న కుర్చీపక్క కుర్చీలో చేరాడు. కాని లీజా ఏమాత్రం లొంగకుండా, అతనికేసి చూడనైనాచూడకుండా కూర్చుంది. ఉద్దేశపూర్వకంగానే ఆమె అతనిని విస్మరిస్తున్నట్టు కనిపించింది. ఏదోఒక పవిత్రభావం తీవ్రంగా ఆమెను ఆవేశించినట్టుంది. మందహాసంచేయాలనీ, ఆహ్లాదకరంగా మాట్లాడాలనీ లావ్రెటస్కీకి బలీయమైన కోరిక కలిగింది. కాని హృదయంలో కలవరం బయలుదేరింది. ఏదో అయోమయావస్థలో పడి చక్కాబోయాడు......లీజాని అర్థంచేసుకోలేక పోతున్నాని కూడా గ్రహించాడు.

ఒకమారు లావ్రెటస్కీ కచేరీగదిలో కూర్చుని జెడియోనవస్కీ చెప్పే అల్లిబొల్లికథలు వింటూకూర్చున్నాడు. హఠాత్తుగా పక్కకి తిరిగి చూశాడు. లీజా నేత్రాలలో ప్రాశ్నికదృష్టి గోచరించింది. ఆ నర్మగర్భితమైన దృష్టి అతనిమీదకే ప్రసరించింది. ఆరాత్రి రాత్రల్లా ఆ దృష్టిని గురించే లావ్రెటస్కీ ఆలోచించాడు. అతనిప్రేమ చిన్నపిల్లవాని ప్రేమ లాంటిది గాదు. నిట్టూర్పులు విడవడం, బెంగపెట్టుకుని కృశించిపోవడం అతనికి తగినవి కావు. లీజాకూడా అతనిలో అటువంటి ఉద్వేగాలను రేకెత్తించలేదు. కాని ప్రేమ వయసునుబట్టి యమయాతనలు పెడుతూనే ఉంటుంది. లావ్రెటస్కీకికూడా అతని వయసుకు తగిన యాతనలు అతనికి తప్పలేదు.

# 33

ఒకనాడు లావ్రెట్స్కీ మామూలుప్రకారం మేరియా ఇంటికి వెళ్ళాడు. ఆపగలల్లా ఉక్కగా ఉన్నా సాయంకాలమయేసరికి ప్రకృతి మనోహరంగా ఉంది. మేరియాకి గాలి ఎక్కువగా సరిపడకపోయినా తోటవైపుకిటికీలు, దర్వాజాలు తెరవమని ఆదేశించింది. అటువంటి వాతావరణంలో ప్రకృతి రమణీయతను అనుభవించాలేగాని పేకాడుకంటూ కూర్చోవడం సిగ్గుచేటనే అభిప్రాయం ప్రకటించి పేకాడ నిరాకరించింది. ఆరోజున పాన్షిన్ ఒక్కడే అతిథి. సాయం సౌందర్యం అతనిని ఉద్దీపింప జేసినా, తనలో కళాత్మక అనుభూతులు ఉబుకుతున్నాయనే పరిజ్ఞానం కలిగినా, లావ్రెట్స్కీముందు పాడడానికి ఇష్టంలేక పాన్షిన్ పద్యాలు కొన్ని చదువుతానన్నాడు. లెర్మాన్‌టోవ్ * పద్యాలు కొన్ని చదివాడు. చదవడం బాగానేఉంది గాని ప్రతిభావంతంగాలేదు. అనవసరంగా సాగదీశాడు. తర్వాత హఠాత్తుగా చదివినపద్యాలకు తానే సిగ్గుపడుతున్నట్లు

---

* లెర్మాన్‌టోవ్ (1812-1841) రష్యన్ విప్లవకవి. ప్రవాసంలో ఉండగా ద్వంద్వ యుద్ధంలో మరణించాడు. ఇతని మరణానికి జారు ఎంతో సంతోషించాడట! ఇతని కవిత విప్లవ, స్వాతంత్ర్య భావావేశంతో రగులుతూటుంది.

కనిపించి యువజనులను నిగసించడానికా అన్నట్లు 'దివాస్వప్నం' అనే ఖండకావ్యం చదివాడు. అధికారం తనచేతిలోనే ఉంటే ప్రతివిషయంలో ఎటువంటి మార్పు తానుతీసుకొచ్చేదీ అవకాశం చిక్కినపుడల్లా చెప్ప సాగాడు. "రష్యా యూరప్ కంటె వెనకబడివుంది. ఆసాయిని అందుకో వాలి. మనం వెనకబడివుండడానికి కారణం మనది యిప్పుడిప్పుడే తలెత్తు తున్న జాతి అనే సాకుచూపుతున్నారు. కాని అదంతా సర్వాబద్ధం. మనలో సృజనాశక్తి లోపించింది. మనం చివరికి ఎలకలబోనుకూడా కని పెట్టలేకపోయామని క__వ్ సహితం అంగీకరించాడు. అందుచేతనే మనం యితర్లను అనుకరించవలసివస్తోంది. 'మనం చివికిపోయాం' అన్నాడు తెర్మాస్‌టావ్ మహాకవి. అతంత్తో నేను యేకీభవిస్తాను. మనం సగం సగం యూరోపియన్లమైనాం. అందుకే మనం చివికిపోయాం. చెప్పుపుండుకు చెప్పువునే మందు. తెలుసా? మనలోని మహాప్రతిభావంతులంతా యీ విషయం వప్పుకున్నారు. జాతులన్నీ ఒకటే, మంచిమంచి నిబంధనలను ప్రవేశబెడితే చాలు, పని జరుగుతుంది. నేటి జాతీయసంప్రదాయాలకి అన్నిటినీ మేళవించగలం. అదీ మనం చేయవలసిన పని, ప్రభుత్వంపని... (రాజకీయవేత్తలు అని అన్నట్లే) అధికారులపని. నువేం విచారపడద్దు. అవసరమైతే ఆ నిబంధనలే జాతీయసంప్రదాయాలను పునర్నిర్మించగలవు." అతను చెప్పిందానికల్లా మేరియా మెచ్చుకుంటూ తలఊపింది. 'నాకచేరీ గదిలో ఎంత ప్రతిభావంతుడు ప్రసంగిస్తున్నాడు!' అని తలపోసింది. లీజా కిటికీకి ఆనుకని మౌనంగా కూర్చుంది. లావ్రెట్‌స్కీకూడా మౌనంగానే కూర్చున్నాడు. ఒకమూల కూర్చుని పేకాడుతున్న మార్ఫాటిమొఫెయెవ్నా తనలోతానేదో గొణుగుకుంది. పాన్షిన్ గదిలో ఆమూలనించి ఈమూలకి పచార్లుకొడుతూ జోరుగా మాట్లాడాడు. అతని స్వరంలో ఆగ్రహం గర్భీకృతమై ఉంది. అతను ఒకతరమువారిని కాకుండా తనకు పరిచయస్తు లైన కొంతమందిని నిందిస్తున్నట్లుగా ఉంది అతని ధోరణి. తోటలోని లిలాక్ పొదలో గూడుకట్టుకున్న కోయిలపాట అతను ఉపన్యాసం ఆపినపు డల్లా వినిపించింది. నిశ్చలంగా ఉన్న నిమ్మచెట్లపైన గులాబిరంగు ఆకా శంలో చుక్కలు అప్పుడే పొడిచాయి. లావ్రెట్‌స్కీ లేచి పాన్షిన్ చెప్పిం దంతా ఖండించసాగాడు. ఇద్దరికీ వాగ్వివాదమారంభమైంది. లావ్రెట్‌స్కీ

యువజనులను, రష్యా స్వాతంత్ర్యాన్నీ బలపరుస్తూ మాట్లాడాడు. తనను, తనతరమువారినీ నిరసించడానికి అంగీకరనూ, నూత్నమానవుల్లను, వారివిశ్వాసాలను, ఆశయాలను సమర్థించాడు. పాన్షిన్ చిరచిరలాడుతూ ప్రతిభావంతులం ప్రతిదానినీ మార్చివేయాలని తీవ్రంగా వాదించాడు. చివరకి తన లోటుపాటులను కూడా మరిచేబోయి ఆవేశంతో లావ్రెట్స్కీని బూజు పట్టిన మితవాదివని అనడమే కాక సాంఘికంగా అతనిస్థానం సందేహాస్పదమైనదని ఎత్తిపొడిచాడు. లావ్రెట్స్కీ ఉలకలేదు. గొంతెత్తి మాట్లాడనూ లేదు. (మైకలెవిచ్ కూడా తనను బూజుపట్టిన వాల్టేరు అనుయాయి అనడం అతనికి జ్ఞాపకంవచ్చింది.) తొణకకుండా వాదించి అన్నివిషయాలలోనూ పాన్షిన్‌ని ఓడించాడు. ఒక్కసారిగా అంతా తలకిందులుచేయడం ఆచరణసాధ్యం కాదని ఋజువుచేశాడు మాతృదేశ పరిస్థితులదృష్ట్యాకానీ, ఆశయదృష్ట్యాకానీ సమర్థనీయంకాని మార్పులు, అధికారుల అహంకారపూరిత హృదయాలనించి ఆవిర్భవించినమార్పులు, ఆచరణయోగ్యం కావన్నాడు. తన చదువే అందుకు ఉదాహరణగా చూపించాడు. ముమ్ముందుగా అవనమ్రతాభావంతో ప్రజావిజ్ఞానాన్ని గుర్తించాలని కోరారు. నమ్రతాభావం మాత్రమే తప్పిదాన్ని సాహసంతో ఎదుర్కొనగలమని వాదించాడు. అనాలోచితంగా కాలం, శక్తి వృథాపుచ్చుతున్నారనే నిందనుమాత్రం ఖండించకుండా తనవాదన ముగించాడు.

పాన్షిన్ పూర్తిగా చికాకుపడి, "సరే. సరే. బాగానేవుంది. నువ్వు రష్యాకి తిరిగివచ్చావుగదా, యేం చేయదలచావ్?" అని ప్రశ్నించాడు.

"భూమి దున్నుకుంటా" అని జవాబిచ్చాడు లావ్రెట్స్కీ.

"సాధ్యమైనంత బాగా దున్నడానికి యత్నిస్తా."

"బలే బాగుంది." అన్నాడు పాన్షిన్ ఎగతాళిగా.

"అందులో నువ్వు ఘటికుడవేనని విన్నా. కాని ఆవృత్తికి అందరూ పనికిరారనేది కూడా అంగీకరించాలి......"

"అవును, అందరూ పొలందున్నలేరు. ప్రతిపని నువ్వెంత గొప్పగా చెప్తావ్, వాల్దిమిర్ నికొలాయిచ్!" అంది మేరయా.

ఈ ముక్కకి పాన్షిన్ తట్టుకోలేకపోయాడు. చిన్నబోయి విషయం మార్చేశాడు. నక్షత్రాలతో వెలుగుతున్న ఆకాశసౌందర్యాన్ని గురించీ,

షూబర్ట్ సంగీతాన్ని గురించీ సంభాషణ సాగించాలని యత్నించి, చివరకు పేకాడదామని మేరియాకు సూచించాడు. "యిలాంటి రాత్రివేళ పేకాటే మిటి?" అని మెల్లిగా ఆక్షేపించి, మళ్ళీ పేకతెమ్మని పురమాయించింది మేరియా.

పాన్షిన్ టపీమని కొత్తపేక చించాడు. లీజా, లావ్రెట్‌స్కీలు కూడ పలుక్కున్నట్లు ఇద్దరూ ఒకసారే లేచివెళ్ళి మార్ఫాదగ్గిర కూర్చున్నారు. హఠాత్తుగా ఇద్దరూ ఎంతో ఆనందంపొంది, ఒంటరిగా ఉండడానికి భయపడ్డారు. కొద్దిరోజులనుంచీ కలిగిన తత్తరపాటు శాశ్వతంగా తొలగిపోయిందనీ గ్రహించారు ముసలావిడ లావ్రెట్‌స్కీ చెంపమీద రహస్యంగా తట్టింది. కొంటెగా కనుగీటి, తలఊపి మెల్లగా "ఆ డంబాచారికి తగినశాస్తి చేశావు. బలే!" అంది. గదిఅంతా సద్దుమణిగింది. కొవ్వొత్తుల టప్‌టప్‌ధ్వని, మధ్య మధ్యబల్లమీద చేతితో తట్టినధ్వని, ఓకులలెక్క, కోయిలసంగీతంమాత్రమే వినిపించాయి. కోకిలసంగీతం మృదుమధురంగా ఉంది. ఆ సంగీతంతోపాటు మంచులాంటి చల్లదనం కిటికీగుండా ఆ గదిలోకి ప్రవహించింది.

# 38

లావ్రెటస్కీ, పాన్షిన్‌లకు వాగ్వివాదం జరిగినంతసేపూ లీజా ఒక్క ముక్కయినా మాటాడలేదు. కాని వారివాదనలను జాగ్రత్తగా అవగాహన చేసుకుంది. లావ్రెటస్కీ వాదన ఆమెకినచ్చింది. ఆమెకి రాజకీయాలలో ఏమాత్రం ఆసక్తిలేదు. ఆ అధికారి (పాన్షిన్) అహంకారయుత స్వరం (అదివరకెన్నడూ పాన్షిన్ అలామాట్లా లేదు.) ఆమెకి అసహ్యం వేసింది. రష్యాఅంటే పాన్షిన్‌కున్న నిరసనభావం ఆమెకి ఆశ్చర్యం గొలిపింది. తనకు దేశభక్తి కలదనేభావం ఆమెకిఎన్నడూ కలగలేదు. కానిరష్యా వారితో ఆమె కలిసిమెలిసి ఉండగలుగుతోంది. రష్యావారి మనస్తత్వం ఆమెకి ఆహ్లాదంకలిగించింది. మేరియా జమీలోని రైతుపెద్ద వచ్చినపుడల్లా అతనితో గంటలతరబడి ఆధిక్యతాభావం లేకుండా సమానస్థాయిలో మాట్లాడేది. లావ్రెటస్కీ ఇదంతా గ్రహించాడు. పాన్షిన్‌కి తాను జవాబివ్వాలనే అవసరం అతనికేంలేదు. అతను మాట్లాడిందంతా లీజా వినడం కోసమే. వారిద్దరూ ఒకరితోఒకరు మాట్లాడుకోలేదు. వారి చూపులు కలుసుకోనూలేదు. కాని ఆ సాయంకాలం తామిద్దరమూ అతి సన్నిహితులమైనామనీ, ఇద్దరి అభిరుచులూ ఒకటేననీ గుర్తించారు. ఒక్క దేవుడి

విషయంలోమాత్రం వారిద్దరికీ భిన్నాభిప్రాయాలున్నా అతనిని ఎలాగో దేవునివైపు తిప్పగలననే ఆశ ఆమెకున్నది. వారిద్దరూ మార్ఫా దగ్గిర కూర్చుని ఆట చూస్తున్నట్లు కనిపించారు. నిజమే! ఆటచూస్తున్నారు. కాని వారి హృదయాలుమాత్రం టకటకా కొట్టుకుంటున్నాయి. ఆ పేకాట కోయిల సంగీతంలా, నక్షత్రకాంతిలా, వేసవి వేడిమికి అలసిసొలసినచెట్ల మర్మర ధ్వనిలా తోచింది. లావ్రెట్‌స్కీ అతనిహృదయాన్ని ఆవరించిన ఆభావంలో పూర్తిగా నిమగ్నుడైపోయాడు. కాని ఆకన్య పవిత్రహృదయంలో ఏం జరుగుతుందో మాటలలో చెప్పలేం. అదేమిటో ఆమెకే తెలియదు. అలా నిగూఢంగా దానిని ఉండనివ్వడమే మంచిది. భూగర్భంలో విత్తనం ఎలా మొలచి, మొక్కై, చిగిర్చి, పుష్పిస్తుందో ఎవరూచూడలేదు. చూడబోరు.

పదికొట్టింది. మార్ఫా, నాస్టాస్యాతో మేడమీదికి వెళ్ళిపోయింది. లావ్రెట్‌స్కీ, లీజాలు తోటవైపు గుమ్మంలోకి వెళ్ళినిల్చుని బయటిచీకటికేసి చూశారు. తర్వాత ఒకరికేసి ఒకరు చూసుకుని నవ్వుకున్నారు. వారిద్దరికీ చేతులూ చేతులూ కలుపుకుని తనివితీరా మాట్లాడుకోవాలనిపించింది. కాని తిరిగి మేరియాదగ్గిరకి వెళ్ళారు. ఇంకా పేకాటపూర్తికాలేదు... ఆటపూర్తి కాగానే పడకకుర్చీలోంచి మేరియా ముక్కుతూ మూలుగుతూ లేచింది. పానిన్ హాటుతీసుకుని మేరియాచేతిని ముద్దుకుని కొంతమంది అదృష్టజాతకులు నిద్రపోవాలనుకుంటే నిద్రపోగలుగుతారనీ, లేక సంతోషంగా గడప దలచితే గడపగలుగుతారనీ కాని తానుమాత్రం చెత్తకాగితాలు ముందు వేసుకు కూర్చోవాలనీచెప్పి ఉదాసీనంగా లీజాకు వంగినమస్కరించి చక్కా పోయాడు. (లీజా వివాహప్రసక్తి తెచ్చినపుడు ఆమె వేచిఉండమంటుందని అతననుకోలేదు. అందుచేత లీజామీద మహాచెడ్డ కోపంగా ఉన్నాడు.) లావ్రెట్‌స్కీ అతనిని అనుసరించాడు. గేటులో ఇద్దరూ విడిపోయారు. పానిన్ చేతికర్రకొనతో బండివానిమెడమీద గుచ్చిలేపి బగ్గీఎక్కి వెళ్ళిపోయాడు. లావ్రెట్‌స్కీకి ఇంటికివెళ్ళాలని బుద్ధిపుట్టలేదు. పట్టణందాటి వెళ్ళాడు అంతానిశ్శబ్దంగా, ప్రశాంతంగాఉంది. చంద్రునిజాడే కనపించడంలేదు. మంచుకప్పిన గడ్డిలో లావ్రెట్‌స్కీ చాలాసేపు తిరిగాడు. చివరికి ఒక ఇరుకుబాట కనిపించింది. దానివెంటే వెళ్ళాడు. వెళ్ళివెళ్ళి ఒక కోరడిని చేరుకున్నాడు. గుమ్మంమీద చెయ్యిపడింది. అనుకోకుండానే తోశాడు. తలుపు

క్రమని అతని హస్తస్పర్శకోసం ఎదురుచూస్తున్నట్టు తెరుచుకుంది. అటూ యిటూ చూసి తానొక తోటలోఉన్నట్లు లావ్రెటస్కీ గ్రహించాడు. నిమ్మచెట్ల వరసవెంట కొన్ని అడుగులువేసి హఠాత్తుగా ఆశ్చర్యంతో ఆగిపోయాడు. అది లీజా ఇంటితోట.

లావ్రెటస్కీ తొందరగా ఒక పొదనీడలో అడుగిడి చాలాసేపు ఆశ్చర్యంతో బుజాలు ఎగరవేసుకుండా కదలకుండా నిల్చుండిపోయాడు. "యిది యాదృచ్ఛిక సంఘటనేమీ కాదు." అని తలపోశాడు.

చుట్టూ అంతా నిశ్శబ్దంగా ఉంది. లీజాఇంట్లో చలీ చప్పుడీలేదు. అతి జాగ్రతగా అడుగులు వేసుకుంటూ నడిచాడు. నిమ్మచెట్లవరస మధ్య బాట మలుపులో లీజా ఇల్లంతా హఠాత్తుగా స్పష్టంగా కనిపించింది. మేడ మీద రెండు కిటికీలలో దీపాలు మినుకుమినుకు మంటున్నాయి. లీజా గదిలో ఒక తెల్లటి తెరవెనక కొవ్వొత్తి వెలుగుతోంది. మార్ఫాటిమొఫెయెవ్నా పడకగదిలో ఒక దీపం దేవతావిగ్రహంముందు ఎర్రగాప్రకాశిస్తో విగ్రహపు బంగారుచట్రంమీద కాంతిని ప్రసరిస్తోంది. మేడవరండా గుమ్మం బార్లా తెరుచుకొనిఉంది. లావ్రెటస్కీ ఒక కొయ్యబల్లమీద చెంపమీద చెయ్యి ఆనించుకుని కూర్చుని ఆ గుమ్మంవంకా, లీజా గదికిటికీవంకా తదేక దృష్టితో చూచాడు. పట్నంలో గడియారం పన్నెండుకొట్టింది. లీజా ఇంట్లో గడియారం కూడా టిగ్ టిగ్ మంది. గస్తీమనిషి చెక్కమీద దరువువాయించాడు. లావ్రెటస్కీ ఏమీ ఆలోచించలేదు. ఏమీ ఆశించాలేదు. లీజాకి దగ్గరగాఉండడం, లీజాతోటలో అనేకసారులు కూర్చున్న ఆసనంమీద కూర్చోడం అతనికెంతో సంతోషం కలిగించింది. లీజాగదిలో దీపం ఆరిపోయింది. "శెలవు, ప్రియతమా శెలవు" అని మెల్లిగా అన్నాడు లావ్రెటస్కీ ఆసనంమీదనుంచి కదలకుండా, చీకటిలో మునిగిపోయిన కిటికీ పైనే దృష్టినిలగ్నంచేస్తూ.

హఠాత్తుగా కిందిభాగంలో ఒక కిటికీవద్ద దీపం కనిపించింది. తర్వాత ఇంకోకిటికీవగ్గిర, అక్కడనించి మూడో కిటికీదగ్గర గోచరించింది. ఎవరో కొవ్వొత్తిదీపం పట్టుకుని ఆ గదులలో తిరుగుతున్నారు. "లీజాయేనా? అసంభవం!" లావ్రెటస్కీ ఆసనంమీదనించి లేచాడు... చిరపరిచితమైన ముఖం గోచరించింది—లీజా కచేరీగదిలో ప్రవేశించింది. తెల్లటిగౌను తొడిగింది.

భుజాలమీద జడలు వేలాడుతున్నాయి. త్వరత్వరగా బల్లదగ్గిరకివెళ్ళి, వంగి, కొవ్వొత్తి బల్లమీదపెట్టి, దేనికోసరమో వెదికింది. తర్వాత తోటకేసి ముఖంతిప్పి గుమ్మంలోకి వెళ్లినిల్చుంది. లావ్రెటస్కీ విపరీతంగా వణికి పోయాడు.

"లీజా!" అని ఇంకా బిగ్గరగా అంటూ పొదనీడలోంచి లావ్రెటస్కీ వచ్చాడు.

"లీజా!" అనేమాట విన్పించీ విన్పించకుండా అతనినోటినుంచి వెలువడింది.

ఆమె అదిరిపోయి చీకటిలోకి దృష్టినిగిడ్చి చూసింది.

లీజా భయంతో తొంగిచూసి త్రుళ్ళిపడింది. ఆమె అతనిని గుర్తించింది. లావ్రెటస్కీ మరోపర్యాయం పిలిచి చేతులుచాచాడు. ఆమె గుమ్మం దాటి తోటలో అడుగిడింది.

"నువ్వా? యిక్కడా" అని గొణుక్కుంది.

"నేనే-నేనే...విను" అని మెల్లిగా అన్నాడు లావ్రెటస్కీ ఆమె చేతినిపట్టుకుని ఆసనందగ్గిరికి తీసుకువెడుతూ.

వెనకాడకుండా అతనిని అనుసరించి లీజా వెళ్ళింది. ఆమె ముఖకవళికలలో, ఆమె నిశ్చలదృష్టిలో, ప్రతిచేష్టలో అనిర్వచనీయమైన ఆశ్చర్యం ద్యోతకమైంది. లావ్రెటస్కీ ఆమెను ఆసనంమీదకూర్చోబెట్టి ఎదురుగా నిలబడ్డాడు.

"నేను యిక్కడికి రావాలనుకోలేదు" అని ప్రారంభించి, యలా వచ్చిపడ్డాను... నేను... నేను...నిను ప్రేమిస్తున్నాను"అన్నాడు భయంతో.

లీజా మెల్లిగా అతనికేసిచూసింది. తాను ఎక్కడున్నదీ, ఏమి జరుగుతున్నదీ, ఆమెకిప్పటికి తెలిసినట్లుంది. లేద్దామనుకుంది. కాని లేవలేకపోయింది. చేతుల్తో మొహం కప్పేసుకుంది.

"లీజా!" అని అతను గొణిగాడు. "లీజా"అని తిరిగీ అంటూ ఆమె పాదాలకడ మోకరిల్లాడు.

ఆమెకు కొద్దిగా వణుకుపుట్టింది. భుజాలుకదలాడాయి. చేతివేళ్ళతో మొహంమీద ఇంకా గట్టిగా నొక్కుకుంది.

"యేదిటిసంగతి" అంటూ గొణిగాడు లావ్రెటస్కీ. అణచుకుం టున్న నిట్టూర్పు వినిపించింది. అతనిగుండె పిచ్చిగా కొట్టుకుంది...అకస్మాత్తుగా అంతా అర్థం అతనికితెలుసు. "నువ్వూ నను ప్రేమిస్తున్నట్టుందే" అని మెల్లిగా అని ఆమెమోకాళ్ళు తాకాడు.

''శే. శే. ఫియొడోర్ ఇవనిచ్! యేదిటీపని?'' అన్నమాటలు అతనికి వినిపించాయి.

అతనులేచి ఆమెపక్కనే కూర్చున్నాడు. ఆమె ఏడవడంమానేసి తడి కళ్ళతో అతనికేసి శ్రద్ధగాచూసింది.

"నాకు భయంవేస్తోంది. మనం చేస్తోందేదిటి?'' అని ఎలాగో అన గల్గింది.

"నిన్నుప్రేమిస్తున్నా. నీకోసం నాప్రాణాలనుసైతం అర్పిస్తానికి సిద్ధంగావున్నా.'' అని మళ్ళీ గొణుగుతూ అన్నాడు.

వేటుతిన్న దానిలా వణికిపోయి ఆకాశంవైపు దృష్టిపరిపి.

"అంతా భగవంతుడియిచ్ఛ. మనదేంవుంది." అంది లీజా.

"కాని నువ్వునను ప్రేమిస్తున్నావు, లీజా! మనం సుఖంగావుందాం.''

ఆమెచూపును నేలపైబరపింది. అతను ఆమెను మెల్లిగా దగ్గరకుతీసు కున్నాడు. అతనిబుజంమీద ఆమెతలవాల్చింది...అతనూతలవంచి ఆమెపెద తన పెదవులతో స్పృశించాడు.

అరగంటతర్వాత లావ్రెటస్కీ తోటగేటులో నిలబడ్డాడు. గేటు తాళం వేసుంది. గత్యంతరంలేక గోడదూకి పట్టణంలోకి వెళ్ళాడు. వీధు లన్నీ నిద్రపోతున్నట్టున్నాయి. తానాశించని సౌఖ్యం అపరిమితంగా తన హృదయాన్ని ముంచెత్తిందనేభావం అతనికి కలిగింది. అనుమానాలన్నీ మటు మాయమయాయి.'' గత కాలభూతమా! తొలగిపొమ్ము" అనుకున్నాడు. "ఆమెనను ప్రేమిస్తోంది. నాదై పోతుంది" హఠాత్తుగా విజయనాదంతో గాలిపిక్కటిల్లుతున్నట్టు అతనికి అనిపించింది. ఆగాడు. ఆ తంత్రులు ఇంకా ఉదాత్తంగామోగాయి. మృదుమధురస్వరం వాకలుగట్టింది. మితిలేని సంతో షం ఆ సంగీతంలోంచి మాట్లాడుతున్నట్టు, పాడుతున్నట్టు అతనికి అనిపిం

చింది. చుట్టూచూచాడు. ఆ సంగీతం ఒకచిన్న ఇంటి పైకిటికీలగుండా ప్రవహిస్తోంది.

“లెమ్” అని అరుచుకుంటూ ఆ ఇంటి వైపుకు లావ్రెటస్కీ పరుగత్తాడు. “లెమ్, లెమ్!” అని తిరిగి బిగ్గరగా అరిచాడు.

సంగీతం ఆగిపోయింది. కిటికీదగ్గర ఆవృద్ధుని మూర్తి ప్రత్యక్షమైంది. వక్షః స్థలంమీద ఆచ్ఛాదనలేదు. జుట్టు చిందరవందరగా ఉంది.

“అహా! నువ్వా?” అన్నాడు ఠీవిగా.

“క్రిస్టాఫర్ ఫియొడోరిచ్! యెంత అద్భుతమైనసంగీతం! లోపలికి రానియ్యి.”

మాట్లాడకుండా ఠీవిగాచేయిఊపుతూ వీధిద్వారపుచెవి కిటికీగుండా కిందికి లెమ్ విసిరివేశాడు. లావ్రెటస్కీ ఒక్క గంతులో మెట్లెక్కి, గదిలోకి ఉరుక్కుంటూవచ్చి లెమ్‌ని చేరుకున్నాడు. కాని లెమ్ రాజఠీవితో కుర్చీ చూపించి హఠాత్తుగా రష్యన్ భాషలో “కూర్చుని, విను.” అనిచెప్పి, తానూ పియానో ముందు కూర్చున్నాడు. చుట్టూ సగర్వంగా తీక్షణంగాచూసి పియానో వాయించ నారంభించాడు. అటువంటి సంగీతం లావ్రెటస్కీ విని చాలాకాలమైంది. ఆదిలోనే ఆ మృదుల ఉద్రిక్తస్వరం అతనిగుండెను ఒడిసిపట్టింది. ఆవేశంతో ఆనందంతో సౌందర్యంతో ప్రజ్వరిల్లిపోతూ పైకెగసి గాలిలో కరిగిపోయింది. అమూల్యమూ, అనిర్వచనీయమూ, పవిత్రమూ అయిన ప్రతిదానినీ వర్ణిస్తున్నట్టుంది అమర విషాదమే దానికి జీవనాడి. పైకెగసి క్రమేపీ సన్నగిలుతూ స్వర్లోకంలో లీనమైపోయింది.

పరవశత్వంతో లావ్రెటస్కీ శరీరం జల్లుమంది. ముఖంపాలిపోయింది. దిగ్గునలేచి నిల్చున్నాడు. ఆ సంగీతం అతని జీవనాడులనే కదలించివేసింది. కొత్తగా లభ్యమైన ప్రేమావశంతో వణికిపోయాడు. ఆ సంగీతం అతని ప్రేమకు తాళంవేసింది. “మళ్ళా పాడండి” అన్నాడు మెల్లగా పాట పూర్తికావస్తుండగా. అతనికేసి పరకాయించిచూసి, రొమ్ముమీద చరుచుకొని “నేను గొప్ప సంగీతజ్ఞుణ్ని. అందుకనే యిలా పాడగల్గాను.” అన్నాడు. తన మాతృభాషలో. ఆ అద్భుతమైన పాటను తిరిగీ పాడాడు. గదిలో కొవ్వొత్తంటూలేదు. కిటికీలగుండా చంద్రకాంతి లోనికిప్రసరి

స్తోంది. ధ్వనులతో గాలి మోగిపోతోంది. అగది పవిత్రస్థలంగా, ఉదాత్తమైనదిగా, ఆవేశపూరితమైనదిగా కనిపించింది. ఆ సంధ్యవెలుగులో ఆ వృద్ధుని శిరస్సు కనిపించీ కనిపించకుండా ఉంది. లావ్రెటస్కీ అతని దగ్గరికి వెళ్ళి కావలించుకున్నాడు. మొదట లెమ్ ఆ ఆలింగనాన్ని త్రుణీకరించలేదు. మోచేతితో తోసివేశాడు. చాలాసేపు పూర్వంలానే తీక్షణదృక్కులు పరుపుతూ కదలకుండాకూర్చుని రెండుమారులుమాత్రం "ఆహా!" అని ఎలాగో అన్నాడు. చివరకు అతని ముఖవళికలో తీవ్రతసడలింది. లావ్రెటస్కీ అభివందనాలకు ప్రత్యుత్తరంగా మందహాసంచేసి చిన్నపిల్లవాడిలా వెక్కివెక్కి ఏడ్వసాగాడు.

"నువ్వు సరిగా యీ సమయానికిరావడం మెచ్చుకోతగ్గది. నాకు తెలుసు. అంతా తెలుసు."

"అంతా తెలుసా?" అని ప్రశ్నించాడు లావ్రెటస్కీ ఆశ్చర్యంతో.

"నే చెప్పింది విన్నావుగా. నాకంతా తెలుసునని నీకుతోచడంలా?"

తెల్లవార్లూ లావ్రెటస్కీకి నిద్రపట్టలేదు. ఆ రాత్రంతా పక్కమీద కూర్చునే ఉన్నాడు. లీజాకూ నిద్రపట్టలేదు. ప్రార్థనలుచేసింది.

## 3౫

లావ్రెట్‌స్కీ బాల్యంగురించీ, పెంపకంగురించీ పాఠకులకు తెలుసు. లీజా విద్యావ్యాసంగాల గురించి నాల్గుముక్కలు చెబుతాను. ఆమె పదవ ఏటనే తండ్రి మరణించాడు. కాని అతను ఆమె విషయంలో ఎక్కువశ్రద్ధ తీసుకోలేదు. వ్యాపారచింతలో మునిగిపోయాడు. ఆస్తిపాస్తులను పెంపొందించుకోవడంలో నిమగ్నుడైవాడు. పైగా కోపిష్టి, కర్కశుడు, తాలిమి లేనివాడు. పిల్లల చదువుసంధ్యలకు, బట్టలకు, తదితరావసరాలకు కావలసిన డబ్బు సణుగుకోకుండా ఇచ్చేవాడు. కాని ఏడ్చే చంటిపిల్లలని ఎత్తుకు ఆడించడమంటే అసహ్యించుకునేవాడు. అసలుపిల్లల్ని ఆడించడానికి అతనికి తీరుబడే ఉండేదికాదు. తనపని చేసుకునేవాడు, వ్యాపారం చూసుకునేవాడు. ఎక్కువసేపు నిద్ర పోయేవాడుకాదు. ఎప్పుడైనా కాసేపు చీట్లాడేవాడు. మళ్ళా పనిచేసుకునేవాడు. గానుగెద్దుకంద తనను' పోల్చుకునేవాడు. "అవును నా జీవితం యిట్టే ముగిసిపోతుంది." అన్నాడు మరణశయ్యమీద తడియారిన పెదవులపై విషపునవ్వుతో. మేరియాడిమిత్రియెవ్నా కూడా లీజా విషయంలో ఎక్కువశ్రద్ధ తీసుకోలేదు. కాని లావ్రెట్‌స్కీతో మాత్రం తాను స్వయంగా తనపిల్లలను పెంచానని కోతలుకోసింది. లీజాని బొమ్మనిఅలంకరించినట్టు అలంకరించేది పదిమందిముందూ తలనిమిరేది. లీజాని తెలివైనపిల్లవని చిట్టితల్లివనీ ముద్దులాడేది. అంతే. ఎప్పుడూ పిల్లల

సంగతి పట్టించుకోవడం ఆమెకి సరిపడేదికాదు. తండ్రి బ్రతికున్నప్పుడు లీజా, మోరియో అనే పంతులమ్మ సంరక్షణలో ఉండేది. తండ్రి పోగానే లీజా సంరక్షణ బాధ్యత మార్ఫాటిమోఫెయెవ్నా స్వీకరించింది. మార్ఫాని గురించి పాఠకులకు ఇదివరకే తెలుసు. ఇక మోరియో శరీరం కృశించి ముడతలు పడిపోయింది. ఆమెఅలవాట్లుబుద్ధీ పక్షిఅలవాట్లు, పడుచుదనంలో హుషారుగా జీవితం గడిపింది. ముసలితనంలో రెండే రెండు వ్యసనాలు— మహాతీపితినడం, పేకాడడంమిగిలిపోయాయి. మస్తుగాతిని చీట్లాడకుండానో, కబుర్లుచెప్పకుండానో కూర్చుంటే ఆమెముఖంలో చావుకళపడేది. అలా కూర్చునిచూస్తున్నా, ఊపిరిపీలుస్తున్నా బుర్రమాత్రం పనిచేసేదికాదు. ఆమె కరుణార్ద్రహృదయం అంటానికీ వీలులేదు. పక్షికి కరుణేమిటి? పడుచుతనంలో అర్థంలేనిజీవితం గడపడంవల్లనో, బాల్యంనించీ పారిస్‌లో పెరగడం వల్లనో చవకబారు సంశయవాదానికి లోనైపోయింది. ఏదో కొంతవరకు శుద్ధ పారిస్‌నగర గ్రామ్యంమాట్లాడేది. బాతాఖానీకి దిగేదికాదు. చాపల్యం లేదు—పంతులమ్మఉద్యోగానికి ఇంతకంటె కావలసిందేముంది? కాని ఆమె ప్రభావం లీజామీద పడనేలేదు. దాది అగాఫ్యావ్లాస్యెవ్నా ప్రభావం మాత్రం అపరిమితంగాపడింది.

ఈ దాదిచరిత్ర చిత్రమైంది. ఆమె రైతుపడుచు. పదహారోఏట ఒక రైతును పెళ్ళాడింది. ఇరవై సంవత్సరాలపాటు ఆమెతండ్రి అమీనాగా పనిచేసి చాలాడబ్బు సంపాదించాడు. అతిగారాబంగా అగాఫ్యాను పెంచాడు. ఆమె అతిసౌందర్యవతి. ఆపేటకల్లా రాణి. తెలివిగలది. ధైర్యస్తురాలు, మాటకారి. ఒకమాటు నూర్పుడిసమయంలో ఆమెయజమాని మేరయాతండ్రి డిమిట్రిపెస్టోవ్ ఆమెనుచూచి మాట్లాడాడు. ఆమెఅంటే అతనికి పిచ్చిమోహం కలిగింది. త్వరలోనే . ఆమెభర్త చనిపోయాడు. పెస్టోవ్ వివాహితుడైనా లక్ష్యంచేయకుండా ఆమెని తీసుకెళ్ళి తనఇంట్లోనే పెట్టుకొని దొరసానిలా అలంకరింపజేశాడు. ఆమె కూడా ఇంకోవిధమైన జీవితమెన్నడూ అనుభవించనిదానిలాగా, ఈ కొత్తపాత్రకు అనుగుణ్యంగా మెలగసాగింది. ఆమె సొగసుహెచ్చింది. శరీరం బొద్దుబారింది. వ్యాపారస్తుని భార్యచేతుల్లా ఆమెచేతులూ తెల్లగా తయారయాయి. టీపాయి బల్లమీదనించి తీయడమంటూలేదు. పట్టుదుస్తులు, మొఖమలుదుస్తులు తప్పితే

వేరే ధరించడానికి ఇచ్చగించేది కాదు. హంసతూలికాతల్పంమీద నిద్రించేది. ఈ విధమైన వైభోగంతో అయిదుసంవత్సరాలు గడిచాయి. డిమిత్రీ పెస్టోవ్ చనిపోయాడు. అతనిభార్య దయార్ద్రహృదయ. భర్తమీదఉండే గౌరవంకొద్దీ సవితినిక్రూరంగా చూడదలుచుకోలేదు. ఆగాఫ్యా కూడా ఆమెతో హద్దుమీరి ప్రవర్తించేది కాదు. యజమానురాలు ఆగాఫ్యాను ఒక గొల్లపిల్లవానికిచ్చి పెళ్ళిచేసి పంపించింది. మూడు సంవత్సరాలు గడిచాయి. వేసంకాలంలో ఒకరోజున యజమానురాలు పశువులను చూడడానికి వెళ్ళింది. ఆగాఫ్యా ఆమెకి మంచిరుచికరమైన ఐస్క్రీం పెట్టింది. పరిశుభ్రంగా, శాంతంగా, సంతోషప్రదంగా సంతృప్తికరంగాఉన్న ఆగాఫ్యాను యజమానురాలు క్షమించి మళ్ళీ ఇంటికి తీసుకువెళ్ళింది. ఆరునెలలయేసరికి యజమానురాలికి ఆగాఫ్యామీద అనురాగం బలీయమైపోయి ఆమెకు ఇంటిసెత్తనమంతా అప్పజెప్పింది. ఆగాఫ్యా పుంజుకుని మళ్ళీ పూర్వంమాదిరిగా సొగసుగా బొద్దుగా తయారైంది. యజమానురాలికి ఆమెమీద పూర్తిగా విశ్వాసంకుదిరింది. ఇక ఆగాఫ్యా భర్తకు యజమానురాలు నౌకరుపనిఇచ్చింది. కాని అతను తాగుడుకు అలవాటుపడి మధ్యమధ్య ఇంటికిరావడమేలేదు. ఒకమాటు యజమానురాలు వెండిచెంచాలు ఆరుదొంగిలించి తనభార్య పెట్టెలోదాచాడు. దొంగతనం బైటపడింది. అతనికి మళ్ళీ పశువులనుకాచేపనిని యజమానురాలు అప్పగించింది. ఆగాఫ్యామీద పూర్వమున్న ఆదరం సమసిపోయింది. యజమానురాలు ఆమెను ఇంట్లోనించి వెళ్ళగొట్టలేదుగాని కుట్టుపని అప్పగించి లేసుటోపీ బదులు రుమాలు తలమీదకట్టుకునేట్టు చేసింది. ఆగాఫ్యా ఈఅవమానానికి తలవంచడం అందరికీఆశ్చర్యంవేసింది. ఆగాఫ్యాకి అప్పటికిముప్ఫయిఏళ్ళు. పుట్టిన పిల్లలంతా చనిపోయారు. కొద్దికాలానికి భర్త కూడా మరణించాడు. తెలివి తెచ్చుకోవలసిన సమయం అది. అలాగే తెలివి తెచ్చుకుని మితభాషిత్వం అలవర్చుకుంది. దైవభక్తి హెచ్చింది. ప్రతిఆదివారం చర్చికివెళుతూండేది. మంచి మంచిదుస్తులన్నీ దానంచేసింది. ఈవిధంగా పదిహేనుసంవత్సరాలు ప్రశాంతంగా, నమ్రతతో, ఎవరితోనూపోట్లాడకుండా, అన్నిటికీ తలవంచి గడిపింది. అవమానంజరిగితే నమ్రతతో తలవంచినమస్కరించి తననుపోషిస్తున్నందుకు కృతజ్ఞతచూపేది. యజమానురాలు ఆగాఫ్యాను క్షమించి సాదర

ణంతో ఆమెకు బహుమతీగా తాను ధరించేటోపీనిచ్చింది. కాని అగాఫ్యా తలరుమాలును మాత్రం విడిచిపెట్టలేదు. ఎప్పుడూ నల్లటిదుస్తులు ధరించేది. యజమానురాలి మరణానంతరం ఆమె ఇంకా ప్రశాంతంగా నమ్రతతో మెలగసాగింది. సర్వసాధారణంగా రచ్చన్నను ఇట్టే భయపెట్టవచ్చు. వారి ప్రేమ చూరగొనవచ్చు. కాని వారిగౌరవం పొందడం కష్టం. వారు ఇతర్లను తొందరగానూ, విచక్షణారహితంగానూ గౌరవించరు. అగాఫ్యా అంటే ఇంట్లో అందరికీ అమితగౌరవం. ఆమె పూర్వపుదోషాలు యజమానితోపాటే మాసిపోయాయో అన్నట్లు ఇంట్లో ఎవరూ వాటినిగురించి ప్రస్తావించే వారు కాదు.

మేరియా డిమిట్రియెవ్నా కాలిటిన్‌నువివాహమాడగానే అగాఫ్యాకు ఇంటిపెత్తనం అప్పగిద్దామని అతను ఆలోచించాడు. కాని అగాఫ్యా అంగీకరించలేదు. ప్రలోభానికి లోనైపోతానేమోనని ఆమెభయం. కాలిటిన్ కోపంతో గొంతెత్తి వంగినమస్కరించి సగిలోంచి వెళ్ళిపోయేది మనిషితత్వం తెలుసుకోడంలో కాలిటిన్ పొరబడేమనిషికాదు. ఆమెతత్వం గ్రహించాడు. ఎన్నడూ ఆమెను మరిచేపోలేదు. పట్టణంలో కాపరంపెట్టగానే అగాఫ్యా ఇష్టప్రకారం ఆమెను లీజాకి దాదిగా నియోగించాడు అప్పటికి లీజాకి అయిదవఏడు.

ఆరంభంలో దాదియొక్క నిశ్చల, గంభీరముఖంచూచేసరికి లీజా బెదిరిపోయింది. కాని త్వరలోనే అలవాటుపడి, ఆమెను ఎక్కువగా ప్రేమించసాగింది లీజా కూడా గంభీరమైంది. రూపురేఖలలో పూర్తిగా తండ్రి పోలిక. కళ్ళుమాత్రం తండ్రికళ్ళుకావు ఆ కళ్ళల్లో సాధారణంగా పిల్లలలో కనిపించని గౌరవ, కరుణాభావాలు గోచరించేవి. ఆమెక బొమ్మలంటే సరదాలేదు. బిగ్గరగానూ, దీర్ఘంగానూ, ఎన్నడూ నవ్వేదికాదు. ఎన్నడూ కలతచెందేదీకాదు. ఎప్పుడూ ఆదేపనిగా ఆలోచించేదికమూకాదు. అలా అని అసలు ఆలోచించడమే మానేసేదికాదు. మౌనంగా ఉండిఉండీ పెద్దవారిని అడిగే ప్రశ్నలుచూస్తే ఆమెకి నచ్చినవిషయాలమీద ఆలోచిస్తుండేదని తేలుతుంది. బాగా పసితనంలో నట్టుగా మాట్లాడడం మానేసింది మూడోఏడు వచ్చేసరికి స్పష్టంగా మాట్లాడడం నేర్చుకుంది ఆమెకి తండ్రి

భయం. తల్లిమీద నిర్దిష్టభావాలుండేవికావు. తల్లంటే భయపడేదికాదు.
ప్రేమను బైటకు ప్రకటించేదికాదు. లీజా అగాఫ్యానొక్కతెను ప్రేమిం
చింది. కాని ఆ ప్రేమనుకూడా బహిరంగంగా ఎన్నడూ ప్రకటించలేదు
అగాఫ్యానువదిలి లీజాఉండలేకపోయేది. వీళ్ళిద్దరిజత చూడడానికి చిత్రంగా
ఉండేది. అగాఫ్యా మొహం మైనంలాంటిదైనా ఇంకా సుందరంగా భావ
ద్యోతకంగా ఉంది. ఆమె పూర్తిగా నల్లటిదుస్తులు ధరించి, తలమీద నల్లటి
రుమాలు కట్టుకని, నిటారుగా కూర్చుని మేజోళ్ళుకట్టుతూంటే, ఆమెపాదాల
చెంత చిన్న పడకకుర్చీ వేసుకుని లీజా ఏదోపనిచేసుకుంటూనో, తల పై
కెత్తి అగఫ్యా చెప్పేది శ్రద్ధగా వింటూనేవుండేది. అగాఫ్యా కట్టుకథలు
చెప్పేదికాదు. మేరీకన్యను గురించీ, ఋషులనుగురించీ, వీరులనుగురించీ,
నెమ్మదిగా చెప్పేది. ఋషులు ఎలా అరణ్యాలలో నివసిస్తూ ఆకలిదప్పులకు
ఓర్చుకని మోక్షాసక్తులై, రాజులనుసైతం లక్ష్యంచేయకుండా క్రీస్తుప్రభు
వును కొలచేవారో, ఎలా పక్షులు వారికిఆహారం తెచ్చిపెట్టేవో, అరణ్య
మృగాలు ఎలా వినయవిధేయతలతో మెలిగేవో, వారిరక్తం పారినచోట
ఎలాపుష్పాలు పుట్టుకొచ్చేవో వర్ణించేది. లీజాకి పువ్వులంటే మహా
ఇష్టం. అందుకని ఒకసారి "పుష్పాలే?" అని అడిగింది, అంత
ఉదాత్తమైన, పవిత్రమైనమాటలు ఉచ్చరించడానికి, తనకు అర్హతలేదని
తెలుసుండికూడా అగాఫ్యా లీజాతో గంభీరంగా, నమ్రతతో, మాట్లాడేది
లీజా ఆమెమాటలు, శ్రద్ధగా ఆలకించింది. సర్వశక్తిసంపన్నుడూ, సర్వ
జ్ఞుడూ అయిన భగవానునిరూపం మధురశక్తితో ఆమెలో ప్రవేశించి నిర్మల
మైన దైవభీతి గలిగించింది, ఇక క్రీస్తుఆమెకు అతిసన్నిహితుడయిపోయాడు,
తన సాటివానిగా ఆయనను లీజా భావించేది. ఒక్కొకపుడు అగాఫ్యా తెల్ల
వారబోయేముందు లీజానిలేపి తొందరతొందరగా అలంకరించి ఉదయ
ప్రార్థనలకు ఎవర్కీ తెలియకుండా తీసుకచక్కాబోయేది. లీజా ఊపిరి బిగ
బట్టి కాలివేళ్ళమీద నడుస్తూ ఆమెని అనుసరించి వెళ్ళేది. ప్రభాతకాలపు
చలీ, చీకటీ, చల్లగా ఖాళీగాఉన్న చర్చీ, ఆచర్చిలో రహస్యంగా వచ్చి
పడుకోవడం-ఇదంతా నిషిద్ధమైనా, ఆ నిషేధంలోని వైచిత్రి, పవిత్రత
ఆమెను పరవశురాలిని చేసేశాయి. అగాఫ్యా ఎన్నడూ ఎవరినీ కోపపడేది
కాదు. చెప్పినమాట వినకపోయినా లీజాని కసురుకునేదికాదు. కోపంవస్తే

మాట్లాడకుండా ఊరుకునేది. ఆ మౌనంలోని అర్థం లీజా గ్రహించింది. పిల్లలకు సహజంగా ఉండే సూక్ష్మబుద్ధితో అగాఫ్యాకి ఎప్పుడు ఎవరి మీద — మేరియా మీద, కాలిటిన్ మీద — కోపం వచ్చిందీ పసిగట్టేది. ఈ విధంగా లీజా అగాఫ్యా చేతుల్లో మూడేళ్ళు పెరిగింది. తర్వాత మేరియా శిక్షణం. మేరియాకి తెలివితేటలు లేవు. వాలకం బాగుండేదికాదు. అందువల్ల లీజా ప్రేమను చూరగొనలేకపోయింది. అంతేకాదు, అగాఫ్యా లీజాసంగతి పట్టించుకోలేకపోయినా ఒకే ఇంట్లో ఉండడంవల్ల తరుచు కలుసుకునేది.

మార్ఫా టిమోఫేయవ్నా కాలిటిన్ ఇంట్లో నివాసం ఏర్పర్చుకున్న దగ్గరినించీ అగాఫ్యాకీ, ఆమెకీ సరిపడలేదు. మార్ఫా ముక్కోపి. పట్టుదలమనిషి. ఆ వృద్ధురాలికి గంభీరంగా, హుందాగా ప్రవర్తించే అగఫ్యా అంటే గిట్టలేదు. అగాఫ్యా తీర్థయాత్రలకని వెళ్ళి మళ్ళీ తిరిగిరాలేదు. ఆమె సన్యసించిందనే ప్రవాదమాత్రము పుట్టింది. కాని లీజా హృదయంలో ఆమె నాటిన భావాలు చెరిగిపోలేదు. లీజా చర్చికి వస్తూనే ఉంది. అభిలాషతో హృదయపూర్వకంగా ప్రార్థనలుచేసేది. ఇదంతా చూస్తుంటే మేరియాకి ఆశ్చర్యం వేసింది. మార్ఫా లీజాస్వేచ్ఛను అడ్డగించకపోయినా, లీజా గొప్పఇంటిబిడ్డకాబట్టి పదేపదే సాష్టాంగపడడం తగదంటూ ఆమె అభినివేశాన్ని సడలించాలని యత్నించింది. లీజా శ్రద్ధగా చదువుకుంది. ఆమె ప్రతిభావంతురాలుకాదు. కాని కష్టపడిచదివేది. పియానో బాగానే వాయించేది కాని నేర్చుకోడానికి ఎంతకష్టపడిందీ లెమ్ ఒక్కడికే తెలుసు. ఎక్కువగా గ్రంథాలుచదవలేదు. ఆమెకి "స్వంతమాటలు" అంటూలేవు. కాని స్వంతఆలోచనలు ఉండేవి. తన ఇష్టప్రకారం నడుచుకునేది. తండ్రిపోలిక ఊరికేరాలేదు. అతనూ ఏమి చెయ్యమంటావని ఎవరినీ అడిగినపాపానపోలేదు. ఈవిధంగా ప్రశాంతంగా, మెలమెల్లగా పంధొమ్మిదోఏటవరకూ పెరిగింది. ఆమె బహు చక్కనిది, కాని ఆవిషయం ఆమెకితెలీదు. చేష్టలలో తీరూతెన్నూ

ఉండేదికాదు. పరస్పర్శ నెరుగని యవ్వనమాధుర్యం ఆమెస్వరంలో విన పించేది. ఏమాత్రం సంతోషకలిగినా వెంటనే మె పెదవులపై మంద హాసం వెలకొనేది. కళ్ళు దేదీప్యమానంగా వెలిగిపోయేవి. కర్తవ్యపరాయణభావంతో, ఇతరులకు బాధకలిగించుతాననే భయంతో, దయార్ద్ర హృదయంతో అందరినీ ప్రేమించేది. కాని ఏఒక్కరినీ ప్రేమించిందనడానికి వీలులేదు. ఒక్క భగవంతుణ్ణిమాత్రమే హృదయపూర్వకంగా, భయభక్తులతో ప్రేమించింది. ప్రశాంతంగాఉన్న ఆమె జీవిత కాసారాన్ని మొదటి సారిగా లావ్రెటస్కీ అల్లకల్లోలంచేశాడు. అటువంటిదీ లీజా.

# 3౬

ఆ మర్నాటి ఉదయం పదకొండు దాటిన తర్వాత లావ్రెట్‌స్కీ లీజా ఇంటికి వెళ్ళాడు. తోవలో పాన్షిన్ గుర్రంమీద స్వారీచేస్తూ, కనుబొమ్మలదాకా హాటుదించుకుని, లావ్రెట్‌స్కీని దాటిపోయాడు. లావ్రెట్‌స్కీకి ఇంటివారెవరూ ఎదురురాలేదు. మేరియా కుటుంబంతో పరిచయమైనతర్వాత ఇలా జరగడం ఇదే మొదలు. "మేరియా డిమిత్రియెవ్నాకి తలనొప్పి వచ్చింది. విశ్రాంతి తీసుకుంటూంద"ని నౌకరు తెలియజేశాడు. మార్ఫా, లీజాలు ఇంట్లో లేరు. లీజా కనిపిస్తుందనే ఆశాలేశంతో లావ్రెట్‌స్కీ తోటలో కాసేపు షికారుచేశాడు. కాని ఎవరూ కనిపించలేదు. రెండుగంటలతర్వాత లావ్రెట్‌స్కీ మళ్ళీ వెళ్ళాడు. నౌకరు నడుంమీద చేతులుమోపుకుని మళ్ళీ అదే సమాధానం ఇచ్చాడు. ఒకేరోజున మళ్ళీ మళ్ళీ వెళ్ళడం భావ్యంకాదని తలచి లావ్రెట్‌స్కీ వాసిలెవస్కోయెకి వెళ్ళ నిశ్చయించాడు. అక్కడ స్వయంగా చూసుకోవాలసిన పనులున్నాయి. తోవలో ఒకదానికంటె ఒకటి ఎక్కువ ఆశాజనకమైన ఆలోచనలెన్నో చేశాడు. కాని తీరా ఇంటికి వెళ్ళేసరికి ఉత్సాహమంతా నీరుకారిపోయింది. ఆంటన్‌తో సంభాషణ ప్రారంభించాడు. ఖర్మంచాలక ఆ వృద్ధఆంటన్ విషాదవిషయాలు స్మృతికి తేసాగాడు. "గ్లాఫీరా

పెట్రోవ్నా చనిపోయేముందు చేసుకున్నంతా అనుభవించింది." కొంచెం ఆగి నిట్టూర్చి మళ్ళా అన్నాడు. "ప్రతివాడూ తన వినాశనంతానే తెచ్చిపెట్టుకుంటాడు." లావ్రెటస్కీ తిరిగి పట్నంచేరుకునేసరికి పొద్దు పోయింది. గతరాత్రివిన్న సంగీతం అతన్ని వెంటాడుతూనేవుంది. లీజా రూపం విస్పష్టంగా అతనికళ్ళముందు తారాడుతోంది. ఆమెను ప్రేమిస్తున్నాననేభావం అతనిని ఆనందంలో ముంచెత్తింది. పట్నంలోని ఇంటికిచేరుకునేసరికి హృదయం ప్రశాంతంగాఉంది. సంతోషం ఉరకలు వేస్తోంది.

ఇంట్లో ప్రవేశించగానే అతను ఎక్కువగా అసహ్యించుకొనే పాచేలీఅత్తరుల వాసన గొట్టింది. హాలులో పెట్టెలు, సూటుకేసులు కనిపించాయి. అతనిని కలుసుకోవడానికి పరుగెత్తుకుంటూవచ్చిన నౌకరు ముఖకవళిక విచిత్రంగాఉంది. వీటన్నిటినీ విశేషించి ఆలోచించకుండా కచేరీ గదిగుమ్మందాటాడు... సోఫాలోంచి లేసులుకట్టిన నల్లటి పట్టుదుస్తులు ధరించిన ఒకావిడలేచింది. లేచి, సన్నటి జేబురుమాలు ముఖానికి అడ్డంపెట్టుకుని నాలుగడుగులు వేసి, అతిసొగసుగా అలంకరించుకుని ఘుమ ఘుమలాడే తలనువంచి, అతని పాదాలమీద వాలింది. అప్పుడు గుర్తించాడు. ఆమె అతనిభార్య.

అతనికి ఎగఊపిరిపడింది...గోడకు ఆనుకున్నాడు...

"థియోడర్! నన్ను తిరిమేయకు!" అని ఫ్రెంచిభాషలో చెప్పింది. ఆమెమాటలు శూలాల్లాగా అతనిగుండెల్లో గుచ్చుకున్నాయి. ఆమెపై శూన్యదృష్టులు పంపాడు. కాని ఆమె తెల్లబారిపోయిందనీ, కాయం మూలమైందనీ గ్రహించాడు.

"థియోడర్!" అంటూ తిరిగి ఆమె మధ్యమధ్య కళ్ళుపైకెత్తుతూ చేతులు నలుపుకుంటూ ప్రారంభించింది. ఆమె చేతిగోళ్ళకు గులాబిరంగు వేసింది. "థియోడర్! నీకు ద్రోహంచేశాను. మహాద్రోహంచేశాను. నేను రాక్షసిముండని. కాని నా మొర కాస్త ఆలకించు. పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నాను. నాకు నేనే భారమైపోయాను. యిక భరించలేను. యెన్నిసార్లో నీతో మొరపెట్టుకోవాలనుకున్నా, కాని నీకు కోపంవస్తుందని భయపడిపోయా. పాతజీవితాన్ని వదలిపెట్టివేయాలని నిశ్చయించు

కున్నా...ఎంతో వ్యసపడ్డా." నుదుటిమీదా, చెంపలమీదా చేతితో రాసుకుంటూ తిరిగిఅన్నది. "నేను చచ్చిపోయాననే వార్తలమాటున నా గతజీవితాన్ని వదిలివేశాను. పగలూ, రాత్రీ అనక ప్రయాణంచేసి యిక్కడకు పరుగెత్తుకుంటూ వచ్చా. నీయెదుట, నాకు న్యాయం ప్రసాదించగల నీయెదుట పడడానికి ఎంతో జంకా. నీవు పూర్వం నామీదచూపిన దయా దాక్షిణ్యాలు జ్ఞాపకంవచ్చేసరికి భయంతీరింది. నువ్వెక్కడున్నదీ పోస్టాఫీసులో అడిగి తెలుసుకున్నా" మెల్లిగా లేచి పడకకుర్చీ అంచునకూర్చుని తిరిగి ప్రారంభించింది. "ఆత్మహత్య చేసుకుందామని అనేకసార్లు ఆలోచించా. నాజీవితం నాకు తీరనిభారంగా తయారైంది. ఆత్మహత్యచేసుకోడానికి వెనుకంజవేసేదాన్ని గాదు. కాని నాచిట్టితల్లి అడా నాకుబంధనమై పోయింది. అదిగో, అక్కడ, ఆగదిలో నిద్రపోతోంది. పాపం! అలిసిపోయింది. చూద్దుగాని అదేం పాపంచేసుకుంది! అబ్బ! యమబాధ, యమబాధ!" అంటూ మదాం లావ్రెట్స్కీ కన్నీళ్ళుకాల్వకట్టేటట్టు ఏడవసాగింది.

లావ్రెట్స్కీ కోలుకుని గోడకు దూరంగా జరిగి గుమ్మం మొహం పట్టాడు.

"వెళ్ళిపోతున్నావా ?" అని నిరాశా గర్భితస్వరంలో అడిగింది. "ఒక్కమాటైనా మాట్లాడకుండా. తిట్టనయినా తిట్టకుండా వెళ్ళిపోతున్నావా ? అబ్బ ఎంత కిరాతకత్వం !... యీ తృణీకారం భరింపరానిది. ఘోరంఘోరం !"

లావ్రెట్స్కీ ఆగి, "యేం చెప్పమన్నావ్." అని భావశూన్యమైన స్వరంలో అడిగాడు.

"యేంలేదు." అని గబుక్కున అన్నది. లావ్రెట్స్కీయా "దేనికీ నాకు అర్హతలేదని తెలుసు. నాకు మతిపోలేదు. నిజం. నాకు ఆశలేశమైనాలేదు. నువు క్షమిస్తావని ఆశించనూలేదు... యెక్కడవుండమంటే అక్కడవుంటాను. యేంచెయ్యమంటే అదిచేస్తాను. యిదే నా ప్రార్థన. నీ ఆదేశాలేమైనప్పటికీ బానిసలాగా శిరసావహిస్తాను."

"ఆదేశాలూ లేవు, గీదేశాలూ లేవు." అని సమాధానమిచ్చాడు జీవరహితమైన ఆదేశ్వరంతో. "మనిద్దరికీ యిక పొసగదని నీకూ తెలుసు... అందులో యిప్పుడు మరీని. నీ యిష్టమొచ్చినచోట వుండచ్చు. మనోవర్తి చాలకపోతే..."

'అబ్బ! అంత భయంకరంగా మాటాడకు' అంది వార్వారాపాప్లోవ్నా "యీ చిట్టితల్లి మొహం చూసైనా నన్ను క్షమించు." అంటూ ప్రక్కగది లోకి ముందుగా పరుగెత్తుకువెళ్ళి మంచి సొగసైన దుస్తులుధరించిన చంటిబిడ్డను ఎత్తుకుని చక్కావచ్చింది. ఆబిడ్డ ముద్దుమొహంమీద, పెద్దగా నల్లగాఉన్న కళ్ళమీదా ముంగురులు వేలాడుతున్నాయి. తల్లి మెడమీద చిట్టిచేతులు ఆనించి మందహాసంచేసి దీపంకేసి మిణకరించి చూసింది.

"ఆడా! అదిగోచూడు మీనాన్న." అంది. వార్వారా కళ్ళమీదపడ్డ ముంగురులు వెనక్కితోసి వేస్తూ.

"నాన్నా ?" అంది ఆ బిడ్డ తొస్సుగా.

"ఆఁ నువ్వంటే ఆయనికి మహాప్రేమ !" అంది వార్వారా

లావ్రెటస్కీ ఇక భరించలేక "సరిగ్గా యిటువంటిసీను యే నాటకంలోవుంది చెప్మా"అని చర్రున చక్కాబోయాడు.

వార్వారాపాప్లోవ్నా కొద్ది క్షణాలపాటు నిర్ఘాంతపోయింది. తర్వాత బుజాలు కొద్దిగా ఎగరవేసి బిడ్డను ప్రక్కగదిలోకి తీసుకుని వెళ్ళి పడుకోబెట్టి నిద్రపుచ్చింది. తర్వాత పుస్తకంతీసుకుని దీపందగ్గిర ఒక గంటదాకా చదువుకుంటూ కూర్చుని, ఆతర్వాత శయనించింది.

"ఊఁ—యేమైందిః" అని ప్రశ్నించింది దాసి. ఈదాసీని వార్వారా పారిస్‌నించి తీసుకువచ్చింది.

"ఓ-అంతా సవ్యంగానేవుంది. జస్టీనీ! ఆయనికి వయస్సు పైబడింది. అయితేనేం పూర్వంలాగానే దయతోనే చూచాడు. యేవీ, నాచేతి తొడుగులు, యిలాయివ్వు. రేపటికి యెత్తుకాలరు, బూడిదరంగుగౌను సిద్ధంగావుంచు. ఆడాకి మాంసపుముక్కలు మర్చిపోకు...యిక్కడ దొరకడం కష్టం. అయినా ప్రయత్నించెయ్యాలి." అంది వార్వారా

"యుద్ధంచేసినంత పనిచేయాలి." అని దీపం ఆర్పేసింది జస్టీనీ.

## 38

రెండుగంటలసేపుపైగా లావ్రెటస్కీ పట్నంవీధుల్లో తిరిగాడు. వెనక పారిస్ వీధుల్లోగడిపినరాత్రి జ్ఞాపకంవచ్చింది. బాధతో గుండెపగిలి పోయింది. తల దిమ్మెక్కిపోయింది. అర్థరహితమైన, భయంకరమైన, అతిదుష్టభావాలు అతనిబుర్రలో సుళ్ళుతిరిగాయి. "అది బతికేవుంది, తిరిగి రానూవచ్చింది." అని ఆశ్చర్యంతో పదేపదే మెల్లగా అనుకున్నాడు. లీజా ఇక తనకు దక్కదని భావించాడు. కోపంతో ఉడికిపోయాడు. ఈ అఘాతం పిడుగులా అతనిమీదపడింది. ఆవెధవపత్రికలోని ఆకట్టుకథ అంతసులభంగా ఎలానమ్మాను? "సరే నమ్మలేదనుకో." అంటూ ఆలోచించసాగాడు. "మోజరిగేది? లీజా నన్ను ప్రేమించిందని నాకు తెలిసేది గాదు. నేనామెను ప్రేమించానని ఆమెకీ తెలిసేదికాదు." భార్య, రూపం, స్వరం, కళ్ళు మర్చిపోవాలనుకున్నాడు. కాని సాధ్యంకాలేదు. తనను తానే తిట్టుకున్నాడు. ప్రపంచాన్నంతా తిట్టిపోశాడు.

తెల్లవార వస్తున్నదనగా అలసటతో, బాధతో సొమ్మసిలి లెమ్ ఇంటికిచేరుకున్నాడు. తలుపు ఎంతసేపుకొట్టినా ఎవరూపలకలేదు చివరికి ఎలాగైతేనేం ఆవృద్ధుతల కిటికీదగ్గిర కనిపించింది. ఆసమయంలో లెమ్ తలకి టోపీపెట్టుకుని ఉన్నాడు. ఇరవైనాలుగుగంటలక్రితం మహో

న్నత కళా ప్రపంచంలో విహరిస్తూన్నప్పటి కళాకాంతులు అతని ముఖంలో లేవు. పైగా ముఖం ముడుచుకుని మహోచికాకుగా ఉన్నాడు.

"యేమిటి? ప్రతిరాత్రీ నీకు సంగీతం వినిపించలేను. కషాయం పుచ్చుకునా.." అన్నాడు లెమ్. లావ్రెటస్కీ ముఖం చిత్రంగా ఉన్నట్టుంది. ఆ వృద్ధు కంటిపైన చెయ్యి అడ్డంపెట్టుకుని జాగ్రత్తగా పరిశీలించి చూసి తలుపు తెరచాడు.

లావ్రెటస్కీ గదిలోకి వెళ్ళి ఒక కుర్చీలో కూల బడ్డాడు. చిరుగు పట్టిన దుస్తులు దగ్గరసాలాక్కుంటూ లావ్రెటస్కీకి ఎదురుగా నిల బడ్డాడు, లెమ్.

"నాభార్య వచ్చింది.' అని తలయెత్తి లావ్రెటస్కీ హఠాత్తుగా విచ్చినవ్వునవ్వాడు.

లెమ్ రాతివిగ్రహంలా నిలబడిపోయాడు. మందహాసమైనా చేయలేదు. దుస్తులు ఇంకా దగ్గిరకి లాక్కున్నాడు.

"అవును నీకు తెలీదు. నేను అనుకున్నా... ఆమె చని పోయిందని ఒక పత్రికలో చదివా"

"ఓహో-చదివి అట్టే కాలంకాలేదు గదూ ?'' అని అడిగాడు లెమ్.

"అట్టే కాలం కాలేదు."

"ఓహో !'' కనుబొమలు పైకెత్తి తిరిగి అన్నాడు లెమ్.

"యిపుడామె యిక్కడే వుందన్నమాట !"

"ఆ-నా యింటోనేవుంది. నేను... దురదృష్ట జాతకుణ్ని." అని విచపునవ్వు నవ్వాడు లావ్రెటస్కీ.

"అవును నువు దురదృష్టజాతకుడివి" అని మెల్లిగా అన్నాడు లెమ్.

"క్రిస్టాఫర్ ఫియొడొరవిచ్! వుత్తరంముక్క ఒకటి తీసుకెళతాగా !''

"హుం—యెవరికి ?"

"ఎలిజవె........."

"ఆ, ఆ. సరే. అర్థమైంది. యెప్పుడు తీసుకెళ్ళియివ్వాలి ?"

"రేపు సాయంత్రమేనంత తొందర్లో."

"హుఁ వంటమనిషిని పంపుతా. ఊహుఁ. నేనే స్వయంగా తీసుకెడతా"

"జవాబు తీసుకొస్తారుగదూ ?"

"ఆ — ఆలాగే"

లావ్రెటస్కీ నిట్టూర్పు విడిచాడు.

"అవును వట్టి దురదృష్ట జాతకుడివి."

లావ్రెటస్కీ లీజాకి నాలుగుముక్కలు రాశాడు. అందులో తన భార్య తిరిగివచ్చిందనీ, లీజాను చూడాల్సిన పనుందనీ రాశాడు. ఇలారాసి సన్నటి సోఫామీద గోడవైపుకు ముఖం పెట్టుకుని పడుకున్నాడు. లెమ్ అతని ప్రక్కమీద పడుకున్నాడుకాని నిద్రపట్టలేదు. అటూ యిటూ దొర్లుతూ, దగ్గుతూ మధ్య మధ్య గుక్కెడు గుక్కెడు కషాయం తాగసాగాడు.

తెల్లవారింది. ఇద్దరూ లేచి ఒకరినొకరు చిత్రంగా చూసుకున్నారు. ఆఘడియలో లావ్రెటస్కీకి ఆత్మహత్య చేసుకుందామనిపించింది. వంటవాడు అడవారికం కాఫీ తెచ్చిచ్చాడు. గడియారం ఎనిమిది కొట్టింది. లెమ్ హాటుపెట్టుకుని, లీజాకి పాఠంచెప్పడానికి వెళ్ళవలసింది పదింటికైనా ఏదో ఒకవంక చెబుతానంటూ, బయలుదేరాడు. లావ్రెటస్కీ మళ్ళీ ఆసోఫాలోకి ఒరిగాడు. అతని ఆత్మలో కొంగ్రొత్తగా విపరీతమైన సంతోషం కదలాడసాగింది. ఇంటినించి తనభార్యా ఎలా తనను తరిమేసిందో తలపోయసాగాడు. లీజాస్థితిని ఊహించుకుంటూ కనులుమూసుకుని చేతులు తలవెనక కట్టుకున్నాడు. లెమ్ తిరిగివచ్చి ఒకచీటీ ఇచ్చాడు. దానిమీద లీజా పెనసలుతో, "ఇవాళ కలుసుకోడంపడదు. రేపుసాయంకాలం కలుసుకుందాం. శెలవు." అనిరాసింది. లావ్రెటస్కీ ఉదాసీనంగా, పరాకుగా లెమ్‌కి కృతజ్ఞత తెల్పి ఇంటికి చక్కాబోయాడు.

ఇంటిదగ్గర అతనిభార్య ఫలహారంచేస్తోంది. అడా, జుట్టు ఉంగరాలు తిరిగివుంది. ఊదా రిబ్బన్న తెల్లటిగౌను తొడుగుకుని మాంసం

ముక్కలు తింటూంది. లావ్రెటస్కీ లోపలికి రాగానే వార్వరా పావ్లోవ్నా లేచి, వినయవిధేయతలతో అతనికి ఎదురేగింది. చదువుల గదిలోకి రమ్మని తీసుకువెళ్ళి లోపల గొళ్ళెం పెట్టి అతను అటూయిటూ తిరగ నారంభించాడు. చేతులు కట్టుకుని గంభీరంగా కూర్చుని అతనిని కంటకనిపెట్టుతూ కూర్చుంది వార్వరా. కొద్దిగా కృత్రిమాలంకారం చేసుకున్నా ఆమె కళ్ళు ఇంకా అందంగానే ఉన్నాయి.

కొంతసేపటివరకూ లావ్రెటస్కీ నోటమాట పెగలలేదు. తన మనశ్శరీరాలు తన స్వాధీనంలో లేవని గుర్తించాడు అంతేకాదు వార్వరాకి తనంటే ఏవిధా భయం లేదనీ, ఏక్షణంలోనైనా మూర్ఛపోయే దానిలా నటిస్తోందనీ గ్రహించాడు.

"వాడు" అని ప్రారంభించాడు దీర్ఘంగా నిశ్వసిస్తూ, పళ్ళు బిగించుకొంటూ. 'మనం ఒకరి నొకరం మోసం చేసుకోవలసిన అవసరం లేదు, నువ్వు పశ్చాత్తాప పడ్డావంటే నేను నమ్మను నువ్వు నిజంగా పశ్చాత్తాప పడ్డా నేను తిరిగి నీవాడనవడం, నీతో కలిసి కాపరం చెయ్యడం సాధ్యం కాదు'

వార్వరా పావ్లోవ్నా పెదిమలు బిగించుకొని ఓర చూపు చూస్తూ కూర్చుని, "అసహ్యం! యిక లాభంలేదు. ఈయన దృష్టిలో నేను స్త్రీనే కాను' అనుకొంది.

"సాధ్యంకాదు." అని కోటుగుండీలు సరిగా పెట్టుకుంటూ తిరిగి లావ్రెటస్కీ అన్నాడు. "నువ్వెందుకిక్కడికి వచ్చావో నాకర్థం కావడం లేదు. బహుశా డబ్బు అయిపోయివుంటుంది కదూ ?"

"అబ్బ! నన్నవమానపరుస్తూన్నావు." అంది వార్వరా మెల్లిగా.

"యేమైనా – దురదృష్టవశాత్తూ నువ్వింకా నా భార్యవే. నిన్ను తరిమేయలేను......సరే విను నీకిష్టమైతే యివాళే నువ్వు లావ్రికీ వెళ్ళొచ్చు. అక్కడ సుఖంగా వుండు. మంచి యిల్లువుంది, నీకు తెలుసుగా నీకు మామూలుగా యిచ్చే మనోవర్తి కాక నీకు కావలసిందల్లా అందజేస్తాను-సరేనా..."

వార్వరా పావ్లోవ్నా బుటేదారీ జేబురుమాలు ముఖంమీద వేసుకుంది పెదిమలు అల్లల్లాడాయి. "నువ్వేం చెయ్యమంటే అది చేస్తానని యిది

వరకే చెప్పానుగా. నీ ఔదార్యానికి కృతజ్ఞత తెల్పదలుస్తున్నాను. అంతే." అంది.

"కృతాభివందనాలకేంలెద్దూ అది లేకుంటేనేమంచిది." అన్నాడు లావ్రెటస్కీ తొందరతొందరగా. గుమ్మంకేసివెళ్ళబోతూ మళ్ళీ అన్నాడు. "అలాఅయితే రేపు వెళతావుగదూ?..."

"రేపు లావ్రికీ వెళ్ళిపోతాను." అని గౌరవపురస్సరంగా ఆసనం మీదనించి లేస్తూ అన్నది వార్వరా. "కాని ఫియోడర్ ఇవనిచ్..." (థియోడర్ అనడంమానేసింది.)

"యేం?"

"నువ్వు ననుక్షమించలేదు. ముందుముందు క్షమిస్తావనే ఆశ..."

"ఓహ్!, వార్వరా పావ్లోవ్నా!" అంటూ అడ్డువచ్చాడు లావ్రెటస్కీ. "నువ్వు తెలివిగలదానివి. కాని నేనుమాత్రం తెలివితక్కువ మొద్దునుగాను. నేను నిన్నుక్షమించాలని నీకు గోరంతైనాలేదు. నిన్ను ఎన్నడో క్షమించాను. మనిద్దరిమధ్యా పెద్ద అఘాతమేర్పడింది."

"వినయ విధేయులతో పడుంటా" అంది తలవంచి వార్వరా. "నేచేసినపాపాన్ని మర్చిపోలేదు. నామరణవార్తకి నువ్వు సంతోషించేవుంటావుకూడా" అంది నమ్రతతో బల్లమీదపత్రిక వేలితో చూపిస్తూ.

ఫియోడర్ ఇవనిచ్ ఆగిపోయాడు. ఆ వ్యాసం పెన్సిలుతో గుర్తు పెట్టివుంది. ఆసమయంలో ఆమె దివ్యసుందరిమూర్తిలా వుంది. తీర్చి దిద్దినట్లు, సున్నితంగా వున్న మెడ, మెడచుట్టూ తెల్లటి కాలరు, ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో కదలాడే వక్షస్థలము, గాజులుగానీ ఉంగరాలుగానీ లేని బోసిచేతులూ - ఆమె ఆపాదమస్తకం ఎంతో అందంగావుంది.

లావ్రెటస్కీ విద్వేషంతో ఆమెకేసి తేరిపారజూచి "బలే, బలే!" అనబోయాడు, గుప్పిటబిగించి కణతమీద ఒక్కటివేయబోయాడు. కాని అలాచెయ్యకుండా గిర్రున తిరిగి చక్కాబోయాడు. గంటతర్వాత వాసిలెవస్కోయకి బయలుదేరాడు. రెండుగంటలతర్వాత వార్వరాకూడా చక్కటిబండి అద్దెకు తీసుకుని, నల్లటిగడ్డ కట్టుపెట్టుకుని, సాధారణమైన పచ్చడంకప్పుకుని, అడాను జస్టినీకి అప్పగించి మేరియా ఇంటికి బయలుదేరింది. సేవకులను ఆరాతీయగా తనభర్త నిత్యమూ మేరియా ఇంటికి వెడుతున్నాడని ఆమెకి తెలిసింది.

# 30

లావ్రెట్స్కీకి భార్యా ఓ-పట్టణానికివచ్చినరోజు సంతోషప్రదంగా గడవలేదు. లీజాకూడా ఆరోజు ఘోరంగా పరిణమించింది. మేడదిగి తల్లిదగ్గిరికి వెళ్ళిందోలేదో బయట గుర్రపుడెక్కలధ్వని వినిపించింది. ఆవరణలోనికి పాన్షిన్ గుర్రమెక్కిరావడం చూసి కంపించిపోయింది. "జవాబుకోసం యివాళే పెందలాడేవచ్చాడు." అనుకుంది. ఆమె పొరబడలేదు. కచేరీగదిలో కాసేపు తచ్చాడితోటలోకి వెడదామని లీజాకి పాన్షిన్ సూచించాడు. అక్కడ అమోతుమో తేల్చుకోవాలని అతనిఉద్దేశం. ధైర్యం తెచ్చుకుని లీజా అతనిని వివాహమాడనని చెప్పేసింది. నుదిటిమీదకు పడేట్టు హాటుపెట్టుకుని, పక్కకువాలి నిల్చుని ఆమె చెప్పేదంతా పాన్షిన్ విన్నాడు స్వరంమార్చి నమ్రతతో ఇదే ఆఖరుమాటా అనీ, ఏం అపరాధంజేశానని నిరాకరించావనీ అడిగి చేతితో కళ్ళుగట్టిగా మూసుకుని దీర్ఘంగా నిట్టూర్చి చెయ్యితీసేసుకున్నాడు పాన్షిన్.

"చూరుపట్టుకుని వేళాడదలుచుకోలేదు." అన్నాడు పాన్షిన్ బొంగురుగొంతుతో. "నామనసుకెక్కిన స్త్రీని వివాహమాడదామనుకున్నా, కాని విధిబలీయం. యేం చేస్తాను? వ్యర్థస్వప్నాలుకన్నాను. సెలవు." అని వంగినమస్కరించి ఇంట్లోకి చక్కాబోయాడు.

పానిన్ వెంటనే వెళ్ళిపోతాడని లీజా భావించింది. కాని అతను తిన్నగా వెళ్ళిపోకుండా మేరియా గదిలోకి వెళ్ళి దగ్గిర దగ్గిర గంటదాకా అక్కడ ఉన్నాడు. వెళ్ళిపోయేటప్పుడు మళ్ళీ లీజా దగ్గిర శలవు తీసుకుని గుర్రమెక్కి కదంతొక్కించుకుంటూ వెళ్ళిపోయాడు. పానిన్ తనకు చుక్కెదురైందని చెప్పాడేమో మేరియా కన్నీరు పెట్టుకొని. "యెంతపని చేశావే, యెంతపని చేశావే ?" అంటూ లీజాని ముదలకించడం ప్రారంభించింది.

"యింతకంటె కావల్సిందేముందే ? నీ మొహానికి ఆయన చాలే ? ఆయనేం మనస్సుకోసం పడిచావడం లేదే? జమిందారు బిడ్డ? ఆయనకేం లోటు. కావాలనుకుంటే పీటర్స్ బర్గ్‌లో యెవతైనా పెళ్ళాడగలడు. యెంత ముచ్చటపడ్డానే ! మనసుమార్చుకుని యెంతకాలమైందేం ? హఠాత్తుగా నీకిది పుట్టిందిరోగం కాదు. వెనకాలెవరో పురెక్కించుంటారు. ఆం— ఇదంతా ఆ బడుద్దాయి లావ్రెటస్కీ పనే అయివుంటుంది. దొంక్క దొరిక్క బలేవాడు దొరికాడులే స్నేహానికి !" అంతటితో ఆగక మళ్ళీ మొదలుపెట్టింది. "యెంత మర్యాదస్తుడు! రోజులు బావుండకపోయినా యెంత నిదానం! యెంత నిదానం! నువ్వింత పనిచేసినా, తానుమాత్రం నాతో తెగతెంపులు చేసుకోనని మాట యిచ్చాడు. యీ దెబ్బ నేను తట్టుకోలేను. అబ్బ! తలబద్దలేసుకొని పోతోంది. పలాషాని యిలా పంపించు. యీ విషయం బాగా ఆలోచించి దారిలోకి రాకపోతే నేను చచ్చినంతవొట్టే! వినిపించిందా?" తన మాటలు వినవందున ఇంకా అనేక విధాల దుయ్యబట్టి లీజాని పంపివేసింది.

లీజా తన గదిలోకి వెళ్ళి కాస్త తేరుకుందో లేదో తలవనితలంపుగా ఇంకోవైపునించి తుఫాను రేగింది. మార్ఫాటిమొంఫెయెవ్నా గదిలోకి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూవచ్చి తలుపు టపీమని మూసేసింది. ఆవిడముఖం పాలిపోయి ఉంది. టోపీ పక్కకిఒరిగిఉంది. కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. చేతులు, పెదిమలు వణికిపోతున్నాయి. లీజా విస్తుపోయింది. మార్ఫా ఎన్నడూ ఆవేశానికి లోనయేదికాదు. అటువంటిది ఇలారావడం లీజాకి ఆశ్చర్యం కలిగించింది.

"బరేపని చేశావులే!" అంది మార్ఫా మెల్లిగా, వణికిపోతూ, "బరేపని చేశావులే! యిలాంటిపనులు యెక్కడ నేర్చుకున్నావమ్మా?... అబ్బ! మాట పెగలడంలేదు తాసిని మంచినీళ్ళియ్యి."

"అంతయిదైపోతావెందుకు అత్తయ్యా? కాస్త శాంతించు." అంటూ మంచినీళ్ళగ్లాసు అందించింది లీజా. "నీకు పాన్షిన్ అంటే పెద్దయిష్టం లేదనే అనుకున్నానే?"

మార్ఫాటిమొఫెయెవ్నా గ్లాసుకిందబెట్టి, "ఉహుం-వాగకేను. పళ్ళుజిబ్బ్గమని వూడిపడిపోయేటట్టున్నాయి. పాన్షిన్ సంగతి నేనేమెత్తలేదే. పాన్షిన్ కీ దీకీ సంబంధమేమిటి? సరేగాని అర్ధరాత్రివేళ పరపురుషులని కలుసుకోమ్మని యెవరు చెప్పారు? ఊం-జవాబుచెప్పు?"

లీజా తెల్లపోయింది.

"అబద్ధాలుచెప్పి లాభంలేదు. నురోచ్కా కళ్ళారాచూసి నాతో చెప్పింది. యింకెక్కడా యీవిషయం వాగద్దని గట్టిగాచెప్పాను. అది అబద్ధాలాడదు."

"నేను కలుసుకోలేదని అబద్ధలాట్టంలేదు, అత్తయ్యా!"

"ఓ-అట్లాగా? అమసలిమొహంతో తోటలోకిరిమ్మని చెప్పావన్న మాట!"

"లేదు."

"మరి కలుసుకోడం యెలా సంభవించింది?"

"నేను ఒక పుస్తకంకోసం కచేరీగదిలోకి వెడుతూంటే, తోటలోంచి పిలిచాడు."

"యింకేం వెళ్ళావు. వాణ్ని ప్రేమిస్తున్నావా యేంఖర్మం?"

"ఆ-ప్రేమిస్తున్నా," అని గొణిగింది లీజా

"ఆం దేవుడా! వాణ్ని...వాణ్ని ప్రేమిస్తోందట!" అంటూ మార్ఫా తలమీదిటోపీ గభీమని తీసేసుకుంది వాడికి పెళ్ళిఅయిపోతే, వాణ్ని ప్రేమిస్తున్నావా? ఊ-ప్రేమిస్తున్నావా?"

"ఆయన చెప్పారు..." అంటూ ప్రారంభించింది లీజా.

"ఏం చెప్పాడమ్మా?"

"భార్య చచ్చిపోయిందని చెప్పారు."

మార్ఫా శిలువ ఆకారం చేతితో గీసి అన్నది. "దాని ఆత్మకి శాంతికలుగుగాక! వట్టి గయ్యాళిపీనుగ. భగవంతుడామెను క్షమించుగాక. ఊ-వాడి పెళ్ళాం చచ్చిపోయిందన్నమాట. జిత్తులమారినక్క- ఒందాన్ని అట్లా సాగనంపాడో లేదో యిలా నీవెంటబడ్డాడూ! దొంగవెధవ! పక్క- మాట చెబుతా బాగా విను. నా పడుచుతనంలో యిలాంటి పిచ్చిచేష్టలు వేస్తే పిల్లల్ని చిదకతన్నేవారు కోపం తెచ్చుకోకు. నిజం చెబితే నిష్ఠూరం వేసే వాళ్ళు వట్టి తెలివితక్కువవాళ్ళు. యివాళనించీ యింట్లోకి రానీవద్దని చెప్పా. వాడంటే నాకు ప్రేమే. కాని గాత్రి జరిగింగానికి వాణ్ణి క్షమించను. విధురుడు! కానివివాహంయియ్యి...యిక పాపిష్ఠికి తగిన ప్రాయశ్చిత్తం చేయడం మంచిదే అయింది. యెలాగైలా నువ్వు మంచి తెలివిగలదానివి. ఆమగపురుగులతో రాత్రిళ్ళు తిరగద్దు. యీ ముసలితొంగలో నా గుండె బద్దలు చెయ్యకు. ముద్దులాట్టమే గాదు, చావగొట్టగలను కూడా-తెలిసిందా... విధురుడు!"

మార్ఫా టిమొఫేయెవ్నా వెళ్ళిపోయింది. లీజా ఒక మూలకూర్చుని ఏడ్వసాగింది. మనసేమీ బాగుండలేదు. ఇంతటి అవమానాన్ని భరించలేకపోతోంది. ప్రేమ ఆమెకి సంతోషప్రదం కాలేదు. కిందటి రోజునించీ రెండు పర్యాయాలు ఏడ్చింది. ఆమె హృదయంలో ఆ నూతన అద్భుత భావం ఉదయించిందో లేదో అప్పుడే ఎంతో సంకటస్థితి ఎదుర్కోవలసి వచ్చింది. ఆమె పవిత్ర రహస్యం బట్టబయలైపోయింది. ఇంతటి అవమానం పొందినా, ఇంత దెబ్బతిన్నా ఆమె ఆవంతైనా సంశయం గాని, భయంగాని పొందలేదు. లావ్రెట్స్కీ పూర్వంకంటె ఎక్కువ ఆప్తుడయ్యాడు. ఆమె తన మనసును గ్రహించక ముందు కొంచెం సందేహించింది: ఆ సమావేశం తర్వాత, ఆ ముద్దు తర్వాత ఆమె సంశయం పటాపంచలైంది. లావ్రెట్స్కీని ప్రేమించానని, హృదయపూర్వకంగా ప్రేమించానని, ఆ ప్రేమ బలియమైందనీ, నిరాఘాటమైందని, శాశ్వతమైందని గ్రహించింది. ఆ ప్రేమ బంధనాన్ని ప్రపంచంలోని ఏ శక్తి విచ్ఛిన్నం చెయ్యలేదని కూడా తెలుసుకుంది.

# 3F

తనను చూడడానికి వార్వరా పెట్రోవ్నా వచ్చిందనగానే మేరియా కంగారుపడింది. ఆమెని లోపలకి రమ్మనడమా, మానడమా? అన్న శంక పొడమింది. రమ్మంటే ఫియోడర్ ఇవనిచ్‌కి కోపం వస్తుందేమోనని భయంవేసింది. కాని చివరకి వార్వరాని చూడాలనే ఆసక్తిదే పైచేయి అయింది. మేరియా పడకకుర్చీలో వెనుకవాల్చి "అయితేనేం యిది కూడా మాకు దగ్గిర బంధువేగా" అని అనుకుని "సరే, రమ్మను" అంది సేవకునితో, కొన్ని నిమిషాలు గడిచాయి. తలుపు తెరచుకుంది. వార్వరాపావ్లోవా చర్రునగదిలో ప్రవేశించి సరాసరి మేరియా దగ్గిరికవెళ్ళి, ఆమె లేచి నిల్చునే అవకాశం ఇవ్వకుండా ఆమె పాదాలముందు మోకరిల్లింది.

"బహు కృతజ్ఞురాల్ని, పిన్నీ!" అని రష్యన్ భాషలో మెల్లిగా కంపిత స్వరంతో అన్నది. "బహుకృతజ్ఞురాల్ని. నువ్వింత వుదారంగా ప్రదర్శిస్తావని నేను ఆశించలా. నువు దేవతవి!"

ఇలాఅని వార్వరా హఠాత్తుగా మేరియాచెయ్యిపట్టుకుని, మెల్లిగా ఒత్తి, ఆవేగంతో ఎత్తి, తననిండుగులాబీరంగు పెదవులపై హత్తుకుంది. తన ముందు మోకరిల్లిన సౌందర్యవతినీ, ఆమెవస్తులను చూసేసరికి మేరియా విభ్రమచెందింది. ఏంచేయాలో పాలుపోలేదు. చేతిని వెనక్కులాక్కుని

ఆసనంచూపించి దయతో మాట్లాడడం ఆమెకెంతో ఇష్టం. కాని అలా చెయ్యకుండా లేచినిల్చుని, సువాసనలు విరజిమ్మే వార్వరా పావ్లోవ్నా నుదురును ముద్దిడుకుంది.

"గుడ్ మార్నింగ్! బావున్నావా? నేయితే అనుకోలేదు...కాని నువురావడం మహాసంతోషముగా వుంది. నీకు తెలుసుగా, భార్యాభర్తల మధ్య తీర్పుచెప్పడానికి సిద్ధంగావడం నాబోటిదానికి భావ్యకాదు." అన్నది మేరియా.

"నాభర్తదేం తప్పులేదు. తప్పంతానాదే." అనేసిందివార్వరా.

"బలే! మెచ్చుకోతగ్గమాటన్నావు...వచ్చి యెంతకాలమయింది? ఆయన కనిపించాడా? కూర్చో."

"నిన్ననేవచ్చా." అని నమ్రతతో జవాబిస్తూ వార్వరా కుర్చీలో కూర్చుంది. "ఫియొడోర్ ఇవనిచ్ కనిపించారు. మాట్లాడా."

"సరే, యేవన్నాడు?"

"నేనిలా హఠాత్తుగా రావడం ఆయనకి కోపంకలిగిస్తుందేమో ననుకున్నా, కాని మొహంచూపకపోలేదు."

"అంటే...సరే, సరె. అర్థమైంది. పైకి కఠినంగా వుంటాడుకాని అతనిమనస్సుమాత్రం అమృతం."

"ఫియొడోర్ ఇవనిచ్ నన్ను క్షమించలేదు. నామొగాలకించలేదు... కాని లావ్రికీలోవుండి పొమ్మని చెప్పారు."

"ఆ_బలే అందమైనచోటు!"

"ఆయనగారి ఆదేశప్రకారం రేపుబయలుదేరి లావ్రికీ వెళుతున్నా. వెళ్ళేముందు నిన్నుచూచి వెళ్ళడం నాధర్మమని తలపోశాను."

"కృతజ్ఞురాల్ని. బంధువుల్ని మరిచేపోవడం మంచిదికాదు. రష్యన్ భాష యెంతచక్కగా మాట్లాడుతావ్!"

వార్వరా పావ్లోవ్నా నిట్టూర్చి, "విదేశాలలో చాలాకాలంవుండి పోయాను, మేరియా డిమిట్రియవ్నా! కాని నాహృదయంమాత్రం మారలేదు. నామాతృభూమిని మరిచేపోలేదు."

"బలే! బలే! మంచిది. ఫియొడోర్ ఇవనిచ్ నువు తిరిగివస్తావనుకోడం లేదు...నేను చెప్తున్నాగా. ఓ...పచ్చదం ఎంత అందంగావుంది? యేసీ చూడనీ."

"బావుందా?" అని వార్వరా తన బుజాలమీదనించి గప్పున పచ్చదంతీసి "యేదో సామాన్యమైందిలెద్దూ." అన్నది.

'యెంత అందంగావుంది! నువుకూడా మంచిమంచి వస్తువులు తెచ్చావనుకుంటా. వాటిని చూడడం పడితే యెంతబావుండును?'

"నా అలంకరణ సామాగ్రంతా నీయిష్టంవచ్చినట్లు వాడుకో కావాలంటే కొన్ని వస్తువులు నీదానీదానికిచూపిస్తా. పారిస్‌నించి వకదానిని తీసుకువచ్చా. దుస్తులు అద్భుతంగా కుట్టుతుంది."

'కృతజ్ఞురాల్ని. కాని నిన్ను కష్టపెట్టతలుచుకోలేదు.'

'కష్టపెట్టడం...'అన్నది వార్వరా. ఆమెస్వరం నిందాగర్భితంగా వుంది. 'నాకు సౌఖ్యంచేకూర్చాలనుకుంటే, నన్ను నీ స్వంతఆస్తిలా చూచుకో.'

మేరియా డిమిట్రియెవ్నా మనసు కరిగింది. 'బలే! బావుంది. హేటు, అవి తీసెయ్యలేదేం' "తీసేసుకోమంటావా?" అంది వార్వరా చేతులుకట్టుకుని దీనస్వరంతో.

"ఓ-తప్పకండా. భోజనానికి వుండిపో...మా అమ్మాయిని నీకు పరిచయంచేస్తాన." అంది మేరియా. కాని ఆమె వ్యాకులంచెందినట్టు కనిపించింది. 'యెలా రాసిపెట్టుందో అలాజరుగుతుంది.' అనుకుని మళ్ళీ వార్వరాతో అంది: 'యివాళ దానిమనసేం బావుండలేదు.'

"ఓ-పిన్నీ! నువ్వెంత దయగలదానివి!" అంటూ వార్వరా జేబురుమాలు పైకెత్తి కళ్ళమీద పెట్టుకుంది.

ఇంతలో ఒక నౌకరుకుర్రాడు గెడియొనోవస్కీ వచ్చాడని చెప్పాడు. ఆ బాతాఖానీ రాయుడు వంగివంగి సలాములు చేసుకుంటూ చక్కావచ్చాడు. మేరియా వార్వరాను అతనికి పరిచయంచేసింది. మొదట్లో అతను కొంచెం తత్తరపడ్డాడు కాని ఆమెచూపినమర్యాదకు సమ్మోహితుడైపోయాడు. ఒళ్లు జలదరించింది. ఇకచూడండి, చొల్లుగబుర్లేమిటి, స్తోత్ర

పాటాలేమిటి అతనినోటవెంట మృదుమధురంగా ప్రవహించొచ్చాయి. ఇదంతా వార్వరా వింటూ, వచ్చేచిరునవ్వును ఆపుకుంటూ క్రమంగా తానూ సంభాషణలోకి దిగింది. ఎంతో వినయంతో పారిస్‌నిగురించి, బాడెన్‌గురించీ, తానుచూచిన ఇతరప్రదేశాలనుగురించీ చెప్పి వార్వరా మేరియాకి రెండు పర్యాయాలు నవ్వుతెప్పించింది. రెండుపర్యాయాలూ తానింత సంతోషంగా మాట్లాడుతున్నందుకు మనసులో బాధపడుతున్న దానిలాగా వార్వరా నిట్టూర్చింది. ఈతడవ వచ్చేటప్పుడు అడాని వెంటబెట్టుకురావడానికి మేరియా అనుమతినిపొందింది. తర్వాత చేతితొడుగులు తీసివేసి తాను వాడుకునేసబ్బు సువాసన, గాగరా, లేసులు మొదలైనవి ఎలా ఎక్కడ ధరించాలో చూపించింది. కొత్తగా ఇంగ్లండులో తయారైన 'విక్టోరియా ఎసెన్స్' అనే అత్తరు తెచ్చిపెడతానని మాటఇచ్చింది. మేరియా ఆ అత్తరును బహుమానంగా స్వీకరించడానికి అంగీకరించింది. దాంతో వార్వరా చిన్నపిల్లలా సంతోషపడింది. రష్యా చర్చిగంటలు విన్పించగానే పొందిన ఆనందం స్మృతికితెచ్చుకుని జలజలా కన్నీరురాల్చింది. 'ఆచర్చి గంటలు నాగుండెల్లోకి చొచ్చుకుపోయాయి.' అని గొణుగుకుంది.

సరిగ్గా ఆసమయానికి లీజా ఆగదిలో ప్రవేశించింది.

లావ్రెట్స్కీ రాసిన చీటిచదువుకుని లీజా కొయ్యబారిపోయింది. ఆక్షణంనుంచీ అతనిభార్యకంట పడకుండా తప్పించుకుతిరగాలని చూసింది. కాని ఆమె కంటపడితీరుతావని అంతరాత్మ చెబుతూనేవుంది. తనపాపిష్టి కోరికలకు పరిహారంగా ఆమెను చూడడమేమంచిదని నిశ్చయించుకుంది. హఠాత్తుగా ఆమెగీత తారుమారుకావడంతో ఆమెప్రాణం గిలగిలా కొట్టుకుంది. రెండుగంటల్లో ఆమెముఖం పీక్కుపోయింది. కాని ఒక్కచుక్కయినా కన్నీరు రాల్చలేదు. 'తగినశాస్తిఅయింది.' అని తనలోతాను అనుకుని కంపింపజేస్తున్న రోషకషాయిత ఉద్రేకాలను ఎంతోకష్టంమీద అణచుకుంది 'సరే, వెళ్ళడమేమంచిది.' అనుకుంది. వార్వరావచ్చిందనే వార్త వినగానే మేడదిగి కిందికి వెళ్ళింది... కచేరీగది ముందు చాలాసేపునిల్చొని, ఎలాగైతేనేం ధైర్యంతెచ్చుకుని తలుపుతెరిచింది. "ఆమెకి ద్రోహంతలపెట్టాను!" ఈభావంతో గదిలోప్రవేశించి బలవంతాన వార్వరాకేసిచూసి, బలవంతాన చిరునవ్వునవ్వింది. లీజా కనిపించీకనిపించగానే వార్వరా

ఆమెను కలుసుకోడానికి లేచివచ్చి నమ్రతతో కొద్దిగా వంగి నమస్కరించింది. నను నేనే పరిచయంచేసుకుంటూ అంది దీనంగా. 'మీ అమ్మ నన్నెంతో దయతో ఆదరించింది. నువ్వుకూడా...దయతలుస్తావనే ఆశిస్తున్నాను.' ఈ ముక్కలనేటప్పటికి వార్వారా ముఖకవళికా, విషపునవ్వూ, విరసపు చూపూ, హస్తవిన్యాసం, ధరించినదుస్తులు అదేమిటినేమిటి ఆమెవిలువెల్లా లీజాకి అసహ్యంగొల్పి జవాబివ్వలేక చేయిచాచింది. చల్లటిలీజా వేళ్ళు నొక్కుతూ 'యీపడుచుకు నేనంటే గిట్టదు.' అని తలపోసి వార్వారా మేరియా కేసితిరిగి 'బలేఅందగత్తె!' అంది. లీజాముఖం వివర్ణమైంది. 'బలేఅందగత్తె!' అనేమాటల్లో వెక్కిరింపూ, తిరస్కారమూ గర్భితమై ఉన్నాయి. కాని లీజా తొందరపడి ఒకనిశ్చితాభిప్రాయానికి రాకూడదనుకొని, కిటికీదగ్గర కంజీరాముందుకూర్చుంది. వార్వారామాత్రం లీజాని ప్రశాంతంగా కూర్చోనివ్వలేదు. ఆమెదగ్గరకి వెళ్ళి ఆమె అభిరుచులను, శక్తిసామర్థ్యాలను పొగిడింది...లీజాగుండె తీవ్రంగా, బాధాకరంగా కొట్టుకుంది. వార్వారా తనసంగతంతా తెలుసుకుని ఉక్రోషంతో తనను వెన పెట్టతలచిందని లీజా భావించుకుంది. ఇంతలో జెడియొవొవస్కీ వార్వారాతో సంభాషణ మొదలుపెట్టి ఆమెదృష్టిని లీజాపైనించి మళ్ళాడు. లీజాకి శనివిరగడైనట్లనిపించింది.

లీజా కంజీరామీదికివంగి, వార్వారాను క్రీగంటచూసి 'ఆయన ఒకప్పుడు ప్రేమించినమనిషి.' అనుకుంది. కాని వెంటనే లావ్రెట్స్కీమీది ఆలోచనలను హృదయంనించి పారద్రోలింది. నిభాయించుకోలేనని ఆమెకి భయంవేసింది. తలతిరుగుతునట్లయింది. మేరియా సంగీతాన్నిగురించి మాట్లాడసాగింది.

"నువ్వు నిజమైన కళాభిమానివని విన్నా."

"నేనువాయించి చాలాకాలమైంది." అంటూ వార్వారా పియానో ముందు కూర్చుని మెట్లమీద వేళ్ళు నీటుగాసారిస్తూ. "వాయించనా?" అంది.

"వాయించమ్మా వాయించు."

వార్వారా పావ్లోవ్నా ఒకగీతం పరమాద్భుతంగా వాయించింది. ఆగీతం వాయించడంలో జిగిబిగులు గోచరించాయి.

"గాంధర్వ గానం!" అన్నాడు జెడిరొయినోవస్కీ.

"బలే, బలే!" అంది మేరియా. "బలే! వార్వరా పావ్లోవ్నా?"

వార్వరాని పేరుపెట్టి మేరియా పిలవడం ఇదే మొదలు. "పరమాద్భుతంగా వుంది. నువు పాటకచేరీలు చేస్తూండాల్సింది. యిక్కడమాకూ ఓ సంగీతం మాస్టారున్నాడు. ఆయన జర్మనుముసలాడు. తలతిక్కమనిషి. కాని మంచి సంగీతపండితుడు. లీజాకి పాఠాలు చెబుతున్నాడు. నీసంగీతం వింటే ఆయనికి శివమెత్తుతుంది."

"ఎలిజవెటా మైకేలోవ్నా కూడా పియానో వాయిస్తుందా?" అని వార్వరా అడిగింది లీజావైపుకు తలపంకిస్తూ.

"యేదో పర్వాలేదు. వకమాదిరిగా వాయిస్తుంది. సంగీతమంటే దీనికి మహాయిష్టం. అయితేనేం. నీముందు యిదెంత? దానికేమొచ్చింది గాని యిక్కడో యువకుడున్నాడు. అతన్ని నువు కలుసుకతీరాలి. అతను రసజ్ఞుడు. మంచిగీతాలు రచించాడు. నీగొప్పతనం అతను బాగా గుర్తించగలడు."

"యువకుడా? యెవరతను? యేదోబీదవాడా?" అంది వార్వరా.

'అబ్బే! మాంవిదిలా సాపురుషుడు యిక్కడేకాదు పీటర్స్బర్గ్లో కూడా పేరుసంపాదించుకున్నాడు. అతనిపేరు వినేవుంటావు: పాన్షిన్ వాల్డిమిర్ నికొలాయిచ్. యిక్కడ ప్రభుత్వపు పనిమీదవుంటున్నాడు... కాబోయేమంత్రి'!

'కళాకారుడుకూడానా?'

'రసజ్ఞుడు. యెంతవినయమనుకున్నావ్! నువ్వే చూద్దువుగాని. తరుచు యిక్కడికి వస్తుంటాడు. యివాళ సాయంత్రం రమ్మన్నా. తప్పకుండా వస్తాడనే అనుకుంటున్నా.' అంది మేరియా కొద్దిగా నిట్టూరుస్తూ, వ్యంగ్యంగా, విచారంగా మందహాసంచేస్తూ.

లీజా ఆమందహాసంలోని అంతరార్థం గ్రహించింది. కాని దానిని పెద్దగా లక్ష్యపెట్టేస్థితిలో లేదు.

'పడుచువాడా?' అంది వార్వరా ఉదాత్తస్వరంలో.

'ఆ యువకుడి వేళ్ళు ఏమి చేస్తుంటాయి. చూడచక్కనివాడు.' "ఆదర్శ యువకుడు." అన్నాడు జెడియొనోవస్కీ.

హఠాత్తుగా వార్వరా ఝమ్మని ఒక డాన్సు పాట పియానోమీద ఎత్తుకుంది. ఆపాట బహుశా కేవలం, సంగీతజ్ఞులపస పట్టేది. ఎత్తుగానే ఎత్తుకోవడంతో జెడియొనోవస్కీ తుళ్ళిపడ్డాడు. పాటమధ్యలో వార్వరా విషాదస్వరం హఠాత్తుగా వాయించి ఒకదరువుతో ముగించింది. తానున్న పరిస్థితిలో హుషారుగొలిపేస్వరం వాయించడం భావ్యంగాదని వార్వరాకితోచింది. చివరవాయించినదరువు మేరియాను ఎంతగానో కదిలించివేసింది.

'యెంతరసవత్తరంగావుంది.' అంది జెడియొనోవస్కీతో మెల్లిగా.

"గాంధర్వగానం" అని తిరిగిఅన్నాడు జెడియొనోవస్కీ కనుగుడ్లు తిప్పుకుంటూ.

ఇంతలో భోజనాలవేళయింది. మార్ఫా టిమొఫెయెవ్నా కిందికి వచ్చేసరికి పులుసువడ్డించేశారు. ఆమె వార్వరాను లాంచనానికి పలుకరించి, ఆమెకేసి చూడనైనాచూడకుండా అ, ఊ లాంటి ఏకాక్షరపదాలతో సమాధానమిస్తూ కూర్చుంది. ఈముసిలిదానివల్ల ఒరిగేదేమీలేదని భావించి వార్వరా ఆమెతో కులాసాగా బాతాఖానీకొట్టటం మానివేయాలని యత్నించింది. మార్ఫా వార్వరాను ఆదరించకపోవడం మేరియాకి కష్టం వేసి, తానింకా ఎక్కువదయతో ఆమెను ఆదరించసాగింది. మార్ఫా ఒక్క వార్వరావంకేకాదు, లీజావంకకూడా చూడలేదు. ఆమె శిలావిగ్రహంలాగా మెదలకుండా కూర్చుంది. మొహం పాలిపోయింది. ఒక్క మెతుకైనా ముట్టలేదు. ఇక లీజా చాలా ప్రశాంతంగావుంది. ఆమెలో రేగిన తుఫాని అణిగిపోయింది. శిక్షకు పాల్పడిన వ్యక్తిలా ఆమెనోట మాట పెగలనేలేదు. భోజనసమయంలో వార్వరా ఎక్కువగా మాట్లాడలేదు. సంశయం బాధించింది. మొహం విషాదాక్రాంతమైంది. జెడియొనోవస్కీమాత్రం కట్టుకథలు చెపుతూ సంభాషణ కొనసాగించాడు. మేరమామూలు అబద్ధాలాడబోతే అతని గొంతు బొంగురుపోతుంది. అందుకని ఆమెకేసి వ్యాకులపాటుతో చూస్తూ, గొంతు సవరించుకుంటూ మాట్లాడాడు. కాని ఆమె అతనిసంభాషణకు అడ్డురాలేదు. భోజనాలయినాక వార్వరాకు పేకాటంటే మహాయిష్టమనేవిషయం బైటపడింది. ఈసంగతి

తెలుసుకుని మేరియా మహాసంతోషించింది. వరవరా ఖుషైపోయింది. తనలోతాననుకుంది, "ఆ ఫియొడోర్ ఫిరోనిచ్ వట్టి తెలివితక్కువ దద్దమ్మలావున్నాడు... కాకపోతే యిటువంటి స్త్రీని మెచ్చుకోకుండా ఎలా వుండగలడు?"

మేరియా, వార్వరా, జెడియొనోవస్కీ పేకాటకు కూర్చున్నారు. మార్ఫా లీజాని వెంటబెట్టుకుని మేడపైకి వెడుతూ లీజాకి శరీరంలో బాగా లేదని తలనొప్పివచ్చిందనీ చెప్పింది.

"అవునను తలనొప్పి విపరీతంగా వచ్చినట్లుంది." అంది మేరియా కళ్ళు తిక్కుకుంటూ.

"నాకూ పార్శ్వపు నొప్పి దారుణంగా వస్తూవుంటుంది."

'నిజంగానా?' అని మెల్లగా అంది వార్వ.

లీజా మేనత్తగదిలోనికివెళ్ళి కుర్చీలో మెల్లిగాకూలబడింది మార్ఫా ఆమెకేసి చాలాసేపు మాట్లాడకుండాచూసి, మోకాళ్ళమీద మెల్లిగా కూర్చుని చేతులు ముద్దాడసాగింది. లీజాముహం ఎర్రబారింది. ముందుకు వంగి ఏడ్చింది. కాని మార్ఫా తెమ్మనూలేదు, చేతులు తీసి వేసుకోనూలేదు. చేతులు తీసేసుకోడానికీ, సానుభూతిని ప్రకటించకుండా ఉండడానికీ, ఆకిందటిరోజున నిందించినందుకు పశ్చాత్తాపం తెలుపకుండా నిరోధించడానికీ తనకు హక్కులేదని లీజా తలచింది. ఆచిన్నారి చేతులను తనివితీరా మార్ఫా ముద్దుకోలేకపోయింది. ఇద్దరి కళ్ళవెంట అశ్రువులు కాలువలుకట్టాయి. పిల్లి పడకకుర్చీలో అరచింది. దేవతావిగ్రహంముందున్న దీపం అటుఇటూ కొట్టుకుంటోంది. పక్కగదిలో, తలుపువెనక నాస్టాస్యా కార్పొవ్నా జేబురుమాలు ఉండగాచుట్టి కన్నీళ్ళు తుడుచుకుంటూ నిలబడింది.

# ౪౦

క్రింద కచేరీగదిలో పేకాట సాగుతూనే ఉంది. మేరియా డిమిత్రియెవ్నా ఆటలో గెలుపొందుతూ మహాఉల్లాసంగా ఉంది. ఇంతలో ఒక నౌకరువచ్చి పాన్షిన్ అరుదెంచాడని తెలియజేశాడు.

మేరియా పేకముక్కలు పారవేసి కుర్చీలో ఆందోళనతో కదలాడుతూ కూర్చుంది. వార్వరా పావ్లోవ్నా పరిహాసపూర్వక మందహాసం చేస్తూ ఆమెకేసి తేరిపారజూచి, దృష్టి ద్వారంవైపు మళ్ళించింది. పాన్షిన్ నున్నగా క్షవరం చేసుకుని, తెల్లటి పొడుగాటి కోటూ, మెడదాకా ఆంగ్లేశీ కాలరూ ధరించి, 'ఏకపట్టాన యిలాగ ఆజ్ఞలకు తలవంచేవాణ్ణిగాను. అయినా వచ్చా.' అంటూ ముఖం బిగించుకుని గదిలో ప్రవేశించాడు.

"నిజం, వాల్డిమిర్! నువు కబురెట్టకుండానే వచ్చేసేవాడివి." అంది మేరియా.

పాన్షిన్ కళ్ళతోనే మేరియాకి సమాధానమిచ్చి, నమ్రతతో వంగి నమస్కరించాడేగాని చేతిని ముద్దిడుకోలేదు. ఆమె అతనిని వార్వరాకు పరిచయంచేసింది. పాన్షిన్ ఒకఅడుగు వెనక్కువేసి వంగి సొగసుగా నమస్కరించి పేకాటకు తానూకూర్చున్నాడు. ఆట అయిపోయింది, పాన్షిన్

ఎలిజవెటా మైకేలోవ్నా క్షేమసమాచారాలు అడిగి, నుస్తీగాఉందని తెలుసుకొని విచారం వెలిబుచ్చాడు. ఆతర్వాత తూచితూచి మాటలు వాడుతూ, సమాధానాలు వినయంతో ఆలకిస్తూ వార్వరాతో సంభాషణ సాగించాడు. కాని ఎంతచాతుర్యంతో మాట్లాడినా అతనిమాటలు వార్వరా మీద పనిచేయలేదు. హృదయాన్ని కదిలించలేదు. పైగా ఆమె అతనిని ఉల్లాసపురుషుడనే దృష్టితో పరిశీలిస్తూ మామూలుధోరణిలోనే మాట్లాడుతుంటే. నవ్వును అణచుకుంటోందా అన్నట్టు నాసికాపుటాలు దరసాగాయి. మేరియా డిమిత్రియెవ్నా ఆమెశక్తిసామర్థ్యాలను పొగడనారంభించింది. పానిన్ సాధ్యమైనంతవరకు తలను ఒకపక్కకువంచి తనకావిషయం తెలుసునని చెప్పాడు. వార్వరా క్రీగంటచూస్తూ మెల్లగా 'మీరూ కళాకారులే గదూ" అంది. అని ఊరుకోకుండా పియానోకేసి తలూపి మందస్వరంతో "ఉత్తమకళాకారులు" అంది. 'ఉత్తమ' అనేమాట అతనిని సమ్మోహితుణ్ని చేసింది. గంభీరవైఖరి మాయమైంది. ముఖం వికసించింది. మందహాసం నెలకొన్నది. కోటుబొత్తాలు విప్పుకుంటూ, "నాదేంవుంది, మీరువాస్తవమైన కళాకారులు" అని, వార్వరావెంట పియానోదగ్గరికివెళ్ళాడు.

"అతనురాసిన చందమామ పాటపాడమను." అని చెప్పింది మేరియా.

"పాడతారా?" అంది చిరునవ్వు అతనిమీద ప్రసరింపజేస్తూ "కూర్చోండి."

పానిన్ ఏవేవో వంకలుచెప్పి పాడకుండా తప్పించుకోవాలని చూచాడు. దానిమీద వార్వరా కుర్చీ వీపుమీద వేళ్ళతో ఆదేశనిగా కొడుతూ, 'కూర్చోండి.' అని మళ్ళీ అన్నది.

అతనుకూర్చుని, దగ్గి, మెడపట్టి సర్దుకుని చందమామపాటపాడాడు.

"బహురమ్యంగావుంది. మీరు బాగానే కట్టుగాపాడతారు. రండీ యింకోపాట పాడండి." అందివార్వరా. అలా అని పియానోనిచుట్టి వచ్చి అతనికి సరిగ్గా ఎదురుగా నుంచుంది. అతను తనపాట తిరిగీపాడడం ప్రారంభించి స్వరంలో విచిత్రమైన కంపనం కలగజేశాడు. వార్వరా పియానోమీద మోచేతులానించి, తెల్లటి అరచేతులు పెదవులకు నూటిగా నిలిపి అతనికేసి తేరిపారజూచింది.

'బహురమ్యంగావుంది. నిజం, బహురమ్యంగావుంది.' అంది వార్వరా కళావేత్తలకుండే దృఢవిశ్వాసంతో 'ఆడగొంతుకు సరిపోయే పాట యేదయినా రాశారా?'

"నేను సాధారణంగా పాటలు రాయను. యెపుడో నావినోదం కోసంమాత్రమే రాస్తుంటాను...నువు పాడగలవుగా."

'ఆ—'

"యేదైనా ఒకపాటపాడుదూ." అని బతిమాలింది మేరియా.

ఎర్రబారిన చెంపలమీదనించి జుట్టు వెనక్కుతోసుకుని వార్వరా సరేఅన్నట్లు తలూపింది.

'మనిద్దరిగొంతులూ కలుస్తాయి.' అని మెల్లిగాఅంది వార్వరా పాన్షిన్ కేసి తిరుగుతూ, "మనిద్దరం కలిసిపాడదాం. మీకు అందాలచందమామ, చందాలచందమామ వచ్చునా?"

"ఆ— చాలాకాలంక్రితం పాడుతుండేవాడిని. యిపుడు జ్ఞాపకం లేదు." అని జవాబిచ్చాడు పాన్షిన్.

'పరవాలేదు. మంద్రస్వరంలో కాసేపు అభ్యసించేద్దాం. సరేనా?'

వార్వరా పావ్లోవ్నాపియానోదగ్గరకూర్చుంది, పాన్షిన్ ఆమెప్రక్కన నుంచున్నాడు. మంద్రస్వరంలో ఆపాటను చాలాసార్లు అభ్యాసంచేశారు, వార్వరా అనేకసార్లు అతని తప్పులు దిద్దింది. ఆతర్వాత బిగ్గరగా పాడుతూ 'అందాలచందమామ...' అనేచరణం రెండుసార్లు పాడారు. వార్వరా స్వరంలో కోమలత్వం నశించిపోయింది, కాని బహునేర్పుతో పాడింది. పాన్షిన్ మొదట్లో కొంచె సిగ్గుపడ్డాడు, శృతితప్పింది. కాని తొందరలోనే ఆవేశం పొందాడు. అతనిపాట దోషరహితం కాకపోయినా, భుజాలు ఎగరవేయడం, శరీరవిన్యాసం, నిజమైనపాటకునిలా మధ్యమధ్య చెయ్యిఎత్తడం లాంటి పనులతో ఆలోటును కప్పిపుచ్చాడు. వార్వరా థావ్బర్గ్ జర్మన్ స్వరకర్త, (1812-1871) గీతాలు రెండుమూడుపాడి, ఆతర్వాత కలుకుతూ ఒక ఫ్రెంచిగీతంపాడింది. మేరియాకి తన ఆనందం ప్రకటించడానికి మాటలేదొరకలేదు, చాలాసార్లు లీజాకోసం కబురుచేద్దామనుకుంది. జెడెయొనవస్కీకికూడా మాటలు దొరకలేదు. తలూపి ఊరుకున్నాడు. ఇం

తలో హఠాత్తుగా ఆవలిస్తూ, పాన్షిన్ మరుగుపర్చాలని చూచాడు కాని లాభంలేకపోయింది. వార్వరా, జెయొంపస్కీ ఆవలించడం కనిపెట్టింది. హఠాత్తుగా వెనుదిరిగి "సరే, యిక సంగీతం కట్టిపెట్టి కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకుందాం" అంటూ చేతులు ముడుచుకుంది. "సరే, సంగీతం కట్టిపెడదాం" అని పాన్షిన్ హుషారుగా సంభాషణలోకి దిగాడు. వారి సంభాషణ మామూలు విషయాలమీదనైనా చమత్కారంగా వుంది "పారిస్‌లోని గొప్పగొప్పవారి కచేరిగది సంభాషణలావుంది." అనుకుంది మేరియా, వారి బాతాఖానీ వింటూ, పాన్షిన్ పరమానందభరితుడైపోయాడు. కళ్ళు మెరిసిపోయాయి. ముఖంమీద మందహాసం నెలవొంది, మేరియా దృష్టి తనమీద పడగానే పాన్షిన్ మొదట్లో ముఖంమీదకు చేతిని పోనిచ్చి, కనుబొమలు కుంచించి, నిట్టూర్చాడు. కాని తర్వాతతర్వాత ఆమెని పూర్తిగా మరిచేపోయి సంభాషణలో నిమగ్నుడైపోయాడు వార్వరా తత్త్వజ్ఞురాలిగా కనిపించింది. ఏప్రశ్నకైనా తడుముకోకుండా జవాబిచ్చింది. ఏ సందిగ్ధతలలోనూ ఆమెకి అనుమానంఅంటూ ఉన్నట్టులేదు. రకరకాల ప్రతిభావంతులతో అనేకమాట్లు ఆమె సంభాషించి ఉంటుందని ఆమెధోరణి తెలుపుతుంది. ఆమె ఆలోచనలు, భావాలు ఎంతసేపూ పారిస్‌చుట్టూ పరిభ్రమించాయి పాన్షిన్ సాహిత్యానికి సంభాషణను మళ్ళించాడు. ఆ సంభాషణ సందర్భంలో ఆమెకూడా అతనిలాగానే ఫ్రెంచిసాహిత్యమే చదివిందని తేలింది. (1) జార్జిసాండ్ గ్రంథాలు ఆమెకి ఉద్రేకం కలిగిస్తాయి. (2) బాల్జాక్ గ్రంథాలు కొంచెం విసుగెత్తించినా, అతనంటే ఆమెకి గౌరవం. (3) సూ, స్క్రైబ్‌లు మానవప్రకృతిని బాగా అర్థంచేసుకున్నారని ఆమె భావించింది. (4) డూమాస్, (5) ఫెవాల్ గ్రంథాలను పూజించేది. కాని నిజానికి వాళ్ళందరికన్నా (6) పాల్‌డికాక్ అంటే ఆమెకు ఎక్కువ అభిమానం. అయితే సంభాషణలో అతనిపేరైనా ఎత్తలేదు. నిజంచెప్పాలంటే

(1) సుప్రసిద్ధ ఫ్రెంచినవలారచయిత్రి (1804-1876) ఈమె అసలు పేరు మదాం డుడెవాన్ట్, జార్జిసాండ్ అనేపేరుతో చాలానవలలు ప్రకటించింది.

(2) విశ్వవిఖ్యాత ఫ్రెంచికథకుడు, నవలారచయిత. (1709-1850)

ఆమెకి సాహిత్యమంటే ఎక్కువ ఆసక్తిలేదు. సంభాషణ నడపడంలో ఆమె సిద్ధహస్తురాలు. తనపరిస్థితిని స్మృతికితెచ్చేవిషయాలను నేర్పుగా తెప్పించింది. అసలు ఆమె ప్రేమసంగతేఎత్తలేదు. ప్రేమగొడవలు సందర్భవశాత్తువచ్చితే ఆమె సంభాషణంతా సంయమనధోరణిలో నడిపింది. పాన్షిన్ ప్రత్యాఖ్యానించాడు. ఆమె గంభీరవైఖరి నవలంభించింది... కాని చిత్రమేమంటే ఆమెనోట వెలువడినమాటలు సంయమనధోరణితో ఉన్నా, ఒక్కొకపుడు నిరసించదగినవైనా, ఆమాటలు ఉచ్చరించినస్వరం ఆకర్షణీయంగా, మనోరంజనంగాఉంది. అంతేకాదు ఆమె కళ్ళతో మాట్లాడసాగింది... కాని ఆమాటలలోని అర్థం సరిగాగ్రహించడంకష్టం. వాటిభావం మాత్రం అస్పష్టంగా, మధురంగా, అనివారణీయంగాఉంది. ఆమాటలలోని నిగూఢార్థంగ్రహించాలని పాన్షిన్ ప్రయత్నించాడు. అతనూ కళ్ళతో మాట్లాడాలని చూచాడు, కాని అతని యత్నమంతా వృథాఅయిపోయింది. వార్వరా విదేశాలనించి దిగిన ఆడసింగంలాంటిదనీ, చేరరానిదనీ గుర్తించాడు. అందువల్ల అతనికి పూర్తిస్వస్థత చిక్కలేదు. వార్వరాకు మాట్లాడేటప్పుడు ఎదుటివాని చొక్కాచేతని పట్టుకుగుంజడం అలవాటు. ఈవిధ

---

అతనికాలమునాటి ఫ్రెంచిసంఘంలోని కుళ్ళును సాహిత్యంద్వారా బహిర్గతంచేసిన మేటిరచయిత.

(3) సూ: ఫ్రెంచినవలారచయిత (1804-1857) సోషలిస్టుభావాల ప్రభావం ఇతనిమీద హెచ్చుగా ఉంది. వాటిని ఆధారంచేసుకుని అనేకరచనలుచేశాడు. నాటిప్రభుత్వం వాటిని నిషేధించింది.

స్క్రయిబ్: ఫ్రెంచి నాటకకర్త. (1791-1861) కొన్నివందల నాటకాలు రచించాడు. ఈయన రచించని నాటకరూపమేలేదు.

(4) సుప్రసిద్ధఫ్రెంచి నవలారచయిత, నాటకకర్త. (1802-1870) ఇతని మూడవహెన్రీఅనేనాటకం, త్రీమస్కిటీర్స్, మాన్టిక్రిసోఅనే నవలలు విశ్వవిఖ్యాతిగాంచినవి.

(5) ఫ్రెంచినవలారచయిత, నాటకరచయిత. (1817-1887)

(6) ఫ్రెంచినవలారచయిత. (1793-1871) ఇతను తన రచనలలో పారిస్‌లోని మధ్యతరగతివారి జీవితమును చక్కగా చిత్రించాడు.

మైన స్పర్శవల్ల పాన్షిన్ కలవరపడ్డాడు. అందరితోనూ ఇట్టే కలిసిమెలిసి పోయే చాకచక్యం వార్వరాకుఉంది రెండుగంటలయిందో లేదో, ఆమె ఎన్నోసంవత్సరాలనుండి పరిచయస్తురాలివలె పాన్షిన్‌కితోచింది. ఇక అతను నిజంగా ప్రేమించిన లీజా, తాను వివాహమాడ దలచినలీజా, అదృశ్యమైపోయినట్టతనికి అనిపించింది. మేరియా డిమిట్రియెవ్నా నౌకరుకుర్రాడిని పిలిచి, తలనొప్పితగ్గితే కిందికిరమ్మని లీజాకుచెప్పమని పంపించింది. లీజాపేరు వినబడగానే పాన్షిన్ త్యాగబుద్ధినిగురించి చర్చించసాగాడు. త్యాగబుద్ధి స్త్రీకి ఎక్కువగాఉంటుందా పురుషునికా అనేవిషయంమీద తర్కించనారంభించాడు. మేరియా ఉద్రిక్తురాలై పురుషులకంటే స్త్రీలకే ఎక్కువ త్యాగబుద్ధి ఉంటుందని వాదించింది. అప్పటికప్పుడే రుజువుచేస్తానని ఒక కుంటిఉదాహరణతో తనవాదం ముగించింది. వార్వరా ఒక సంగీత గ్రంథం ముఖానికి చాటుపెట్టుకుని పాన్షిన్‌వైపువంగి, రొట్టెముక్క కొరుక్కుతింటూ పెదవులమీదా, కళ్ళల్లో చిరునవ్వు ఒలికిస్తూ మందస్వరంలో, “వట్టి మట్టిబుర్ర” అంది. ఈమాటవిని పాన్షిన్ మ్రాన్పడిపోయాడు. ఆమె సాహసానికి చకితుడయ్యాడు. ఇలా హఠాత్తుగా అన్నముక్కలో తనను గురించి ఎంత పరిహాసమున్నదో పాన్షిన్ కనిపెట్టలేకపోయాడు. మేరియా చూపిన దయాదాక్షిణ్యాలు, చేసిన విందులు, అప్పిచ్చినసొమ్ము, అంతా మరిచేపోయి అదేస్వరంలో అదేమందహాసంతో, “అవునవును” అన్నాడు.

వార్వరా అతనికేసి స్నేహభావముతో చూసి లేచినిలబడింది. లీజా లోపలికివచ్చింది. మార్ఫాటిమొఫెయెవ్నా ఆమెనివెళ్ళవద్దని వారించింది కాని లీజా అగ్నిపరీక్షకు నిలబడాలనే సంకల్పించుకుంది. వార్వరా పాన్షిన్‌లు ఆమెను కలుసుకోవడానికి ముందుకు వెళ్లారు. పాన్షిన్ యథాప్రకారం

“వంట్లో యెలావుంది.” అని లీజాని ప్రశ్నించాడు.

“కొంచెం నయంగానేవుంది.”

“యిక్కడ యేదో కొంచెం సంగీతకాలక్షేపంజరిగింది. వార్వరా పాట నువ్వు వినలేదుగాని, అద్భుతంగావుంది.

'యిలా రా అమ్మా!' అని మేరియా వార్వరాను పిలచింది. వార్వరా చంటిపిల్లలా వినయవిధేయతలతో వెళ్ళి ఆమె పాదాలదగ్గర డిన్ముక్కాలపీట మీదకూర్చుంది. ఫానిన్‌తో ఒకక్షణమైనా ఒంటరిగావుండే అవకాశం లీజాకి కల్గించాలనే ఉద్దేశంతో మేరియా వార్వరాను పిలిచింది. అంతే కాదు ఇంకో ఉద్దేశంకూడా ఆమెలో కలిగి, దానిని వెంటనే బయటపెట్టాలనే ఆతురతకూడా ఇందుకు కారణమైంది.

"నిన్ను మళ్ళీ నీ మొగుడితో కలపాలని నాకు బుద్ధిపుట్టింది. అయితే యిది సాధించగలుగుతాననే ధైర్యం నాకు లేదు. అయినా యత్నించిచూస్తాను. నేనంటే అతనికెంతో గౌరవం, తెలిసిందా." అంది మెల్లి మెల్లగా వార్వరాతో.

వార్వరా మెల్లగా మేరియాకేసి దృష్టిసారించి దయనీయంగా చేతులుకట్టుకుని, "పిన్నీ! అలాచేస్తే నన్ను రక్షించినదానివవుతావు. నామీద యింతదయ చూపుతున్నందుకు నీ ఋణం యెలాతీర్చుకోవాలో తెలీటంలేదు. కాని ఫియోదర్ ఇవానిచ్‌కి మహాద్రోహం చేశాను. క్షమించరాని ద్రోహం చేశాను." అంది దీనంగా.

"ద్రోహం చేశావా?... నిజంగానే?..." అంటూ మేరియా ఆరంభించింది కుతూహలంతో

"ఆవివరాలేమీ అడుగవద్దు. ఏదో చిన్నతనం, పాడుబుద్ధి... కాని యెన్నో పాపాలు చెప్పి నేతప్పించుకోవాలనుకోడంలేదు.

"సరే అయినదేదో అయిపోయింది. ప్రయత్నించిచూద్దాం. నిరాశ చెందకు." అని ంపనిముంబోయింది. తీరా ముఖంచూసేసరికి, 'పైకి కనపడదు కాని, యిది ఆడసింగమే' అనిపించింది.

"జబ్బుగావుందా?" అని ఫానిన్ లీజాని అడుగుతున్నాడు.

"ఆఁ... నాకు తల్లో బాగుండలేదు."

"సరే, గ్రహించాను." అన్నాడు చాలాసేపు మౌనంగావుండి. "సరే, గ్రహించాను."

"అంటే?"

"గ్రహించాను." అని తిరిగి అన్నాడు ఫ్రాన్సిస్. ఆమెతో మాట్లాడడానికి ఇంతకంటే వేరేమీ అతనికి తోచలేదు.

లీజా కలవరపడి 'సరే, అలాగే' ననుకుంది. ఫ్రాన్సిస్ అర్థంకాని వైఖరి అవలంబించి మౌనంగా గంభీరంగా ఇంకోవైపు చూస్తుండిపోయాడు.

"పదకొండు కొట్టినట్టున్నాడు." అంది మేరియా.

ఈ ముక్కలోని అర్థం గ్రహించి అతిథులంతా వెళ్ళిపోవడానికి సంసిద్ధులయ్యారు. ఆడానితీసుకుని మర్నాడు భోజనానికివస్తానని వార్వారా మేరియాకి మాటఇచ్చింది. మూలకూర్చుని కునికిపాట్లు పడుతున్న జెడియొనవస్కీ లేచి వార్వారాను ఇంటిదాకా సాగనంపడానికి సిద్ధమయ్యాడు. ఫ్రాన్సిస్ గంభీరంగావంగి అందరికీ నమస్కరించాడు. బయట మెట్లమీద వార్వారాను బండిలో ఎక్కిస్తూ ఆమెచేతిని ఒత్తి 'మళ్ళీకలుసుకుందాం' అని కేకపెట్టాడు. జెడియొనవస్కీ బండిలో వార్వారాపక్కన కూర్చున్నాడు. లోపల కాలి బొటనవేలిని, అతని బొటనవేలిమీద ఏదో పరాకునపెట్టినట్టు పెట్టి నొక్కుతూ కాలంగడిపింది. అతనూ పొంగిపోయి ఆమెను పొగడడం ప్రారంభించాడు. ఆమెచిరునవ్వు తెచ్చిపెట్టుకుని, వీధిదీపపు వెలుతురు బండిలో పడగానే కన్నుగీటింది. ఆమెపాడిన డాన్స్‌పాట ఆమెచెవులలో గింగురుమంటోంది. ఉద్రేకంతో ఒళ్ళు జలదరించింది. ఆమె ఎక్కడున్నా, దీపాలు, నాట్యశాలలు, సంగీతానికి అనుగుణంగా నృత్యం చేసే విగ్రహాలు ఆమెమనసులో మెసలుతూంటాయి... ఆమె కంఠం వేడెక్కింది. కళ్ళు మసకలుగమ్మినాయి. పెదవులమీద మందహాసం తాండవించింది, ఆమె శరీరమంతా మధురభావంతో పులకరించింది. ఇంటికి చేరగానే బండిలోంచి వార్వారా ఇట్టేదూకేసింది ఆడసింగంతప్పితే ఇంకెవరు అలా దూకేయగలరు? ఆమె జెడియొనవస్కీకేసితిరిగి ముఖంలో ముఖం పెట్టి వెర్రిగానవ్వేసింది.

"మంచిరసికురాలు!" అని తలపోశాడు జెడియొనవస్కీ ఇంటిదారి పడుతూ. 'నేను పెద్దమనిషినికాబట్టి సరిపోయింది... అయితే అలా నవ్వెందుకో? నాకే ఆశ్చర్యంగావుంది.' ఇంటిదగ్గర నౌకరు కర్పూరతైలం సీసాపుచ్చుకుని అతనికోసం కాచుకూచున్నాడు.

మార్ఫాటిమొఫియొవ్నా రాత్రంతా లీజాప్రక్కలో కూర్చుంది.

# ౪౧

త్రావెటన్స్కీ వాసిలెవస్కోయేలో రోజున్నర ఉన్నాడు. ఉన్న కాలమంతా చుట్టుపక్కల తిరగడంతోనే గడిపాడు. అతనికి ఒకచోట కాలునిలువలేదు. దుఃఖంతో అతనిమనసు మహాబాధపడిపోయింది. అదిరామంగా, తీవ్రంగా రేకెత్తిన వ్యర్థఉద్రేకాలతో యమయాతనలుపడ్డాడు. గ్రామసీమకు తిరిగివచ్చినమర్నాడు తనను ముంచెత్తిన ఉద్వేగాలు స్మృతికి వచ్చాయి. అపుడు తలపెట్టినకార్యక్రమం జ్ఞప్తికివచ్చి తనమీదతానే మండిపడ్డాడు. విద్య కర్మంనించి, జీవితపరమావధినించి తనను వేరుచేసిందేమిటి? సౌఖ్యతృష్ణ...తిరిగీసౌఖ్యతృష్ణ, మైకెలవిచ్ చెప్పిందే సక్రమమైంది." అనుకున్నాడు. మళ్ళీయింకోమారు జీవితసౌఖ్యం అనుభవించాలని అభిలషించావు" అనుకున్నాడు తనలోతాను అది తలకమించిన వైభోగమనీ, జీవితంలో ఒకేఒకసారితటస్థించినా అది అనర్హమైనవరమనీ మరిచేపోయావు. ఆసౌఖ్యంపరిపూర్ణమైందికాదనీ కృత్రిమమైందనీ నువనచ్చు. సరే, పరిపూర్ణమైన, యదార్థమైన ఆనందానికి అర్హతను రుజావుపరుచుకో. చుట్టూచూడు. సుఖసంపదలతో తులతూగుతున్నదెవరు? ఆనందిస్తున్నదెవరు? కొడవలి చేతబట్టి పొలంవెడుతున్న ఆరైతునుచూడు-బహుశా అతను తనకున్నదానితో తృప్తిపడుతున్నట్టున్నాడు...

"పోనీ, జీవితాలు మార్చుకోడానికి అంగీకరిస్తావా? మీ అమ్మ విషయం ఆలోచించు: ఆమె జీవితాన్నించి కోరింది స్వల్పాతిస్వల్పమే. కాని ఆ స్వల్పమైనా ఆమెకి లభించిందా? భూమి దున్నడానికి రష్యా వచ్చానని పానిక్‌తో నువ్వు డప్పాలు కొట్టావు. నువ్వు రష్యా వచ్చి చేసిందేమిటి? ఈ వయసులో ఆడపిల్లల వేటబడ్డావు? స్వేచ్ఛ చిక్కిందన్న వార్త నీ చెవున బడిందో లేదో, సర్వమూ మరచిపోయి బడిపిల్లవాడిలాగా సీతాకోక చిలకల వెంట పరుగెత్తుతున్నావు..." ఈ ఆలోచనల మధ్య లీజా రూపం ఎడతెగకుండా అతని మనసులో మెసలసాగింది. హృదయాన్ని ద్రవ్యాల చేసే వార్వరా రూపాన్ని, చెక్కు చెదరని కపట, శృంగార, ఏహ్యాకృతిని మనసులోనించి తుడిచివేసుకున్నట్టే లీజా రూపాన్నికూడా ఎంతో కష్టంమీద తుడిచివేసుకున్నాడు. యజమాని మనసు సరిగా లేదని మానిలి ఆంటన్ కనిపెట్టాడు. తలుపు వెనకాల, గుమ్మంలో ఒకటి రెండుసార్లు నిట్టూర్చాడు. ఎలాగో ధైర్యం తెచ్చుకుని లావ్రెటస్కీ దగ్గరికి వెళ్ళి, ఇంత వెచ్చవెచ్చని పానీయం త్రాగమని సలహా ఇచ్చాడు. లావ్రెటస్కీ ఆంటన్‌మీద మండిపడి బయటికి పొమ్మని తిట్టాడు. తిట్టాడే గాని మళ్ళీ పస్తాయించి క్షమాపణ వేడుకున్నాడు. కచేరిగదిలో లావ్రెటస్కీ నిలువలేకపోయాడు. గోడమీది తైలచిత్రంలోనించి అతని ముత్తాత, గుండెనిబ్బరంలేని తన వంశీకుణ్ణి చూచి అపహాస్యం చేస్తున్నట్లనిపించింది. "ఆ-పక్షీ..." అని ఎగతాళిచేస్తున్నట్టుంది. "ఏమైనా సరే నా జీవితాన్ని ఛిన్నాభిన్నం కానివ్వను. ఈ కాస్తగిరికి లొంగిపోతానా? (యుద్ధంలో తీవ్రంగా గాయపడ్డవాళ్ళు తమ గాయాలను గీరుకుంటూంటారు. మనిషి తనను తాను మోసగించుకోకపోతే ఈ భూమ్మీద బతకలేడు.) యింతా జేస్తే నేనేం యేడ్పుగొట్టు పిల్లవాడినా? జీవితపర్యంతం సుఖపడే అవకాశం చేరువకు వచ్చింది. చిక్కిపోయింది. కాని హఠాత్తుగా మాయమైంది. లాటరీలో కూడా అయింతే. చక్రం కాస్త తిరిగితే చాలు, ముష్టివాడు భాగ్యవంతుడై చక్కాపోతాడు. యెలాగానిపెట్టిందో, అలా నే జరుగుతుంది. అంటే పళ్ళబిగువున నా పనేదో నేను చూచుకుంటూ, నోరు మూసుకుని నిశ్శబ్దంగా పడుకుంటాను. నన్ను నేను అదుపులో పెట్టుకోవడం యిదేం మొదటిసారి గాదు. యిలా తప్పించుకు తిరగడం దేనికి! యిసకలో దూర్చిన

ఉష్ట్రపక్షిలాగా యిక్కడ అంటిపెట్టుకుండడం దేనికి? జీవితగానాన్ని ఎదుర్కొనే దమ్ము లేదూ? ఛా! ఆంటన్" అని బిగ్గరగా కేకేసి "తక్షణం బగ్గీ సిద్ధం చేయించు" అన్నాడు "అవును. నోరుమూసుకుని నిశ్చలంగా పడుంటాను. నిగ్రహం అలవర్చుకుంటాను."

ఇలా తర్కించుకుంటూ బాధను పోగొట్టుకోవాలని లావ్రెట్స్కీ యత్నించాడు. అంతులేని ఆ మహాబాధ చూసి అప్రేక్సియా తల పంకించి బగ్గీ ఎక్కుతున్న అతని కేసి దీనంగా చూసింది. గుర్రాలు కదం తొక్కుతూ నడుస్తున్నాయి. అతను ఒళ్ళు బిగపట్టుకుని, నిశ్చలంగా రోడ్డు వంక తేరి పారజూస్తూ కూర్చున్నాడు.

# ౪౨

సాయంకాలం వచ్చి కలుసుకోమని ఆకిందటిరోజున లీజా లావ్రెటస్కీకి రాసింది. కాని అతను ముందుగా పట్నంలోని తనఇంటికివెళ్ళాడు. ఇంట్లో భార్యాకాని కూతురుగాని కనిపించలేదు. కూతురిని వెంటపెట్టుకుని వార్వరా మేరియాఇంటికి వెళ్ళిందని సేవకులు తెలియజేశారు. వార్తవిననే సరికి అతనికి ఆశ్చర్యంవేసింది, విపరీతమైన కోపంవచ్చింది. హృదయం అసహ్యభావంతో దహించుకుపోయింది. "వార్వరా పావ్లోవ్నా నామచ్చ మాపాలని నిశ్చయించుకున్నట్టుంది." అనుకున్నాడు. అటూఇటూ తిరుగుతూ కాలికి అడ్డంవచ్చిన ఆటవస్తువులను, పుస్తకాలను, ఆడవాళ్ళ సామగ్రిని తన్నిపారేశాడు. జస్టినీనిపిలిచి ఆ 'చెత్తంతా' తీసేసెయ్యమని చెప్పాడు. జస్టినీ మూతిముడుచుకుని "సరేలెండి" అంది. గదిఅంతా సరిగాసర్దడానికి సొగసుగావంగి ప్రతిచేష్టలోనూ అతను పట్టి మడ్డిమృగమనేభావం ద్యోతకమయేటట్లు ప్రవర్తించింది. వెక్కిరిస్తున్నట్లున్న ఆమె పాడుముఖంకేసి విచారసూచకంగాచూసి చివరికి ఆమెని పంపించివేశాడు. ఎంతసేపటికీ వార్వరా తిరిగిరాలేదు. కొంచెంతడవు తటపటాయించి లీజాఇంటికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. కాని మేరియా డిమిట్రియేవ్నాని చూడదలుచుకోలేదు. (మేరియా కచేరీగదిలో వార్వరా ఉంటుంది. అందుకని

ఏమైనాసరే ఆగదిలోకి వెళ్ళకూడదని లావ్రెట్స్కీ అనుకున్నాడు) మార్ఫాటిమోఫెయెవ్నాని కలుసుకుందామని తలచాడు. నౌకర్లగదిలోంచి మెట్లమీదుగావెడితే తిన్నగా ఆమెగదిని చేరుకోవచ్చని అతనికి జ్ఞాపకం వచ్చింది. సరే, అలానే చేద్దామని నిశ్చయించుకున్నాడు. అదృష్టంకూడా కలిసివచ్చింది. ఇంటిముంగిటిలో సుశోబ్క్యా కనిపించి మార్ఫాదగ్గిరకు తీసుకువెళ్ళింది. ఒంటరిగా కూర్చోడం మార్ఫాకి అలవాటులేదు. కాని నేడు అందుకు భిన్నంగా ఒంటరిగా ఒకమూల కూర్చునిఉంది. నెత్తిన టోపీలేదు. వక్షస్సలంమీద చేతులుకట్టుకుంది. లావ్రెట్స్కీ కంటపడే సరికి కలవరపడి, దిగ్గునలేచి, టోపీకోసం వెతుకుతున్నదానిలాగా గదిలో పచార్లుచేయసాగింది.

"ఆ-నువ్వా? నువ్వా?" అంటూ ప్రారంభించింది అతనిదృష్టినించి తప్పించుకుంటూ గదిలో హడావిడిగా తిరుగుతూ, 'సరే-మంచిది, మంచిది. నిన్న యెక్కడకెళ్ళావ్? అది వచ్చేసిందన్నమాట. సరే, యేంజేస్తాం.'

లావ్రెట్స్కీ ఒకకుర్చీలో కూలబడ్డాడు.

'సరే, కూర్చో, కూర్చో. తిన్నగా మేడమీదకేవచ్చావుకదూ? అవునవును. ననుచూడడానికి వచ్చావా? మంచిది, మంచిది.'

ఇలాఅని అవృద్ధురాలు కొంచెంసేపు ఆగింది. లావ్రెట్స్కీకి ఏమనాలో తోచలేదు. కాని ఆమె అతనిని అర్థంచేసుకుంది.

'లీజా...అవును. లీజా యిప్పటిదాకా యిక్కడేవుంది.' అంది అల్లికసంచి మూతిదారాలు ముడివేస్తూ, మళ్ళీ ఊడదీస్తూ. 'దానికి వంట్లో యేంబావుండలా. షురోచ్కా, యెక్కడున్నావే? యిలారా. వకచోట స్థిరంగా కూర్చోలేవూ? నాకూ తలనొప్పివచ్చింది. యిదంతా ఆసంగీతం, ఆపాటలుమూలంగానే అనుకుంటా.'

'సంగీతమేమిటి?'

'యేమిటా? వాటిపేరేమిటి? డ్యూయటుపాటలు, అందులోనూ ఇటాలియన్ భాషలో, 'చిచీ, చచా' కొంటిపక్షిలాగా. ఆపాట వింటుంటే తల బద్దలైపోయింది. ఆ వెధవ పానిన్, నా అర్ధాంగిని యింతలో ప్రాణ

స్నేహితులైపోయారు. మామూలు మర్యాదలు పాటించడంలేదు, దగ్గిర బంధువుల్లాగా అట్టె ఆలోచిస్తే కుక్క కూడా తలదాచుకోడానికి స్థలం కోసం యత్నిస్తుంది. దాన్ని వీధిలోకి తరిమేయనంతకాలం దానికేం పరవాలేదు.'

'అయినా, నాకేంనమ్మకం కుదరడంలేదు. యెంతో ధైర్యంకావాలి.'

"ఊహుం-ధైర్యంకాదు, పాచిక. భగవంతుడామెను క్షమించుగాక! నువ్వామెను లావ్రికికి పంపిస్తున్నావనిదిన్నాను!"

"ఆc-ఆ జమీఅంతా దానికి యిచ్చేశాను."

"డబ్బుకావాలని అడగలా?"

'యింకా అడగలా.'

'తొందర్లోనే అడుగుతుందిలే. నిను తిన్నగా యిపుడేమాశాను. వంట్లో బాగుండలేదాయేం?'

"బావుండలేదు."

"షురోబ్కా" అని కేకేసింది మార్ఫా, "వెళ్ళి ఎలిజవెటామైకెలోవ్నాతో చెప్పు. కాదు...కిందేవుందికాదూ?"

'అవును.'

'వెళ్ళి నాపుస్తకం యేంజేసిందో అడుగు. దానికి అర్థమవుతుందిలే.'

'సరే.'

ఆవృద్ధురాలు తిరిగీ గదంతా పచార్లు చేయనారంభించింది. ఊరికే బీరువాతాళాలు తీస్తూమూస్తోంది. లావ్రెటస్కీ కదలకుండా మెదలకుండా కూర్చున్నాడు. హఠాత్తుగా మెట్లమీద అడుగుచప్పుడయింది. లీజా లోపలికివచ్చింది.

లావ్రెటస్కీ లేచి, వంగి అభినందించాడు. లీజా గుమ్మంలోనే నిలుచుండిపోయింది.

'లీజా, లీజా!' అంది మార్ఫా హడావిడిగా

"నాపుస్తకంయేదీ? యేంజేశావ్?"

"యేపుస్తకం అత్తయ్యా?"

“అరె! పుస్తకం! అయినా నిన్ను... సరేపోనీ కిందయేంజేస్తున్నారు? చూడు, ఫియోదర్ ఇవనిచ్ వచ్చాడు. తలనెప్పి యెలావుంది?”

‘తగ్గిపోయింది.’

‘నువ్వెప్పుడూ: ‘తగ్గిపోయింది, తగ్గిపోయింది’ అంటూనేవుంటావు. కిందయేంజేస్తున్నారు. మళ్ళీ సంగీతం మొదలెట్టారా?”

‘ఊహుం- పేకాడుతున్నారు.’

“అవునవును. అది అన్నిటిలోనూ గట్టిచెయ్యి. షురోచ్కా, నీకు తోట్లోకివెళ్ళి ఆడుకోవాలని వుందనుకుంటా. సరే పరుగెత్తుకెళ్ళి ఆడుకో.”

“ఊహుం-”

‘ఊ—వాదనకు దిగకు. పరుగెత్తుకుపో. నాస్టాస్యాకార్పోవ్నా తోటలో వంటరిగావుంది. తోడుగావుండు ఊ, ఊ-మహామంచిదానివి కదూ.’ షురోచ్కా చక్కాబోయింది. “నాటోపీయేమైపోయింది?”

‘వెతుకుతానుండు.’ అంది లీజా.

‘సరేలే. అక్కడకూర్చో. నాకాళ్ళింకా చచ్చుబడిపోలేదు. టోపీ పడకగదిలో వున్నట్లుంది.’

లావ్రెటస్కీ గంటమాని మార్ఫా తలుపులు బార్లాతీసివెళ్ళిపోయింది. మళ్ళీ యేమనుకుందో వచ్చి తలుపులుమూసేసి చక్కాబోయింది...

లీజా కుర్చీలో వెనక్కి ఆనుకునికూర్చుని ముఖం చేతులతో కప్పేసుకుంది. లావ్రెటస్కీ కూర్చున్నచోటునించి కదలలేదు.

“ఊ—తిరిగి యిట్లా కలుసుకున్నామన్నమాట.” అన్నాడు లావ్రెటస్కీ.

లీజా ముఖంమీదనించి చేతులుతీసేసుకుంది.

‘అవును.’ అందిమెల్లగా. ‘మనకి తొందర్లోనే తగిన ప్రాయశ్చిత్తమైంది.’

‘ప్రాయశ్చిత్తమా? యెందుకు?’

లీజా కళ్ళుపైకెత్తి అతనికళ్ళకేసిచూసింది. వాటిలో విచారంగాని, ఆదుర్దాగాని ద్యోతకంకావడంలేదు. అవి కుంచించుకుపోయి వాడిపోయాయి. ముఖం పాలిపోయింది. పెదవులు విడివడ్డాయి.

లావ్రెటస్కీ హృదయం పరితాపంతో, ప్రేమతో ముడుచుకుపోయింది.

"అంతా అఖరయిపోయింది, అని రాశావుగదూ. అవును. మొదలు కాకముందే అంతా అఖరయిపోయింది." అన్నాడు లావ్రెటస్కీ మెల్లిమెల్లిగా.

'అదంతా మనం మర్చిపోవాలి.' అనిగొణిగింది లీజా. 'నువువచ్చావు. నాకు సంతోషమైంది. నీకు వుత్తరం రాద్దామనుకున్నా. కాని యిలా కలుసుకోవడమే మంచిదయింది. ఈ అఖరిక్షణాలు నాలుగూ వృథాకానీయకూడదు. మనిద్దరం మనమన కర్తవ్యాలు నెరవేర్చాలి. నువు నీభార్యతో సమాధానపడాలి.'

"లీజా!"

"నిను ప్రార్థిస్తున్నా, అలాచెయ్యి. అలాచేస్తేనే మనదోషం పరిహారమవుతుంది. బాగా ఆలోచించు. నాప్రార్థన నిరాకరించవనుకుంటా."

'లీజా. నువుచెప్పినట్టు చెయ్యడం సాధ్యంకాదు. నువు యేంచెయ్యమన్నాచేస్తా, కాని మళ్ళీ దానితో సమాధానపడడమాత్రం, ఊహుఁ.. సాధ్యంకాదు... దేనికైనా తలవొగ్గుతా. నేను దానిని మర్చిపోయా, క్షమించా. కాని మళ్ళీ ఆమెని ప్రేమించడం... ఊహుఁ.ఘోరం!'

'యిష్టంలేందే నిన్నెంబలవంతపెట్టను. పోనీ కాపరంచెయ్యొద్దులే. సమాధానపడు. అంతేచాలు.' అని జవాబిచ్చి లీజా మళ్ళీ చేతులతో ముఖంకప్పేసుకుంది. "నీకూతురువిషయం ఆలోచించు, నాకోసమని యీ పనిచెయ్యి."

'సరే' అని గొణిగాడు లావ్రెటస్కీ పళ్ళుకొరుక్కుంటూ, 'సరే. అలానేచేసి, నాకర్తవ్యం నెరవేర్చుకుంటాను. మరి, నీసంగతి? నీకర్తవ్యం "నాకర్తవ్యమేమిటో నాకుతెలుసు." లావ్రెటస్కీ హడిలిపోయి, "నువ్వా పాన్షిన్‌గాడిని పెళ్ళాడుదామనుకుంటున్నావా?" అని అడిగాడు.

లీజాముఖంలో ఒక మందహాసరేఖ వెలిసింది.

"ఊహుఁ.లేదు." అంది.

"ఆ-లీజా! లీజా! మనమెంత సుఖపడేవాళ్ళం"

లీజా అతనికేసి తిరిగిచూసి,

"ఆసౌఖ్యం మనమీద ఆధారపడిలేదు. భగవంతుడిమీద ఆధారపడివుందని నీకు బోధపడలా?"

"అవును. నువ్వు..."

పక్కగదిలోంచి వెళ్ళేద్వారం తెరుచుకుని మార్ఫా చేత్తో టోపీపట్టుకుని తిరిగి ప్రత్యక్షమయింది.

"కనిపించిందండి, దీన్ని తగిలెయ్యా" అంది లావ్రెటస్కీ, లీజాల మధ్యనిల్చుని. "బహుశా నేనే పెట్టి కర్చోబోయా. వృద్ధాప్యమాయిరా! అలా అనుకుంటే యవ్వనంమట్టుకు వరిగబెట్టిందేవుంది? నీభార్యతో లావ్రికీ వెడుతున్నావా?" అంది లావ్రెటస్కీకేసితిరిగి.

'వాంతో లావ్రికీకా? నేనా? యేమో నాకేంతెలీదు.' అని గొణిగాడు కాస్సేపు ఆగి.

"కిందకి వెడతావా?"

'ఉహుం-యివాళకాదు.'

'సరే. నీకుతెలియందేముంది? లీజా. నువ్వుమాత్రం కిందకివెళ్ళు అరే! జీనువాయి పిట్టకి మేతింకావేయలేదు. ఒక్కక్షణంఆగండి. యిప్పుడే... అని మార్ఫా టోపీపెట్టుకోకుండానే తొందరతొందరగా బయటికివెళ్ళింది.

లావ్రెటస్కీ ఒక్కఅంగలో లీజానిచేరుకుని,

'లీజా! శాశ్వతంగా విడిపోతున్నాం. నాహృదయం ప్రయ్యలయిపోతోంది. యేదీ అఖరిసారి చెయ్యిఅందియ్యి.' అని ప్రార్థించాడు.

లీజా తలపైకెత్తి వాడివత్తులైనకళ్ళతో అతనికేసిచూసి, "ఉహుం-" అనిగొణిగి చాచినచేతిని వెనక్కులాక్కుంది. 'ఉహుం- లావ్రెటస్కీ,' (లావ్రెటస్కీని అని పిలవడం యిదేమొదలు) 'చెయ్యి అందియ్యను. అందించి ప్రయోజనమేమిటి? నిను వేడుకుంటున్నా, యిక్కడనించి వెళ్ళిపో. నిన్ను ప్రేమిస్తున్నానని నీకుతెలుసు...అవును. ప్రేమిస్తున్నా.' అందిఎంతో ప్రయాసమీద. 'కాని...ఉహుం-'

జేబురుమాలాతో పెదవులునొక్కుకుంది.

'పోనీ, ఆజేబురుమాలన్నా నాకివ్వు.'

తలుపు కిర్రుమని చప్పిడయింది... జేబురుమాలు లీజాఒళ్ళోకిజారింది. ఒళ్ళోపడకముందే పట్టుకుని తొందరగా దాన్ని జేబులో నుక్కేసుకుని తిరిగి చూచేసరికి మార్ఫాకనిపించింది.

"లీజా! చిట్టితల్లీ! మీఅమ్మ నిన్నుపిలుస్తున్నట్టుంది." అంది ఆవృద్ధురాలు.

లీజా వెంటనేలేచి వెళ్ళిపోయింది. మార్ఫా యథాప్రకారం ఒక మూల కూర్చుంది. లావ్రెటస్కీ వెళ్ళివస్తానని శెలవుతీసుకుంటూంటే, "ఫెద్యా!" అందామె హఠాత్తుగా.

'యేమిటి అత్తయ్యా?'

'నువు పెద్దమనిషివేకదూ?'

'యేమిటది అత్తయ్యా!'

"నువు పెద్దమనిషివేకదూ? అని అడుగుతున్నా."

"అవుననుకుంటా."

'ఊ... పెద్దమనిషినని ప్రమాణంచెయ్యి.'

"సరే, నీయిష్టం. కాని యీగొడవంతా యేమిటి?"

'యీగొడవంతా నాకూతెలుసు, నీకూతెలుసు. కాస్త ఆలోచించావంటే—నువేం తెలివితక్కువవాడివి కావులే—నావుద్దేశం నీకు బోధపడుతుంది. సరే. వుంటా, ప్రమాణంచేశావు, మర్చిపోకు. ఫెద్యా! యిలా వచ్చినను ముద్దుపెట్టుకో. అవును, నాకుతెలుసు. మాటలేంకాదు. నీకేమిటి, యెవరికైనాయింతే. వకప్పుడు యీగలంటే నాకు మహా చప్పనాత్తనంగా వుండేది. సుఖపడుతున్నాయనుకున్నా. కాని వకనాటిరాత్రి తీరాచూస్తే కదా, వకటి సాలిగూడులోపడి విలవిలా తన్నుకుంటోంది. అవును, వాటికుండేకష్టాలు వాటికీవుంటాయని అప్పుడనుకున్నా, యేంచేస్తాం? ఫెద్యా ప్రమాణం మర్చిపోకు. సరే. యికవెళ్ళు. వుంటా."

లావ్రెటస్కీ వెనకమెట్లమీదనించి దిగి గేటులోకి వెళ్ళేసరికి నౌకరు ఒకడు కలుసుకుని, 'మేరియా డిమిట్రియెవ్నా మిమ్మల్ని రమ్మంటున్నారు.' అనిచెప్పాడు.

'యిప్పుడు రాలేనని...' అంటూ మొదలుపెట్టాడు లావ్రెటస్కీ.

'చాలా ముఖ్యమైన పనుందని చెప్పమన్నారు. యెవరూ లేరనికూడా చెప్పమన్నారు.'

'అంతా వెళ్ళిపోయారా?'

"ఆ-వెళ్ళిపోయారు." అని నౌకరు జవాబిచ్చాడు పళ్ళికిలిస్తూ.

లావ్రెటస్కీ బుజాలు ఎగరవేసి నౌకరువెనక నడిచాడు.

## ౪3

వేరియా డిమిట్రియేవ్నా తనగదిలో వాల్టేరు కాలంనాటి లోతైన పడకకుర్చీలో కూర్చుని ఉడుకులోను వాసనచూస్తోంది. పక్కన చిన్నబల్ల మీద నారింజపువ్వు నీళ్ళ గ్లాసు ఉంది. ఆమె ఆందోళనచెందుతూ కొంచెం భయపడుతున్నట్లుంది. లావ్రెటస్కీ గదిలోకివచ్చి, "నన్నురమ్మన్నారటగా?" అన్నాడు మభౌవంగావంగి నమస్కరిస్తూ.

"అవును." అని మేరియా జవాబిచ్చింది కాసినినీళ్ళుతాగుతూ. 'నువ్వు సరాసరి మాఅత్తయ్యగదికి వెళ్ళావని విన్నా. నిన్ను రమ్మనికబురు పెట్టా. నీతో మాట్లాడవలసిన పనుంది. కూర్చో.' మేరియా దీర్ఘంగా నిట్టూర్చి?

'నీ భార్యవచ్చిందని నీకు తెలుసుగా?'

'ఆ-తెలుసు.'

"అలాఅయితే నేను చెప్పబోయేదేమంటే, నన్నుచూట్టానికని వచ్చింది. ఆదరించా. యీవిషయంలోనే నీతో మాట్లాడాలనుకుంటున్నా. అందరూ నను గౌరవిస్తున్నారు. గౌరవభంగం కలిగేపనిగాని, అక్రమమైనపనిగాని భూమితలకిందులైనా నేనుచెయ్యను. నీకునన్నుకొంచెం కష్టంతోచినా, ఆమెమాట తోసేయడానికి బుద్ధిపుట్టలేదు. నిన్న

బట్టి ఆమెకూడా నాకుచుట్టమే. యిక యిప్పుడు నాపరిస్థితిలో నువున్నా వనుకో. యింట్లోకి అడుగుపెట్టనీయకుండా యెలావుండను చెప్పు?"

"యీమాత్రందానికి తలకిందులవడం దేనికి మేరియా డిమిత్రియెవ్నా! నువు పొరపాటుచేశావు. నాకేమాత్రం కోపంలేదు. పరిచయస్తురాల్ని వార్వరా కలుసుకోకుండాచేయడం నాఅభిమతంకాదు. దానిని కలుసుకో వాలనిలేదు. అందుకే యిందాకయిటుగా లేను. అంతే."

"నువ్విట్లామాట్లాడడం నాకెంతో సంతోషంగావుంది. నీది వుదార ప్రకృతి. యిక నేను తలకిందులవడం-ఆశ్చర్యకరమైన విషయమేంకాదు. నేనుస్త్రీని, తల్లిని. నీభార్య నీకు తెలుసుగా...మధ్యవర్తిత్వానికి నేనెవరిని-యీముక్క ఆమెతోకూడా అన్నా. యెంతో కలుపుగోలుమనిషి-ఆనంద రాశి. ఆమెను ప్రేమించకుండా యెవరుండగలరు?"

లవ్రెట్స్కీ వెటకారంగానవ్వి, ఆటవస్తువుతోలాగా హాటుతో ఆడుకోసాగాడు.

"యింతేకాదు, యింకోవిషయంకూడా నీతో చెప్పదలచుకున్నాను, ఫియోందర్ ఇవనిచ్!" అని మేరియా బడబడా చెప్పసాగింది, అతనికి ఇంకా దగ్గిరిగాజరుగుతూ. "యెంతనమ్రత! యెంతమర్యాద! అబ్బ! మనసు కరిగిపోతుంది! నినుగురించి యేమన్నదో తెలుసా? 'తప్పంతానాదే, ఆయన గొప్పదనాన్ని గ్రహించలేకపోయాను. ఆయన మామూలుమనిషికాదు, దేవుడు!' అంది. నిజం! 'దేవుడు' అంది. యెంతకుములిపోతోందను కున్నావు...నాజీవితంలో యెన్నడూ యెవరూ యింతగా కుమిలిపోవడం చూడలేదు, నామాటనమ్ము."

"సరేకాని, మేరియాడిమిత్రియెవ్నా! తెలీకఅడుగుతున్నా సంగీతం పాడుతోందట—కుమిలిపోతూ పాడిందన్నమాట-అవునా?"

"అబ్బే! యేమిటామాట, సిగ్గుచేటు! నన్ను సంతోషపెట్టడానికని పాటపాడింది, పియానోవాయించింది. యెంతగానో బతిమాలితే, ఆజ్ఞా పిస్తే, చివరికి యెలానోపాడించి. మహావిచారంగా కనిపించింది. విచారం

పోగొట్టడానికి యేంచేద్దామా రని ఆలోచించా. అద్భుతంగా పాడుతుం దనివిన్నాను... పూర్తిగా కుంగిపోయింది, కావాలంటే, సెర్జీపెట్రోవిచ్ ని అడిగిచూడు. ఆమెహృదయం బద్ధలైపోయింది. నిజం!"

లావ్రెటస్కీ భుజాలు ఎగవేసి ఊరుకున్నాడు.

"నీకూతురు దేవకన్యే! యెంతముద్దొస్తుంటుంది! మంచితెలివిగలపిల్ల. ఫ్రెంచి అద్భుతంగా మాట్లాడుతుంది. రష్యన్ భాషకూడా అర్థంచేసుకుం టుంది. ఆయీడుపిల్లలందరిలాగా కొత్తింటూలేదు. నన్నుఅత్తయ్యాఅని పిలి చింది. మూడుమూర్తులా నీరూపే. ఆకళ్ళు, కనుబొమలు, అచ్చంగా నీపోలికే. నాకు చంటిపిల్లలంటే సరదాలేదుకాని, యెందుకనో నీకూతురంటే నాకు మహాప్రేమ యేర్పడింది."

"మేరియా డిమిట్రియెవ్నా!" అని సంబోధించాడు లావ్రెటస్కీ ఆశ్చర్యం వెలిబుచ్చుతూ, "యింతకీ యీగొడవంతా చెప్పడంలో నీవుద్దేశ మేమిటి?"

"నావుద్దేశమా?" అందిమేరియా ఊదుకులాంవాసనచూసి, కాసిని మంచినీళ్ళుతాగుతూ, "యీవిషయమంతా యెందుకుచెబుతున్నానంటే,... నేనునీకుచుట్టాన్ని. నువ్వంటే నా కెంతో ఆసక్తి... నీది చాలా వుదార హృదయం అని నాకుతెలుసులే. విను. యెంతో అనుభవమున్నదాన్ని. యేదో నోటికివచ్చినట్లు మాటాడేదాన్నికాను. ఆమెనిక్షమించు. నీభార్యను క్షమించు." మేరియా డిమిట్రియెవ్నా కళ్ళుకన్నీటితో నిండిపోయాయి. "కాస్త ఆలోచించు. అనుభవమూలేదు. పైగా యవ్వనం!...మంచిపని కాదనుకో. తల్లికూడా పరిదిద్దేటంత తెలివిగలది కాదాయెను. నీభార్యను క్షమించు. ఫియోడర్ ఇవనిచ్! యిప్పటికే కావలసినంత ప్రాయశ్చిత్త మైంది."

మేరియాచెక్కిళ్ళపై కన్నీరు కాలువలుకట్టింది. వాటిని ఆమె తుడుచుకోలేదు. ఆమెకి ఏడ్వడమంటేసరదా. లావ్రెటస్కీ ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చున్నాడు. "అంభగవంతుడా! చిత్రహింసపెట్టేస్తోందే! పాడురోజు" అనుకున్నాడు.

"యేదిటి, జవాబు చెప్పవేం?" అంటూ మేరియా తిరిగి ప్రారంభించింది. "నేనేమనుకోను. నువు నిజంగా కఠినాత్ముడివా? ఊహుఁ. నేను నమ్మను. నామాటలు నీకు నచ్చాయనుకుంటా. నీ వుదారతకు నిను భగవంతుడు మెచ్చుకుని మేలుచేకూరుస్తాడులే. సరే, యిక నా చేతుల్తో నీకు నీభార్యని అప్పగిస్తాను..."

లావ్రెటస్కీ చటాలున కుర్చీలోంచి లేచాడు. మేరియా కూడా లేచి తెరచాటుకు వెళ్ళి వార్వరాను చేతితో పట్టుకుని తీసుకు వచ్చింది. వార్వరా మొహంలో కాంతిలేదు. నిర్జీవ ప్రతిమలా వుంది. కిందికి చూస్తూ స్వంత ఆలోచనల్ని, ఇచ్ఛాశక్తిని పరిత్యజించి మేరియా చేతిలో అంతా పెట్టి నట్టు కనిపించింది. లావ్రెటస్కీ తుళ్ళిపడ్డాడు.

"యింతసేపటినించి యిక్కడే వున్నావన్నమాట!"

"దాందేఁ తప్పులేదు." అంది మేరియా తొందరగా. "యేమైనా సరే వుండమనే అంది. నేనే బలవంతం మీద నిలిపా... తెర వెనక వుండమన్నా. నీకు తోషంవస్తుందని చెప్పనే చెప్పింది. నేను లక్ష్యం చెయ్యలా. దీని కంటె నిన్ను నేనే బాగా యెరుగున్నా. రా, నీభార్యని నా చేతుల్తో అప్పగిస్తా, వచ్చి తీసుకో, రా, వార్యా, భయమెందుకు? మోకరిల్లు. (మోచేతితో వార్వరాను పొడిచింది.) యిదిగో ఆశీర్వదిస్తున్నా..."

"వకక్షణం ఆగు." అంటూ అడ్డువచ్చాడు లావ్రెటస్కీ. స్వరం తగ్గుస్థాయిలో ఉన్నా భయంకరంగా వుంది. "నీకు నాటకమాడదమంటే మహాసరదా. (లావ్రెటస్కీ పొరబడలేదు. మేరియాకు చదువుకునే రోజుల్లోని నాటకాల సరదా ఇంకా పోలేదు.) పిల్లికి చెలగాటం యెలుక్కి ప్రాణసంకటం నీతో మాట్లాడదలుచుకోలేదు. యీ నాటకంలో ప్రధాన పాత్ర నీది కాదు." భార్యకేసి తిరిగి, 'నన్నేం చెయ్యమంటావ్?" అని ప్రశ్నించాడు. "నేను చెయ్యగలిగిందంతా చెయ్యలేదూ? యీ నాటకమంతా ఆడించింది నేను కాదని బూకరించకు. నీమాట నమ్మను. నమ్మలేను. ఆ సంగతి నీకూ తెలుసు. నీకేం కావాలి? నువ్వేం తెలివితక్కువదానివి కావు. కారణం లేకుండా యేపనీ చెయ్యవు. వెనకటి మాదిరిగా నీతో మళ్ళీ కాపరం చెయ్యడం అసంభవం. నీమీద నాకేం కోపం లేదు. నేను వెనకటిమని

షినికాను. యీవిషయం నువ్వక్కడికి తిరిగివచ్చిన మర్నాడే చెప్పేశాను. నీహృదయహృదయాంతరాళంలో యిందుకు అంగీకరిస్తున్నావనే తలుస్తున్నాను. మళ్ళీ పలుగురిలో కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకోవాలని కదూ నీకోరిక! నాయింట్లోవుండడంతో తృప్తిపడక పకేమూరుకింద నీతోబాటు వుండాలనికదూ నీవూహ! అవునా?"

"నన్నుక్షమించమని కోరుతున్నా." అందివార్వారా చూపుపైకెత్తకుండా.

'క్షమించమంటోంది.' అందిమేరియా.

'నాకోసం కాకపోయినా, ఆడా కోసమైనా క్షమించమను.' అని వార్వారా మేరియాచెవిలో చెప్పింది.

'సరే. అంతేనా?' అన్నాడు లావ్రెటస్కీ ఎంతోయత్నంమీద. 'సరే. అందుకూ అంగీకరిస్తున్నా.'

వార్వారా పావ్లోవ్నా అతనికేసి తీక్షణంగాచూసింది. మేరియా, 'భేష్' అని వార్వారాను చేయిపట్టుకుగుంజి, 'నాచేతుల్తో అప్పగిస్తున్నా, స్వీకరించు...' అంది.

'వకక్షణం ఆగు.' అంటూ అడ్డువచ్చాడు లావ్రెటస్కీ, 'నీతోకలిసి వుంటానికి వప్పుకుంటున్నా, వార్వారా పావ్లోవ్నా, అంటే నిన్ను లావ్రికీకి తీసుకెడతా. నేను అక్కడిజీవితం తట్టుకోకలిగినంతకాలం వుంటా. తర్వాత వెళ్ళిపోయి, అపుడపుడూవచ్చి చూచిపోతుంటా. చూడు, నిన్ను మోసగించాలని నాకేమాత్రంలేదు....యిక యింతకంటె యెక్కువఆశించకు. యీవిధమాటమీద మళ్ళీనాహృదయానికి హత్తుకుని జరిగిందేమిటో జరిగిందిలే, మోళ్ళు మళ్ళీచిగురిస్తాయి అని నీకు నమ్మపలికితే నీకేనవ్వొస్తుంది... యేంజేస్తాం. విధికి తలవొగ్గకతీరదు. నాభావం నీకుఅర్థంకాకపోవచ్చు. మళ్ళాచెబుతావిను. నీతోకలిసివుంటా...ఊహుఁ అలావాగ్దానంచెయ్యలేను...యెలాగోఅలాగ సమాధానపడతాను. నిన్ను నాభార్యగా మళ్ళీ చూచుకుంటాను...'

'సరే, ప్రమాణంచెయ్యి.' అందిమేరియా. ఆమెకన్నీరు అప్పటికే యింకిపోయింది.

'యెన్నడూ నేను వార్వారా పావ్లోనాని మోసగించలేదు.' అని ఛళ్ళున జవాబిచ్చాడు లావ్రెటస్కీ. 'ముందుకూడా మోసంచెయ్యను.

లా[విక్కి పంపిస్తాను. వార్వారా పావ్లోవ్నా, జ్ఞాపకం పెట్టుకో. యీ యేర్పాటంతా నువు లా[వెకీవదిలిపోకుంటూ వున్నంతవరకే. తెలిసిందా? యిక శెలవు. వెళ్ళొస్తా.' ఇద్దరికీ వంగినమస్కరించి తొందరతొందరగా చక్కాబోయాడు.

'నీతో యీ మెని తీసుకుని వెళ్ళవూ?' అని మేరియా వెనకనించి కేకేసింది.

'సరే, వెళ్ళనిద్దూ.' అని వార్వారా మెల్లిగా చెప్పి మేరియా బుజం మీద వాలింది. నసురక్షించావంటూ చేతులు ముద్దిడుకుని కృతజ్ఞత అనేక విధాల తెలిపింది.

మేరియా డిమి[టియెవ్నా అతియ్యానిమాటలకు పొంగిపోయింది. కాని లా[వెటస్కీ, వార్వారా, అదృశ్యం ఆమెకి సంతృప్తి కలిగించలేదు. ఆమె అనుకున్నంతగా అనాటకం రక్తికట్టలేదు వార్వారా భర్తపాదాల పడితే బావుండేదనుకుంది.

'నేచెప్పింది నీకర్థకానట్టుంది. మోకరిల్లమని యెన్నిసార్లు చెప్పాను గదూ?'

'యిదేబావుందిపిన్నీ, కరవాలేదు. అంతాదివ్యంగానే జరిగిపోయింది. లెద్దూ.' అని వార్వారా సమాధానకర్చింది.

'అవును. అతనిలో యెక్కడా చలనమేకనిపించలేదు. నువు యేడ్వనే. లేదుకదా! నేను కళ్లువాచేటట్లు యేడ్చేను. ఊ-నిన్ను లా[విక్కీలో ఖైదు చేయాలనుకుంటున్నాడన్నమాట. నువువచ్చి మళ్ళీ చూడడానికికూడా యిక వీలుండదుకాబోను. మగవాళ్ళంతా యింతే. వట్టిరాతిగుండెలు.' అందిమేరియా తలూపుతూ 'మంచిదనాన్ని, వుదారతను స్త్రీలు మెచ్చుకో గలరు.' అని గొణిగి వార్వారా మేరియాముందు మోకరిల్లి ఆమె నడుమును వాటేసుకుని మొహంలో మొహంపెట్టి నొక్కింది. ఆమె మొహంలో మంద హాసం తాండవించింది. మేరియాకళ్ళవెంట మళ్ళీ కన్నీరు[ప్రవహింప సాగింది.

లా[వెటస్కీ ఇంటికివెళ్ళి నౌకరుగదిలో [ప్రవేశించి తలుపువేసుకుని సోఫామీద కూలిపోయాడు. తెల్లవారేవరకూ అలానే పడుకున్నాడు.

## ౪౪

ఆమర్నాడు ఆదివారం. తెల్లవారింది. ఆరాత్రంతా అతనికి కనులు మూతపడనేలేదు. చర్చిగంటలు వినిపించాయి. లీజాకోసమీద తాను చర్చికి వెళ్ళిన ఆదివారంనాటి ముచ్చట్లు జ్ఞాపకంవచ్చి దిగ్గునలేచాడు. ఈ రోజునకూడా ఆమెను చూడగలుగుతానని అతని అంతరాత్మ ప్రబోధించింది. వార్వరా ఇంకా నిద్రలేవలేదు. మధ్యాహ్నభోజనానికి తిరిగివస్తానని చెప్పమని ఇంట్లోనించి నెమ్మదిగా జారాడు. విరామంలేకుండా మోగుతున్న చర్చిగంటలతనిని ఆకర్షించాయి. తిన్నగా చర్చికివెళ్ళాడు. పెందలాడే వెళ్ళాడేమో, అక్కడ ఒకపురుగయినా కనిపించలేదు. గర్భగుడిలో మతగురువుగంటలు లెక్క పెడుతున్నాడు. మధ్యమధ్యవస్తున్న దగ్గుమూలంగా అతనిస్వరం హెచ్చుతూ తగ్గుతూంది. లావ్రెట్‌స్కీ గుమ్మందగ్గరగా చోటు చూసుకున్నాడు. ప్రార్థనలు చేయడానికి జనం ఒక్కొక్కరూ వచ్చారు. లోపలికిరాగానే ఆగి, నలువైపులకు వంగి నమస్కరించారు. ప్రశాంతంగా ఉన్న చర్చిలోవారి అడుగులు ప్రతిధ్వనించాయి. చినిగిపోయిన దుస్తులు వేసుకని ఒకముసలివగ్గు లావ్రెట్‌స్కీ పక్కనే మోకరిల్లి దీనంగా ప్రార్థన చేస్తోంది. మడతలుపడి, పాలిపోయిన ఆమెబోసినోటిమొహం ఉద్వేగంతో బిర్రబిగుసుకుపోయింది. ఎత్తునఉన్న విగ్రహాలవంక తదేకదృష్టితో

చూసింది. మధ్యమధ్య బొమ్మికలాంటి చేతిని దుస్తులచాటునించి బయటికితీసి శిలువగురుతు వేసింది. ఒకరైతువచ్చాడు. అతనిగడ్డం బాగామాసిపోయింది. మొహం భయంకరంగా ఉంది. ముడతలుపడింది. అతను లోపలకురాగానే మోకరిల్లి దీర్ఘతీవ్రంగా ప్రార్థనలుచేశాడు. అతని ప్రతికదలికలోనూ ప్రగాఢదుఃఖం గోచరమైంది. లావ్రెటస్కీ అతనిని పలకరించి దుఃఖకారణం అడిగాడు. ఆరైతు భయంతో చిరచిరలాడుతూ వెక్కితిరిగి తేపారజూచి "నాకొడుకు చనిపోయాడు." అనిచెప్పి మళ్ళీ ప్రార్థనచేయసాగాడు..."యిక్కడ, చర్చిలోలభించే ఉపశమనం యింకెక్కడలభిస్తుంది!" అనుకుని లావ్రెటస్కీ 'తానుకూడా' ప్రార్థనచేయాలని యత్నించాడు. కాని హృదయం బాధతో, విచారంతో కుంగిపోయింది. మనసు పరిపరివిధాలపోతోంది. లీజాకోసం ఎంతసేపు కాసుకున్నా రాలేదు. చర్చి జనంతో నిండిపోయింది. కాని ఇంకా లీజారాలేదు. అర్చనప్రారంభమయింది. మతాధికారి బైబిలుచదివాడు. అంతిమప్రార్థనలకు గంటమోగింది. లావ్రెటస్కీ కొంచెంజంకాడు. హఠాత్తుగా లీజాకంటబడింది. లావ్రెటస్కీ రాకముందే ఆమెచర్చికి వచ్చింది. కాని అతను గమనించలేదు. గర్భగుడికి, గోడకు మధ్య జనంలో ఇరుక్కుపోయి కదలలేదు, చుట్టూ చూడనూలేదు. అర్చన జరుగుతున్నంతసేపు లావ్రెటస్కీ ఆమెనించి దృష్టి మరల్చలేదు. కళ్ళతోనే సెలవు తీసుకుంటున్నాడు. జనం ఒకొక్కక్కరూ వెళ్ళిపోతున్నారు. లీజా మాత్రం ఇంకా తారాడుతోంది. లావ్రెటస్కీ వెళ్ళి తర్వాత వెడదామని ఆగినట్టుంది. ఆఖరుసారి శిలువవేసి పక్కలకు చూడకుండా బయటికి వెళ్ళిపోయింది. కూడా దాసీఉంది. లావ్రెటస్కీ ఆమెను అనుసరించి వెళ్ళి వీధిలో కలుసుకున్నాడు. ఆమె తలవంచుకుని మొహంమీదికి ముసుగులాక్కుని, చకచకా వెళ్ళుతోంది.

"గుడ్ మార్నింగ్, ఎలిజవెటా మైకేలోవ్నా!" అన్నాడు బిగ్గరగా' బలవంతాన యాదృచ్ఛికమైఖరి తెచ్చిపెట్టుకుంటూ, "కూడావచ్చి దిగబెట్టనా?"

లీజా మాట్లాడలేదు. ఆమె పక్కపక్కనే నడుస్తూ "నేచేసినపని సంతృప్తికరంగా ఉందా?" అని ఆమెను అడిగాడుమెల్లిగా.

"నిన్న జరిగిందంతా వినేవుంటావు."

"ఆ-ఆ. బాగానేవుంది." అని లీజా కూడా మెల్లిగా అన్నది.

లీజా ఇంకా తొందరగా నడవసాగింది.

"సంతృప్తికరంగావుందా?"

లీజా తలూపి ఊరుకుంది.

"ఫియోదర్ ఇవనిచ్!" అని లీజా ప్రారంభించి నిశ్చలంగా, మంద స్వరంతో. "ఒకమాట—యిక మమ్మల్ని చూడడానికి రావద్దు, సాధ్యమైనంత తొందరగా వెళ్ళిపో. తర్వాత తర్వాత యేసంవత్సరమో గడిచి యిక మళ్ళీ కలుసుకుందాం. యిప్పుడు నే చెప్పినట్లు చెయ్యి. నిను ప్రార్థిస్తున్నా."

"నువు చెప్పిందల్లా చెయ్యడానికి సిద్ధంగావున్నా, ఎలిజవెతా మిహైలోవ్నా! — అయితే మనం యిలాగే విడిపోవాలా చెప్పు ... ఒక్క మాటన్నా"

"ఫియోదర్ ఇవనిచ్, నువు నాపక్క పక్కనే నడుస్తున్నా నాకెంత దూరమైపోయావు. నువ్వొక్కడవేకాదు..."

"చెప్పు, చెప్పు. నిను వేడుకుంటున్నా చెప్పు." అన్నాడు లావ్రెట్స్కీ. "నీ అభిప్రాయం యేమిటి?"

"నువ్వు వింటావులే...యేమైనా నన్ను మర్చిపో...ఊహుం - మర్చిపోవద్దు. జ్ఞాపకంవుంచుకో."

"నిన్ను మరిచేపోగలనా?"

"సరే. యిక శెలవు. నా వెంట రావద్దు."

"లీజా!" అంటూ ప్రారంభించాడు లావ్రెట్స్కీ...

"శెలవు, శెలవు." అని పదేపదే అంటూ ముసుగు ఇంకా కిందకు లాక్కుని లీజా చకచకా చక్కాబోయింది.

లావ్రెట్స్కీ ఆమెవంక చేరపాటుగా చూచి, [illegible] నడకసాగించాడు. కాస్తంతలో తనమీద పడేనడి. తనకూడా [illegible]

ముక్కుమీదకి లాక్కుని తలవంచుకు నడుస్తున్నాడు. ఇద్దరూ ఒకరినొకరు మాటాడకుండా చూసుకున్నారు.

"అయితే యేమంటావ్?" అని ఎలాగో అన్నాడు లావ్రెట్‌స్కీ.

'నేనేం చెప్పగలను?' అని సమాధానమిచ్చాడు లెమ్ విచారంగా.

'యేమంటాను? సర్వనాశనమైంది. మనమూ నశించిపోయాం. నువ్వు కుడిచేతివేపుకేనా వెళ్ళడం?'

"అఁ—"

"నేను యెడమవేపుకి. శెలవు."



మర్నాడు ఉదయం లావ్రెట్‌స్కీ భార్యనుతీసుకుని లావ్రికీకి బయలుదేరాడు. ముందుబండిలో వాన్యా, ఆడా, జస్టిన్‌లు కూర్చున్నారు. వెనకబగ్గీలో లావ్రెట్‌స్కీ. దారిపొడుగునా ఆఅందాలపాప బండికిటికీదగ్గర నించి కదలనేలేదు. ఆపాపకు ప్రతీదీ ఆశ్చర్యకరంగానేఉంది. రైతుజనం, గుడిసెలు, బావులు, గుర్రాలమెడలమీది కాడిలు, గణగణమోగేగంటలు అసంఖ్యాకమైన కాకులు, ఆమెకి ఆశ్చర్యంకలిగించాయి. జస్టిన్‌కూడా ఆశ్చర్యపోయింది. ఆశ్చర్యపోతూ వాళ్ళిద్దరూ అనేకమాటలకి వార్వారా నవ్వుకుంది. బయలుదేరేముందు తనపరిస్థితిని స్పష్టంచేసుకుందేమో వార్వారా మంచిహుషారుగా ఉంది.

'నీపరిస్థితిని అర్థంచేసుకున్నా' అంది ఆమె కంటిచూపునుబట్టి తన పరిస్థితిని సరిగ్గా అవగాహన చేసుకున్నదని లావ్రెట్‌స్కీ గ్రహించాడు. 'నిన్నేం యిబ్బందిపెట్టను, నీనెత్తిమీదకూర్చోను, నీకు అడ్డమూరాను. నాకు కావలసిందా అడా భవితవ్యం సుస్థిరం చెయ్యడం. అంతే.'

'సరే. నీలక్ష్యం సాధించుకున్నావుగా.' అన్నాడు లావ్రెట్‌స్కీ.

'నాకు ఒకేఒక కోరిక మిగిలిపోయింది. ఏకాంతంగా జీవితం వెళ్ళబుచ్చాలని. మీఔదార్యం యెన్నటికీ మరిచిపోను.'

'ఊ-పోనిద్దూ...'

'మీస్వేచ్ఛనీ, మనశ్శాంతినీ నిలబెట్టడం యెలాగో నాకు తెలుసు' అంది ముందుగా ఆలోచించిపెట్టుకున్నమాటలు తిరిగిచెబుతూ.

లావ్రెటస్కీ బాగావంగి నమస్కరించాడు. భర్తలోలోపల కృతజ్ఞతాభావంతోనే ఉన్నాడని వార్వరా గ్రహించింది.

మర్నాడుసాయంకాలానికి వారు లావ్రికీచేరుకున్నారు. వారం రోజులతర్వాత చిల్లరఖర్చుకు అయిదువేలు భార్యకిచ్చి లావ్రెటస్కీ మాస్కో చక్కాబోయాడు. లావ్రెటస్కీ వెళ్ళినమర్నాడు పానిన్ తయారయాడు. అతనికి ఆమె మహాఘనంగా స్వాగతమిచ్చింది. రాత్రి పొద్దుపోయేవరకూ ఆవిశాలమైన గదులు, బయటతోట సంగీతంతో, పాటలతో, ఫ్రెంచిభాషలో సంభాషణలతో మారుమోగాయి. ఈవిధంగా మూడురోజులపాటు పానిన్ వార్వరాయిచ్చిన ఆతిథ్యంస్వీకరించి ఆనందభరితుడయాడు. వెళ్ళిపోయేముందు అందమైన ఆమె చేతుల్ని తనచేతులతో పట్టుకునొక్కి త్వరలోనే మళ్ళీ వస్తానని మాటఇచ్చాడు. మాట నిలబెట్టుకున్నాడుకూడా.

## ౪౫

లీసాకి మేడమీద ప్రత్యేకంగా ఒకగది వుంది. ఆగదిలో గాలి శుభ్రంగా వీస్తుంది. తెల్లటి పక్క, నలు మూలలా కిటికీలలో పూల కుండీలుంటున్నాయి. చిన్నవ్రాతబల్ల, పుస్తకాల అలమారా, ఒకశిలువ ఉన్నాయి. ఇది పిల్లలగది. లీజా ఈ గదిలోనే పుట్టింది. లీజా చర్చి నించివచ్చి మామూలుకన్నా ఎక్కువగా గదిని శుభ్రపరిచింది. దుమ్ము దులిపింది. కాపీ పుస్తకాలు, స్నేహితురాండ్రు రాసిన ఉత్తరాలు చదివింది. చదివి రిబ్బన్లతో వాటిని కట్టలుకట్టింది. డ్రాయర్లకు తాళాలు వేసింది. పువ్వుపువ్వునూ తాకుతూ నీళ్లుపోసింది. ఈపనులన్నీ తేలికగా, మౌనంగాచేసింది. మొహం విషాదావృతమైంది. గదిలో కదలకుండా నిలబడి చుట్టూ మెల్లిగా తేరిపారజూచింది. బల్లపైన గోడకు శిలువ వేలాడుతోంది. ఆబల్లదగ్గరికివెళ్ళి మోకరిల్లి, చేతులుకట్టుకుని, వాటిమీద తలానించి మెదలకుండా అలానే ఉండిపోయింది.

మర్ఫా టిమోఫెయెవ్నా లోపలికివచ్చి లీజాను ఆభంగిమలో చూచింది. లీజా ఆవిడరావడం గమనించలేదు. మార్ఫా మునివేళ్ళమీద నడిచివెళ్ళి చాలా సార్లు దగ్గింది. ఆదగ్గువిని లీజా చటుక్కునలేచి కళ్ళు తుడుచుకుంది. కళ్ళు కన్నీళ్ళతో మెరిసిపోతున్నాయి.

'ఒహో! మళ్ళీ నీగూడు కుదుర్చుకుంటున్నావన్నమాట.' అని మార్ఫా ఒకగులాబిపువ్వుమీదికివంగి 'వాసన యెంతబావుంది!' అంది.

లీజా విచారంగా ఆమెకేసిచూసి 'యేమిటన్నావు?' అని అడిగింది.

'ఓ—ఆమాటా?' అంది మార్ఫా తొందరగా 'యేమిటిదంతా? ఘోరం! మహాఘోరం!' హఠాత్తుగా టోపీతీసి నేలకేసికొట్టి లీజా పక్క మీదకూర్చుంది. "యిక నేనుభరించలేను. యిప్పటికి నాలుగురోజుల నించి యేమీపాలుపోక చస్తున్నా. నేనేమీ గమనించలేదనుకున్నావేమో? అంతా గమనించా. నువ్విలా రోజురోజుకీ పాలిపోయి, వడిలిపోతూ, దుఃఖించడం నేనుభరించలేను. భరించలేను."

"యేమిటాగొడవంతా? నేను బాగానేవున్నానే." అని గొణిగింది లీజా.

"సరే, సరే బాగున్నానని యెవరితోనైనా అంటే చెల్లుతుందేమో కాని నాదగ్గిరా? యిపుడు మొకరిల్లిందెవరు? కన్నీళ్ళతో యెవరికనుగొనలు తడిసిపోయాయో? సరే. సరే వకమాటు నిను నువుచూచుకో. యేమిటి దంతా? నీముహంచూచుకో. ఊ-యిదంతా యెందుకొచ్చిందో నాకు తెలుసులే-"

"కాలక్రమేణా అదేవదిలిపోతుంది."

"యెప్పుడూ, యెప్పుడు? ఆరిదేవుడా? వాణ్ణి ప్రేమించావా? వాడు ముసిలాడు. మంచివాడేననుకో. అయితేనేం? మనమంతా మంచివాళ్ళంగామూ? ప్రపంచం విశాలమైంది. ప్రేమకుచోటేదొరకదూ?"

"అదేవదిలిపోతుంది. అపుడే వదిలిపోయిందికూడా"

"మాఅమ్మవుకదూ నామాటవిను." అని మార్ఫా లీజాని తన పక్కన కూర్చోబెట్టుకుని జుట్టూ, రుమాలు నిమరింది. "యీవేడిలో యీదుఃఖం యెన్నటికీ వుపశమించదని అనిపిస్తుంది, నిజమే. కాని వక చావుకే విరుగుడులేదు. 'యీదుఃఖానికి లొంగిపోను, భయంలేదు.' అనుకో, నీమనసు తేలికబడుతుంది. యెలాగోవకలాగ పళ్ళబిగువుతో తట్టుకోవాలి."

"వదిలిపోయింది. సమసిపోయిందని చెప్తుంటే."

"సమసిపోయిందా? నిజంగానే? నీ మొహంచూసుకో యెలావుందో? సమసిపోయిందట!"

"అవును. సమసిపోయింది. నాకు అండగానిలబడడానికి నువు వప్పుకుంటే..." అంది లీజా ఉద్రేకంతో మార్యా మెడకావలేసుకొని "అత్తయ్యా! స్నేహంచూపు, నాకుసాయపడు. కోప్పడద్దు. నను అర్థ చేసుకోడానికి యత్నించు..."

"యేమిటమ్మా! యేమిటి? నన్నిలా హడలగొట్టకు. యేడ్చేస్తాను సుమా. నాకేమి అలాచేస్తావేం? యేమిటి, త్వరగాచెప్పమ్మా, చెప్పు."

"నేను... నేను..." లీజా మార్యావక్షంలో తలదూర్చి, "నేను మఠంలో చేరిపోతా." అంది.

మార్ఫా పక్కమీద ఒక్క ఉరుకు ఉరికి,

"శిలువగుర్తువెయ్యి లీజా, వెయ్యి. నీవేంమాట్లాడుతున్నావో నీకు తెలీడంలేదు. ఛీ! పాడుమాటలు." అంటూ తుతూ. మళ్ళీ నాలుక సరిచేసుకుని, "పడుకో అమ్మా, పడుకుని వకనిద్రతియ్యి. యిదంతా నిద్రలేకపోవడంవల్ల వచ్చినఖర్మ."

లీజా తలెత్తింది. చెంపలు వెలిగిపోతున్నాయి. "ఊహుం-అలా అనకు అత్తయ్యా, నేను నిశ్చయంచేసుకున్నాను. ప్రార్థించాను. భగవంతుని సలహాతీసుకున్నాను. అంతా అఖరైపోయింది. మీతో నాజీవితమూ అఖరైపోయింది. యిదంతా వూరికేరాలేదు. యీవిషయం ఆలోచించడం యిది మొదటిసారికాదు. నాకు సుఖపడేగతిలేదు సుఖపడతాననే ఆశ జనించినప్పుడుకూడా భయంతో నాహృదయం బరువెక్కింది. నాకంతా తెలుసు——నేజేసిన పాపాలు యితర్లుచేసినపాపాలు అన్నీ నాకు తెలుసు. నాన్న యిదంతా యెలాసంపాదించాడోకూడా తెలుసు. ప్రార్థనలు, ప్రార్థనలుమాత్రమే యీపాపాలను పరిహరించగలుగుతాయి. నిన్నుజూచినా, అమ్మనిజూచినా, లెనోచ్కాజూచినా జాలేస్తుంది. కాని గత్యంతరంలేదు. యిక్కడిజీవితం నాకు సరిపడదని తోస్తోంది. అందరిదగ్గిరా, యింట్లో వాటన్నిటిదగ్గిరా మనసులో అప్పుడే ఆఖరిసారి శెలవుపుచ్చుకున్నాను. నాకు పిలుపువచ్చింది. నాహృదయం బాధతో కమిలిపోతోంది. శాశ్వతంగా

యేకాంతవాసం చేయదలచాను. నన్ను ఆపవద్దు. నను నిరుత్సాహపర్చవద్దు. నాకు మద్దతుగువుండి, లేకపోతే ఒంటరిగానే వెడతాను..."

మార్ఫా ఈ మాటలు ఆశ్చర్యంతో వినసాగింది.

"దీనికి జబ్బుగావుంది. సంధిప్రేలుతుంది." అనుకుంది. "డాక్టర్ని పిలిపించాలి. యెవర్ని పిలిపించను? మొన్న జెడియొనవస్కీ వకడాక్టర్ని గురించి పొగుడుతూ మాట్లాడాడు. అయితే జెడియొనవస్కీ వట్టి అబద్దాల కోరు. కాని యీతడవ నిజమే చెప్పాడేమో!" లీజా చెపుతున్న సమాధానాలనుబట్టి ఆమెకి జబ్బుగా లేదనీ, సంధిప్రట్ట లేదనీ మార్ఫా గ్రహించి విపరీతంగా భయపడిపోయింది. "కాని ఆసుకంలో జీవితం యెలావుంటుందో నీకు తెలీదు" అంటూ వాదించడం ప్రారంభించింది. "అక్కడ తిండి అర్ధాన్నంగా వుంటుంది. కట్టుకోడానికి ముతకగుడ్డలుయిస్తారు. యెండా వానా చలీగిలీ అనకుండా పనిచేయాలి. నువ్వు యీకష్టాలను తట్టుకోలేవు. యిదంతా ఆ అగాఫ్యాముందు చేసినపని. నీకిదంతా నూరిపోసి తప్పుదోవను పట్టించింది. కాని అదిమాత్రం మొదట్లో హాయిగా జీవితంగడిపి అన్ని సౌఖ్యాలు అనుభవించింది. నువ్వుకూడా అన్ని సౌఖ్యాలూ అనుభవించాలి. నన్ను హాయిగాచచ్చిపోనీ. ఆతర్వాత నీయిష్టమొచ్చినట్లుచెయ్యి. మొగాడిమూలంగా ఆడది మఠంలో చేరడం యెప్పుడైనా విన్నామా, కన్నామా! అంత బాధాకరంగా వుంటే తీర్థయాత్రలు చేసిరా. ప్రార్థనలు చేయించు, అర్చనలు చేయించు. అంతేకాని మఠంలో చేరి సన్యాసంపుచ్చుకోకు. మాచిట్టితల్లివి కదూ!" ఇలా అంటూ మార్ఫా కన్నీరుపెట్టుకుంది. లీజా ఆమెనిఓదర్చి, కన్నీళ్లుతుడిచింది. కాని మనసుమాత్రం మార్చుకోలేదు. నిరాశమాప్పర గొనగా, మార్ఫా లీజాని బెదిరించసాగింది. మీఅమ్మతో అంతా చెప్పేస్తానంది. కాని ప్రయోజనంకలగలేదు. చివరికి ఎలాగైతేనేం మనిలిపానిపోరు పడలేక ఆరునెలలదాకా తన ఆలోచనలు కట్టిపెడతానని లీజా మాట ఇచ్చింది. దీనికి బదులుగా, ఆరునెలల్లో మనసుమార్చుకోకపోతే అండగానిలిచి మేరియా చేతకూడా లీజా మఠంలో చేరడానికి ఒప్పిస్తానని మార్ఫా మాటఇచ్చింది.

శీతాకాలం వచ్చిందోలేదో వార్వరా పావ్లోవ్నా ఏకాంతివాసం గడుపుతానని ఇచ్చినమాటకు భిన్నంగా పీటర్స్బర్గ్కు వెళ్ళిపోయింది. ఈమె

కంటే ముందుగా అక్కడికిచేరుకుని పాన్షిన్ ఆమెకి చక్కటిఇల్లు కుదిర్చి పెట్టాడు. పాన్షిన్ ఓ — పట్టణంలో నివసించిన చివరిరోజుల్లో మేరియాకి అతనిమీద గౌరవం నశించిపోయింది. ఆమె ఇంటికివెళ్ళడమే మానేసి ఎప్పుడూ లా(ద్రికీలోనే మకాంపెడుతూండేవాడు. వార్వరా అతనిని పూర్తిగా బానిసనుచేసేసుకుంది. అతనిమీద ఆమె చలాయించే అంతులేని, తిరుగులేని, సంపూర్ణాధికారాన్ని వర్ణించాలంటే 'బానిస' అనే పదంకంటె వేరుపదంలేదు.

లావ్రెట్స్కీ ఆశీతాకాలం మాస్కోలో గడిపాడు. వసంతకాలం వచ్చింది. రష్యా మారుమూలల్లోఉన్న చి — మఠంలోచేరి లీజా సన్యాసం పుచ్చుకుందనేవార్త అతనిచెవిన పడింది.

# ఉపసంహారం

ఎనిమిది సంవత్సరాలు గడిచాయి. మళ్ళీ వసంతకాలం వచ్చింది... మైకెలవిచ్, పాన్షిన్, మదాం లావ్రెటస్కీయాల గతి ఏమైందో నాలుగు ముక్కలు చెప్పుకుందాం. మైకెలవిచ్ అనేక కష్టసుఖాలనుభవించాడు. చివరికి ఎలాగైతేనేం అతనికి తగిన ఉద్యోగం లభించింది. ఒక ప్రభుత్వ పాఠశాలలో సహాయోపాధ్యాయుడుగా చేరాడు. ఈ ఉద్యోగంతో అతనికి చాలా సంతృప్తి కలిగింది. విద్యార్థులు, వెనకనించి ఎంత వెక్కిరించినా, అతనిని పూజించేవారు. పాన్షిన్ ఉద్యోగంలో బాగా పైకివెళ్ళి డైరెక్టర్ కావాలని ఆశిస్తున్నాడు. మెళ్ళో వ్లాదిమియర్ క్రాసు బరువుకి వంగి నడుస్తున్నాడు. అతనిలోని కళాపిపాసను అధికారవ్యామోహం చంపేసింది. ముదురుమొహం తడకపోయినా పాలిపోయింది, జుట్టు పల్చబడింది. సంగీతం, చిత్రలేఖనం కట్టిపెట్టేశాడు. కాని రహస్యంగా సాహిత్యగ్రంథాలు మాత్రం గీకుతున్నాడు. ఒక సామెతను ఆధారం చేసుకుని నాటకం ఒకటి రాశాడు. నేటి కాలపు రచయితలకు తమ రచనలలో ఎవరినో ఒకరిని చిత్రించడం తప్పనిసరి. అందువల్ల పాన్షిన్ తన నాటకంలో ఒక వగలాడిని చిత్రించాడు. తనంటే ఎక్కువ మక్కువ జూపే ఇద్దరు ముగ్గురు స్త్రీలకు రహస్యంగా ఈ నాటకం చదివి వినిపిస్తున్నాడు. ఎన్ని సంబంధాలు వచ్చినా పెళ్ళి చేసుకోలేదు. దీనికంతా కారణం వార్వరా పావ్లోవ్నా. ఇక వార్వరా శాశ్వతంగా పారిస్‌లోనే ఉంటోంది. మళ్ళా అకస్మాత్తుగా దాడిచేయకుండా ప్రామిసరీనోటు రాసిచ్చి లావ్రెటస్కీ ఆమె పీడ వదిలించుకున్నాడు. ఆమెకు కూడా వయసు ముదిరింది, లావెక్కింది. అయితేనేం ఇంకా ఆకర్షణీయంగా, అందంగానే ఉంది. ఒక్కొక్కరికి ఒక్కొక్క ఆదర్శముంటుంది. వార్వరాకు ఆమె ఆదర్శం డూమాస్ ఫిల్స్ (1) నాటకాలలో లభిం

---

1. ఫ్రెంచి నవలారచయిత, నాటకకర్త. 1824-95 ఇతను ప్రపంచ విఖ్యాత నవలారచయిత కుమారుడు. ఇతని నాటకాలు తరువాత రచయితలకు ఆదర్శప్రాయమైనవి.

చింది. ఆమె మహాసరదాగా నాటకాలు చూడడానికి తరుచు వెళుతోంది. ఆనాటి నాటకరంగంమీద క్షయతో క్షీణించిపోతున్నా ఆడంబరంగా తిరిగే నాయికలను చిత్రించడం పరిపాటయింది. మర్గాండోర్చ్ అనే పాత్ర జీవించినట్లు జీవించడమే జీవితానందపరమావధని వార్వారా తలపోసేది. మన కూతురు కూడా డోర్చ్ జీవితంలాంటి జీవితం గడపడమేతన అభీప్స తమని ఒకమారు వెల్లడించింది. ఆ బాలికను అలాంటికర్మ పట్టవనే ఆశిద్దాం అడా చిన్నప్పుడు నిగనిగలాడుతూ బొద్దుగా ఉండేదల్లా పాలిపోయి పీలగా తయారయింది. నరాలపటుత్వం అప్పుడే దెబ్బతిన్నది. వార్వారాపావ్లోవ్నాను ఆరాధించేవారిసంఖ్య క్రమంగా తగ్గిపోయింది. కాని అపుడపుడువచ్చి చూచిపోవడంమాత్రం తగ్గలేదు. వీరిలో కొందరైనా ఆమెను జీవితాంతం వరకు అంటిపెట్టుకుని ఉండవచ్చు. ఈరోజులలో వార్వరాను మెచ్చుకునే వారందరిలోకీ ఘనుడు జాకర్గాలో-షుబిన్స్కోవ్ అనే అతను రక్షణ సేవాధికారిగా పనిచేసి ఫించను పుచ్చుకున్నాడు. మీసాలరాయుడు. వయసు ముప్ఫయి ఎనిమిది. మంచి చురుకైనవాడు. వార్వరా ఎన్నడూ అతనిని విందులకు, వినోదాలకు ఆహ్వానించేదికాదు. కాని అతనంటే ఆమెకి ఎక్కువ ఇష్టమనడంలో సందేహంలేదు.

ఈవిధంగా ఎనిమిదేళ్ళు గడిచాయి. వసంతశోభ నలుగడలావ్యాపించి సకల చరాచరాలను ఆనందంలో ముంచెత్తింది. భూమిమీద, మానవుల మీద మందహాసం కురిపించింది. మళ్ళీ దాని ఒడలిలో ప్రపంచంపుష్పించి ప్రేమతో గానం చేయసాగింది. ఈ ఎనిమిది సంవత్సరాలలో ఓ-పట్టణంలో పెద్ద మార్పేమీ రాలేదు. కాని మెరయాడిమిత్రీయెవ్నా గృహం యవ్వన విలసితమైనట్టు కనిపిస్తుంది. కొత్తరంగు వేసిన గోడలు బాగా ప్రకాశిస్తున్నాయి. తెరచిన కిటికీలఅద్దాలు అస్తమయ సూర్యకిరణాలలో మెరమెరలాడే రక్తవర్ణమును ప్రతిఫలింప జేస్తున్నాయి. ఈ కిటికీలలోనించి యువజనుల స్వరాలలోని కాంతీ, ఆనందం. ఎడితెగని నవ్వులూ వీథిలోకి ప్రవహిస్తున్నాయి. ఆ గృహమంతా జీవకళతో, ఆనందంతో తొణికిసలాడుతున్నట్లుంది. ఆ ఇంటి యజమానురాలు కాలంచేసింది. మేరయా డిమిత్రియెవ్నా, లీజా సన్యసించిన రెండు సంవత్సరాలకు చనిపోయింది. మార్ఫా

టిమొఫెయెవ్నా తర్వాత ఆట్టేకాలం బతకలేదు. వీరిద్దరినీ పక్కపక్కనే సమాధిచేశారు. నాస్టాస్యా కార్పోవ్నా కూడా చనిపోయింది. ఈమె కొన్ని సంవత్సరాలపాటు స్నేహితురాలి సమాధివద్ద ప్రార్థన చేయడానికి వారం వారం వెళుతుండేది...... ఈవిడకూ ఆయుర్దాయం అయిపోయింది. మట్టిలో కలిసిపోయింది. అయితే మేరియా డిమిత్రియెవ్నా ఇల్లు ఎవరో కొత్తవారి పాలబడలేదు. ఆ కుటుంబంలోనివారి ఆధీనంలోనే ఉంది. గూడు చెడిపోలేదు. లెనోచ్కా నాజూకుగా అందంగా తయారైంది. ఆమె ఒక అశ్విక దళాధికారిని వివాహమాడ నిశ్చయించుకుంది. మేరియా కొడుక్కి కొన్న మొన్ననే పీటర్స్‌బర్గ్‌లో పెళ్ళి అయింది. అతను భార్యను, ఆమె చెల్లెల్ని వెంటబెట్టుకు వచ్చాడు. ఆమె చెల్లెలు పదహారేళ్ళది. ఇంకా చదువుకుంటుంది. గులాబిరంగు చెంపలు, స్వచ్ఛమైనకళ్ళు. షురోచ్కా పెరిగిపెద్దదై మనోహరంగా ఉంది. ఈ యువజనుల నవ్వులకు కేలాపనల ఇంటి గోడలు ప్రతిధ్వనిస్తున్నాయి. కొత్తగావచ్చిన వీరికి అనుగుణ్యంగా ఇంట్లో అంతా మారిపోయింది. పూర్వపు ముసలినౌకర్ల స్థానంలో శుభ్రమైన పిల్లకాయలు ప్రవేశించారు. పూర్వం రోస్కా ఠీవిగా నడయాడేచోట ఇప్పుడు రెండు వేటకుక్కలు పిచ్చిగా సోఫాలమీద కుప్పిగంతులు వేస్తున్నాయి. ఇప్పుడు గుర్రపుశాలలో టక్కపల్చటి ఆటగుర్రాలు, చురుకైన బండి గుర్రాలు, జూలు జడలుకట్టిన పందెపుగుర్రాలు, డాన్ స్వారీగుర్రాలు ఉన్నాయి. ఒక నియమితకాలంలో భోజనాలు చేయడమంటూ లేదు. అందుకని ఇరుగూపొరుగూ ఆ ఇంట్లో అదంతా "అధునాధునిక" పద్ధతుల్లో జరుగుతూంటుందనేవారు.

ఒకానొకరోజు సాయంకాలం కాలిటిన్ ఇంట్లో సరదాగా దాగుడుమూత లాడుతున్నారు. కుక్కలు వారివెంటతిరుగుతూ ఉద్రేకంతో మొరుగుతున్నాయి. కిటికీలపైన వేలాడుతున్న పంజరాలలోని సంగీతపిట్టలు ఆవేశంతో చెవులు చిల్లులువుడేటట్టు కిలకిలలాడుతూ ఆ కోలాహలమును మరింత చేశాయి. చెవులు బద్దలయే ఈ గందరగోళంమధ్య దుమ్ముకొట్టుకున్న బగ్గీ ఒకటి గేటుదగ్గరికి వచ్చిఆగింది. అందులోంచి ప్రయాణపుదుస్తులువేసుకున్న నలభై అయిదేళ్ళతను దిగి దిగ్భ్రమతో కొయ్యలా నిలుచుండి పోయాడు. కొంతసేపు అలా కదలకుండా నిలుచుని, ఇంటికేసి పరికించిచూచి, ఆవరణ

లోకి వెళ్ళి మెల్లిగా పోర్చిమెట్లు ఎక్కాడు. హాలులో ఎవరూ అతనికి తారసిల్లలేదు. హఠాత్తుగా గదితలుపులు తెరుచుకుని షురోచ్కా పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆమె వెనక కేకలు వేసుకుంటూ, గుంపుగుంపంతా వచ్చిపడింది. ఆ అపరిచయస్తుణ్ణి చూసి వారుటపీమని ఆగిపోయారు. అతనికేసి ఎగాదిగా చూసిన ఆ కళ్ళల్లో దయ, ఆనందం అతనికి గోచరించాయి. మేరియాడిమిట్రియెవ్నా కొడుకు ఆ ఆగంతుకుని దగ్గరికి వెళ్ళి స్నేహపూర్వకంగా యేం కావాలని అడిగాడు.

"నేను లావ్రెట్స్కీని" అని చెప్పాడు ఆగంతకుడు.

'నేను లావ్రెట్స్కీని' అనే సరికి అంతా సంతోషంతో కేకలు పెట్టారు. అయితే తామెన్నడో మరిచిపోయిన దూరపుబంధువు వచ్చాడని కాదీ సంతోషం. కాస్త రచ్చగొట్టే సంఘటనజరిగితే గందరగోళంచేసి సంతోషించడం వీరికి సరదా. తక్షణం అందరూ లావ్రెట్స్కీని చుట్టేశారు. లెనోచ్కా పూర్వపరిచయాన్ని పురస్కరించుకుని కాసేపుంటే తాను అతనిని గుర్తుపట్టేదాన్నే అంటూ, ఒక్కొక్కర్ని తనకు కాబోయే భర్తతో సహా—అందరినీ వారివారి ముద్దుపేర్లతో లావ్రెట్స్కీకి పరిచయంచేసింది. అంతాకలిసి భోజనాల గదిగుండా కచేరీగదిలోకి వెళ్ళారు. ఈ రెండు గదులలోనూ గోడలకు కొత్తకాగితం అంటించిఉంది. కిటికీదగ్గిర పూర్వపు అల్లికచట్రాలు అలాగే ఉన్నాయి. ఆ చట్రాలలో ఎనిమిదేళ్ళక్రితం పూర్తికాకుండాఉన్న అల్లిక గుడ్డలు అలాగే ఉన్నట్లున్నాయి. అతనిని ఒక పడకకుర్చీలో సుఖాసీనుని చేసి నమ్రతతో అంతా చుట్టూకూర్చున్నారు. ప్రశ్నోత్తరాల వర్షంకురిసింది.

"మిమ్మల్ని, వార్వరా పావ్లోవ్నానుచూసి చాలాకాలమైంది." అంది లెనోచ్కా అమాయకంగా.

"సహజమే" అని తొందరతొందరగా అన్నాడామె సోదరుడు. "నిన్నేమో నేను పీటర్స్‌బర్గ్ తీసుకుపోతిని, యిక ఫియొడోర్ ఇవనిచ్ యింతకాలమూ ఆ పల్లెటూళ్ళో వుంటున్నాడాయె."

"అవును. తర్వాత అమ్మ చనిపోయింది."

"మార్ఫాటిమోఫెయెవ్నా కూడా కాలంచేసింది." అని గొణిగింది షురోచ్కా.

"నాస్తాస్యా కార్లోవ్నా కూడా." అంది లెనోచ్కా.

"మాజియర్ లెమ్......"

"యేమిటి? లెమ్ కూడా చనిపోయాడా?" అనిఅడిగాడు ల్రావెటస్కీ.

"అవును." అని సమాధానమిచ్చాడు చిన్నకాలటిన్. "వాడెస్సా వెళ్ళాడు. యెవరో అతనికి ఆశపెట్టి తీసుకువెళ్ళుంటారు. అక్కడే చనిపోయాడు."

"అతను కూర్చిన సంగీతం మేమున్నా వుందేమో తెలుసా ?"

"తెలియదు. వుందనుకోను."

అంతా మౌనంగా ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. ఆ యువజనుల మొహాలలో విషాద మేఘాలలము కున్నాయి.

"మాట్రోను బతికేవుంది. తెలుసా?"అంది లెనోచ్కా హఠాత్తుగా.

"జెడియొనొవస్కీ కూడా బతికేవున్నాడు" అన్నాడామె సోదరుడు.

జెడియొనొవస్కీ పేరు వినిపించేసరికి అందరూ కడుపుబ్బ నవ్వారు.

"అవును. బతికే వున్నాడు. యిప్పటికీ అబద్ధాలాడడం మానలేదు." అన్నాడు మేరియా కొడుకు. "నిన్న అతని పొడుండబ్బాలో యీ పిచ్చి పిల్ల (మరదల్ని వేలితో చూపిస్తూ) మిరియాల పొడి చిటికెడు వేసింది."

"అతను తుమ్ముతుండగా చూడాల్సింది." అంది లెనోచ్కా, ఆమె సర్వం, మళ్ళా విపరీతంగా రేగిన నవ్వుల సందడిలో, అణగిపోయింది.

"యిటీవలనే లీజావార్తలు తెలిసాయి." అన్నాడు చిన్నకాలిటిన్. అందరూ మౌనంగా కూర్చున్నారు. "కులాసాగానేవుంది. ఆరోగ్యం యిప్పుడిపుడే కుదుటబడుతోంది."

"యింకా ఆ మఠంలోనే వుందా?"అనిల్రావెటస్కీ అతి ప్రయత్నం మీద ప్రశ్నించాడు.

"ఆం."

"వుత్తరాలు రాస్తోందా ?"

"ఊహుం. రాయడంలేదు. యితరద్వారా ఆమె సంగతి సందర్భాలు తెలుస్తున్నాయి" మళ్ళా నిశ్శబ్దం నెలకొన్నది. "మధుర దేవత" అనుకున్నారందరూ.

"తోటలోకి వెళ్ళాలని వుందా? యీ మధ్య తుప్పా చెదారం పెరిగినా పసందుగానే వుంది." అని అడిగాడు చిన్నకాలిటిన్.

లావ్రెట్‌స్కీ తోటలోకి వెళ్ళాడు. ఆ తోటలోని ఆసనం మొదలు అతనికంట బడింది. ఆ ఆసనం మీదనే అతను లీజాతో కలిసి కొన్ని క్షణాలు పాటు మరవలేని ఆనందం అనుభవించాడు. ఆ ఆసనం నల్లబెక్కింది. వంకర బోయింది. కాని దానిని అతను గుర్తించాడు. మధుకీలలాంటి ఒక దివ్యోద్వేగం అతని గుండెను పిండేసింది. గడచిపోయిన యవ్వనాన్నీ, ఒకప్పుడనుభవించిన ఆనందాన్నీ స్మృతికి తెచ్చే విషాదభావమది. ఆ యువజనులతో కలిసిన చెట్లవరసలగుండా అతను పచార్లు చేశాడు. నిమ్మచెట్లు పొడుగెగిగి ముసిలివైనట్లు లేదు. నీడలు మాత్రం ఒత్తుగా ఉన్నాయి. కాని పొదలన్నీ బాగా ఎదిగాయి. కోరిందపొదలు బొద్దుగా ఎదిగాయి. అడవిచెట్లు విపరీతంగా పెరిగిపోయాయి. ఆ తోటంతా అరణ్యకనవ్యతతో టీ, గడ్డివాసన, పూలతోటి గుబాళిస్తున్నది.

"యిక్కడ నాలుగు స్తంభాలాట ఆడుకోడానికి మహావీలుగావుంది" అంది, లెనోచ్కా హఠాత్తుగా, నిమ్మచెట్ల మధ్య చిన్నపచ్చిక ప్రదేశంలో అడుగు పెడుతూ.

"అయిదుగురం..."

"ఫియొడోర్ ఇవనిచ్‌ని యేంజేస్తాం? లేకపోతే నిను నీవు లెక్కేసుకోవడం మర్చిపోయావా?"

లెనోచ్కా కొద్దిగా వైవర్ణ్యం చెంది, "అయితే ఫియోడోర్ ఇవనిచ్ యింత వయసులో..." అని ప్రారంభించింది.

"మీరు మీ ఆటలు ఆడుకోండి" అంటూ లావ్రెట్‌స్కీ వెంటనే అడ్డుతగిలాడు "నా గొడవ మీకొద్దు. మీ దారికి అడ్డురాకుండా వుంటమే నాకు సంతోషం. నాకు వినోదం చేకూర్చాల్సిన అవసరమూ మీకులేదు.

మా ముసిలివాళ్ళకి వక వ్యావృత్తి వుంది. దానిసంగతి మీకింకా తెలిం యే వినోదమూ దానిముందు సరిరాదు—అదే స్మృతి.”

ఆ యువజనులు హుషారుగా వినయ విధేయతలతో లా వ్రె మాటలు శంతులు చెప్పి పాఠం వింటున్నట్టువిన్నారు. ఆ తర్వాత వ త్తుగా చెదిరిపోయి పచ్చికప్రదేశానికి వెళ్ళి ఒకచెట్టుకింద నలుగురు ని న్నారు. మధ్యన ఒకరు. ఆట ప్రారంభమయింది.

లావ్రెట్స్కీ వెనుతిరిగి ఆ ఇంటిదారి పట్టాడు. ఇంటి భోజనాల గదిలోకివెళ్ళి పియానో దగ్గరకిచేరి ఒక మెట్టును తాకాడు ఒక విస్పష్టమైన స్వరం వెలువడి గాలిలో కంపించి, అతని హృదయతంత్రులను మోగించింది. ఎన్నడో ఒకరాత్రి లెమ్ అతనికి వినిపించి ఆనందపరచినస్వరం తిరిగీ అతని హృదిలోమోగింది. ఆ తర్వాత లావ్రెట్స్కీ కచేరిగదిలోకివెళ్ళి చాలాసేపక్కడ ఉండిపోయాడు. అక్కడ, లీజారూపం మరింతస్పష్టంగా అతని కళ్ళకుగట్టింది. ఆమె తనసమక్షంలో ఉన్నట్టే అతని కనిపించింది. కాని ఆమెకోసం అతనుపడే పరితాపం బాధాకరంగా'భరింపరానిదిగాఉంది. మృత్యువుప్రసాదించే ప్రశాంతం అందులో'లేదు. లీజా ఎక్కడో దూరాన జీవించిఉంది. బతికిఉన్న వాళ్ళనుగురించి ఆలోచించినట్టే ఆమెని గురించీ ఆలోచించాడు. సన్యాసిని దుస్తులలోఉన్న ఆ రూపంలో ఒకనాడు తాను ప్రేమించిన యువతిలక్షణాలతనికి గోచరించలేదు. లీజానిచూచిన అంతర్దృష్టితో తనను తాను చూసుకుంటే తననూ గుర్తుపట్టలేక పోయేవాడే. ఈ ఎనిమిదేళ్ళలో అతను జీవితపథంలో మలుపుతిరిగాడు. చాలామంది ఈ మలుపు తిరక్కుండానే చక్కాపోతారు. అయితే ఈమలుపు తిరక్కుండా ఎవరూ పెద్దమనిషి అని అనిపించుకోలేరు. అతను నిజంగా స్వసౌఖ్యంగురించిగాని స్వప్రయోజనాలనుగురించిగాని ఆలోచించడమే లేదు. అతనిఆత్మ చచ్చిపోయింది. శారీరకంగానేగాక మానసికంగాకూడా ముసిలివాడయిపోయాడు. కొంతమంది చెప్పేటట్టు వృధాప్యంలోకూడా యువకహృదయం కోల్పోవకుండా ఉండడం మహాకష్టం. మహాకష్టమేకాదు, అసంభవం. మంచిదనంలో విశ్వాసం, కార్యాచరణలో పట్టుదల, ఇచ్ఛాశక్తి కోలుపోనివారు మాత్రం సంతృప్తిచెందితే చెందవచ్చు. లావ్రెట్స్కీకి సంతృప్తిపడే హక్కుంది. అతను నిజానికి మంచిరైతుగా తయారయాడు. దున్నడం నేర్చు

డు. స్వప్రయోజనం ఆశించిమాత్రమే కష్టపడటంలేదు. తన రైతుల క్షేమాలను దిట్టపర్చడానికి శక్తినంతా ధారపోశాడు.

లావ్రెటస్కీ తిరిగితోటలోకి వెళ్ళి చిరపరిచితమైన ఆ ఆసనంమీద కూర్చున్నాడు. అతనికెంతో ప్రియమైన ఆ స్థలంలో ఒకప్పుడతను ఆనంద సాగరంలో తేలియాడుతూ కామితార్థమును ఒడిసికట్టడానికి వ్యర్థంగా చేతులు చాచాడు. ఇక ఇప్పుడో ఏకాకి. దిక్కూమొక్కూలేదు. పూర్వజీవితం స్మృతికి తెచ్చుకోసాగాడు. అతనిస్థానం ఆక్రమించిన ఆ యువజనులు సంతోషంతో వేసే కేకలు వినిపించాయి. హృదయం విచారగ్రస్తమయింది. కాని అందులో బాధగానీ, తాపంగానీ లేదు. అతని జీవితంలో పశ్చాత్తాప పడవలసిందేగాని, సిగ్గుచెందవలసిందేమీ లేదు. "ఆడుకోండి, ఆనందించండి. పెంపొందండి" అని ఆయువజనుల నుద్దేశించి అనుకున్నాడు. అతని ఆలోచనలతో ఈర్ష్య ఎక్కడాలేదు. "మీముందు జీవితముంది. మీజీవితం సుఖవుగా సాగిపోతుంది. మాలాగా దారీడొంకా వెతుక్కుంటూ పడుతూ లేస్తూండే అవస్థ మీకుపట్టదు. జీవితయాత్ర సాగించడానికి యెంతకృషి చేశాం? యెంతమందిమి సవ్యంగా జీవితయాత్ర సాగించాం? మీకు ఆచరించాల్సిన విద్యుక్తధర్మముంది. పనివుంది. మాబోటి వృద్ధుల ఆశీర్వచనాలున్నాయి. యికనాకు రేపటినించీ యీ అనుభవాల తర్వాత మిగిలిందల్లా అఖరి సారి మిము చూచిపోవడమే. నాకు కాలం చేరువయింది. భగవానుడు నాకోసం నిరీక్షిస్తున్నాడు. ఈ దృష్ట్యా విచారంతో ఈర్ష్యావేశం లేకుండా, దుష్టిలోచనలు లేకుండా, 'వృద్ధాప్యమా స్వాగతం! వ్యర్థజీవితమా బుగ్గి అయిపో.' అనుకోవడమొక్కటే నాకు మిగిలింది."

లావ్రెటస్కీ ప్రశాంతంగా లేచివెళ్ళిపోయాడు. ఎవరూ అతని సంగతి పట్టించుకోలేదు. ఎవరూ అతనిని వెళ్ళకుండా అడ్డుపెట్టలేదు. నిమ్మచెట్లవెనకనించి ఉల్లాసధ్వనులు పూర్వంకన్నా ఎక్కువగా మోగిపోతున్నాయి. లావ్రెటస్కీ బగ్గీఎక్కి ఇంటికి పట్టించమనీ, గుర్రాలను తొందరపెట్టవద్దనీ బండివానికి ఆజ్ఞాపించాడు.

"చివరికి యేమయింది ?" అని ఆశాభంగం చెందిన చదువరి ప్రశ్నించవచ్చు. "లావ్రెటస్కీ యేమయాడు? లీజా యేమైంది?" జీవించిఉన్నాదా?

ప్రపంచాన్నించీ, జీవితపోరాటాన్నించీ తప్పుకున్న వారిని గురించి చెప్పే దేముంటుంది? తిరిగి వారిని తలుచుకుని లాభమేమిటి? లీజా ఆశ్రయించిన మఠానికి లావ్రెటస్కీ వెళ్ళి ఆమెను చూచాడట. మఠంలో ఒకచోటినుంచి ఇంకొక చోటికి అతని పక్కగానే లీజా వెళ్ళింది. ఆమె ప్రశాంతంగా నడుస్తూ అతనికేసి చూడనైనా చూడలేదు. కనురెప్పలుమాత్రం అల్లలాడాయి. శుష్కించిపోయినమొహం ఇంకా కిందకివంగింది. చేతివేళ్ళు జపమాలను ఇంకాఎక్కువగా నొక్కుకున్నాయి. వారిద్దరూ ఏమాలోచిస్తున్నారు? వారిలో ఎటువంటి భావాలు రేకెత్తాయి? ఎవరికి తెలుసు? ఎవరు చెప్పగలరు? జీవితంలోతారసిల్లే కొన్ని కొన్ని ఘడియలను, కొన్ని కొన్ని భావాలను సూచిస్తూ పోగలం—అంతే.

—•••—

728

# విశ్వవిఖ్యాత నవలలు

| | | |
|---|---|---|
| నవజీవనము | టాల్‌స్టాయ్ | రు. 6- 0-0 |
| అమ్మ | గోర్కీ | 3- 0-0 |
| ముగ్గురు మిత్రులు | ,, | 5- 0-0 |
| మానవుడు | రోమారోలా | 5- 0-0 |
| బీజలక్ష్మి | పెరల్‌బక్ | 2- 8-0 |
| ఆటుపోటు | ,, | 2- 8-0 |
| అనుమానం | టాల్‌స్టాయ్ | 2- 0-0 |
| సంసారసుఖం | ,, | 1- 8-0 |
| యమకూపం | కుప్రిన్ | 4- 0-0 |
| నానా | ఎమిలీజోలా | 2- 8-0 |
| జనపదాలు | జాక్‌లండన్ | 4- 0-0 |
| తండ్రులు-కొడుకులు | టర్జినీవ్ | 3- 0-0 |
| వేగుచుక్క | ,, | 2- 0-0 |
| రూడిన్ | ,, | 2- 8-0 |
| ఆకలి | నట్‌హామ్సన్ | 2-12-0 |

ఆదర్శగ్రంథమండలి, విజయవాడ-2.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B198 |
| పుస్తకం పేరు | పేక మేడలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 233 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| | Hema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |